షష్టిపూర్తి ప్రచురణ

# అనుశీలన

వ్యాస సంపుటి

డా॥ జి.వి.సుబ్రహ్మణ్యం



# అనుశీలన

(వ్యాస సంహిత)

షష్టిపూర్తి ముద్రణం


ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం
తెలుగుశాఖ పూర్వాధ్యక్షులు
మానవీయశాఖ పూర్వాధ్యక్షులు
హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం

ఆచార్య ఎల్లూరి శివారెడ్డి
అధ్యక్షులు తెలుగుశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం



ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం
షష్టిపూర్తి ప్రచురణలు
హైదరాబాదు - 500 044.

# ANUSEELANA

An anthology of l terary essays

by Prof G V Subrahmanyam
Rtd Professor Former Head Department of Telugu
Former Dean School of Human t es
Univers ty of Hyderabad

Shashtipurthi Publication



First Ed tion September 1996
Cop es 1000
Price Rs 80/-
Cover Des gn Sri Seela Veeraraju
Cop es available at

1 Convenor Prof G V. Subrahmanyam
Shasht purthi Publ cat ons
Sri Van 1-8 702/105
Nallakunta Hyderabad - 500 044
Phone 7633275

2 Visalandhra Book House
4 435 V gnan Bhavan Bank Street
Hyderabad - 500 001 & other branches

3 Navodaya Book Sellers
In front of Arya Samaj
Koti Hyderabad

Pr nted at
Padmavath Art Pr nters
1-1 517/B/1 New Bakaram Gandh nagar
Hyderabad - 500 080 Phone 7611413

Cover page Pr nted at
Vipla Printers Pr vate Ltd
Near Shankar Math Nallakunta
Hyderabad - 500 044
Phones 636242 667476

# స్వీకర్త



కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు

నవ్య సంప్రదాయ ప్రస్థాన నాయకులు

ఇతిహాస నవలా నాటక ప్రయోక్తృ చక్రవర్తులు

జ్ఞానపీఠ పురస్కారాన్నందుకొన్న ప్రథమాంధ్ర మహాకవులు

కవిసమ్రాట్, పద్మభూషణ్

# శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారికి

శతజయంతి ఉత్సవ సందర్భంగా సమర్పిస్తున్న

# సారస్వతోపాయనం

# కానుక

సన్నుతి నన్నపార్యుని ప్రసన్న కథా కలితార్థ యుక్తిలోఁ
గన్నులఁగాంచిఁదెల్పితివి కావ్యకథా కవితార్థ శిల్పముల్
మన్ననతోడ నా రచచ మామక కావ్య విమర్శ మూర్తికిన్
వన్నెలువెట్టి నీవు గురువర్యుడవైతివి ఈ భవమ్మునన్

నేనుఁ బ్రత్యక్ష శిష్యుడఁగాను నీకు
ఏకలవ్యుడు ద్రోణుని నెంచినట్లు
యోగ గురువుగ భావించి సాగినాను
దక్షిణ నివ్వని శిష్యుడీ ధన్యజీవి.

ఒక మాహేశ్వర హేలభూతలముపై ఓ జన్వియై దూకెనాన్
ఒక చంద్రుండు కళాప్రపూర్ణుడయి కావ్యోత్సాహుడై నిల్చెనాన్
ఒక వాల్మీకి తెనుంగు రామకథ సర్వోహమ్ముగా వ్రాసెనాన్
ఒక సమ్రాట్టు జనించె సత్కవి యశస్సోహోయనన్ ప్రీతిమై

కల్పవృక్షము మాకు కవితామయమ్ముగా
పెరటనాటిన కళా పీఠమీవు
వేయిపడగలతో విశ్వరూపము దాల్చు
వేలుపు జూపించు వేత్త వీవు
ఆంధ్రజాతికి అంతరాత్మ ప్రబోధమ్ము
వినిపింప వచ్చిన వేగు వీవు
గోదావరీ కృష్ణ భంగ కోలాహమ్ములు
భరతదేశము పొంగ పాడినావు

నీవు బల్కిన పద్యము నిగమ సూక్తి
నీవు మీటిన కిన్నెర దేవగీతి
శిల్ప మార్గము దర్శన చిత్రభూమి
విశ్వనాథుడ వన్నింట వేయునేల

యుగయుగాలకు బాటవై సాగు నీకు
శతజయంతి యనగ ప్రస్థాన భేరి
దాన పాల్గొన్న గుర్తుగా నేనునిత్తు
విశ్వ కవినాథ ఈ కృతి వేడ్కతోడ

# కృతజ్ఞతలు

విశ్వనాథ జీవియస్‌లు ఇద్దరూ సెప్టెంబర్ 10 వ తేదీనే జన్మించారు. 1994 సెప్టెంబర్ 10 నుంచి 1995 సెప్టెంబర్ 10 వ తేదీ వరకు విశ్వనాథ శత జయంతి ఉత్సవాలలో జీవియస్ నిమగ్నులై ఉన్నారు సత్యనారాయణగారంటే జీవియస్ అమితమైన ప్రేమ అభిమానం కలవారు వారిని నవ్య సంప్రదాయోద్యమ నాయకుడుగా సాహిత్యరంగంలో స్థాపించిన వారు జీవియస్ వీరి షష్టిపూర్తి ఉత్సవాలు 10 సెప్టెంబర్ 1995 నుండి ప్రారంభమై 1996 సెప్టెంబర్ దాకా సాగాయి జీవియస్‌గారి జన్మతిథి భాద్రపద శుద్ధ త్రయోదశి కావడంవల్ల ఆ రోజు అనగా 24-9-1996 నాడు ముగింపు సమావేశంలో ఈ పుస్తకం ఆవిష్కరింపబడుతున్నది దీనిని విశ్వనాథవారికి కానుకగా సమర్పించడం సందర్భోచితంగా ఉంది

ఈ గ్రంథానికి తమ అభిజ్ఞత ను అందించిన ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారికి అభిప్రాయం తో ఆమోదాన్ని తెలిపిన ఆచార్య రవ్వా శ్రీహరి గారికి హృదయపూర్వక ధన్యవాదాలు

ఈ అనుశీలన లోని వ్యాసాలను ఇతఃపూర్వం ప్రచురించిన సంస్థలకు కృతజ్ఞతలు

ఈ గ్రంథానికి ముఖచిత్రాన్ని అలంకరించిన శ్రీ శీలా వీర్రాజుగారికి ధన్యవాదాలు

ప్రూఫులు దిద్దడంలో సాయపడిన కుమారి N మృదుల కుమారి J. భారతిగార్లకు ఈ గ్రంథాన్ని అందంగా అచ్చువేసిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్‌కు కవర్ పేజీని అచ్చువేసిన విప్లా ప్రింటర్స్‌కు ధన్యవాదాలు

—సంపాదకుడు

సంపాదకీయం :

# అభినవ ప్రస్థాన మర్మజ్ఞుడు
# ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం

తెలుగునాట కవు లెక్కువ. విమర్శకులు తక్కువ. ఈ నేల స్వభావం
ఆది. గుణగ్రహణ పారీణత, ప్రామాణికత, నిర్భీకత విమర్శకుని ప్రాథమిక
ధర్మాలు. నాలుగు దశాబ్దుల సాహితీ జీవితాన్ని విమర్శకే ధారపోసి తెలుగు
విమర్శ రంగానికి స్థాయి, వాయి అలవర్చిన మహావిమర్శకులు ఆచార్య జి. వి.
సుబ్రహ్మణ్యంగారు. మూడు నాలుగు విమర్శగ్రంథాలతో తమ పని తీరిందని
భావించే ప్రామాణిక విమర్శకులు లేకపోలేదు - కానీ సంపుటాలకు సంపుటాలుగా
విమర్శగ్రంథాలు వెలయించి తమదంటూ ఒక ప్రస్థానాన్ని, తమదైన ఒక
స్థానాన్ని నిర్మించుకున్న నిండైన సాహితీమూర్తి సుబ్రహ్మణ్యంగారు. వారి
సృజనశక్తి విమర్శకు శోభను సంపాదించి పెట్టింది. సాహిత్య శాస్త్ర వేతృత్వం
గంభీరతను సమకూర్చింది. శైలీచాతుర్యం రచనలకు వన్నెదిద్దింది, సమన్వయ
శీలం ఒక క్రమ శిక్షణను ప్రతిపాదించింది. వాల్మీకి వ్యాసులనుంచి నేటి ఆత్యా
ధునిక సాహిత్య ధోరణుల దాక వారు అవగతం చేసుకోని అంశం లేదు. వారి
సమాలోచనకు నోచుకోని ప్రముఖ సాహిత్యవేత్త లేడు. సుబ్రహ్మణ్యంగారు
ప్రాచీన-అర్వాచీన కవుల ఆత్మదర్శనం చేస్తారు. సమకాలీన సాహిత్యవేత్తలను
సంభావిస్తారు.

ఈ గ్రంథం ఇరవై వ్యాసాల సంపుటీకరణం. ఈ వ్యాసాలన్నీ సంప్ర
దాయ సాహితికి చెందినవే. ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారి పరిశీలన ప్రవృ
త్తికీ, పరిశోధన పరమార్థానికి, విశ్లేషణ వైయాత్యానికి ఈ గ్రంథం మరో
మచ్చుతునక. చాలామంది విమర్శకులు ఒక పద్ధతికే సీమితమై, ప్రగాఢ పరి
శ్రమ చేయటం సహజంగా మనకు తెలిసిన సంగతి. అయితే సుబ్రహ్మణ్యంగారి
నిశితమేధకు పొలిమేరలు లేవు. వారి అధ్యయన శీలానికి సాటి రాగల విమర్శ

కులు విరళం. ప్రాచీన సాహిత్యంలోని అనేక జటిల విషయాల్ని ప్రసన్నం చేసి గహనంగా ఉన్న విషయాన్ని సుగ్రాహం చేయటంలో వారికి ఎంతటి ప్రతిభ ఉందో ఇందులోని ప్రతి వ్యాసం రుజువు చేస్తుంది. ఏ విషయాల్ని విశ్లేషించినా అందులోని జీవనాడిని గ్రహించి ఆరోగ్య సమీక్ష చేస్తారు. వారి విమర్శలకు సౌష్ఠవం కలిగించేది విషయపుష్టి. అంశం ఎంతచిన్నదైనా దానికి సంబంధించిన విషయాన్ని శకలాలుగా కాకుండా రాశులుపోసి మనకు విస్మయం కలిగిస్తారు. నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలను వారు విశ్లేషించిన తీరు అభినవ రమణీయం. వారిది గతానుగతికమైన మార్గం కాదు; విశిష్టమైన మార్గం. కొందరు చెప్పిన దాన్నే శైలి మార్చివేసి మళ్ళీ చెబుతారు. వీరలా కాదు. కొత్తగా చెప్పాలన్న తపన, ఆ చెప్పిన కొత్త విషయం మరికొన్ని కోణాలను వెలిగించాలన్న దృష్టి, తులనాత్మక పరిశీలనలో దానికున్న స్థానం - వారి విమర్శ వ్యాసాలలో ఇవి మనకు గోచరించే ప్రముఖాంశాలు. వారి దృష్టి ఎప్పుడూ అభినవ ప్రస్థానం వైపే. దీనికి నిదర్శనంగా ఈ సంపుటిలోని కొన్ని అంశాలను ప్రస్తావిస్తాను.

మొదట 'పురాణము - ఇతిహాసము' వ్యాసంలో వాటి స్వరూపాన్ని విశదంగా వివరించారు. భారతీయ సాహిత్యంలో ఈ ప్రక్రియల అవతరణ వికాసాన్ని, పరిణామాన్ని పేర్కొంటూ పాశ్చాత్య విమర్శకులు చెప్పిన విభాగాల్ని, వాటికి సమాన ప్రక్రియల్ని ఉదాహరించారు. Epics, Myths ను వారు ప్రస్తావించి సమన్వయించిన అంశాలు వారి సర్వాంగీణ విషయావగాహనకు గీటురాళ్లు.

విమర్శకుడు భావుకుడైతే సౌందర్య సందర్శనం ఎంత రసమయంగా ఉంటుందో 'మేఘసందేశము - ప్రకృతి వర్ణనము' వ్యాసం విప్పి చెబుతుంది. అలంకారశాస్త్ర విషయాలు వట్టి నియమాలు కావనీ, వాటిని అనువర్తించుకొని భావించగలిగితే రసస్పందన కలుగుతుందని నిరూపించారు. అలంకారాలు కాళిదాసు చేతిలో ఎంత రసదీప్తి పొందాయో ఉదాహరించారు. పూర్వమేఘంలోని పర్వతాల స్వరూపాల్ని పూజ్యములు, భోగ్యములు, దర్శనీయములు, ప్రీతిదాయకములుగా పేర్కొనటం విమర్శకుడుగా సుబ్రహ్మణ్యంగారి సూక్ష్మాంశ వివేచనకు నిదర్శనం.

తెలుగు మహాభారతం గురించి సుబ్రహ్మణ్యంగారు రస విషయికంగా, లక్షణ విషయికంగా, పాత్ర చిత్రణ విషయికంగా ఎంతో విలువైన కృషి

చేశారు. సాహిత్యశాస్త్రాంశాలను కావ్యపరంగా సమన్వయించి చూపడంలో వారి దొక విలక్షణమైన ప్రతిభ. 'మహాభారతము కర్ణుడు' వ్యాసం ఈ విలక్షణ దృష్టిని తెలుపుతుంది. ఆనంద వర్ధనాదులు పేర్కొన్న కథానాయకుల గురించి వర్గీకరణ చేస్తూ 'మహాకావ్యములందు నాయకాను నాయకోప నాయకుల కెంత ప్రాధాన్యముండునో ప్రతినాయకునకును అతనికి సహాయభూతులగు సమవాయ కోప నాయకులకును అంత ప్రాముఖ్యముండును' అంటూ 'మహాభారతమున శ్రీకృష్ణుని వృత్తము వలెనే, కర్ణుని వృత్తాంతమునకును ప్రత్యేక ప్రతిపత్తి గలదని' నిర్ధారించారు. కర్ణుని స్థాయిని అంచనా వేయడంలో, దానిని సోపపత్తి కంగా సమర్థించటంలో సుబ్రహ్మణ్యంగారి దర్శనశక్తి ప్రస్ఫుటమవుతుంది.

తిక్కనలో కనిపించే నాటకీయతా లక్షణాన్ని నన్నయలో అన్వేషించడం మొదటి చూపుకు స్థూలంగా అనిపించినా ఇది చాలా లోతైన విషయం. నన్నయలో 'ఆదరణీయసార వివిధార్థగతి స్ఫురణంబు' గమనించిన తిక్కన అయనలోని నాటకీయతా లక్షణాన్ని విస్తరించి విన్యసించి ఉండవచ్చు. నన్నయ లోని నాటకీయతా లక్షణాన్ని సుబ్రహ్మణ్యంగారు విశ్లేషించిన తీరు పరమ సుకుమారంగా ఉంది. 'శ్రీ రమణీప్రియ ధర్మవిశారద' పద్యంలో కావ్య పాత్రల నామనిర్దేశం చేసి నన్నయ ముద్రాలంకారంతో నాందీ పద్యాన్ని రచించటాన్ని వీరు వివరించి చూపారు. శిశుపాల వధ ఘట్టంలో కథాకథనాన్ని సంగ్రహంగా సంభాషణలను అధికంగా రచించటం నాటకీయతా దృష్టితోనే అని నిర్ధారించారు. అలాగే ఇద్దరు మహాకవుల శైలుల్ని వీరు సమీక్షించిన పద్ధతి శైలీ శాస్త్రంలో వారికి గల పటిమను విశదం చేస్తుంది. శీర్షికలే శైలీసుందరంగా ఉన్నాయి. 'శబ్దగుణశాలి నన్నయ చతురశైలి', 'అర్థగుణశాలి తిక్కన యజ్వ శైలి' ఈ శీర్షికలే పద్యపాదాలుగా అమరి వారి శైలీగతిని వ్యంజిస్తున్నాయి.

ప్రతీ వ్యాసం పరిశోధనాంశంగా తీర్చిదిద్దిన సుబ్రహ్మణ్యంగారి ప్రతిభా పాండిత్యాలను సమగ్రంగా సమీక్షింపకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. అది అవశ్యంగా విమర్శకులు ఎంతో అభినివేశంతో చేయవలసిన పని. అయితే మరో రెండు మూడు వ్యాసాల్ని స్పృశించి తక్కిన వ్యాసాలు సాహితీవేత్తలు అధ్యయనం చేసి అనుభవించగలరని ఆశాసిస్తున్నాను.

ప్రబంధశైలికి ప్రాణం పోసింది వక్రోక్తి. అలంకారాలు వక్రోక్తి విన్యాసాలే. అలంకారిక శైలికి నిధానంగా నిలిచిన ప్రబంధాలలోని వక్రోక్తి జీవితాన్ని సూక్ష్మాతి సూక్ష్మంగా అనుశీలించారు. దానికి తోడుగా ప్రబంధ వక్రతల్ని ప్రస్తావించారు. ప్రబంధాల లక్షణాల్ని వివేచించవలసిన విమర్శకులంతా 'ప్రబంధ ప్రస్థానంలో వక్రోక్తిజీవితం' చదివితేగాని పరిపూర్ణ అవగాహన ఏర్పడదు. సంప్రదాయ స్వభావ స్వరూపాల్ని సమగ్రంగా దర్శించిన సుబ్రహ్మణ్యంగారు 'సంప్రదాయ సాహిత్యం-నేటి సమస్య'లు అనే విషయాన్ని చర్చించి సాహిత్యవేత్తలకు విపుల ప్రణాళిక ఇచ్చారు. ప్రక్రియా పరంగా ఏక సూత్రతతో సాహిత్య వికాస చరిత్రను నిర్మించటానికి వాటికి సంబంధించిన 22 అంశాలు ప్రస్తావించారు. వీటిని అర్థం చేసుకొని వారి మార్గదర్శకత్వంలో తెలుగు విమర్శకులు పురోగమించవలసి ఉంది.

ఈ కొద్ది విషయాలు ప్రస్తావించటానికి నాకు అవకాశం కల్పించిన షష్టిపూర్తి ప్రచురణ సంఘానికి నా కృతజ్ఞతలు.

ఆచార్య ఎల్లూరి శివారెడ్డి

సంపాదకులు

---

గమనిక : పుస్తకం వెనుక అట్టమీద-మహాకవి శ్రీశ్రీతో ఆచార్య జీవియస్.

# అభిజ్ఞత

## —ఆచార్య బేతవోలు రామబ్రహ్మం

అనుశీలన అనే మాట వినగానే సాహితీపరులకు యేషాం కావ్యానుశీలన వశాత్....అనే వాక్యం కొందరికైనా స్ఫురిస్తుంది. ఆ వాక్యంలో ప్రతిపాదించిన సహృదయ శబ్దానికి మున్ముమ్మూర్తులా భాజనులు శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యంగారు. ఒక సాహిత్యశాఖలో (పనిచేసిన) ఆచార్యుణ్ణి గురించి ఇదొక విశేషంగా చెప్పాలా అంటే, చెప్పవలసిన దశ వచ్చేసిందని గుంభనగా ఊరుకోవడం నా ఆరోగ్యానికి మంచిదనుకుంటాను.

I

కావ్యానుశీలన అన్నప్పుడు కావ్యశాస్త్రానుశీలన అని కూడా ప్రపంచించు కోవడం శ్రీ జి. వి. యస్.గారి విషయంలో అవసరం. అయితే, ఈ రెండింటినీ దేనికదిగా సాగించడంకాక పరస్పర పరిపూరకాలుగా సంయోజించుకోవడంలోనే ఉంది వీరి ప్రత్యేకత - విశిష్టత.

కావ్యాలనూ, కావ్యశాస్త్రాలనూ నిరంతరం అనుశీలిస్తున్నప్పుడు ఎప్పుడో ఏదో ఒక స్ఫురణ తళుక్కున మెరుస్తుంది. అది కవితా సృజనకు దారితీయ వచ్చు. వ్యాసరచనకు ప్రేరణ కావచ్చు. మొదటివారు కవులయితే రెండవవారు విమర్శకులు అవుతున్నారు.ఇంతకుమించి ప్రతిభలో తారతమ్యం లేదనుకుంటాను.

శ్రీ జి. వి. యస్. గారు ప్రతిభావంతులైన విమర్శకులు. ఆధునికాంధ్ర సాహిత్య రంగంలో వీరి అభిజాత్యాన్ని నిర్ధారింపవలసివస్తే రాయప్రోలు - విశ్వనాథ - శేషేంద్ర - జి.వి.యస్. - కోవెల ద్వయం - తుమ్మపూడి - ఇలా వీరి దొక పాఠశాల. చిన్న చిన్న మినహాయింపులను ఆమోదిస్తే సర్వశ్రీ ఆర్. యస్. సుదర్శనం - వడలి మందేశ్వరరావు - మునిగొండ వీరభద్రయ్య ప్రభృతులు ఈ బరి (డి) లోకే వస్తారు. ఇంకా చాలామంది ఉన్నారు. వీరి బలగం పెద్దదే.

సాహిత్యాధ్యయనానికి లేదా సాహిత్య పరిణామచరిత్రను తెలుసుకోడానికి సామాజికశాస్త్ర సిద్ధాంతాలు మాత్రమే కొలమానాలు అనే ప్రయోజనైకదృష్టుల వాదదౌర్జన్యాన్ని అంత తీవ్రంగానూ ప్రతిఘటించడంలో, సాహిత్య రసికతకూ పరంపరయా అది కలిగించే ఆర్ద్రతకూ పెద్దపీట వెయ్యడంలో వీరందరికీ ఏక వాక్యత ఉంది. అయితే, ఎవరి సాధనాలు వారివి, ఎవరి ప్రతిపాదనలు వారివి.

ఒక సారాంశంగా చెప్పాలంటే - కేవలం సామాజికస్పృహ కాదు, సాహితీ సామాజిక స్పృహ ఉండాలి అంటారు శ్రీ జి. వి. యస్. గారు. సామాజికపరిణా మాలకు ఉన్నట్టే సాహిత్యంలో కూడా పరిణామాలను కలిగించే అంతర్గతి తర్కం ఒకటి ఉంటుంది. ప్రయోగాలకన్నింటికీ అదే ప్రేరకశక్తి. సాహిత్య (దార్శనిక) సిద్ధాంతాలను ఆశ్రయించి రచనలు వెలువడతాయి. తాత్త్వికభూమిక లుగా పనిచేసే ఈ శక్తుల వికాసగతి సూత్రాన్ని కూడా కలుపుకొని సాహిత్య వికాస చరిత్రను వివేచించాలి అని వీరు చాలా బలంగా ప్రతిపాదించారు. అంటే ఒకటవ శతాబ్దంనుంచి పదిహేడవ శతాబ్దం వరకూ విస్తరించిన అలంకార శాస్త్రంలో ప్రకాశించిన ఆయా నూతన సిద్ధాంతాలకు సమాంతరంగా లక్ష్య ప్రాయంగా తెలుగులో కావ్యరచన పరిఢవిల్లింది - అనడం. ఆధునిక సాహిత్యా నికి కూడా ఈ సూత్రం వర్తిస్తుంది. అయితే, పాశ్చాత్య సాహిత్య-సాహిత్యేతర సిద్ధాంతాలనూ ప్రయోగ వైచిత్రులనూ అదనంగా కలుపుకోవాలి (పుట-286).

ఈ శతాబ్దంలో ఇంచుమించు ఆరవ దశకం నుంచీ సాగిన వీరి విమర్శ నాత్మక రచనలు అన్నింటా ఈ సూత్రం కనబడుతుంది. అనేక కోణాలనుంచి చర్చించి వీరు దీనిని అప్రత్యాఖ్యేయంగా స్థాపించారు. ఇది తెలుగు విమర్శ రంగానికి శ్రీ జి.వి.యస్ గారు అందించిన కొత్తకోణం లేదా కలిగించిన పరిపుష్టి.

ఈ సంపుటిలోకి చేరిన ఇరవై వ్యాసాలలోనూ ఎనిమిది వ్యాసాలు ఈ కోవ లోకి చేరినవే. మహాభారతంలో కర్ణుణ్ణి ప్రతినాయకునికి ఉపనాయకుడుగా (ఉప ప్రతినాయకుడు-45) సమన్వయించడం: నన్నయగారి శిశుపాలవధ ఘట్టాన్ని వ్యాయోగంగా లక్షించడం; శబ్ద గుణాలను నన్నయ రచనలోనూ ఓజ అదర్థ గుణాలను తిక్కన రచనలోనూ అన్వేషించడం; ఎఱ్ఱనగారి రచనలనూ సోముని ఉత్తర హరివంశాన్నీ ప్రక్రియాపరంగా నిర్ధారించడం; శ్రీనాథయుగాన్ని ధ్వని పరివర్తన యుగంగా పరాక చూపు చూడటం; కథాకావ్యాలలోని జాతివార్తా చమత్కారాలను విశ్లేషించడం - వీటన్నింటా అంతస్సూత్రం ఇదే,

శబ్ద గుణశాలి నన్నయ చతురశైలి - అర్థ గుణశాలి తిక్కనయుజ్వశైలి అంటూ శీర్షికలు తేటగీతి పాదాలయ్యేట్టు (నవీనగుణం) కూర్చిన ఈ రెండు వ్యాసాలూ జంటగా అనుశీలింపదగినవి. వీటిలో మొదటిది ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం వారికి చేసిన ప్రసంగవ్యాసం. కాబట్టి, దాని పరిమితులు దానికి ఉంటాయి. రెండోది తిక్కన తిరునాళ్ళ సంచికలో ప్రచురింపబడినది. ఇందులో ఒక తీర్మానం చేశారు వీరు. "కవిత్రయంలో శబ్దార్థోభయ ప్రాధాన్యమున్న రచన చేసినవాడు నన్నయ. అర్థప్రాధాన్యాన్ని మన్నించినవాడు తిక్కన, శబ్ద మాదుర్యంచేత అర్థాన్ని దీపింపజేసినవాడు ఎఱ్ఱన (75, 76)" అని. దీనిముందు వ్యాసంలో "నన్నయ కవితలోని ఆస్వాదనీయమైన సౌందర్యం శబ్ద గుణ సంయోజనం వలన ఏర్పడింది (70)"అంటూ "నన్నయ భారతావతారికలో తన కవితా లక్షణాలను పేర్కొన్నా తన సాహిత్య దర్శన ప్రస్థానాన్ని ప్రత్యేకించి పేర్కొని వాచ్యం చేయలేదు. కానీ నన్నయ ధ్వని ప్రస్థానాన్ని ఆశ్రయించి కావ్యరచనం చేసిన మహాకవి (72)" అన్నారు. వీటిలో ఏదో కొంచెం వైరుధ్యం ఉన్నట్టూ, నన్నయ ఎఱ్ఱనల కవితా గుణాలకు అట్టే తేడా లేనట్టూ కనిపిస్తుంది. ఆనక శ్రీనాథయుగం మరొక్కచూపు అనే వ్యాసంలో "....నన్నయ అనుసరించింది ప్రధానంగా ఆనందవర్ధన క్షేమేంద్రాదుల మార్గం - అంటే, పరోక్ష రస వాదులైన ధ్వనిదార్శనికుల సాహిత్య ప్రస్థానమన్నమాట (155)" అని స్పష్టంగా నిర్ధారించారు.

నన్నయ రసాలంకార రీతులు మూడూ తన సాహిత్య ప్రస్థానాలని వాచ్యంగానే పేర్కొన్నాడు. అందరూ కథాకలితార్థంమీద పడి ప్రసన్న-యుక్తి పదాలను అంతగా పట్టించుకోలేదు. భరతుని రససూత్రంలో వినిపించే సంయోగ పదానికే మరొక భావార్థక ప్రత్యయంతో యుక్తిపదాన్ని నన్నయ రస ప్రస్థాన స్ఫోరకంగా ఉపయోగించాడు. సరే సర్వ రససాధారణమైన ప్రసాదగుణాన్ని స్ఫురింపజేస్తుంది ప్రసన్నపదం. కథా కలితార్థమనేది అంతతః రసమే.

సూక్తిపదం సమాసం. శోభనాచసా ఉక్తిశ్చ అని. కాబట్టి పదాంతర వినిమయ సహిష్ణువు. దీన్ని అలంకారపర్యాయంగా కవితా (కావ్య) పర్యాయంగా రాజశేఖరాదులు చాలామంది ఉపయోగించారు. నానావిధ రుచిర + అర్థాలంకారాలకు నిధి నన్నయభట్టు. ఇదే ప్రస్థానం సరసమధురవచోగుంభనగా (నిర్వచన, 1-10) తిక్కన దగ్గర, చతురవచోనిధిత్వంగా (మను, 1-15) పెద్దన దగ్గర,

కవిజన సహకారావళీ వసంతోత్సవ సూక్తి నిధిత్వంగా (పాండు 1-22) తెనాలి రామకృష్ణుని దగ్గర కనపడుతోంది సూక్తి వైచిత్రి (కాశీ 1-13) అని శ్రీనాథుడు అన్నదీ ఇదే కావచ్చు ఈ ప్రస్థానానికి ఇంత అవిచ్ఛిన్నత ఉంది మిగిలిన అక్షరరమ్యత అనేది రీతి ప్రస్థానానికి ఉపశ్రుతి (వివరాలకు శ్రీతూమాటి దోణప్ప షష్టిపూర్తి అభినందన వ్యాసం సూక్తినిధి నన్నయ పుటలు 91-96)

## II

తక్కిన వ్యాసాలలో పురాణము - ఇతిహాసము అనే మొదటి వ్యాసం ప్రక్రియా వివేచనాత్మకాలైన తరువాతి వ్యాసాలకు భూమికా భూమికను నిర్వ హిస్తోంది మేఘసందేశము - ప్రకృతివర్ణనము అనే రెండవ వ్యాసం తటస్థ వైఖరితో చేసిన అనుశీలన బసవపురాణాన్ని దేశిపురాణంగా సంభావిస్తూ దాని నిర్మాణంలో కనిపించే జైనపురాణ ప్రభావాన్ని అన్వేషించిన విశిష్టరచన ఏడవ వ్యాసం వరూధినిని జాత్యహంకార గర్వితగా నిరూపించే పదమూడవ వ్యాసం కలభాషిణీ కథామూలం సరస్వతీ చతుర్ముఖుల ప్రణయకలహ ఘట్టంలోనే ఉందని నిరూపించే పద్నాల్గవ వ్యాసం వేమనయోగి పద్యాన్ని ఒక కీర్తన ఒక తత్త్వములాగా ఒక ప్రక్రియగా వినియోగించుకున్నాదన్న పదిహేడవ వ్యాసం యుగ ధర్మానుసారం త్యాగరాజు సంగీతంపై పే మొగ్గుచూపడం వారి ఆత్యం తిక ప్రకృతి అని ప్రస్తావించిన పద్దెనిమిదవ వ్యాసం ప్రక్రియా పరిజ్ఞానం సాహిత్యావగాహనకు అవసరమనీ ఆ దృష్టితో తెలుగు సాహిత్యంలోని వికాస దశలను అధ్యయనం చెయ్యాలని గట్టిగా ప్రతిపాదించిన ఇరవయ్యవ వ్యాసం- ఇవన్నీ శ్రీ జి వి యస్‌గారి స్వతంత్ర వివేచనాశీలానికి నిదర్శనాలు

కావ్యనిర్మాణంలో ప్రతీకాత్మకత ఉంటుందని అది ప్రబంధాలలో తప్పనిసరి అనీ వీరు ప్రతిపాదించి ప్రభావతీ ప్రద్యుమ్నాన్నీ విజయవిలాసాన్నీ ఆ దృష్టితో అవలోడించిన వ్యాసాలు రెండూ అపూర్వంగా భాసిస్తున్నాయి. పాండిత్యానికి సహృదయతకూ ఏర్పడె ఘర్షణను పింగళి సూరన తన ప్రభావతీ ప్రద్యుమ్నంలో ప్రతీకాత్మకంగా ధ్వనింపజేసాదని వారు సావయవంగా సమన్వ యించారు (పుట 230 కళాపూర్ణోదయ సృష్టికర్తగా పింగళి సూరన అంతటి వాడే ప్రౌఢా ముగ్ధా మధ్యా నాయికలతో కథ నడుపుతూ ధ్వనిప్రభేదాలను సంకేతించడం చేమకూర వేంకటకవి విజయ విలాసంలో నిక్షేపించిన వస్తు

తత్త్వం అంటున్నారు వీరు ఇవి రెండూ నూతనత్వంకోసం మరీ గిట్టిస్తున్నా రేమో అనిపించే వ్యాసాలే అయినా - అలంకారశాస్త్ర విషయాలను కావ్యకథా శరీరంలో ప్రత్యక్షంగానో పరోక్షంగానో అనుసంధానించడమనేది మనకు పూర్వ కాలంనుంచీ చాలా కావ్యాలలో కనిపిస్తున్న సంప్రదాయమే అనుపమ కాంతి వైభవ సమన్వితు (వసు 6-48) అనే పద్యంలో రసావిష్కారక్రమాన్ని అను సంధానించాడు రామరాజభూషణుడు ప్రతీకాత్మకంగా కావ్యమంతటినీ నిర్వహిం చడమూ మనకు ఉన్నదే- ప్రబోధ చంద్రోదయాదులు అందుచేత శ్రీ జి వి యస్‌గారి ఈ వ్యాసాలు రెండూ మొదటిసారి చదివినప్పుడు ఎలా అనిపించినా ఆలోచించగా ఆలోచించగా భావన చేయగా చేయగా అవునేమో అనిపిస్తాయి కాకపోతే సమన్వయం పైవాటంత సులభంగా మాత్రం అనిపించదు

III

ఇంక వీరశాంతరసవాదాలు - ఒక వివేచన అనేది ప్రత్యేకంగా చూడ వలసిన బరువైన వ్యాసం వీర రసము అనే వీరి గ్రంథానికి ఇది సారాంశం నవరసాలలో వీరరసం ఒకటి అలా ఉండగా రసస‌ముకరణ వాదాలకు తలమాని కంగా ఉత్సాహస్థాయికమైన వీరరసాన్ని శ్రీ జి వి యస్‌గారు ప్రతిపాదించారు రస నిర్వహణకూ రస చర్వణకూ అనువైన చిత్తస్థితిని సమకూర్చేది ఉత్సాహమే కనుక సర్వరసాలకూ ఇదే జన్మభూమి అని వీరు చేసిన ప్రతిపాదనా సాంగో పాంగంగా చర్చించిన తీరూ అలంకారశాస్త్రానికి ఆంధ్రులు చేసిన పరివస్యలో అగ్రభాగాన నిలుస్తుంది శాఖాచంక్రమణమే అయినా ఇక్కడొక విషయం ముచ్చటించాలి - ఆధునిక యువ పాఠకులకు వాచవిగా

ప్రాచీనులు చెప్పిన దానదయా యుద్ధధర్మ వీరాలను గురించి చర్చిస్తూ రసగంగాధరకర్త వస్తుతస్తు బహవో వీరరసస్య శృంగారస్యేవ ప్రకారా నిరూపయితుం శక్యన్తే అన్నాడు అటుపైని సత్యవీరం ధర్మవీరంలోనే అంతర్భవిస్తుంది కదా అంటే- దానదయా వీరాలు మాత్రం అందులో అంతర్భ వించవా వాటికి పృథగ్గణనం అనౌచిత్యం కాదా అన్నాడు (దానదయోరపి తదంతర్గతతయా తద్వీరయోరపి ధర్మవీరాత్ పృథగ్గణనానౌచిత్యాత్ )

పాండిత్యవీర క్షమావీర బలవీరాలకు ఇచ్చిన లక్ష్యాలలో గర్వాది సంచారిభావాలకే ఉత్కట ప్రతీతి కనబడుతోంది కాబట్టి వీటిని భావధ్వనులుగా సమన్వయించి దానదయాయుద్ధ ధర్మవీరాలను మాత్రం రసాలుగా అంగీకరిస్తే సరిపోతుందనే వాదాన్ని ఖండిస్తూ తర్హి యుద్ధ వీరాదిష్వపి గర్వాదిధ్వనితామేవ కిం న బ్రూయాః ? [illegible]మేవ వా కిం న తదభిధానం [illegible]నేన

గతార్థయేః? అని చమత్కారంగా ఒక బెదిరింపు ప్రశ్న వేశాడు ప్రాచీనులు చెప్పిన యుద్ధ వీరాదుల్లోను గర్వాదిభావధ్వనులనే ఎందుకు చెప్పవు? వాటిని ఒప్పకున్నావు కనక వీటినికూడా ఒప్పకో అనడం ఈ వాదానికి పునాది. లేదంటే మొత్తం రసధ్వనినే తిరస్కరించి అంతటా భావధ్వనియే అని మూల విచ్ఛేద మైనా చెయ్యి అన్నాడు అంతేకానీ కొన్నింట ఉత్సాహానికి స్థాయిత్వ ప్రతీతి అంగీకరించి మరికొన్నింట సంచారి భావత్వమే అంటానంటే కుదరదు ఇదే మన్నా రాజాజ్ఞ అనుకున్నావా ఉపపత్తి విచారవంచిత కావడానికి - అంటూ ఛలోక్తితో మేళవించి మరీ గద్దించాడు. (స్థాయిప్రతీతిః దురపహ్నవా చేత్ తుల్యం ప్రకృతే అపి అనంతరోక్త పద్యేషు నోత్సాహః ప్రతీయతే దయావీరాదిషు ప్రతీయత ఇతి రాజాజ్ఞా మాత్రమ్ )

జగన్నాథ పండితరాయలు చేసిన ఈ చర్చాధోరణి అనంతరకాలాన అలంకారశాస్త్ర పండితులలో రకరకాల ఆలోచనలను రేకెత్తించింది అసలు వీర రసప్రభేదాలు పండితరాయనికి సమ్మతాలేనా లేక పూర్వులు చెప్పారుకదా అని గౌరవంతో అనువదించాడా అని శంకించిన ఉపాధ్యాయులు కూడా ఉన్నారు అలమ్ అతివిస్తరేణ

శ్రీ జి. వి యస్‌గారు ఈ బెదిరింపులకు పూర్తి భిన్నంగా స్వతంత్రంగా వివేచన చేసి నాయకాశ్రితమైన ఉత్సాహస్థాయి నిమిత్తంగా సహృదయుడు అనుభవించే రసం నవరసాలలోని వీరం నాయకాదుల నాశ్రయించిన ఎట్టి స్థాయిభావాన్నైనా నిమిత్తంగా చేసికొని సహృదయుడు సాధించే రసం - మూల ప్రకృతి అయిన వీరం (276) అని తేల్చి చెప్పారు ఇక్కడ సాధించడం అనే మాట చాలా సాభిప్రాయం ఇది రస స్థితిని కలిగించే మనో వ్యాపారమనీ రసాల అస్తిత్వానికి ఆదిమూలమనీ రసానాం రసః అనీ కట్టకడపటికి ధర్మవీర ఏవ రసానాం రసః అనీ శాంతానికీ వీరానికీ ఉన్న విరోధాన్ని తొలగించిన వివేకసూత్రం ఈ వాదమనీ విరు ఆత్మీయతా ముద్రతో-పారిభాషికాల బరువుతో-కర్తృపద బహువచనతా సంప్రదాయంతో సహా ప్రతిష్ఠాపించారు

## IV

శ్రీ జి. వి. యస్‌గారి శైలికూడా ఇవ్వేళ సాహిత్యంలో ఒక చర్చనీయాంశం ప్రతిపాదించే విషయాన్ని బట్టీ స్వీకరించిన ప్రక్రియనుబట్టీ ఉద్దేశించిన పాఠకులనుబట్టీ రచయిత వ్యక్తిత్వాన్నిబట్టీ రచనాశైలి రూపుదిద్దు

కుంటూ ఉంటుంది. వీరిది ఆలంకారిక శైలిగా ముద్రపడింది. గ్రాంథికమా వ్యావహారికమా అనేది పెద్ద చర్చనీయాంశం కాకపోయినా విషయప్రతిపాదనమే ప్రధానంగా సాగే వ్యాసానికి ఈ శైలి అంతగా నప్పదనో, అనవసరమనో, అదనపు భారమనో కొందరు విమర్శకులు భావిస్తున్నారు. వారిలో చేరాగారు ముఖ్యులు. వీరికి ఇంకా మరికొన్ని అభ్యంతరాలు ఉన్నాయి. అవన్నీ శ్రీ జి.వి. యస్.గారి మీద అభిమానంతోనూ, గౌరవంతోనూ, విషయాలపట్ల శ్రద్ధతోనూ, స్వీయమార్గాభినివేశంతోనూ అంటున్నవే కనుక అభిప్రాయభేదాలుగా మన్నించడమూ, అవసరమైన మేరకు స్వీకరించడమూ అభిలషణీయం. శ్రీ జి.వి.యస్. గారు కాలమ్ రచనలో అదే చేశారని చాలామంది గుర్తించారు.

అది అలా ఉండగా-వ్యాసంలో ఒక అంశాన్ని గాఢంగా చర్చిస్తూ చరాలున ఒక సాధారణ సామాజిక విషయాన్ని నిదర్శనంగా నిబద్ధించడం వీరి శైలిలో కనిపించే మరొక అవిచ్ఛిన్నత. వేదాంత గ్రంథాలలోనూ, వ్యాకరణ వ్యాఖ్యానాలలోనూ, అలంకార శాస్త్రాలలోనూ తరచుగా ఈ జీడిపప్పులు తగులుతూ ఉంటాయి. శాస్త్రాంతర పరామర్శ కూడా ఇటువంటిదే. అయితే, వీరి ఇటీవలి వ్యాసాలలో-ఉపన్యాసాల్లో కూడా దర్శనపదప్రయోగబాహుళ్యం దర్శనమిస్తోంది. ఛలోక్తిగా అంటున్నమాట - సవయస్కుల మధ్య వీరు మా దర్శనాచార్యులు.

ఉత్తరోత్తర రచనలకు శీర్షికలను పూర్వాపూర్వ రచనలలో నిక్షేపించడాన్ని ఒక శిల్పవిశేషంగా ఈమధ్య కొందరు ముందుకు తెచ్చారు. సి.నా.రె. కావ్యాలలో ఇది స్ఫుటంగా కనబడుతోంది. కాకతాళీయమే అన్నా రచనాకాలం సంవదించకపోయినా ఈ వ్యాసాల కూర్పులో ఒకటి రెండుచోట్ల ఆ శిల్పవిశేషం స్ఫురించేట్టు చేసిన సంపాదకులు ఆచార్య శ్రీ ఎల్లూరి శివారెడ్డిగారిని అభినందించకతప్పదు.

ఈ వ్యాసాలను ఇదివరకే చదివిన పాఠకుల సంగతి అలా ఉంచితే ఇదే ప్రథమంగా చదువుతున్నవారికి ప్రతి వ్యాసమూ నూటికి నూరుపాళ్ళు గిట్టుబాటు అవుతుంది. అవగాహన పరిధులు అలలు అలలుగా విస్తరిస్తున్న అనుభూతి కలుగుతుంది. సాహితీతత్త్వమేదో తెలిసిపోతున్న "దర్శనం" లభిస్తుంది.

ఉపక్రమ్యతామ్ - సెలవు.

# అభిప్రాయం

—ఆచార్య రవ్వా శ్రీహరి

ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు తెలుగులో ప్రముఖ విమర్శకులుగా, పరిశోధకులుగా, నిత్య సాహిత్యానుశీలకులుగా ప్రసిద్ధి పొందినవారు. ప్రాచీన సాహిత్యం పైనా, ఆధునిక సాహిత్యంపైనా ప్రామాణికమైన ఎన్నో విలువైన విమర్శ వ్యాసాలు రాసి విమర్శ రంగంలో తమదైన ఒక ప్రత్యేకతను నిలుపుకున్నవారు. ప్రాచీన భారతీయాలంకారికుల సిద్ధాంతాలనే కాక పాశ్చాత్య విమర్శ సిద్ధాంతాలను కూడా క్షుణ్ణంగా అధ్యయనం చేసి ఆయా విమర్శ సిద్ధాంతాలను తెలుగు సాహిత్యానికి అన్వయింపజేసి సాహిత్య విమర్శలో నూత్న మార్గాలకు ప్రయోక్తలైనవారు. అట్టి గొప్ప విమర్శకుడి లేఖిని నుండి వెలువడిన విలువైన వ్యాస సంపుటి ఈ జీ.వీ.ఎస్. అనుశీలన.

ఈ సంపుటిలో ఇరవై వ్యాసాలున్నాయి. వీటిలో సంస్కృత సాహిత్యానికి, పురాణేతిహాసాలకు, రసవాదానికి సంబంధించిన మూడు వ్యాసాలను మినహాయిస్తే తక్కిన పదిహేడు వ్యాసాలూ ప్రాచీన తెలుగు సాహిత్యానికి సంబంధించినవి. ఈ వ్యాసాలన్నీ తెలుగు సాహిత్య చరిత్రలో ఇంచుమించుగా ప్రతి యుగానికి ప్రాతినిధ్యం వహిస్తూ తెలుగు సాహిత్యంలోని ప్రధాన క్రమ పరిణామాన్ని నిరూపించేవిగా ఉన్నాయి.

ఏదో ఒక కొత్త విషయం చెప్పందే సుబ్రహ్మణ్యంగారు వ్యాసరచనకు పూనుకోరు. ఇందులోని ప్రతి వ్యాసంలోనూ ఏదో ఒక నూత్న ప్రతిపాదనం మనకు కనిపిస్తుంది. నాటకీయ రచనకు తిక్కన ప్రసిద్ధుడు. కాని, ఆచార్య సుబ్రహ్మణ్యంగారు 'నన్నయ రచనలో నాటకీయత, అన్న వ్యాసంలో శిశుపాల వధ ఘట్టం ఆధారంగా నన్నయలోని నాటకీయ శైలిని ఎంతో ప్రతిభావంతంగా

ప్రతిపాదించడం కనిపిస్తుంది. సభాపర్వంలోని 'శ్రీరమణీప్రియ' అనే మొదటి పద్యంలో ఐావికథలో వచ్చే ధర్మజాది ప్రధాన పాత్రలను సూచించే నాందీ పద్యలక్షణాన్ని సమన్వయించిన పద్ధతి విశిష్టంగా ఉంది.

బసవపురాణాన్ని పురాణమనే పేరుతో పిలుస్తున్నాం. కాని, ప్రసిద్ధ పురాణాల లక్షణాలైన సర్గ ప్రతిసర్గాదులు అందులో లేవు కదా! ఐనప్పుడు దాన్ని పురాణ శబ్దంతో వ్యవహరించడం ఎలా సమంజసం? అనే విచికిత్సను లేవదీసి, బసవపురాణం సర్గ ప్రతిసర్గాదులతో కూడిన సంప్రదాయ పురాణాల వంటి పురాణం కాదనీ, జైనమత సంప్రదాయానుగుణములైన ఉత్సవ పంచకం లేదా పంచజిన మహాకల్యాణాలనే జైన పురాణ లక్షణాలతో కూడిన పురాణమనీ సుబ్రహ్మణ్యంగారు 'బసవపురాణ నిర్మాణము - జైనపురాణము' అనే వ్యాసంలో ప్రతిపాదించినారు. ఇదివరకెవ్వరూ చేయని ప్రతిపాదన ఇది.

ఈ విధంగా పరిశీలిస్తే ఈ సంపుటిలోని ప్రతి వ్యాసంలో ఒక కొత్త ప్రతిపాదనం, ఒక కొత్త సమన్వయం మనకు కనిపిస్తుంది. జి. వి. యస్‌గారి నిశిత పరిశీలనదృష్టికి ఇది నికషోపలం.

# ఇందులో...

# పురాణము – ఇతిహాసము

భారతీయులకు వేదములు పరమ ప్రమాణగ్రంథములు. వేదధర్మములు జనులకు సులభగ్రాహ్యము లగుటకై మహర్షులచేఁ దదర్థ పర్యాలోచనరూపము లుగా నిర్మింపఁబడిన ధర్మసంహితలు స్మృతులు. శ్రుతి స్మృతులలోని ధర్మము లను విపులీకరించి దృష్టాంతరూపము లగు వివిధేతిహాస కథాకదంబముల ద్వారమున పామరపండిత మనోరంజకముగ బోధించు గ్రంథములు పురాణేతి హాసములు. శ్రుతిస్మృతులు ప్రభుసమ్మితము లయి ధర్మ ప్రబోధమును నిర్వ హించుచుండ, పురాణేతిహాసములు మిత్రసమ్మితములై లోకమునకు హితము నుపదేశించుచున్నవి.

వాజసనేయి బ్రాహ్మణోపనిషత్తు వేదములును, ఇతిహాసపురాణములును పరమేశ్వర నిశ్వాసరూపములని యభివర్ణించెను:

"అస్యమహతో భూతస్య నిశ్శ్వసిత మేతద్య దృగ్వేదో
యజుర్వేద స్సామవేదోఽథర్వాంగిరస ఇతిహాసః పురాణమ్."

మానవునకు శ్వాసనిశ్వాసలు ప్రాణసంకేతము లైనట్లే భగవంతునకుఁ బ్రాణస్థానములు వేద పురాణేతిహాసము లని యుపనిషత్తాత్పర్యము. అనఁగా, జీవునకు శ్వాసముతో యావద్దివ్యభావిత్వమున్నట్లే భగవంతునకు వేద పురా ణములతో యావద్దివ్యభావిత్వ సంబంధము గలదని భావము దీనివలన నుపని షత్తులు వేదార్థముల కిచ్చిన యున్నత స్థానమును, ప్రామాణ్యగౌరవమును బురాణేతిహాసముల కిచ్చి గౌరవించినట్లు తెలియుచున్నది. ఛాందోగ్యోపనిషత్తు ఇతిహాసపురాణము పంచమవేద మని చాటి చెప్పుచున్నది:

సహోవాచ "ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం
సామవేద మాథర్వణమ్
చతుర్థ మితిహాసపురాణం పంచమం వేదానాం వేద మితి."

పంచమవేదము చతుర్వేదసారము. మహాభారత మాతాత్పర్యమును "ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" తని నిపుణముగాఁ బేర్కొని నది. కావున, నితిహాసపురాణముల వలననే వేదము లెస్సగా బలపడుచున్నది.

పురాణేతిహాస విజ్ఞానమువలన వేదార్థము ప్రసన్నమగును. అనఁగా, పంచమ వేదములైన పురాణేతిహాసములు వేదహృదయము విప్పిచెప్పు విశిష్టగ్రంథములు.

పురాణేతిహాసముల కత్యంత సాన్నిహిత్యము కలదు. వేదకాలము నుండియు నట్టి సంబంధము వానియందుఁ గానవచ్చుచున్నది. వేద బ్రాహ్మణము లందు పురాణేతిహాసములు విడివిడిగాఁ బేర్కొనబడియున్నను శతపథబ్రాహ్మ ణాదులలో 'నితిహాసపురాణ'మను నేకపద ద్వంద్వసమాసములు ప్రయోగింపఁ బడి యున్నవి. సామాన్యముగా నట్టి ద్వంద్వసమాస మవినాభావసంబంధము గాని, యాజన్మవిరోధముగాని కల రెండు వస్తువులను గలిపి చెప్పునపుడు వాడఁబడు చుండును గావునఁ బురాణేతిహాసము లవినాభావ సంబంధముగల ద్వంద్వముగా నట్టి సమాస ప్రయోగము సూచించుచున్నది.

పురాణేతిహాసముల స్పష్టమైన పరిగణన మథర్వవేదమునఁ దెలియవచ్చు చున్నది. వానితోపాటు గాథలు, నారాశంసలు, వాకోవాక్యములు అనువానిని గూడ నావేదము తెలుపుచున్నది. విద్యారణ్య సాయణాచార్యులు తమ భాష్యము లందుఁ బైవాని స్వరూప స్వభావములను గూర్చి పేర్కొనియున్నారు: "దేవాసు రాస్సం యత్తా ఆసన్" అని యిట్లు పూర్వము జరిగినదట యనునట్లు పూర్వ ప్రసిద్ధ వృత్తములను దెలుపునది యితిహాస మనియు "ఇదంవా అగ్రేనైవ కించి దాసీత్" ఇట్లు జగత్ప్రాగవస్థ నుపక్రమించి చెప్పెడి సర్గ ప్రతిపాదకమైన వాక్యజాతము పురాణ మనియు విద్యారణ్యులు. సాయణాచార్యులు గాథాదుల నిట్లు నిర్వచించెను: "మహోహ మివవై బ్రహ్మదాత్ ఇత్యాదయో మన్త్రాః గాథాః। 'నరాః మనుష్యాః తత్ప్రశంసాపాదకాః శ్లోకాః నారాశంస్యః గాథాః। సమానాన్ సదముక్షన్తి' ఇత్యాదికాః మనుష్య ప్రశంసాపరాః నారాశంసాః। 'సవై గౌతమస్య పుత్రవృతో జనం ధావయేత్' ఇతి ఉక్తి ప్రత్యుక్తిరూపమ్ బ్రాహ్మణం (ప్రక రణం) వాకోవాక్యమ్."

పై వ్యాఖ్యాత లితిహాసాదులను వివేచించునపుడు వేదవాక్యములనే దృష్టాంతములుగా నిచ్చియుండుట గమనింపఁ దగిన యంశము. అనఁగా, వేదవాక్యములలోనే జగత్ప్రాగవస్థనుగూర్చి చెప్పెడి వాక్యములు పురాణము లనియు, దేవ దానవ యుద్ధాది ప్రసిద్ధ విషయములను జెప్పు వాక్యసముదాయము లితిహాసము లనియు, దైవప్రశంసాత్మకము లైన మంత్రవాక్యములు గాథ లనియు, నరప్రశంసారూపములైన వాక్యములు నారాశంసలనియు ఉక్తి ప్రత్యుక్తిరూపము లైనవి వాకోవాక్యము లనియు స్పష్టమగుచున్నది. దీనినిబట్టి

వేదవాక్యము లందే పురాణేతిహాస స్వరూపకల్పన మొనర్పఁబడిన దని భావింప వచ్చును. మఱియు సర్గ ప్రతిసర్గ లక్షణ విశిష్టమైనది పురాణ మనియు, దేవ దానవంశములకు సంబంధించిన కథన మితిహాస మనియు సధర్వ వేదకాలమున భావింపఁబడుచుండె ననియు గ్రహింపవచ్చును.

నైఘంటికు లొనర్చిన పురాణశబ్దనిరుక్తు లిట్లున్నవి: "పురా భవతీతి పురాణః"; "పురా పూర్వస్మిన్ భూత మితి పురాణమ్"; "పురా భవమితి పురాణమ్"; "పురా నీయతే ఇతి పురాణమ్"; "పురా నవం భవతి పురాణమ్" "పురా అనక్తి" మొదలగునవి. ఇట్టి నైఘంటిక నిరుక్తుల కాలంబనములు పురాణము లందుఁ గలవు:

"యస్మా త్పురా హ్యనక్తీదం పురాణం తేన హి స్మృతమ్
నిరుక్త మస్య యోవేద సర్వపాపైః ప్రముచ్యతే॥"

—వాయుపురాణము.

"పురా పరంపరాం వష్టి పురాణం తేనవై స్మృతమ్॥"

—పద్మపురాణము.

"యస్మా త్పురా హ్యభూ చ్చైతత్పురాణం తేన తత్స్మృతమ్॥"

—బ్రహ్మాండపురాణము.

''పురాతనస్య కల్పస్య పురాణాని విదుర్బుధాః॥''

—మత్స్యపురాణము.

దీనినిబట్టి పురాణము లనఁ జిరకాలమునఁ బుట్టిన వనియుఁ, బ్రాచీన విష యములను దమయందుఁ బొందించుకొనిన వనియుఁ, బ్రాచీనకాలమున నవీనము లుగా నుండినవనియు, పురావిషయములందు జీవించెడి వనియుఁ, బ్రాక్తనవిష యాభిరతి కలిగిన వనియుఁ, బురాతన కల్పవస్తుకము లనియు నేర్పడుచున్నది.

ఇవి యన్నియు నిట్లుండ "పురాపి నవమ్ పురాణమ్" అను నిరుక్తి యొకటి ప్రసిద్ధిగాంచినది. దీనినిబట్టి పురాణములం దభివర్ణింపఁబడు వస్తువిశేష ములు పురాతనము లయ్యును నవ్యములుగను, నిత్యనూతనములుగను భాసించు చుండునని తాత్పర్య మేర్పడుచున్నది. పురాణములందలి యీ నవ్యతయే వాని

కుత్తమ సాహిత్య గౌరవము నాపాదించుచున్నది. పురాణములందలి వస్తువులు పురాతనము లయ్యు నవి రచింపఁబడిన కాలమునుబట్టి యర్వాచీనములుగాఁ బొడగట్టుచున్నవి కావున, నవ్యము లనఁబడుచున్నవని యీ నిరుక్తిని కొందర న్వయించిరి. అట్లైనను పురాణ మన నతి ప్రాచీనమైన దనెడి పూర్వ నిరుక్తుల తాత్పర్యమున కెట్టి విప్రతిపత్తియు నేర్పడుట లేదు. కాని, పురాణములు ప్రప్రథమమున పురాణగాథా స్వరూపములై యుండినను క్రమముగా వానియం దర్వాచీనములైన వస్తు విశేషము లెన్నియో చేరుచు వచ్చినవని యీ నిరుక్తి స్పష్టము చేయుచున్నది.

పురావస్తు లక్షణములను బరిశీలించి తత్స్వరూప నిర్వచనము చేయ యత్నించిన ప్రాచీనులు పెక్కురు గలరు. వారందఱిలో నమరసింహుఁడు "పురాణం పఞ్చలక్షణ"మ్మని చెప్పిన నిర్వచనము కడుప్రసిద్ధికెక్కి యున్నది.

"సర్గ శ్చ ప్రతిసర్గ శ్చ వంశో మన్వన్తరాణి చ
వంశానుచరితం చేతి లక్షణానాం తు పఞ్చకమ్."

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశానుచరితము లను బంచ లక్షణములు గలవి పురాణము లని యమరకోశము. వంశానుచరిత స్థానమున 'భూమ్యాదేః సంస్థాన' మ్మను పాఠాంతర మొండు కనఁబడుచున్నది. ఈ పంచ లక్షణ నిర్వచనమును మార్కండేయాగ్ని వాయు విష్ణు కూర్మ మత్స్యాది పురాణములు కూడ పేర్కొని యుండుటయే కాక, తల్లక్షణములను దమయందు యథావకాశముగా సంతరించుకొని యుంచినవి. కావున ప్రాచీను లీ పంచ లక్షణ సూత్రము నతి ప్రామాణ్య బుద్ధితో గ్రహించి యుండిరని భావింప వీలగుచున్నది.

ఈ సూత్ర మంత ప్రాచుర్య మందుట కాపంచలక్షణముల పరమ సార్థక్యమే కారణము. పురాణము సర్గముతో నారంభింపఁబడునని పైసూత్ర నిర్దేశము. సర్గమునందు బ్రహ్మాండోత్పత్తి చెప్పబడును. విద్యారణ్యు లన్నట్లు జగత్ప్రాగవస్థకంటెఁ బ్రాచీనమైన వస్తువు సృష్టియందుఁ గానరాదు. పురాణ మచ్చటినుండి ప్రారంభమగుట కంటె నౌచిత్యము మఱొండు లేదు. ఆపైన 'ప్రతిసర్గము' నందు బ్రహ్మాదు లొనరించిన సృష్టివిధానము వివరింపఁబడి యుండును. అందు స్థావరజంగమాత్మక మైన సృష్టివైవిధ్యము విపులముగా వర్ణిత మగును, వంశములందు దేవాసురాది విభేదోత్పత్తియు, బ్రహ్మర్షి దేవర్షి

వంశకర్తల చరిత్రములును వర్ణింపఁబడును. కావున సృష్టింపఁబడిన జీవరాసులలో నేర్పడిన క్రమబద్ధమైన వికాస మిం దభివర్ణింపఁబడును. మన్వంతరములందు ధర్మశాస్త్ర ప్రవర్తకులై భువిని శాసించెడు పదునలుగురు మనువుల యుత్పత్తియు, వారి పరిపాలన కాలములందలి విశేషములును వర్ణింపఁబడును. అనఁగా నీ యంశమునందు వేదధర్మమును లోకమున నాచరింపఁజేయుట కేర్పడిన విశిష్ట సంస్థలవంటి మహావ్యక్తులను గూర్చిన కథలు కీర్తింపఁబడు ననుట. వంశానుచరితమున దేవమూలములైన సూర్యచంద్ర వంశములందు జన్మించి, ధర్మవీరులయి ప్రసిద్ధికెక్కిన మహారాజుల చరిత్రములు వివరింపఁబడును. సర్గ ప్రతిసర్గ వంశములలో సృష్ట్యారంభమును, వేదోత్పత్తియు, దేవదానవాదుల యుత్పత్తి వికాసములును వర్ణింపఁబడఁగా మన్వంతర వంశానుచరితములందు మానవజాతి వ్యవస్థయుఁ, దత్పరిపాలనమును, దత్ప్రభువుల విధానమును దెలుపఁబడుచున్నవి. కావున వేదాదిధర్మములు దేవ మానవ సంఘములం దనుష్ఠితములగు క్రమ మీపంచ లక్షణములందు నిర్దేశింపఁబడిన దనవచ్చును. మఱియొక మాటలో జెప్పవలెనన్న నీ పంచలక్షణ సూత్రమునఁ బ్రపంచోత్పత్తి వికాస క్రమము భాసించుచున్నది. తద్వికాసమును బరమార్థానుసంధానవృష్టితో మిత్రసమ్మితముగాఁ బ్రపంచించెడి సారస్వత మూర్తులు పురాణములు!

ఇట్లే యితిహాస స్వరూపమును భావించుటకు నైఘంటిక నిరుక్తులు కొంత తోడుపడఁగలవు. "ఇతిహాసం పురావృత్త"మ్మని యమరసింహుఁడు. "ఇతిహాసః- ఇతిహ పారంపర్యోపదేశ ఆస్తే అస్మిన్ అస ఆధారే ఘఞ్. ధర్మార్థ కామమోక్షాణాం ఉపదేశసమన్వితమ్। పూర్వముక్తకథాయుక్తం ఇతిహాసం ప్రచక్షతే॥ ఇత్యుక్తలక్షణే పురావృత్త ప్రకాశకే భారతాదిగ్రంథే" అని శబ్దకల్పద్రుమము. వీనినిబట్టి యితిహాసమన పూర్వవృత్త మని స్థూలముగాఁ జెప్పవచ్చును. అది యిట్లు జరిగినదని పారంపర్యముగాఁ జెప్పుకొనుచున్న కథయై యుండవలెను. అనఁగా, నది చారిత్రక సత్యమై యుండవలెను. ఆ కథ వట్టి వార్తగా, నుదంతముగా నుండరాదు. చతుర్వర్గోపదేశ సమన్వితమైన యుజ్జ్వల కథా రూపమున నుండవలెను. కావున నితిహాసము పూర్వచరిత్ర నిబంధనప్రాయమై, నుజ్జ్వలోపదేశాత్మకమైన కథయై యుండవలెనని యేర్పడుచున్నది.

అభినవగుప్తుఁడు నాట్యశాస్త్ర వ్యాఖ్యానమునఁ గర్మఫల సంబంధ స్వభావములైన యాగమికార్థము లెందుఁ బ్రత్యక్ష పరిదృశ్యమానములగు

చుండునో యది యితిహాసమని పేర్కొనెను.[1] అనఁగా, నాగమములం దాయా పుణ్య పాపకర్మాదుల కాయాఫలములు లభించునని చెప్పఁబడిన వాక్య తాత్పర్య ములు ప్రత్యక్షపరిదృశ్యమానములగునట్లు ఇతిహాసమందలి యితివృత్తముండవలె నని నిర్దేశింపఁబడినదనవచ్చును.

పై నైఘంటికోక్తులను బరామర్శించినచోఁ బురాణములకును, ఇతిహాస ములకును గొట్టవచ్చినట్లు కానవచ్చెడి సామ్యము పురావస్తు సంబంధము. కాని తత్సామ్యమునందును బురాణేతిహాసములకు భేద నిరూపణము చేసి చూపించి నారు విద్యారణ్యులు. జగత్ప్రావస్థనుండి యారంభమగునది పురాణమనియు, దేవాసురుల గాథలు చెప్పునది యితిహాసమనియుఁ జెప్పుటలోనే యాభేదము కలదు. అనగాఁ బురాణ మత్యంత ప్రాచీనమగు వృత్తమును జెప్పుచుండ, నితి హాస మిది యిట్లని చూచి చెప్పినవారినుండి పరంపరగాఁ జెప్పఁబడుచు వచ్చెడి పురాతన చారిత్రక వృత్తమును జెప్పునని తాత్పర్యము.

సంస్కృతభాషలో భూతకాలిక క్రియలకు లఙ్, లుఙ్, లిట్ అను త్రివిధ లకారములు చేర్చి అనాద్యతనాద్యతనానంత భూతకాలికార్థములను దెలుపు చుండుట కలదు. అనఁగా, భూతమును బ్రాచీనులు ముప్విధముగా భావించిరని స్పష్టపడుచున్నది. అమరసింహుఁడు పురాశబ్దమునకు చిరాతీతనికటాగామికార్థ ములు కలవని పేర్కొనుటయు దీని కుపబలకముగా నున్నది. ఇట్టి విభాగమునం దొక సామంజస్యము కలదు.లౌకికానుభవదృష్టితో వివేకించినపు డిది సరిపడును. మనకుఁ బ్రస్తుతము వర్తమానము. అది ప్రత్యక్షము. కొలది కాలము గడచిన తరువాత నా విషయము వార్త యనఁబడును. మఱికొంతకాలము గడచుసరికి

---

1. నాట్యశాస్త్ర 1. 15 శ్లో.లోని "సేతిహాసమ్" అను పదమున కొనర్చిన వ్యాఖ్యానము : "ఇతిః=ఏవ మర్థే ప్రత్యక్ష నిర్దేశంద్యోతయతి। హః=ఇహ శబ్ద ఆగమః। ఆసః=ఆసనం. ఏవం ప్రకారాః ప్రత్యక్ష పరిదృశ్యమానాః అగమికార్థాః। కర్మఫల సంబంధ స్వభావాః యత్ర అసతే తేన ఇతిహాసేన-సహేతి పాఠే మత్వ ర్థీయో అకారః। ఇతి జ్ఞానమ్ తస్యహాసోహర్షపూర్వకో వికాసో యతః ఇతి కేచిత్ ఇతిహాసశ్చ - తల్లక్షణం ఇద్ధం కిల ఆసనం యత్ర రూపకభేదానాం భణ్యతే (దృశ్యతే)॥"

అది పరంపరా కథన రూపమున వెలసి, చారిత్రకవృత్త మనఁబడును. అదియే చిరకాలమైన తరువాతజెప్పఁబడినచో దాని చారిత్రకత్వముకంటె పురాతనత్వమే యధికముగా భాసించి పురావృత్త మనఁబడును. దీనిని జగత్కథ కన్వయించుచో సర్గాది పురా లక్షణ విశిష్టమైన వస్తువు నేఁడు పురాణవస్తు వనుటలో విప్రతిపత్తి లేదు. ప్రాచీన ప్రసిద్ధ రాజచరిత్రము లితిహాసములని గ్రహించుటలో నెట్టి సంకోచమును లేదు. అమరసింహుని మాటలలోఁ జెప్పిన- చిరభూతార్థము పురాణము, అతీతభూతార్థము ఇతిహాసము. ఈ సత్యమును గుర్తించి భోజుడు ''అతీతార్థ ప్రాధాన్యా దితిహాసః"[1] అని నిర్దేశించినాఁడు.

చతుర్విధ పురుషార్థ ప్రబోధము నితిహాసములవలెనే పురాణములు కూడ నిర్వహించుచున్నవి. కాని, పురాణము లాయర్థములను త్రివిధభాషలలో[2] యథానుకూలముగాఁ జెప్పవచ్చును. ఇతిహాసములు తదర్థబోధ నైతిహాసిక కథాముఖమున నిర్వహింపవలసి యుండును. ఈ భావమునే మఱియొక విధముగాఁ జెప్పినచోఁ గర్మఫల రూపము లయిన యాగమికార్థములు ప్రత్యక్ష పరిదృశ్యమానములగునట్లు చెప్పవలెనను నియమము పురాణములం దానుషంగికముగను, ఇతిహాసములందవశ్యముగను చాటింపబడునని భావము. ఇతిహాసమునఁ జతుర్వర్గ సాధకులైన ప్రసిద్ధపురుషుల జీవితవృత్తములు వర్ణింపఁబడును. అందు వారు తమ లక్ష్యసిద్ధికై యొనర్చు ప్రయత్నాదులఁ గూర్చియుఁ, దత్ఫలసిద్ధిని గూర్చియుఁ వివరముగా వర్ణింపఁబడును. వారి జీవిత వృత్తములు కర్మఫల రూపములైన యాగమికార్థములకు దృష్టాంతరూపములుగా నుండును. ఇట్టి కథార్థములచే వ్యంజితమగునది చతుర్విధ పురుషార్థ ప్రబోధము. పురాణమున నిట్టి

1. సరస్వతీ కంఠాభరణము 2-368 శ్లో. వ.

2. సమాధిభాష - లౌకికభాష - పరకీయభాష- యనునవి త్రివిధ భాషలు. సమాధి గమ్యములును, అతిగంభీరములు నైన వేదార్థములను సూత్రప్రాయమైనభాషలోఁ జెప్పుట సమాధిభాష. అతిసూక్ష్మములైన వేదతత్త్వములను సర్వజన సుబోధము లగునట్లు లౌకికభావముల తోడ్పాటుతో సార్థకాలంకార బంధురముగాఁ జెప్పుట లౌకిక భాష. వేదార్థములను దృష్టాంతరూపములైన కథేతిహాసముల ద్వారమున బోధించుట పరకీయ భాష. సమాధిభాషను లౌకిక భాష సరళము చేయును; సమాధిభాషలోఁ జెప్పబడిన ధర్మమును బరకీయభాష దృఢీకరించును. విష్ణు పురాణ ప్రథమాధ్యాయము నందలి సృష్టి వర్ణనము సమాధి భాష. అదే తత్త్వము దేవీభాగవత శ్రీభాగవతములందు లౌకికభాషలోఁ జెప్పబడినది. వేద సమ్మతమైన సత్యధర్మమహిమను స్థాపించుటకై హరిశ్చంద్రోపాఖ్యానాదులు చెప్పుట పరకీయభాష.

ప్రబోధము చారిత్రక సత్యమైన మహాపురుష జీవిత కథావర్ణనముఖముననే నిర్వ హింపవలసిన యవసరము లేదు. కల్పిత కథలద్వారమున గాని, ప్రతీకాత్మక గాథల వలన గాని, సమాధిలౌకికభాషలద్వారమున గాని ప్రబోధింపవచ్చును. కావున, పురాణేతిహాసములు చతుర్వర్గప్రబోధైక దృష్టి కలవయ్యు భిన్నమార్గ ముల ననుసరించుచున్నవనవచ్చును.

క్రీ.పూ. 4 వ శతాబ్ది ప్రాంతమున వెలసిన కౌటిల్యుని యర్థ శాస్త్రమున నితిహాస స్వరూపము తెలుపఁబడియున్నది రాజుయొక్క దినచర్యను నిర్దేశించి చెప్పుచుఁ గౌటిల్యుఁడు - ప్రభువు పూర్వాహ్ణభాగమున హస్త్యశ్వప్రహరణ విద్యాభ్యాసమును, పశ్చిమాహర్భాగమున నితిహాసశ్రవణమును జేయవలెనని నిర్దేశించి, "పురాణ మితివృత్త మాఖ్యాయికోదాహరణం ధర్మశాస్త్రమర్థశాస్త్రం చేతిహాసః"[1]అని యితిహాస స్వరూపమును బేర్కొనెను. ఈ మాటలవలన నితి హాసమునందు కొంతపురాణము ప్రవర్తిల్లుననియుఁ, గార్యకారణసంబద్ధమైన ప్రఖ్యాత వృత్తము నిబంధింపఁబడియుండు ననియు, నాయకనాయకేతరులచేఁ జెప్పఁబడు కొన్ని యాఖ్యాయికలును, దృష్టాంతరూపములైన కొన్ని గాథలును, ధర్మార్థ శాస్త్ర విషయములును సంతరింపఁబడియుండు ననియు స్పష్టమగు చున్నది. ఈ లక్షణము లన్నియు మహాభారతమున కన్వయించుచున్నవి. భారతారంభమున సర్గాదిలక్షణయుక్తమైన వస్తువు కలదు. దేవదానవ విభేద కథనము కలదు. తదంశలచే సంభూతులైన రాజులును, వారి వంశములును బేర్కొనఁబడినవి. చంద్రవంశ ప్రసిద్ధచక్రవర్తుల చరిత్రములు కీర్తింపఁబడినవి. అందును పాండవ కౌరవుల వృత్తాంత మాధికారిక వస్తువుగా విస్తరింపఁబడినది. వాసుదేవమాహాత్మ్య మా కథయందు వర్ణింపఁబడినది. ప్రసక్తానువశమున బహు విధోపాఖ్యానములును, ధర్మార్థనీతి మోక్షశాస్త్రాది విషయములు నందు పొందు పరుపఁబడియున్నవి. మహాభారతము మోక్షశాస్త్రమనియు, ధర్మశాస్త్రమనియు, నర్థశాస్త్రమనియు, నీతిశాస్త్రమనియు, నితిహాసమనియు, పురాణమనియు, మహా కావ్యమనియుఁ గీర్తింపఁబడుచున్నది. ఈ యంశములను క్రోడీకరించి చూచినచో గౌటిల్యుఁడు వాచ్యముగాఁ జెప్పకపోయినను మహాభారతము నుపలక్షించియే యితిహాస స్వరూపము నట్లు నిరూపించె నని భావింప వలను పడుచున్నది.

రాజశేఖరుఁడు పురాణము శాస్త్రమనియు, నందు వేదములలో జెప్పఁబడిన యాఖ్యానము లుపనిబద్ధములైయుండుననియు, నది పంచ లక్షణ సమంచిత

1. అర్థశాస్త్రము I. 5. పుట. 10.

మనియుఁ దెలిపి, పురాణములలోని యొక విధమైన భేదమే యితిహాస మని పేర్కొనెను. అట్టి యితిహాసగతి పరిక్రియా పురాకల్ప భేదముచే ద్వివిధ మనియు, నందు పరిక్రియ యేకనాయకమనియు, పురాకల్పము బహునాయక మనియు నిర్దేశించెను.[1] వానికిఁ గ్రమముగా రామాయణ మహాభారతము లుదాహరణములుగా నిచ్చెను. ఇందు రాజశేఖరుఁడు ఇతిహాసము పురాణాంతర్గత మైనదని భావించుట గమనింపఁదగినది. సృష్ట్యాదినుండి కలియుగ రాజవంశ ములవఱకు వ్యాపించియున్న మానవజాతి యొక్క సమగ్ర చరిత్రమును బురాణ వాఙ్మయము సమీక్షించుచున్న ట్లగుచున్నది కదా! అప్పుడు అతీత ప్రధానమగు నితిహాసము పురాణాంతర్భాగమే - వంశవంశానుచరితాంతర్గతమే యగు చున్నది కదా! కావున, నితిహాసము పురాణైకదేశ మని భావించుటలో నెట్టి విప్రతిపత్తియును లేదు. ఇఁక రామాయణ మహాభారతములందు ఫలభాక్కులగు నాయకులు వరుసగా రాముఁడును, పంచపాండవులును నగుటచే వానిని రాజశేఖరుఁడు పరిక్రియా పురాకల్పము లని భావించియుండును. రాజశేఖరుఁ డీశబ్దములను దార్శనికుల పరిభాష నుండి గ్రహించినట్లున్నాఁడు. దార్శని కులు పరిక్రియా పురాకల్పము లనునవి యర్థవాదములుగాఁ బేర్కొని యుండిరి. అర్థవాదములు వస్తుతః నిందా - ప్రశంసా - పరకృతి - పురాకల్ప భేదముచే నాలుగు విధములు. మహాపురుషుఁ డొకఁడు పూర్వ మొనర్చిన యొక యంశమును బ్రమాణముగాఁ జూపించుట పరకృతి యనఁబడును. "అగ్ని యనువాఁడు సర్వభక్షకుఁడు కాఁగోరి అగ్ని నారాధించెను. సర్వభక్షకుఁ డయ్యెను."[2] అనుపూర్వ ప్రవర్తితైతిహ్యమును బ్రమాణముగాఁ జూపించుట పరకృతి. పూర్వ మొకనిచేఁ జెప్పఁబడిన యర్థమును బ్రతిపాదించునది పురా కల్పము. పూర్వ మగ్ని హోమములు మోయ నిష్టము లేక నీటిలో దాగెను. దేవత లగ్ని నన్వేషించుచుండిరి. చేప లగ్ని నీటియందు దాగియుండె నని చెప్పినవి.

---

1. "పరిక్రియా పురాకల్ప ఇతిహాసగతి ర్ద్విధా
   స్యా దేకనాయకా పూర్వా, ద్వితీయా బహునాయకా."

   — కావ్యమీమాంస, 2 వ అధ్యా.

2. తైత్తిరీయ బ్రాహ్మణము III. 1, IV. 1.

అగ్ని తన రహస్యమును బయఃబపఱచినందుల కాగ్రహించి దేవలను లోకులు మిమ్మల నిష్టమువచ్చినట్లెల్లఁ జంపెదరుగాక యని శపించెను.[1] అను పర వక్తృకార్థ ప్రతిపాదనము పురాకల్పము ఇవి చెప్పఁబడిన విధమును గమనించి నచోఁ పరక్రియ యేకవక్తృక మనియు పురాకల్పము బహువక్తృక మనియు నేర్పడుచున్నది ఒక విధముగా నీ రెండును అతీతార్థ ప్రధానములే కాని పరకృతి యద్యతన భూతార్థము పురాకల్ప మనద్యతనభూతార్థము పరకృతి యందు ప్రాచీనోదంతము ప్రథమముగా నొక వ్యక్తిచేఁ జెప్పఁబడినది పురా కల్పము పారంపర్య కథనముగా బహువక్తలచేతఁ జెప్పఁబడినది బహుశః మీమాంసకులు చెప్పెడి యీ యర్థవాద భేదములను రాజశేఖరుఁడు గ్రహించి తన కావ్య మీమాంస యందు స్థాపించి యుండవచ్చును కాని వాని సహజ లక్షణములగు నేకవక్తృ బహువక్తృకత్వములను మార్చి యేకనాయక బహు నాయకత్వములుగా నాతఁడు నిబంధించి యుండవచ్చును పరక్రియా శబ్దము పరిక్రియ గా మార్చియుండవచ్చును ఇతిహాసము పారంపర్యోపదిష్టమైనదే కావున మీమాంసకుల మతము తద్విరుద్ధము కాదు

సామాన్యముగా లాక్షణికులు వాఙ్మయమును శాస్త్రేతిహాస కావ్యము లని మువ్విధముగాఁ బరిగణించెదరు అందు శాస్త్రము శబ్దప్రధాన మనియు నితిహాస మర్థప్రధాన మనియు కావ్య ముక్తిప్రధాన మనియుఁ బరిగణించెదరు. అగ్ని పురాణము ఇతిహాసమునకు నిష్ఠత ముఖ్యమని పేర్కొనినది[2] అతీతార్థప్రధాన మగుటచే నితిహాసమునకు సత్యప్రతిపాదనము సహజ లక్షణ మగుచున్నది. అది యర్థప్రధాన మగుటచే వేదాదులవలెఁ ప్రభుసమ్మితముగాఁ గాక కావ్యమువలెఁ గాంతాసమ్మితముగాఁ గాక హితునివలె మిత్రసమ్మితముగాఁ ప్రబోధము నిర్వ హించుచున్నది ఆనందవర్ధనాచార్యుఁడు ధ్వన్యాలోకమున నితిహాసమగు మహా భారతమును శాస్త్రరూప కావ్యచ్ఛాయాన్వయి యని పేర్కొనెను దానివలన శాస్త్ర కావ్య మధ్యవర్తి యగు నితిహాసమునందుఁ గొంత శాస్త్రరూపమును కొంత కావ్యచ్ఛాయయును అన్వయించి యుండునని యేర్పడుచున్నది అనఁగా

---

1 తైత్తరీయ సూత్రము II VI VI 1
ఇవి కృష్ణయజ్వ మీమాంసాపరిభాష యను గ్రంథము నుండి గ్రహింపబడినవి

2 శాస్త్రే శబ్దప్రధానత్వం - ఇతిహాసేషు నిష్ఠతా
అభిధాయాః ప్రధానత్వాత్ - కావ్యం తాభ్యాం విభిద్యతే
—అగ్ని పురాణము.

నితిహాసము శాస్త్రకావ్యచ్ఛాయల కొకవిధమైన సంగమస్థానము. శాస్త్ర మనఁగాఁ జతుర్వర్గ వ్యుత్పత్తి. కావ్య మనఁగా రసభావసమన్వితోక్తి. ఇతిహాసమునకు సహజలక్షణము అతీతార్థప్రధానమైన సత్యవస్తుకథనము. ఇతిహాసమునకు శాస్త్రరూప కావ్యచ్ఛాయలు సమకూడినచో నుపదేశోపరంజకత్వములు సిద్ధించి, యొక నిండుదనము కలుగుచున్నది. సత్య, శివ, సుందరరూప మగుచున్నది.

పురాణము లితిహాసములవలెనే అర్థప్రధానములు. మిత్రసమ్మితములు. ఈ రెండును వేదార్థములనే యుపదేశించును. పురాణమున శాస్త్రవిషయ మధికముగాఁ జెప్పఁబడును. దృష్టాంతరూపమున పెక్కితిహాసకథాగాథాదులు పేర్కొనఁబడుచుండును. ఇతిహాసమున శాస్త్రము సామాన్యముగా కథాగతి కొదిగియుండును. ఇతిహాస కథాకథనమునఁ బ్రధాన వృత్తమునందు మంద మయ్యు నొక యవిచ్ఛిన్నత భాసించును దానియం దొక వస్త్వైక్యము గోచరించును పురాణ కథాకథనమునందు సామాన్యముగా వస్త్వైక్యముండని కారణమున నవిచ్ఛిన్నతకు మాఱుగా ననుసంధాన మొండు భాసించును. అందైక్యతకుబదు లేకవాక్యత శోభించును.

పురాణము లితిహాసములకంటె నధికముగా దైవలీలలను వర్ణించును. ఋషిదేవపితృగణముల వృత్తములు, శాస్త్రవ్రతాది నియమములు, స్వర్గ నరకాది లోకానుభవ వర్ణనలు, పుణ్యాపాపఫలనిరూపణములు, పుణ్యతీర్థ క్షేత్ర మాహాత్మ్యములు, వివిధ శాస్త్రార్థసారసంగ్రహములు పురాణములందు స్వేచ్ఛగా వర్ణింపఁబడును. ఇతిహాసములందివి సందర్భవశమున నౌచిత్యవంతముగాఁ జెప్పఁబడుచుండును.

సంస్కృతమున వెలసిన ఇతిహాసములు రామాయణ మహాభారతములు. ఇందు రామాయణ మాదికావ్యమను ప్రశస్తిగాంచి, మహాకావ్య గౌరవము నందుకొనినది. మహాభారత మితిహాసమని ప్రసిద్ధిగాంచినది. పైన పేర్కొనఁబడిన యితిహాసలక్షణము లన్నియు మహాభారతమున కన్వయించుచున్నవి. పురాణములవలెనే యదియును పంచమవేదఖ్యాతిఁ బడసి, భారతీయ విజ్ఞానమణిదర్పణమువలె విరాజిల్లుచున్నది.

పురాణేతిహాసములు మాతాపుత్రికల వంటివి. కావున వాని రెండింటికిని కొన్ని పోలికలున్నవి. పరిణతయైన పుత్రిక మాతవలె గౌరవప్రపత్తులను లోకమున సంపాదించుకొనును. పురాణపురంధ్రి పండిన విజ్ఞానకల్పకము.

తత్ప్రతిక తల్లక్షణములు కొన్ని ముద్రించుకొనిన మహితమాకందమూర్తి. వారి గుణములందును. లక్ష్యములందును సామ్యములుండును. కాని, యవస్థల యందును, వ్యవస్థలయందును భేదముండకతప్పదు.

భారతీయ సాహిత్యములం దితిహాసపురాణము లెట్లు ప్రసిద్ధిజెంది యున్నవో పాశ్చాత్య వాఙ్మయములందు Epics, Myths అట్లు విఖ్యాతిఁ బడసియున్నవి. వీని పుట్టుపూర్వోత్తరములకును, వికాస క్రమమునకు, స్వరూప నిర్మాణ సంవిధానములకును వానికిని సంబంధ ప్రభావములు చాల తక్కువ. కాని, సాహిత్య ప్రక్రియలుగా వానికిని, వీనికిని సామ్యము కొంత కానవచ్చు చున్నది. పాశ్చాత్య విమర్శకులు ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య ప్రక్రియా పర్యాలోచనము సేయుచు భారతీయములైన యితిహాస పురాణములను క్రమముగా Epics, Myths గాఁ బరిగణించుట జరిగినది.

Epic poem సామాన్యముగా నొక సుదీర్ఘ కథావృత్తము గల కావ్యమై యుండును. మహాసంగ్రామము వంటి యుద్వేగ చైతన్య భావముచే నుత్తేజితమైన జాతియొక్క జీవితవృత్తమునుండి గైకొనఁబడిన యుజ్జ్వలములును, ప్రసిద్ధములునైన సన్నివేశములతో నది నిర్మింపఁబడును. దానియందలి పాత్రలును, సన్నివేశములును మానవుని యౌదార్యౌన్నత్యములయందును, మహోన్నత లక్ష్యసాధన శక్తియందును సామాజికులకు విశ్వాసము నినుమడింపఁజేసి విశిష్టానందము నొడగూర్పఁగలుగునట్లు చిత్రింపఁబడును.[1] Epic poem లో నితివృత్తమున కధిక ప్రాముఖ్యము కలదు. అందలి కథ రసభరితమై యుండవలెను. అందు మానవ జీవితానుభవముల కతీతములుగాని సంఘటనలు వర్ణింపఁబడుచు, వానిపైఁ బ్రభావము వేయుచున్న విధి ప్రాబల్యము నెఱుకపఱచుచుండవలెను. దానివలన నొక మహోపబోధముగాని, మహా ప్రయోజనముగాని సాధింపఁబడవలెను. అట్టి యుదాత్త వస్తువున కుచితమును, ఛందోలంకార బంధురమునైన కవిత్వ శైలి దానియందు నిబంధింపఁబడును.[2] ఇట్టి లక్షణములతో నొప్పారు Epic స్వరూప స్వభావములచే నితిహాసమునకన్న భిన్నమయ్యుఁ గొన్ని యంశములందు సాదృశ్యము సంతరించుకొనుచున్నది. సుదీర్ఘ కథా

1. చూడు: Virgil to Milton - By C. M. Bowra, పుట 1.

2. The Epic - By L. Ebercrombie, పుట 51.

కథనము ఉజ్జ్వలమైన జీవితవృత్తములు గల పాత్రలు చారిత్రక సత్యనిష్ఠ పురుషార్థ సాధనాత్మకమైన యున్నత జీవిత లక్ష్యము రసాత్మకమును ఉపదేశాత్మకమునైన యితివృత్త నిర్వహణము కర్మఫల సంబంధ నిరూపణాత్మకములైన యాగామికార్థములు ప్రత్యక్షపరిదృశ్యమానము లగునట్లు చేయుట• ప్రసన్న గంభీరమైన శైలి అను లక్షణములు ఇతిహాసమునందువలెనే Epic నందును గానవచ్చుచున్నవి కాని భారతీయేతిహాసములు Epic poems కంటె నుత్తమములైనవి వీనియందుఁ గానఁబడు తాత్త్వికౌన్నత్యము సార్వకాలిక విజ్ఞాననిధిత్వము పంచమవేద మనఁబడు ప్రామాణికత్వము వానియందుఁ దత్సాహిత్యాంతరంగమునఁ గానరావు పాశ్చాత్యుల Epic లక్షణములు భారతీయుల మహా కావ్యలక్షణముల కత్యంత సన్నిహితమై యున్నవి కాని యితిహాస సమగ్ర స్వరూప లక్షణముల నవి ప్రతిబింబించుకొనలేదు

పాశ్చాత్య విమర్శకులు Epicను Authentic Epic అనియు Literary Epic అనియు ద్వివిధాకరించిరి Authentic Epicను Primary Epic అనియు Epic of growth అనియు Oral Epic అనియుఁ బిలిచెదరు Literary Epicను Secondary Epic అనియు Epic of Art అనియు Written Epic అనియు వ్యవహరించెదరు విమర్శకులు వీనిని గుఱించి వివరించిన వాక్యములను క్రోడీకరించుకొనినచో వాని స్వరూప స్వభావముల నీ క్రింది విధముగా భావింప వచ్చును

భట్టులవంటి కథకు లొక సమకాలీన సత్వర ప్రయోజన ముపలక్షించి వివిధ కాలములందుఁ జెప్పఁబడుచుఁ బారంపర్యముగా వచ్చుచున్న కథలనుగాని ప్రత్యక్షముగా లోకమున గనుగొన్న యద్భుత వీర దృశ్యములనుగాని గానము చేయుచు వినిపించుచుండ వాని నొకచోట సంపుటీకరణము చేసినచో నది Authentic Epic అనఁబడును సామాన్యముగా నట్టివి యాశువుగాఁ జెప్పఁబడుచుండుటచే వక్తృభేదము ననుసరించి నూతనాంశములు పెక్కు లందుఁజేరుటకవకాశమున్నది ఇవి సాధారణముగా ననేక వీరుల సాహస గాథలను వర్ణించుచుండుటచే బహునాయకములై యుండును అందలి పాత్రలు గుణదోషమిశ్రమూర్తులైన మానవులై యుందురు అందుఁ బ్రబోధము నిర్వహింపఁబడవలెననెడి యాదర్శదృష్టికంటె వాస్తవికతను బ్రతిబింబింపఁ జేయవలెననెడి యాసక్తి యధికముగాఁ గానఁబడును అందలి కవితాశైలి సరళమును శక్తిమంతమును ధారాళమునై నిరాడంబరముగా నొప్పారుచుండును

ఒక మహాకవి మహాకవిత్వ దీక్షావిధి నంది తా నొక యితిహాసమును రచింప సంకల్పించి ప్రయత్నపూర్వముగా నందు కావ్య శిల్పాదులను సంత రించి రచించిన కవితా గ్రంథ విశేషము Literary Epic. సామాన్యముగా నొక మహాసంఘటనము గాని, యొక యుజ్జ్వల చరిత్రాధ్యాయము గాని ముగిసిన వెంటనే వెలసిన యొక మహాకవి యద్యతనభూతమైన యాచరిత్రను సమగ్రముగా సమీక్షించి, యొక తాత్త్వికసమన్వయముతో వస్త్వైక్యమును సంత రించి, యాలంకారికమైన ప్రౌఢకవిత్వమున నొక మహాకావ్యముగా నిర్మించు చుండును. అది సార్వకాలీనమైన సాహిత్య ప్రయోజనము నుపలక్షించి పఠన పాఠనముల కుపయోగపడునట్లు రచింపఁబడును. సాధారణముగా నిది యేక నాయకమైయుండును. ఆ నాయకుఁడు స్వయంసమర్థుఁడును దివ్యాదివ్యుఁడు నయియుండుటయే కాక యొక్కొక్కసారి యొక జాతికిని, ఒక సంస్కృతికినిఁ బ్రతీకగానో - లేక - ప్రతినిధిగానో నిర్మింపఁబడవచ్చును. ఆనందముతోపాటు ఉపదేశమును గూడ సామాజికుల కందించుట దీని ప్రధాన లక్ష్యము.

సంస్కృతమున వెలసిన యితిహాసముల కీవిభాగము సమగ్రముగా నన్వ యింపదు. కాని, స్థూలదృష్టితోఁ బరిగణించినచో మహాభారతము Authentic Epic అనియు, రామాయణము Literary Epic అనియు భావింపవచ్చును.

Myth అను పద మిప్పుడు అభూతకల్పన మను నర్థమున నిత్య వ్యవ హారమున వాడఁబడుచున్నది. ఈ పదము ప్రాచీన గ్రీకు భాషలో 'నోటితో నుచ్చరింపఁబడినది' యను నర్థము నిచ్చు 'Mythos' అను పదమునుండి జన్మించినది. ఆ పద మా భాషలోనే కాలక్రమమున దైవములకును, అద్భుతావ హములగు దైవలీలలకును సంబంధించిన గాథలను నర్థమున బ్రసిద్ధికెక్కినది. అది క్రమముగా నమాయకులను మోసగించుటకై కల్పింపఁబడిన యద్భుతగాథ యను నర్థమున రూఢికెక్కినది.

పాశ్చాత్య విమర్శకులు Myth అనునది యనాదిమానవుఁడు భగవదా రాధనరూపమైన పవిత్రకర్మతంత్రము నాచరించునప్పు డుచ్చరించిన వాక్యసము దాయమునుండి మొదట పుట్టియుండవచ్చు ననియు, నదియే క్రమముగా దత్కర్మల నాచరించిన వ్యక్తుల యొక్కయు, దైవములయొక్కయు మహిమ న్వితములైన గాథలతో విస్తరించియుండవచ్చుననియు భావించుచున్నారు. ప్రా నులు ప్రకృతి శక్తులను, పితృదేవతలను, సురాసురప్రవృత్తులను, వన్యమృ

దులను ఆదర్శప్రభువులను ఐంద్రజాలికులను దైవములుగా రూపకల్పన
గావించి [1] వారియందు మానవాతీతశక్తుల నారోపించి యద్భుతకథలుగా
వర్ణించియుందురని యూహించుచున్నారు మొత్తముమీఁద Myths చారిత్రక
సత్యములు కావనియు మానవాతీతశక్తులకు సంబంధించిన కల్పితగాథలనియుఁ
జాలమంది విమర్శకులు విశ్వసించుచున్నారు ఇట్టి కథ లద్భుతకల్పనలుగా
నిప్పుడు కానవచ్చుచున్నను ప్రాచీను లాకథలు గాథలు పురాతన కాలమునం
దెప్పుడో యొకప్పుడు జరిగియుండియుండు నను విశ్వాసముతో నుండిరని
ప్రొఫెసర్ మాలినౌస్కీ వంటి విమర్శకులు భావించుచున్నారు ఆ గాథలయం
దవి యెట్టి పురాతన వాతావరణములందుఁ బుట్టినవో వానియందుఁ బ్రపంచిత
మయ్యెడి ప్రాచీనవిశ్వాసాదు లెట్టివో తెలుపు నంశములు భద్రపఱచుట జరిగిన
దనియు తత్కథాకథనమున శ్రోతలు వానియందలి శబ్దములను భావములను
వివరములను ప్రమాణబుద్ధితో గ్రహించి వానిపట్ల నెట్టి మార్పు లొనర్చుటకును
సుముఖులై యుండెడివారు కారనియుఁ దలంచుచున్నారు

Mythలతో దైవలీలలే కాక సర్గ ప్రతిసర్గాదుల వంటి విషయములును పుణ్య
ఖగోళరహస్య విషయములును స్వర్గనరకాది పరలోకవిషయములును
పాపఫలానుభవ విశేషములును నరు లొనర్చు ఆముష్మిక పుణ్యకర్మలకు
దేవతలు తృప్తులై లోకమునకు వా రొనర్చు ప్రత్యక్ష ప్రత్యుపకారాదులును
అట్లే దేవతల యాగ్రహచర్యలును వర్ణింపఁబడియున్నవి అతిప్రాచీన విషయ
ములయొక్క విస్పష్టోత్పత్తి వికాసాదుల నెఱిఁగింప యత్నించిన కథలలోఁ
గొన్నింట స్థానిక చరిత్రలే పురాణగాథలుగాఁ బరివర్తనము చెందుటయుఁ గాన
బడుచున్నది Mythలలో నభివర్ణితులైన దేవతలలో సూర్యున కధికోన్నతస్థానము
గలదు ఒకవిధముగా సర్వప్రపంచ పురాణ వాఙ్మయము (Mytohlogies)
సూర్యునిచుట్టు తిరుగుచున్నదని చెప్పినను ఆశ్చర్యము లేదని విమర్శ
కులు భావించుకున్నారు [2]

Myth యొక్క వైశిష్ట్యమును ప్రొఫెసర్ మాలినౌస్కీ యీ క్రింది
వాక్యములలోఁ బ్రతిభావంతముగా నుడివియున్నాఁడు ఒక జాతియొక్క
సంప్రదాయములను బలపఱచుటకు (Myth) పుట్టును చరిత్ర కందని పురా
వృత్తమును సముజ్జ్వలాధ్యాత్మిక దృష్టితో సముద్ధరించి వ్యాఖ్యానించి జాతి

1 The outl nes of Mythology - by Lewis Spence P 25

2 The outl ncs of Mythology - page 71-72

యొక్క గౌరవప్రతిష్ఠల నినుమడింపఁజేయుట 'మైథాలజీ' లక్ష్యము. 'మైథాలజీ' సర్వవాఙ్మయమునకు మూలభూత మైనది. అందుండియే ఇతిహాసము, కావ్యము, నాటకము,సర్వము జనించును. 'మైథాలజీ' మానవసంఘ వ్యవస్థను శాసించును, ధర్మమును బోధించును. న్యాయమును సూచించును. శిల్పసుందరమైన కళయును, జ్ఞాన బంధురమైన శాస్త్రమును దాని వాక్కున భాసించును. కావున మానవుని ఆవేశ ములకును, యనుభూతులకును, ఆశలకును, ఆశయములకును, అంతరంగము లకును, అన్వేషణమునకును 'మైథాలజీ' యొక మణిదర్పణము వంటిది.[1]

పాశ్చాత్యులు భారతీయుల వేదపురాణేతిహాసములను గలిపి యుమ్మడిగా Myths అని గుర్తించియున్నారు. కాని, భారతీయులు శ్రుతిస్మృతులను శాస్త్ర ములుగను, పురాణేతిహాసములను శాస్త్రముల కంటె భిన్నమైన సారస్వత ప్రక్రియలుగను బరిగణించుట ప్రసిద్ధము. కావున పాశ్చాత్యులు చెప్పిన Myth యొక్క స్వరూప స్వభావములలో భారతీయుల వేదముల కేవి వర్తించునో, పురాణేతిహాసముల కేవి వర్తించునో వివేచింపవలసి యున్నది.

పురుషార్థ సాధకుఁడైన మానవుని ధర్మాచరణములను విధి రూపమున నిర్దేశించునవి వేదాదులగుటచే నవి శాసించు శాస్త్రములనియు, నవి శబ్దప్రధాన ములనియుఁ జెప్పబడుచున్నవికదా! అట్టి శబ్దప్రధానము లైన కర్మతంత్ర విధులు Myth లలోఁ గలవని పాశ్చాత్యులు చెప్పుచున్నారు. వానియం దుపయుక్తములైన శబ్దములకు మారుగా నదే యర్థము నిచ్చు నన్యశబ్దములను వాడినచో శ్రోతలు గర్హింతు రనుటయు దాని కుపబలకముగా నున్నది. వేద శాస్త్రములందలి ఋక్ సూత్రములకు నిట్టి నియమము ప్రసిద్ధము కావున కర్మ తంత్రముల (Rites) నభివర్ణించు Myth వేదతుల్యమైనది. తత్స్వరూప స్వభావ ముల నిర్దేశించు వాక్య సముదాయము స్మృతి గ్రంథ సదృశమైనది. మఱియు వేదమున మంత్ర బ్రాహ్మణములు కలవు. మంత్రము దైవస్వరూపమును శబ్ద రూపమున వాచ్యము చేయు బీజాక్షర సంపుటి. బ్రాహ్మణము విధి-అర్థవాద- అనువాద భేదముచేఁ త్రివిధము. ఇట్టివానినే "Myth is, in the strict sense of the term, the description of a rite, its story, the narrative linked with it" అని Lewis Spence భావించి యుండును.

---

1. Myth in Primitive Psychology - by Molinowski.

Mythology లోఁ గానఁబడు నిట్టి విధివాక్యములు గాక మిగిలిన లక్షణములు కొన్ని పురాణముల కన్వయించుచున్నవి. సర్గ ప్రతిసర్గములు, పుణ్య పాప ఫలరూపములైన స్వర్గనరకభోగవర్ణనాదులు, భగవల్లీలలు, పితృదేవతా మహిమలు, ప్రకృతిశక్తులు పాత్రలుగాఁగల గాథలు, సూర్యమహిమాభివర్ణితము లగు కథలు పురాణములందును వర్ణింపఁబడుచున్నవి. మఱియు పురాణములు వేదార్థోపబృంహితము లగుటచే Myths లో వలె rites కు సంబంధించిన విషయములు పురాణములం దుండుననుటలో వైరుధ్యము లేదు. పురాణములు వేద తుల్యము లనియు భారతీయులు భావించుచున్నారు కావునఁ బాశ్చాత్యుల Mythology కిని, పురాణ వాఙ్మయమునకును గొంత సాదృశ్యమున్నదనుటలో విప్రతిపత్తి లేదు.

ప్రతిపాద్యాంశములనుబట్టి Myths - Explanatory Myths అనియు, Aesthetic Myths అనియు రెండు విధములని C. M. Gayley విభజించెను.[1] విశ్వవిశ్వాంతరాళములలోని మహాద్భుత విషయములను గూర్చియు, జీవిత విశేషానుభవములను గూర్చియు ననాదిమానవుల కున్న యాసక్తిని దీర్చుటకై సత్యాన్వేషణపరులైన కొంద రొనరించిన యూహాపోహలలో రూపులు దిద్దుకొనిన కథలు Explanatory Myths. వానియందుఁ బ్రపంచసృష్టియు, మానవసృష్టి స్థితి వికాసములును, దేవాసుర ప్రవృత్తులును, మృత్యువు, పరలోకములు, ఆచారవ్యవహారములు, పండుగ పబ్బములు - ఇట్టివానిని గూర్చిన జిజ్ఞాసయు కథలుగా, గాథలుగా నల్లుకొని కానఁబడుచుండును.

ఆహ్లాదమే పరమప్రయోజనముగా నిర్మింపఁబడిన యపూర్వ కల్పనా మహనీయగాథాప్రపంచమును Aesthetic myths యందురు. ఈ కథలయం దపూర్వవిజ్ఞానవిశేషము లెన్నియో చెప్పఁబడును. కాని, వానివలన నాహ్లాదము కంటె వేఱొక ప్రయోజనము కానరాదు. అందలి పాత్రలును, వాని మనోభావములును, సన్నివేశములును మానవ సహజానుభవములకు దూరమై యున్నను, భావనాబంధురములై యాబాలగోపాలమును జవులూరించును. పఠితలు వానివలన బొందెడి యఖండానందమునకు కథామాధుర్యమే పరమకారణము.

Aesthetic myths లోఁ జరిత్రాంశము లాధారముగా వెలసినవి కొన్నియుఁ, గేవలము కల్పనాకథలు కొన్నియుఁ గానవచ్చుచుండును. అట్టి భేద

1. The Classic Myth - Page 431.

మును బురస్కరించుకొని సి యమ్ గేలే Aesthetic myths ను Historical myths అనియు Romantic myths అనియు రెండు విధములుగా విభజించెను చారిత్రకాంశము నొకదాని నాధారముగాఁ గొని దాని కొక దివ్య వాతావరణమును సాహసాత్మక కథా స్వభావమును భావనాబంధురములును సంభావ్యతాగుణవిశిష్టములు నైన కల్పనలను జోడించుకొని యొక మిశ్రకథా మూర్తిగా రూపొందినది Historical myth అనఁబడును దానియందు బలీయమైన విధి ప్రభావము సర్వకథాజీవితమును శాసించుచున్నట్లు చిత్రింపఁబడుట గమనింపఁదగిన ముఖ్యాంశము Romantic myth ఒక మహావీరుని యుజ్జ్వల చరిత్రను నభివర్ణించు కథ అందు సన్నివేశములకంటెఁ గథానాయకపాత్ర చిత్రణమునకే ప్రాముఖ్య మీయఁబడుచుండును అతని ఆలోచనల యొక్కయు, ఆచరణలయొక్కయు నిర్ణయముల యొక్కయు గతి ననుసరించి సర్వకథా ప్రవృత్తి వానిచుట్టును పరిభ్రమించుచుండుట యీ కథలలోని ప్రత్యేకత

పాశ్చాత్యులు Mythలను విభజించిన విధమును పురాణ కథల కన్వయింపఁజేసినచో వీనిలోని సర్గ ప్రతిసర్గ వృత్తాంతములు Explanatory Myths అనియు మన్వంతర వంశవంశానుచరితములు Aesthetic myths అనియు స్థూలముగా నేర్పరుపవచ్చును అందు వంశానుచరితములందలి యైతిహాసికమహాపురుషులచరిత్రలు Historical myths అనియు భావింపవచ్చును. కాని యిట్టి దృష్టితో పురాణకథలను విభజించినట్లు కానరాదు అయినను నవ్యులు పాశ్చాత్య విమర్శనాపద్ధతుల ననుసరించి పురాణకథల నిట్లు వర్గీకరించుచున్నారు. అయినను తత్పరిగణనము సర్గాది విభాగమునకన్న స్వాభావికమును సార్థకమును గాఁజాలదు.

పాశ్చాత్యులు రామాయణ మహాభారతములను Epics అనియు Myths అనియుఁ గీర్తించిరి. వానిని Epics అనియే గుర్తించుట సమంజసము కాని వారి Epic భావనకును మన యితిహాస స్వరూప సంభావమునకును మౌలికమైన కొన్ని భేదము లుండుటవలననే యిట్టి చిక్కేర్పడినది అది యట్లయినను పురాణములకును Myths కును స్వరూప స్వభావములందుఁ గొన్ని సమాన లక్షణము లున్నవనుట తథ్యము!

(1965)

# మేఘసందేశము - ప్రకృతివర్ణనము

కాళిదాస మహాకవి రచించిన లఘుకృతులలో మేఘసందేశము మేలు బంతి. శాపగ్రస్తుఁడైన యక్షుఁడొకఁడు తన సతికి మేఘ ముఖమునఁ బంపిన సందేశ మను కథావస్తువు కలిగియుండుటచే నా కావ్యమునకు మేఘసందేశ మను పేరు పెట్టఁబడినది. దానికి మేఘదూత మనియుఁ బ్రసిద్ధి కలదు. మేఘుని దౌత్యము నధికరించి యుంచఁబడిన నామ మది. కాళిదాసుని యా కృతి సందేశ కావ్య మనియు, దూతకావ్య మనియుఁ బిలువఁబడు నొక నూత్నకావ్యనిర్మాణ ప్రక్రియకు శ్రీకారము చుట్టినది. వాల్మీకిరామాయణమునందలి 'హనుమత్సందేశ' ఘట్టము మేఘసందేశ కావ్యరచనమునకు ప్రేరణ కల్పించియుండవచ్చునని విమర్శకులు భావించుచున్నారు. అయినను ఈ కావ్యమున కున్న వ్యక్తిత్వము విశిష్టమైనది. హనుమత్సందేశము దీనివలె నొక స్వయంసమగ్రమైన కృతి కాదు. అది యొక మహాకావ్యాంతర్భాగము. మేఘసందేశ మపూర్వకల్పనావిశేషావహమైన కవిప్రతిభనుండి యుద్భవించిన స్వతంత్రము, సమగ్రమునైన యొక కల్పితఖండకావ్యము. ఇది తరువాతి సందేశ - దూత కావ్యములకు మార్గదర్శకమై, నేఁటికిని తన గురుగౌరవమును నిలుపుకొనుచున్నది.

మేఘసందేశము పూర్వమేఘ మనియు, ఉత్తరమేఘ మనియు రెండు భాగములుగా విభజింపఁబడినది. ఆత్మాశ్రయకవిత్వకాసారమైన యీకావ్యము కథాప్రధానమైనది కాదు; వర్ణనాప్రధానమైనది. కాళిదాసు తాను గడించిన యఖండ ప్రపంచానుభవమును రసదిదృక్షువై భావించి, యాత్మీయతాగుణము జోడించి, ప్రకృతికిని మానవునకును గల యవినాభావసంబంధమును సూక్ష్మేక్షికతో దర్శించి, భావనాబంధురముగా రససింధువువలె నీ కావ్యమును సృజించెను.

మేఘసందేశమున కథ యత్యంతము స్వల్పము. స్వాధికార ప్రమత్తుఁడైన యక్షుఁ డొకఁడు కుబేరుని శాపమునకు గురియై చిత్రకూటాద్రి ప్రాంతమున (రామగిర్యాశ్రమమున) సంవత్సర భోగ్యమైన ప్రియావియోగము ననుభవించుచు, నాషాఢ మాసారంభమునఁ గానవచ్చిన యొక మేఘమును దూతగాఁ దన

సందేశము నలకాపురియందున్న తన యర్ధాంగి కంపుట యిందలి వస్తువు అలకాపురీగమనమునకు మార్గనిర్దేశ మొనర్చుట పూర్వమేఘమందలి కథాంశము అలకాపురమును యక్షగృహమును యక్షసతీవిరహావస్థను యక్షసందేశమును వర్ణించుట యుత్తరమేఘమందలి యితివృత్తము ప్రవాసవిప్రలంభ శృంగార రసపోషణ మీకావ్యమునకుఁ బ్రాణము

కవి రసభావములను వర్ణించును వర్ణ్యవస్తువులను ప్రకృతి నుండి గ్రహించును అవి చేతనాచేతనములును సాకారనిరాకారములునై యొప్పు చుండును అందు కన్నులతోఁ జూచినట్లు కొన్నింటిని రమణీయ వస్తుసాదృశ్య ముతో భావింపఁదగినట్లు కొన్నింటిని వ్యంగ్యార్థముచే నూహింపఁదగినట్లు కొన్నింటిని కవి ప్రతిభతో వర్ణించును కావ్యవస్తు వను భిత్తికపై వ్యుత్పత్తి యనెడి ధాతురాగముతో నలంకారములను రేఖలను గీచి ప్రతిభ యను కుంచెతో వర్ణములు నింపి లౌకిక జగత్తునకుఁ బ్రతిబింబమైన రసమయ జగత్తును కవి చిత్రించును అందు చేతనాచేతనములన్నియు సజీవమూర్తులై లోకవృత్తమునకు మణిదర్పణములవలె భాసించుచుండును

యక్షుఁడు మేఘుని ముఖమునఁ బ్రియురాలికి సందేశ మంపఁదలఁచి యలకాపురి మార్గమును సూచించుచు మార్గమధ్యమునందుఁ గల కొండలను నదులను వనములను నగరములను క్షేత్రములను పశుపక్ష్యాదులను నరనారీ జనములను గథానుగుణముగ వర్ణించుటయే మేఘసందేశకావ్యమందలి ప్రకృతి వర్ణనల స్వరూపము వర్ణనము స్వరూప స్వభావభేదముచే ద్వివిధము మేఘాసన్న కాలమునందలి ప్రకృతి బహిస్స్వరూపమును వర్ణించుట స్వరూపవర్ణనము జీవ ప్రకృతిలోని స్వభావపరిణామమును దెలుపుట స్వభావ వర్ణనము రసాత్ముఁడైన మేఘుని ముఖమున వానిని సాధారణీకరించుట రసజ్ఞుఁడైన కాళిదాసు చేసినపని. చిత్రకూటాద్రిపైనుండి పుష్పకవిమాన మెక్కి యలకానగరము చేరునంతవఱకు మేఘునితోఁ బయనించిన ట్లా దృశ్యములు మన కనుభూతము లగును

కాళిదాసు ప్రకృతివర్ణన చేయునపు డందలి చేతనాచేతనముల యొక్క స్వరూపము నెంత రమణీయముగఁ జిత్రించెనో వాని స్వభావమునుగూడ అంత హృదయంగమముగా భావించి ప్రపంచించెను. స్వరూపచిత్రణము కంటె స్వభావ వర్ణనము రసవంతమై మహాకవి ప్రతిభకు నికషోపల మగును కాళిదాసు వ్యంగ్య మార్గము ననుసరించి యట్టి ప్రకృతిస్వభావమును మేఘసందేశమునఁ బ్రపంచించి నాఁడు

యక్షుఁడు వప్రక్రీడాపరిణత గజప్రేక్షణీయమైన మేఘమును గాంచెను. మేఘము కౌతుకాధాన హేతువు. ప్రియురాలితోఁ గూడి సుఖమున్నవానికైనను మేఘదర్శనమువలన వలపు మోసులెత్తును. ఇఁక ప్రియావియోగదుఃఖ మను భవించుచున్న యక్షునిమాట వేఱుగాఁ జెప్పవలెనా? దేశాంతరగతులైన ప్రియులు మేఘోదయమును గాంచి యబలావేణిమోక్షణౌత్సుక్యమును దాల్చెదరఁట! అట్టి వారిని మేఘుఁడు తన మంద్రస్నిగ్ధ గర్జలచేఁ ద్వరపెట్టునఁట!

"యో బృన్దాని త్వరయతి పథి శ్రామ్యతాం ప్రోషితానాం
మన్ద్రస్నిగ్ధైర్ధ్వనిభి రబలావేణిమోక్షోత్సుకాని"

—ఉ. మే. 38

అని మేఘుఁడే తన స్వభావమును దెలియఁబఱచినాడు. కావున యక్షుని చిత్తవృత్తి మేఘోదయకాలమునందలి విరహుల సామాన్య మనఃప్రవృత్తి. అది స్త్రీపుంసప్రవృత్తుల సంయోగాకాంక్షారూపమై ప్రకృతియందు వ్యాపించి యుండును. కాలస్వభావము ననుసరించి భావించినను అది సమంజసమే యగును. వసంతఋతువు రత్యుద్దీపనమున కనువైనకాలము. ఆ సమయమున స్త్రీపుంసయోగ రూపమైన రతిభావమును ప్రకృతి భజించును. కాని, గ్రీష్మర్తువున మార్తాండ తీవ్రతాపమునకు జీవప్రవృత్తి తప్తమై యలసమై యుండుటచే ప్రకృతి విరతిని భజించును. భూమిపై ధూళికణములుసైత మెండవేడిమికి వేఁగి పొడిపొడిమై విడియై పడియుండునన్న కుసుమదళసదృశములైన నరనారీచిత్తవృత్తుల విషయము వేఱుగాఁ జెప్పవలయునా? అట్లు గ్రీష్మాతపసంతప్తములైన చిత్తములు మఱల చిగురింపఁ బ్రణయసుధాసేచనమువలె వానజల్లులఁ గురియునది మేఘము. వర్షధారలవలన ధూళికణములు రసార్ద్రములై ముద్దయగును. బీజములందలి జీవాణువులు పులకించి మొలకెత్తును; ప్రకృతియందలి స్త్రీ పుంస ప్రవృత్తులు మఱల రతిచైతన్యమును భజించి పరస్పరపునస్సమాగమాకాంక్ష వహించును. కావున కాళిదాసు వర్షారంభసమయమున చేతనాచేతనరూపమైన ప్రకృతి యందు స్త్రీపుంసయోగ రూప మను మహాచైతన్య మొండు వ్యాపించి యుండునను తాత్పర్యమును యక్షముఖమున మేఘసందేశమునం దంతటను వ్యంగ్యముగా నిబంధించెను. అది కావ్యకథానుకూలమును, శృంగారరసపోషకము నగుటచే సార్థకమగుచున్నది.

విరహార్తుఁడైన యక్షుఁడు అలకానగరద్వారసీమనందలి విశేషములను వర్ణించి చెప్పు వాక్యసముదాయమునం దంతర్లీనమ్ముగాఁ [illegible] పేర్కొనఁబడిన

భావస్రోతస్విని ప్రవహించుచున్నది శాపకారణముగా నతని కేర్పడిన బలవ ద్వియోగము వంటిది లోకమున నెవ్వరికిని కలుగఁగూడదని యతని భావము పరస్పర సాన్నిహిత్యము గోరు ప్రేమసీ ప్రియులమధ్యగాని సన్నిహితులై సుఖులై యున్న దంపతుల నడుమగాని వియోగము క్షణకాలమైనను కలిగినట్లు భావించుటకుఁగూడ యాతని చిత్త మంగీకరింపదు అందువలన పయోదప్రయా ణము ప్రణయసిద్ధి ప్రమోదహేతువై ప్రణయజీవులను రంజింపఁజేయవలెనని యతఁడాశించెను అతఁ డభిసారికలను వర్ణించినను సిద్ధదంపతులను భావించినను, పార్వతీపరమేశ్వరుల నూహించినను వారికి మేఘునివలన వియోగ విలుప్తియు సంయోగ సంసిద్ధియుఁ గలుగవలెననియే యాశించుటయు మేఘునిఁ దత్తదుచిత విధముల వర్తింపు మని నిర్దేశించుటయు గమనింపఁదగియున్నది. ఈ క్రింది శ్లోకము లందుల కుదాహరణములు

ఉజ్జయినీనగరమందలి యభిసారికలు :

గచ్ఛన్తీనాం రమణవసతిం యోషితాం తత్ర నక్తం
రుద్ధాలోకే నరపతిపథే సూచిభేద్యై స్తమోభిః
సౌదామిన్యా కనకనికషస్నిగ్ధయా దర్శయోర్వీం
తోయోత్సర్గ స్తనితముఖరో మాస్మ భూ ర్విక్లబా స్తాః.

—పూ మే 41

ఆమ్రకూటమున సిద్ధదంపతులు :

అమ్భోబిన్దుగ్రహణచతురాం శ్చాతకాన్ వీక్షమాణాః
శ్రేణీభూతాః పరిగణనయా నిర్దిశన్తో బలాకాః
త్వా మాసాద్య స్తనితసమయే మానయిష్యన్తి సిద్ధాః
సోత్కమ్పాని ప్రియసహచరీ సంభ్రమాలిఙ్గితాని

—పూ మే 22

మహాకాళక్షేత్రమున పార్వతీపరమేశ్వరులు

పశ్చాదుచ్చై ర్భుజతరువనం మణ్డలేనాభిలీనః
సాన్ధ్యం తేజః ప్రతినవజపాపుష్పరక్తం దధానః
నృత్యారమ్భే హర పశుపతే రార్ద్రనాగాజినేచ్ఛాం
శాన్తోద్వేగ స్తిమితనయనం దృష్ట భక్తి ర్భవాన్యా

—పూ. మే. 40

## కైలాసనగమున పార్వతీపరమేశ్వరులు :

"హిత్వా తస్మిన్ భుజగవలయం శమ్భునా దత్తహస్తా
క్రీడాశైలే యది చ విహరే త్పాదచారేణ గౌరీ
భఙ్గీభక్త్యా విరచితవపుః స్తమ్భితాన్తర్జలౌఘః
సోపానత్వం కురు మణితటారోహణాయాగ్రయాయీ."

—పూ. మే. 64

ప్రియసమాగమాకాంక్షలై చిమ్మచీఁకటిలో రాజమార్గమునఁ బోవు తమోభిసారిక లభీష్టసిద్ధిఁ బడయుటకు మేఘుని మెఱయు మనినాఁడే కాని యుఱుమ వల దనినాఁడు యక్షుఁడు. సిద్ధపతు లయాచిత ప్రియాపరిరంభ సౌఖ్యము నొందవలె నని యాశించి యతఁడు మేఘుని నుఱుము మనినాఁడే కాని, వర్షింప వలదనినాఁడు. ప్రణయాధిదేవత లగు పార్వతీపరమేశ్వరుల పట్ల అతఁడు మేఘుని నాదేశించినవిధము వేఱు. ఆ దంపతుల యవిచ్ఛిన్నానురాగమున కావంతయైన నవరోధము కలుగకుండవలె నని యక్షుని యభిమతము. నటరాజస్వామి తాండవమాడునెడ నతని యర్ధాంగియైన పార్వతి లాస్య మాచరించును. స్వామి ధరించిన రక్తార్ద్రగజచర్మవస్త్ర మాదేవిచిత్తమునఁ గొంత యేవగింపు గలిగించి యతనినుండి యామెను గొంతదూరముగా నేఁగునట్లు చేయునని యతనిభయము. మేఘుఁ డాగజాజిన స్థానమున నిలిచినచో నాయుమాదేవి ప్రీతితోఁ బతిఁగూడి సుఖింపఁగలదఁట! కైలాసమునఁ బతికరపల్లవము గ్రహించి శివునివెంట విహరించు పార్వతి పర్వతసానువుల నధిగమించుటలోఁ గొంతక్లేశ మొంది యతని యత్యంత సాన్నిహిత్యము ననుక్షణము పొందఁజాలదేమో యని యక్షుని విచారము. అందువలన నాదేవికి సుకరగమన సౌఖ్యము నాపాదింప మణివేదికగా నిలువు మని మేఘుని నాదేశించినాఁడు. అదిదంపతుల యవిచ్ఛిన్నప్రణయసిద్ధినిఁ గోరు యక్షుఁడు సర్వజీవప్రవృత్తులలో నట్టి సంవిధానము నాశించుటలో నాశ్చర్యమేమి? అది సార్థక మనుటలో ననుమాన మేమి?

విరహతప్తుఁ డైన యక్షుఁడు చేతనప్రకృతియందేకాక అచేతనప్రకృతి యందును ప్రణయసిద్ధినే కాంక్షించి సర్వభూతహితార్థబుద్ధి యైనాఁడు. అతఁడు నదీమేఘములమధ్య నాయికానాయక సంబంధమును భావించి తత్పునస్సంయోగ సిద్ధినిఁ బెక్కుచోట్ల వర్ణించినాఁడు. మచ్చున కొండు రెండు వర్ణన లీక్రిందఁ బొందుపఱుపఁ బడుచున్నవి.

దశార్ణదేశములందలి వేత్రవతీనది

తేషాం దిక్షు ప్రథితవిదిశాలక్షణాం రాజధానీం
గత్వా సద్యఃఫల మవికలం కాముకత్వస్య లబ్ధా
తీరోపాన్తస్తనితసుభగం పాస్యసి స్వాదు యత్ర
త్వభ్రూభఙ్గం ముఖ మివ పయో వేత్రవత్యా శ్చలోర్మి

—పూ మే 35

నిర్వింధ్యానదీ వర్ణనము

వీచిక్షోభ స్తనితవిహగశ్రేణికాఞ్చీగుణాయాః
సంసర్పన్త్యాః స్ఖలితసుభగం దర్శితావర్తనాభేః
నిర్విన్ధ్యాయాః పథి భవ రసాభ్యన్తరః సన్నిపత్య
స్త్రీణా మాద్యం ప్రణయవచనం విభ్రమో హి ప్రియేషు

—పూ మే. 29

వేణీభూత ప్రతను సలిలా సా త్వతీతస్య సిన్ధుః
పాణ్డుచ్ఛాయా తటరుహతరుభ్రంశిభి ర్జీర్ణపర్ణైః
సౌభాగ్యం తే సుభగ విరహావస్థయా వ్యఞ్జయన్తీ
కార్శ్యం యేన త్యజతి విధినా స త్వయైవోపపాద్యః

—పూ మే 30

గంభీరానది వర్ణనము

గమ్భీరాయాః పయసి సరిత శ్చేతసీవ ప్రసన్నే
ఛాయాత్మాపి ప్రకృతిసుభగో లప్స్యతే తే ప్రవేశం
తస్మా దస్యాః కుముదవిశదా న్యర్హసి త్వం న ధైర్యా
న్మోఘీకర్తుం చటులశఫరోద్వర్తనప్రేక్షితాని —పూ. మే 44

తస్యాః కిఞ్చి త్కరధృత మివ ప్రాప్తవా నీరశాఖం
హృత్వా నీలం సలిలవసనం ముక్తరోధో నితమ్బం
ప్రస్థానం తే కథ మపి సఖే లమ్బమానస్య భావి
జ్ఞాతాస్వాదో వివృతజఘనాం కో విహాతుం సమర్థః

—పూ. మే. 45

నదీమేఘము లచేతనములయ్యు పై శ్లోకములందలి యర్థాలంకారశక్తిచే సాకారములై శృంగార నాయికా నాయకులవలె రాణించి పఠితల మనోనేత్రముల నలరించుచున్నవి. కవి సృష్టిలో కానిదేమున్నది? వార్షుకప్రకృతియందు సహజ విభావములైన నదీమేఘములను గ్రహించి, వానియందు చేతనత్వ మారోపించి, స్త్రీ పుంసయోగరూప జీవచైతన్యమును వ్యంజింపఁజేసి, రసపోషణము గావించిన కాళిదాసు ప్రతిభ నిసర్గరమణీయమై రాణించుచున్నది.

కాళిదాసు నదీమేఘములనే కాక ప్రకృతిగతములైన బహువిధాచేతనద్రవ్యములను వర్ణించు నవసరములందును ప్రణయసంసిద్ధిభావమునకు ప్రాధాన్యమొసఁగి రచనము గావించెను. ఉదాహరణమున కీక్రింది శ్లోకములను గమనింపనగును:

**సూర్యోదయకాలవర్ణనము:**

"తస్మిన్కాలే నయనసలిలం యోషితాం ఖణ్డితానాం
శాన్తిం నేయం ప్రణయిభిరతో వర్త్మభానో స్త్యజాశు,
ప్రాలేయాస్రం కమలవదనాత్సోఽపి హర్తుం నలిన్యాః
ప్రత్యావృత్త స్త్వయి కరరుధి స్యాదనల్పాభ్యసూయః."
—పూ. మే. 43.

ఇందు పద్మిని ఖండితానాయిక. సూర్యుఁడు నాయకుఁడు. అన్యకాంతారతుఁడై రాత్రి చరించి యుదయమున నింటికిఁ జేరు ధృష్టునివలె సూర్యుఁడు ఉదయించినాఁడు. పద్మిని ఖండితానాయికవలె నన్యరతుఁడైన నాథునిఁ గాంచి మంచుకన్నీటిని పద్మముఖమునఁ దాల్చినది. సూర్యుఁ డామె కన్నీటినిఁ దుడిచి యూరడింప కరములు సాచు తరుణ మది. వియోగదుఃఖితయైన నాయిక పతి ప్రణయసిద్ధినిఁ బడయు నాశుభవేళ మేఘుఁ డాదంపతులనడుమ నిలువక తొలఁగి పోవలయు నని యక్షుని యాదేశము! కవిసమయము నాశ్రయించి కావింపఁబడిన యీ వర్ణనమున కవిహృదయము నూహించుట కష్టతరము కాదు!

శిప్రావాయువు ప్రార్థనాచాటుకారుఁడగు ప్రియునివలె సురతపరిశ్రాంతలైన సుదతులచిత్తములందలి గ్లానినిఁ బోఁగొట్టి పునస్సంభోగాభిలాషను రేకెత్తించు నఁట!

"దీర్ఘీకుర్వన్ పటుమదకలం కూజితం సారసానాం
ప్రత్యూషేషు స్ఫుటితకమలామోదమైత్రీకషాయః

దశార్ణదేశములందలి వేత్రవతీనది

తేషాం దిక్షు ప్రథితవిదిశాలక్షణాం రాజధానీం
గత్వా సద్యఃఫల మవికలం కాముకత్వస్య లబ్ధా
తీరోపాన్తస్తనితసుభగం పాస్యసి స్వాదు యత్ర
త్సభ్రూభఙ్గం ముఖ మివ పయో వేత్రవత్యా శ్చలోర్మి

—పూ మే 35

నిర్వింధ్యానదీ వర్ణనము

వీచిక్షోభ స్తనితవిహగశ్రేణికాఞ్చీగుణాయాః
సంసర్పన్త్యాః స్ఖలితసుభగం దర్శితావర్తనాభేః
నిర్విన్ధ్యాయాః పథి భవ రసాభ్యన్తరః సన్నిపత్య
స్త్రీణా మాద్యం ప్రణయవచనం విభ్రమో హి ప్రియేషు

—పూ మే. 29

వేణీభూత ప్రతను సలిలా సా త్వతీతస్య సిన్ధుః
పాణ్డుచ్ఛాయా తటరుహతరుభ్రంశిభి ర్జీర్ణపర్ణైః
సౌభాగ్యం తే సుభగ విరహావస్థయా వ్యఞ్జయన్తీ
కార్శ్యం యేన త్యజతి విధినా స త్వయైవోపపాద్యః

—పూ మే 30

గంభీరానది వర్ణనము

గమ్భీరాయాః పయసి సరిత శ్చేతసీవ ప్రసన్నే
ఛాయాత్మాపి ప్రకృతిసుభగో లప్స్యతే తే ప్రవేశం
తస్మా దస్యాః కుముదవిశదా న్యర్హసి త్వం న ధైర్యా
న్మోఘీకర్తుం చటులశఫరోద్వర్తనప్రేక్షితాని —పూ. మే 44

తస్యాః కిఞ్చి త్కరధృత మివ ప్రాప్తవా నీరశాఖం
హృత్వా నీలం సలిలవసనం ముక్తరోధో నితమ్బం
ప్రస్థానం తే కథ మపి సఖే లమ్బమానస్య భావి
జ్ఞాతాస్వాదో వివృతజఘనాం కో విహాతుం సమర్థః

—పూ. మే 45

నదీమేఘము లచేతనములయ్యు పై శ్లోకములందలి యర్థాలంకారశక్తిచే సాకారములై శృంగార నాయికా నాయకులవలె రాణించి పరితల మనోనేత్రముల నలరించుచున్నవి కవి సృష్టిలో కానిదేమున్నది? వార్షుకప్రకృతియందు సహజ విభావములైన నదీమేఘములను గ్రహించి వానియందు చేతనత్వ మారోపించి స్త్రీ పుంసయోగరూప జీవచైతన్యమును వ్యంజింపఁజేసి రసపోషణము గావించిన కాళిదాసు ప్రతిభ నిసర్గరమణీయమై రాణించుచున్నది

కాళిదాసు నదీమేఘములనే కాక ప్రకృతిగతములైన బహువిధాచేతనద్రవ్య ములను వర్ణించు నవసరములందును ప్రణయసంసిద్ధిభావమునకు ప్రాధాన్య మొసఁగి రచనము గావించెను ఉదాహరణమున క్రింది శ్లోకములను గమనింప నగును

**సూర్యోదయకాలవర్ణనము**

తస్మిన్కాలే నయనసలిలం యోషితాం ఖణ్డితానాం
శాన్తిం నేయం ప్రణయిభిరతో వర్త్మభానో స్త్యజాశు
ప్రాలేయాస్రం కమలవదనాత్సోఽపి హర్తుం నలిన్యాః
ప్రత్యావృత్త స్త్వయి కరరుధి స్యాదనల్పాభ్యసూయః
—పూ మే 43

ఇందు పద్మిని ఖండితానాయిక సూర్యుఁడు నాయకుఁడు అన్యకాంతా రతుఁడై రాత్రి చరించి యుదయమున నింటికిఁ జేరు ధృష్టునివలె సూర్యుఁడు ఉదయించినాఁడు పద్మిని ఖండితానాయికవలె నన్యరతుఁడైన నాథునిఁ గాంచి మంచుకన్నీటిని పద్మముఖమునఁ దాల్చినది సూర్యుఁ డామె కన్నీటినిఁ దుడిచి యూరడింప కరములు సాచు తరుణమది వియోగదుఃఖితయైన నాయిక పతి ప్రణయసిద్ధినిఁ బడయు నాశుభవేళ మేఘుఁ డాదంపతులనడుమ నిలువక తొలఁగి పోవలయు నని యక్షుని యాదేశము కవిహృదయము నాశ్రయించి కావింపఁబడిన యీ వర్ణనమున కవిహృదయము నూహించుట కష్టతరము కాదు!

శిప్రావాయువు ప్రార్థనాచాటుకారుఁడగు ప్రియునివలె సురతపరిశ్రాంత లైన సుదతులచిత్తములందలి గ్లానినిఁ బోఁగొట్టి పునస్సంభోగాభిలాషను రేకెత్తించు నఁట!

దీర్ఘీకుర్వన్ పటుమదకలం కూజితం సారసానాం
ప్రత్యూషేషు స్ఫుటితకమలామోదమైత్రీకషాయః

యత్ర స్త్రీణాం హరతి సురతగ్లాని మంగానుకూలః
శిప్రావాతః ప్రియతమ ఇవ ప్రార్థనాచాటుకారః."

—పూ. మే. 32.

ఇట్లు సార్వకాలిక ప్రకృతి ద్రవ్యములైన సూర్యపవనాదులయందును మేఘోదయకాలోచిత జీవప్రవృత్తిని వ్యంజింపఁజేసి కాళిదాసు సార్థకమైన కావ్యశిల్పమును సాధించెను.

కాళిదాసుని ప్రకృత్యంగ వర్ణనలలో మొదటఁ బేర్కొనఁదగినది మేఘుని వర్ణనము. ఉపమారూపకార్థాంతరన్యాసాద్యలంకారమండితములైన వాక్కులతో కామచారియైన యతనిరూపు సమయోచితభంగీవైచిత్రిని వెలార్చునట్లు వర్ణించుటలో కాళిదాసు ప్రతిభ మెఱుపువలె ప్రకాశించినది! చిత్రకూటాద్రిపై వప్రక్రీడాపరిణత దంతిదర్శనీయుఁడని రూపింపఁబడిన మేఘుని గజస్వరూప స్ఫూర్తి కావ్యమునం దెడనెడ భావింపఁబడునట్లు చేయఁబడినది. దిఙ్నాగస్థూలహస్తావలేపములను వారించుట యందును. గజశృంగారమువలె నున్న నర్మదను జూచి మోహించుటయందును. మదజలతిక్తములైన యాయేటినీటినిఁ గ్రోలుటయందును, మదజలధారలు వర్షించు నుజ్జయినీనగర స్తంబేరముల యాకృతులందును, గంగానదియందు నీరు త్రాగెడి సురగజమునందును, హిమగిరియందలి శరభములు మేఘమును గాంచి గజమని భ్రాంతి పొందుటయందును,మహాకాళుని కార్ద్రనాగాజినేచ్ఛను మాన్పుటయందును, కైలాస విహారములయందును మనకు మేఘుఁడు దంతిరూపస్ఫూర్తితో భాసింపఁగలఁడు. వర్ణసాదృశ్యముచే నతనికి గోపాలకృష్ణునితోడి సామ్యము ముమ్మాఱు భావింపఁబడినది. అంతియకాదు, ఆయా సందర్భములందు మేఘుఁడు మసృణకేశబంధముతోడను, భూసతి స్తనచూచుకముతోడను, శివగళ కళంకముతోడను, హరధవళ వృషభోత్ఖాతపంకముతోడను, హరినీల మణితోడను, నీలమణిమయ సోపానపంక్తితోడను, త్రివిక్రముని శ్యామలపాదముతోడను, బలభద్రుని నల్లనియుత్తరీయముతోడను, స్త్రీలముంగురుల (అలకల) తోడను, క్రీడాద్రితోఁడను పోల్పఁబడినాఁడు. రసపానమునం దాతఁడు వేత్రవతీ నిర్వింధ్యాదులుపట్ల విటునివలె భాసించినాఁడు. శ్రవణసుభగమైన యాతనిగర్జ మురజపటహశబ్దాదులతోడనే కాక ప్రణయకూజితముతోడను బోల్పఁబడినది. అవస్థాభేదమునుబట్టి యచేతనుఁడైనయా మేఘుఁడు కాళిదాసుని యలంకారశిల్పమునందు సజీవమూర్తియునై రసానందసందాయి యైనాఁడు.

మేఘవర్ణనము తరువాతఁ బేర్కొనఁదగినవి గిరివననదీనదవర్ణనలు కాళిదాసు వానిని వర్ణించుపట్ల వాని సహజలక్షణములను గొన్నింటినిఁ జెప్పుచు వాని శోభ నాలంకారికముగాఁ జిత్రించెను ఉదాహరణమునకుఁ జిత్రకూటాద్రివర్ణనము గైకొందము దట్టమైన సురపొన్నల వనములు సీతాస్నానపవిత్రోదకములు శ్రీరామపాదచిహ్నితములైన కూటములు దాని సహజలక్షణములు ప్రతి వర్ష కాలమునందు నా శైలము మేఘునితో సమాగమము పొంది చిరవిరహజము నుష్ణమునైన బాష్పమును విడచుచు స్నేహమును వ్యక్తీకరించు ననుట నలంకారోక్తి వర్షమున కాకొండ వెచ్చనియావిరి గ్రక్కుచున్న దని తాత్పర్యము వాస్తవము నుక్తి చమత్కృతితో నలంకరించినచోఁ గావ్యమునకు శోభ కలుగును ప్రతి ప్రకృత్యంగ వర్ణనమునందును గాళిదాసు స్వరూపస్వభావముల నౌచిత్య మెఱిఁగి యలంకారములచే ధ్వనింపఁజేసెను

ప్రకృతికి స్థిరములైన లక్షణములు కొన్ని చెప్పుటయేకాక కాలానుగుణమైన పరిణామము వర్ణించు పద్ధతి మఱియొకటి కైలాసగిరివాసుల నిత్యజీవితమటుండ సురయువతు లాసన్న మేఘుని గృత్రిమధారాగృహముగాభావించుటయు, అలకాపురి మేఘబృందము లనెడి ముంగురులతో నొప్పారి సార్థకాఖ్య యగుటయు నట్టివి

మేఘునకు వియత్తలము విహార రంగము అతనిని గొండ లాకర్షించును గావున నతఁ డచ్చటచ్చటఁ గొండలపై విశ్రమించుచు నదులలో నీరు త్రాగుచు నెల్లెడల వర్షించుచు బయనించుచుండును కావున మేఘునకు గిరివరములు విడిది పట్టులు నదీజలములు స్వాదుపానీయములు రామగిరినుండి కైలాసమున కేఁగు లోపలఁ బ్రధానపర్వతములు తొమ్మిది మేఘమునకుఁ దగులును అందొక్కొక్క కొండ యొక్కొక్క విధమైన సభ్యతకు కేంద్రస్థానము ఆ కొండ నాశ్రయించి యున్న చేతనాచేతనములం దావిధమైన ప్రవృత్తి ప్రకటిత మగుచుండును. మేఘుఁ డీకావ్యమున పర్వతములకు మిత్రుఁడుగా సర్వత్ర వర్ణింపఁబడినాఁడు కావున మేఘాద్రుల సమావేశము మిత్రసమాగమమువలె భాసించును

పూర్వమేఘమున వర్ణింపఁబడిన పర్వతముల స్వరూపస్వభావములనుబట్టి వానిని చతుర్విధముగా విభజింపవచ్చును అవి

1. దేవతావాసములు-పూజ్యములు ఇవి రామగిరి (చిత్రకూటము) దేవగిరి హిమాచలము క్రౌంచపర్వతము కైలాసము

2. నదీనద ప్రధానములు - భోగ్యములు : వింధ్యగిరి ప్రాంతము, కనఖల పర్వతము.

3. వన ప్రధానములు : దర్శనీయములు : ఆమ్రకూటాద్రి.

4. క్రీడాప్రధానములు - ప్రీతిదాయకములు : నీచైర్గిరి:

ఇందు దేవతా వాసములైన పర్వతము లుత్తమములు: నదీవన ప్రధానములు మధ్యమములు; క్రీడా ప్రధానము లధమములు. సత్త్వరజస్తమోగుణముల ప్రాబల్య మీ విభాగమునందుఁ గ్రమముగాఁ గనుపట్టును. కాళిదాసు సత్త్వ సంపన్నములై దేవతాత్మలైన పర్వతముల నధికముగా వర్ణించి తన కావ్యమున కౌదాత్త్యము నాపాదించుకొనెను. తదితరములను విడువక సహజత్వము సాధించెను.

పై పర్వతము లాకృతులలో, నధికారములలో భిన్నము లయ్యు స్నేహశీలమున సదృశములు. శిలామయము లయ్యు. స్నిగ్ధహృదయములు గల చైతన్య మూర్తులు. శ్రీరామపాద చిహ్నములను, సీతాస్నానపవిత్రోదకములను, సాంద్రనమేరుతరువనములను గలిగియున్న చిత్రకూటము మిత్రుఁడగు నాషాఢ మేఘునిఁ జూచినంతనే చిరవిరహజమును, నుష్ణమునైన బాష్పమును విడుచునఁట! మేఘుఁ డతని నాప్యాయముగా నాలింగన మొనర్చి, సగౌరవముగాఁ బోయి వచ్చెదనని వీడుకొనిపోవునఁట! గిరివనోపప్లవములు శాంతించునట్లుగా వర్షించుచు మార్గాయాస ఖిన్నుఁడైన మేఘుని సార్థకనామదేయ యగు నామ్రకూటము శిరమునఁ దాల్చి పూజించునఁట! "నక్షుద్రోఽపి ప్రథమసుకృతాపేక్షయా సంశ్రయాయ ప్రాప్తే మిత్రే భవతి విముఖః కిం పునర్యస్తథోచ్చైః" వేశ్యారతిసౌరభములు వెదజల్లుచు, విదిశానగర పౌరుల యుత్కటయౌవన ప్రవృత్తిని బ్రకటించు గుహల కాలవాలమైన నీచైర్గిరి మిత్రుఁడగు మేఘుని సంపర్కముచే మేనంతయుఁ బులకితమైనట్లు కడిమిపూలతోఁ బొంగిపోవునఁట! గిరిమేఘముల మధ్య వర్తిల్లెడిది యిట్టి స్నేహము. కాళిదాసభావమును బోషించుటలో సార్థక్యము కలదు. మేఘునకు సందేశహరణ మొక మిత్రకార్యము. స్నేహము స్వచ్ఛము, నిర్వ్యాజము, త్యాగసంభరితము. దాని నాధారముగాఁ గొనియే యక్షుఁడు మేఘున కెడనెడ నిట్లు ప్రబోధించినట్లు కాళిదాసు రచించినాఁడు. "మన్దాయన్తే న ఖలు సుహృదా మభ్యుపేతార్థకృత్యాః" "భర్తు ర్మిత్రం ప్రియ మవిధవే విద్ధి మా మమ్బువాహం, తత్సన్దేశై ర్హృదయనిహితై రాగతం త్వత్సమీపం,"

"కచ్చి త్సౌమ్య వ్యవసిత మిదం బన్ధుకృత్యం త్వయా మే
ప్రత్యాదేశా న్నఖలు భవతో ధీరతాం కల్పయామి
నిశ్శబ్దోఽపి ప్రదిశసి జలం యాచిత శ్చాతకేభ్యః
ప్రత్యుక్తం హి ప్రణయిషు సతా మీప్సితార్థక్రియైవ."
"ఏతత్కృత్వా ప్రియ మనుచితం ప్రార్థనా దాత్మనో మే
సౌహార్దాద్వా విధుర ఇతి వా మయ్యనుక్రోశబుద్ధ్యా."

ఇత్యాది వాక్యము లందుల కుదాహరణములు. మేఘసందేశమునందు వర్ణింపఁబడిన ప్రకృత్యంగములలో మేఘ - పర్వతములు రెండును బురుషప్రకృతులే. కావున కాళిదాసు వానిమధ్య కావ్యార్థఫలసిద్ధికి మూలహేతువగు స్నేహప్రవృత్తినిఁ బోషించి రసభావసమృద్ధిని సంతరించినాఁడు.

నదీపర్వతములకు నాయికానాయకభావము కల్పించుట కవిసమయము. కాళిదాసు మేఘసందేశమున దానినిఁ బాటింపకుండుట యొక విశేషము. కావ్యవస్తువు మేఘదూతకు సంబంధించియుండుటచే నదులకును, మేఘునకును వర్షారంభమున భాసించు నాయికానాయక పునస్సమాగమభావమును విరహార్తుఁ డగు యక్షునిముఖమున వర్ణింపఁజేసెను. కవి తన వ్యుత్పత్తిని గావ్యార్థపోషకముగా ననుసంధించి వర్ణించుటయే కావ్యశిల్పము.

రసపిపాసి యైన మేఘుఁడు నదీజలాదులయందు విటునివలె వ్యవహరించుననియు, నానదీయోషలు శృంగారనాయికలవలె మేఘునిం దమవిలాసచేష్టలచే నాకర్షించు ననియు నిందు భావింపఁబడినది. ఏకవేణులైన నదులు కృశాంగలైన నాయికలు. వానికి బునస్సమాగమసౌఖ్యము గలిగించి, గర్జలను బ్రణయకూజితములతో వానిచిత్తము లలరించి, జీవనప్రదాన మొనర్చువాఁడు మేఘుఁడు.

వింధ్యప్రత్యంతపర్వత ప్రాంతమునఁ దన్నడ్డగించు నేరేడు పొదలను ద్రోసికొనుచు ప్రవహించు నర్మద యేనుఁగుమేనిపై భక్తిభంగులచే రచింపఁబడు శృంగారభూషవలె మేఘునకుఁ జూడ కనువిందగును. దానినిఁ గాంచి మేఘుఁడు రసార్ద్రుఁడై వర్షించును. గజమదబంధురములును, తిక్తములునైన యానదీజలములను మేఘుఁడు కడుపారఁ ద్రాగి యంతస్సారుఁ డగును. నర్మదను గూడిన మేఘుఁడు వాసకసజ్జిక నలరించు వరునివలెఁ గాళిదాసు చిత్రించినాఁడు.

వేత్రవతి మధురజలతరంగము లను భ్రుకుటివిలాసములతో శోభిల్లు నదీలలామ. మేఘుఁడు రతికూజితమువలె మందమందముగా నుఱుముచు, నామె యధరమును గ్రోలునట్లు జలమును పానము చేసి కాముకత్వ ఫలమును సంపూర్ణముగాఁ బొందును. వేత్రవతి స్వాధీనపతికయు, రతాంతవివశురాలైన మధ్యానాయికయు నయి మేఘున కుపభోగ్య యైనది.

నిర్వింధ్య ప్రోషితభర్తృకవలె సాక్షాత్కరించును. ఆమె విలాసము లనెడి తొలిపలుకులతోడనే మేఘునకుఁ దన వలపును దెలుపును. సుందరాకారుఁ డగు మేఘుని యెడబాటుకు చిక్కి సన్ననిజాలుగాఁ బ్రవహించుచు, నెండిన చెట్ల యాకుల రంగుచే వెల్లవారి విరహావస్థను వ్యక్తముచేయు నిర్వింధ్యను తత్కార్శ్యము పాయునట్లుగా మేఘుఁ డుపభోగించును.

గంభీర సార్థకాఖ్య. దాని నిర్మలగంభీరోదకమునందు వలదనుకొన్నను మేఘుని యందమైన నీడ పడకమానదు. తెల్లటి కలువలవలె నెగురుచున్న చేప లను చూపులతో నానది మేఘు నాకర్షించును. ఒడ్డునుండి దిగజారి ప్రబ్బలి చెట్ల నానియున్న జలమును గలిగిన యానది కోకపోకముడి యూడిఁ దిగజారుఁ చుండగా చేతఁబట్టుకొనిన వనితవలె శోభిల్లునఁట! జ్ఞాతాస్వాదుఁ డైన మేఘుఁ డామెను దమిదీర భోగించునఁట! గంభీర గంభీర యయ్యును మదన భావోన్మత్తయైన ప్రౌఢ, అందువలన నామె నిండుదనము ప్రియునిదర్శన మగు నంతనే బయటపడినది.

చర్మణ్వతి రంతిదేవుని కీర్తిస్రవంతి వలె స్వచ్ఛమైనది. దానిపై నారిగి మేఘుఁడు జలపానము చేయునెడ ఖేచరులైన సిద్ధుల కానది స్థూలమధ్యేంద్రనీల మణియైన భూదేవి యొంటిపేట ముత్యాలపేరువలెఁ జూడ నింపు గలిగించునఁట! భర్తృవాల్లభ్యము నందిన పుణ్యాంగనవలె నానదీలలామ వర్ణింపఁబడినది.

నదులను స్త్రీమూర్తులుగా భావించుట కవిసమయ మైనను, విప్రలంభమున నదీలలామలను శృంగార నాయికలుగా వర్ణించుట రసపోషక మయ్యును, గంగా సరస్వతులమాహాత్మ్యమును గుర్తించి వానిని బుణ్యనదులుగాఁ గీర్తించి శృంగార మూర్తులుగాఁ బ్రదర్శింపకుండుట కాళిదాసుని యౌచిత్యదృష్టికి పరమావధి. రస పిపాసియైన మేఘుఁడు నర్మదాది నదీలలామల నుపభోగించియు, సరస్వతీజల పానముచే సంతశుద్ధుఁడై గంగాజలమున గజరాజువలెమునింగి పవిత్రుఁడయ్యెనని వర్ణించుట గమనార్హము. పరమేశ్వరపత్ని యైన గంగానది యొడిలో నర్ధముగా

బవ్వళించి పయఃపాన మొనర్చు మేఘుఁ డాపుణ్యాంగనకుఁ బుత్రతుల్యుఁ డయ్యెనని వ్యంగ్యము. కామచారియైన మేఘుని చిత్తమునందలి కామనైల్యము సరస్వతీ తోయముతో నశింప నతఁడు పరిశుద్ధాంతరంగుఁడై పర్వతరాజ తన యను సేవించెననుట సార్థకము. కైలాసగిరి కేఁగు దూత కనువైన యంతశ్శీలి మును గల్పించుట కాళిదాసుని యంతరార్థము. అలకానగరమును జేరిన తరు వాత మేఘున కెట్టి నదీలలామలతోడి సంబంధము భావింపఁబడలేదు. అందు వలన యక్షుఁడు మేఘునకు విద్యుత్కళత్ర సంతత సాన్నిహిత్యము నాశించి నాఁడు!

"ఇష్టాన్దేశాన్ జలద విచర ప్రావృషా సంభృతశ్రీ
ర్మా భూ దేవం క్షణమపి చ తే విద్యుతా విప్రయోగః." —ఉ.మే. ౫౬.

స్వీయకాంతాసమాశ్రితమైన ప్రణయము మేఘునకు లభింపవలె నని గోరుటయందే యక్షుఁడు తత్సిద్ధికి వలసిన చిత్త సంస్కారమును దనలోఁ బండించుకొనినాఁడు. అందువలననే కుబేరుని శాప ముపసంహృత మైనది! కావ్యార్థసిద్ధి కెంతటి సార్థకమైన హేతు విది!

పూర్వమేఘమున కాళిదాసు వర్ణించిన ప్రసిద్ధ నగరములు రెండు. అవి: విదిశానగరము, ఉజ్జయినీ నగరము. దశార్ణజనపదములకు రాజధాని దిశా ప్రసిద్ధమైన విదిశానగరము. ఆ నగర ప్రాంతములు మొగలిపూరేకుల తెల్లఁ దనమునకును, పక్షిసంకులములైన వృక్షరాజములకును, పక్వఫల శ్యామలము లైన జంబూవనములకును, మానసరాజహంసల తాత్కాలికవాసములకును, వేత్రవతీ నదీజలవిలాసములకును ప్రసిద్ధికెక్కినది. సుందర వరిసర ప్రాంత ములచేఁ జూడ నింపయిన నాపట్టణశోభను కాళిదా సేలనో వివరించలేదు. కాని, ఉజ్జయినీ నగరము మేఘమార్గమునకుఁ గొంత చుట్టైనను దానిని దర్శింపని జన్మము నిష్ఫల మని చెప్పి తన్నగర విశేషముల నెన్నింటినో వివరించి వర్ణించెను. కాళిదాసు చూపించిన యాయభినివేశమునుబట్టి యతని జన్మ స్థానము ఉజ్జయినీనగరమై యుండవచ్చునని విమర్శకులు భావించుచున్నారు.

రక్తి ముక్తుల కాలవాలమైన యుజ్జయినీ నగరశోభ పూర్వమేఘమందలి నగర వర్ణనలో నాయకమణి వంటిది. చారిత్రక ప్రసిద్ధియు, ధనధాన్య జల సమృద్ధియు, నరనారీవిలాస వైభవసిద్ధియు, పరమేశ్వర కృపాకటాక్షలబ్ధియు నానగరజీవితమున నైహికాముష్మిక ఫలాభివృద్ధి నెల్లప్పుడు కూర్చుచుండుటచే

నది యాదర్శనగరమై యొప్పినది ప్రియావియోగదుఃఖితుఁడగు యక్షుఁడు ఆ నగర జీవితమునందలి ప్రణయోదంతములనే భావించెను వాసవదత్తావత్స రాజుల పూర్వ వృత్తాంత స్మరణములు గిరిజాశంకరుల ప్రణయ నృత్య భంగిమల వర్ణనములు అభిసారికలు సంకేత స్థలముల కొసర్చు రహస్య గమనములు కమలినీకమలాప్తుల పునస్సమాగమనమును దెల్పు సుప్రభాతములు మొదలగునవి తన్నగరమధుర ఘట్టములు

కాళిదాసు గిరులలో హిమగిరిని నదులలో జాహ్నవిని నగరములలో నుజ్జయినిని విశేషించి వర్ణించెను ఆ మూఁడును దేవతాత్మలగుటయు నభిమానపాత్రము లగుటయు దానికిఁ గారణము అతఁడు పర్వతరాజును మేఘునకు హితునిగా పూజ్యునిగా శివక్షేత్రముగా గంగాజన్మస్థానముగా నభినివేశముతో వర్ణించెను గంగానదిని పుణ్యస్రవంతిగా ముక్తిప్రదాతగా మేఘునకు జీవనదాతగా నిరూపించెను ఉజ్జయిని నైహికాముష్మిక జీవిత ప్రవృత్తులకు సంగమస్థానమైన సంస్కృతి కాలవాలముగాఁ జిత్రించెను మహాదేవుని విభూతిపై నా మహాకవి కున్న యభిమానమంతయుఁ బై వర్ణనలందు శరచ్చంద్రికవలె వెల్లివిరిసినది

ఉజ్జయిని కుజ్జీగా నిలచినది అలకాపురి అది యుత్తరమేఘమున వర్ణింపఁబడినది సకలదివ్యభోగముల కాలవాలమై నిత్యానందకరములగు వస్తుసముదాయములచేఁ బరిపూర్ణమై ప్రవృత్తి భోగములకుఁ బ్రాణప్రదమైన యలకాపురి కుబేర సంపదకు మణికిరీటమై ప్రకాశించుచుండె నని కాళిదాసు వర్ణించెను రసికుఁడైన మానవుఁ డాశించు భోగముల కవధి అలకాపురి ఉజ్జయిని భుక్తావశిష్ట సుకృతులైన స్వర్గవాసుల కేర్పడిన భూతల స్వర్గ ఖండము కాఁగా అలక భోగైకమూర్తులగు యక్షుల భాగ్యనగరము రసికులైన యుజ్జయినీనగరవాసులు పరిపూర్ణమానుషానందకాములు కాగా దేవయోనులైన యక్షులు కల్పతరులబ్ధ వాంఛితార్థసిద్ధులు కావున నా యుభయనగరములందలి నాగరకభోగ ప్రవృత్తుల యం దట్టి తారతమ్యము కనుపట్టుచుండును

మేఘసందేశమున రసము శృంగారము నాయికానాయకులు కారణాంతరమున విడివడి పునస్సమాగమాకాంక్షతోఁ బరితపించుట విప్రలంభ శృంగారము కారణము ప్రవాసమైనచో నది ప్రవాస విప్రలంభ మగును విప్రలంభము శృంగారమునకుఁ బుష్టి కలిగించును స్నేహానాహుః కిమపి విరహే ధ్వంసినస్తే త్వభోగా దిష్టే వస్తు న్యుపచితరసాః ప్రేమరాశీ భవన్తి అను యక్షోక్తిచేఁ గాళిదా సా యంశమును సమర్థించినాఁడు. ఆలోకనాభిలాషలను రాగస్నేహ

కాంక్షలను గలిగియుండుట ప్రేమ. (ప్రియుని లేక ప్రియురాలిని) చూడ వలయుననెడి యిచ్ఛ యాలోకనము, తచ్చింత యభిలాష; సంగబుద్ధి రాగము, ప్రణయప్రక్రియ స్నేహము; వీనిని గలిగియుండుట ప్రేమ. వియోగమునందు నాయికానాయకులకు అభిలషితమైన సంభోగము సిద్ధింపమిచేఁ బ్రేమ బలీయ మగు నని కాళిదాసోక్తి. ఇట్టి విప్రలంభమును బోషించుట కుత్తరమేఘమునఁ గాళిదాసు యక్షగృహమును, యక్షసతీవిరహమును, యక్ష సందేశమును రసోదంచితముగ వర్ణించెను. పరమభోగాస్పదమై, ప్రియా సంభోగసుఖజ్ఞాపకమైన గృహమునుగూర్చి తలంచుటచే యక్షుని విప్రలంభము పుష్టిమంతమగును గదా!

యక్షునిముఖమునఁ గాళిదాసు సందర్భోచితముగా విరహిణియైన నాయిక యనుభవించు మదనదశావస్థలను నిపుణముగా వర్ణించెను. వియోగమున జక్షుః ప్రీతి యుండదు. అందుచేఁ బునర్దర్శనాభిలాష వర్ణింపఁబడినది. చిత్రలేఖనమున నది కొంత సూచింపఁబడినది. మనస్సంగమును విరహసంతప్తయైన యామె స్థితి చెప్పక చెప్పుచున్నది. యక్షనామాంకిత గేయరచనమున నది స్ఫుట మగుచున్నది. పరిశేష మాసగణనాదులయందు సంకల్పము వ్యక్తమగుచున్నది. రాత్రులు నిద్ర లేకుండుట యందు జాగరమును, ఏకకళయైన చంద్రరేఖవలెఁ గృశించుటయందు కార్శ్యావస్థయును, చల్లని చంద్రకిరణములపట్ల గలిగిన విరక్తియం దరతియు, స్వప్నసంభోగమునకై యత్నించి కన్నీరు గార్చుట యందు లజ్జాత్యాగమును, సిగను గోళ్ళతో త్రోసికొనుటయందు చిత్తవిభ్రమమును, లేవలేక పడకపై నొరుగుటయందు మూర్ఛావస్థయుఁ గ్రమముగా వ్యక్తము లగుచున్నవి. దశమావస్థ మరణము. అది కలుగులోపలఁ బ్రియుని క్షేమవార్త తెలిసి నాయిక యూరడిల్లును గాన దానిని కవి వర్ణింపలేదు. దానికి తగిన హేతువును గావ్యారంభమునందే నిబంధించినాఁడు.

"ఆశాబన్ధః కుసుమసదృశం ప్రాయశో హ్యఙ్గనానాం
సద్యఃపాతి ప్రణయి హృదయం విప్రయోగే రుణద్ధి." —పూ.మే. 10.

యక్షునివిరహ మాతని సతీవిరహముకంటె నెందును దీసిపోలేదు. అతని స్థితిని మేఘుఁ డిట్లు వర్ణించి చెప్పెను:

"అఙ్గేనాఙ్గం ప్రతను తనునా గాఢతప్తేన తప్తం
సాస్రేణాస్రద్రుత మవిరతోత్కణ్ఠ ముత్కణ్ఠితేన,
ఉష్ణోచ్ఛ్వాసం సమధికతరోచ్ఛ్వాసినా దూరవర్తీ
సఙ్కల్పైస్తై ర్విశతి విధినా వైరిణా రుద్ధమార్గః" —ఉ.మే. 41.

ప్రియాసదృశవిరహార్తుఁ డగు యక్షుఁడు ప్రాణసఖిచిత్తవృత్తి నాత్మప్రతిబింబ సదృశముగా నూహింపఁ గలిగె ననుట కథనములోని సార్థక్యము యక్షుఁ డంపిన తన సందెశమున ప్రేమ రతి సహవర్తనము శృంగారము, సమక్రీడ సంభోగము మొదలగు సప్తవిధావస్థలను వ్యంజింపఁజేయుచు కాళిదాసు లక్షణ సమ్మతమైన వర్ణనము గావించినాఁడు విప్రలంభపోషణమున కింతకంటె విభా వాదిసామగ్రి యేమి కావలెను? నాయికానాయకుల కుత్కటభావస్థితి రసస్థితి నందుట కది వారి ప్రథమ విరహ మని పేర్కొని యుపపత్తి సాధించుట రసజ్ఞుడైన కాళిదాసుని విజ్ఞతకుఁ దార్కాణము

జానే సఖ్యా స్తవ మయి మనఃసంభృత స్నేహ మస్మా
ద్దిత్థం భూతాం ప్రథమవిరహే తా మహం తర్కయామి
వాచాలం మాం న ఖలు సుభగమ్మన్యభావః కరోతి
ప్రత్యక్షం తే నిఖిల మచిరాద్భ్రాత రుక్తం మయా యత్

—ఉ మే. 33.

విభావాదులు సాధారణీకరణము చెంది సామాజికుఁడు రసానుభూతి నొందుట కిట్టి వాక్యార్థము లెంతియో తోడుపడును కాళిదాసుని రచనలో రస పోషకము గాని భావము గాని బావన గాని శబ్దము గాని, అర్థము గాని కానరాదు ఆలోచనామృతము వర్షించు దివ్యమేఘ మాతని యీ ఖండకావ్యము.

మధురమందగతియైన మందాక్రాంతవృత్తము యక్షుని విరహాక్రాంత చిత్తవృత్తిని రసోచితముగా వ్యంజింపజెసినది కాళిదాసుని యిట్టి సార్థక ఛందః ప్రయోగమునకు ముగ్ధుఁడు గాని సహృదయుఁడు లేఁడు క్షేమేంద్రుఁడు ప్రావృట్ ప్రవాసవ్యసనే మందాక్రాంతా విరాజతే యను లక్షణ మేర్పఱచుట కీకావ్యలక్ష్యమే హేతు వనుటలో నెట్టిసంశయమును లేదు

ప్రకృతి సౌందర్యదిదృక్షువైన కవి యుపమను నేర్పుగా వాడును. కాళిదా సుపమాలంకార ప్రయోగమున గణుతికెక్కినవాఁడు అతని యుప మానము లసంఖ్యాకములు అర్థవంతములు ప్రతిభాపూర్ణములు మేఘసందేశ కావ్యము చదువుచున్నప్పుడు - ఆమ్రకూటమను భూదేవి స్తనముతోడను నిర్వింధ్యను ప్రోషిత భర్తృకతోడను శిప్రావాయువును ప్రార్థనాచాటుకారుఁ డైన ప్రియునితోడను, గంభీరను వివృతజఘన యగు వనితతోడను కైలాస గిరి కందరమునందలి యలకాపురిని ప్రియుసుత్సంగమునందలి ప్రస్తగంగా దుకూల యగు సువిటతోడను గృహపతి లేని గృహమును కమలాప్తుఁడు లేని

కమలముతోడను, విరహార్తుఁడైన ప్రియుని ప్రాణమును శిథిల ప్రాతఃకుంద ప్రసవముతోడను కాళిదాసు పోల్చి వర్ణించుపట్టుల - సహృదయుఁడు తన్మయుఁడు కాకమానఁడు. అతని యర్థాంతరము లాతని యఖండ లోక ప్రజ్ఞకు మణిముకురములు. "కామార్తా హి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు", "రిక్తస్సర్వో భవతి హి లఘుః పూర్ణతా గౌరవాయ", "స్త్రీణామాద్యం ప్రణయ వచనం విభ్రమో హి ప్రియేషు", "ఆపన్నార్తి ప్రశమనఫలాః సంపదో హ్యుత్తమానామ్", "కేవా న స్యుః పరిభవపదం నిష్ఫలారంభయత్నాః", "ప్రత్యుక్తం హి ప్రణయిషు సతా మీప్సితార్థక్రియైవ" - ఇట్టి మణులెన్నియో కల వా కావ్యరస సముద్రమున. కావ్యమునకు గౌరవము కవి వాడిన యలంకారముల సంఖ్యను బట్టి రాదు; కవి వానిని వాడుటలోని సార్థక్యమునుబట్టి వచ్చును. కాళిదా సర్థాలంకారములను సార్థకముగా వాడినాఁడు. అనౌచిత్య మతని వాక్కునకు విషయము కాదు. ఆడంబరము లేని యలంకార రచన మతని కావ్య శోభలోని యాంతర్యము.

కాళిదా సద్వైతి. శివకేశవు లతనికి సమానులే. మేఘసందేశము- శ్రీరామ పాదచిహ్నాంకకూటమును విష్ణుస్థానీయము నగు చిత్రకూటమునఁ జెప్పఁబడినది. శివ క్షేత్రమైన కైలాసగిరిపై నున్న అలకానగరమున కది చేర్పఁబడినది. కాళిదాసుని యభేదదృష్టి కిదియే చక్కని యుదాహరణము.

మేఘమార్గమున నున్న మహాకాళ క్షేత్రము, హిమవంతము. కైలాసము ప్రసిద్ధిగన్న శైవక్షేత్రములు. అందు మొదటిది కాళిదాసున కభిమానపాత్ర మైనది. మిగిలినవి భారతీయుల కందఱికిని ప్రీతిపాత్రములైనవి. వాని నభినివేశముతో వర్ణించి కాళిదా సౌచిత్యము పాటించెను. దేవగిరి కుమారస్వామి నివాస మైన క్షేత్రము. గంగ శివజటాజూటవర్తి. శైవములైన వీనిని గాళిదాసు రసోదంచితముగఁ గీర్తించెను. వైష్ణవమైన చిత్రకూటమును, బలరామసంబంధియైన సరస్వతీ నదీతీర్థమును, పరశురామసంబంధియైన క్రౌంచపర్వతమును కాళిదాసు యథోచితముగ వర్ణించెను. వర్ణసామ్యముచే మేఘుని గృష్ణునిగను, హరనీల గళచ్ఛాయగను కాళిదాసు పోల్చి చూడఁగలిగినాఁడు. కాళిదా సీకావ్యమున శైవ క్షేత్రములను గూర్చి కొంత విపులముగా వర్ణించుట కావ్యార్థ పోషణార్థమై కావచ్చును. మఱియు, వర్షారంభమునఁ గలుగు స్త్రీపుంసపునస్సమాగమాకాంక్ష సర్వజీవులతోపాటు జగత్పితరులైన యుమాశంకరులందును భావింపఁజేసి తన కావ్యమునందలి ప్రకృతి వర్ణనా శిల్పమునకుఁ బరిపూర్ణత్వము సాధించుట కాళిదాసుని యభిమతమైయుండవచ్చును!

(1957)

# మహాభారతము – కర్ణుఁడు

భారతీయసంస్కృతిపై నఖండప్రభావము వైచిన సాహిత్యగ్రంథములు మూఁడు. అవి : వాల్మీకి రామాయణము, వ్యాస మహాభారత భాగవతములు. సాహిత్య గౌరవముతోపాటు మానవ జీవితాదర్శము లైన పురుషార్థసాధనోపాయము లాకావ్యములందు రసవత్తరముగా నిరూపింపఁబడుటచే ప్రతి భారతీయుని హృదయ దేవాలయమందును వానికి నిత్యార్చనలు జరుగుచున్నవి. కాలక్రమేణ వానిని గీర్వాణము నుండి తమతమ మాతృభాషలలోని కనువదించుకొని తత్కావ్యార్థ ప్రసాదమును సర్వజనభోగ్యముగా భారతీయులు తీర్చిదిద్దుకొనిరి. అట్టి వారిలో తెలుఁగువారు శ్రేష్ఠులు. తెలుఁగున ముందు భారత మవతరించినది. తరువాత రామాయణ భాగవతములు అనువదింపఁబడినవి. మూలగౌరవ మేమాత్రము తఱుగకుండ తెలుఁగున నాకావ్యములను రసదృష్టితో సంతరించినకవులు వందనీయులు. మన సాహిత్యమున నన్ని గ్రంథము లొకయెత్తు: ఈ మూఁడు గ్రంథములు మఱియొక యెత్తు.

తెలుఁగుబిడ్డల నోములపంటలై త్రిమూర్తులఁ బోలి భువి నవతరించి మహాభారతకావ్య ప్రపంచమును సృజించి పురుషార్థ సాధనోపాయమును సూచించి తరించిన కవిత్రయము ప్రాతఃస్మరణీయము. వాగనుశాసనుఁ డగు నన్నయ భట్టారకుని యొక్కయు, కవిబ్రహ్మ యగు తిక్కనసోమయాజి యొక్కయు, ప్రబంధ పరమేశ్వరుఁడగు నెఱ్ఱాప్రెగ్గడ యొక్కయు కవితాస్రవంతు లిందు కూడుటచే నియ్యది పవిత్ర త్రివేణిసంగమ క్షేత్రమై రసపూర్ణమును, పుణ్యవంతము నయి యైహికాముష్మిక సుఖద మగుచున్నది.

మహాభారతము భరతవంశజులగు చక్రవర్తులచరిత్ర యైనను, పాండవుల సంపూర్ణజీవితమే ప్రధానవృత్తముగా గల యితిహాసము. ఆంధ్రమహాభారతావతారికలో నీవిషయము నొకవిధముగా రాజరాజనరేంద్రుఁడే సూచించియున్నాఁడు.

చ. "హిమకరు దొట్టి పూరుభరతేశకురుప్రభుపాండుభూపతుల్
గ్రమమున వంశకర్త లనఁగా మహి నొప్పిన [illegible]

శమునఁ బ్రసిద్ధులై విమలోద్గుణశోభితులైన పాండవో
త్తములచరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెమ్మెయిన్ ఆది 1-4

అనుటలో నీకావ్యేతివృత్తము పాండవ పవిత్ర ప్రధానమని స్పష్టము అనఁగా నీ కావ్యమున నాయకులు పంచ పాండవు లనవచ్చును గదా కాని అట్లయిదుగు రనుటకు వలనుపడదు కావ్యారంభమునుండి తుదివఱకు నెవ్వని జీవితము సమగ్రముగా వర్ణితమగునో అతనినే నాయకునిగా నెన్నుట సంప్రదాయము సమంజసము అట్లగుటచె భీమాదులు దివంగతులైన తరువాత కూడ ధర్మము వీడక సశరీరియై స్వర్గమున కేఁగి యమేంద్రాదుల దయావిశేషముచే దేవత్వముఁ బొందినవాఁడు ధర్మజుఁ డగుటచే నాతఁడే ఫలభాక్కగు నాయకుఁ డనఁ దగియున్నాఁడు భీమాదులు జీవికాజీవులవలె పరస్పరము భ్రాతృస్నేహముతో వర్తించి భక్తిశ్రద్ధలతో నాజన్మాంతము ధర్మజుని సేవించి తరించి యుండుటచే వా రనునాయకు లనఁదగియున్నారు వీరికిఁ బ్రత్యర్థి దుర్యోధనుఁడు అతనికి భీమాదులవలె నూఱుగురు తమ్ములు గలరు కర్ణాదు లతని కండగ నిలిచినారు ఈయిరుపక్షములవారికి నేర్పడు సంఘర్షణమే భారత ప్రధాన కావ్యేతివృత్తము

ధర్మము మూర్తికట్టిన మహితాత్ముఁడు ధర్మరాజు ఆ విరాడ్రూపమున కాలయ్రపాయులు నకులసహదేవులు అంగరక్షకులు భీమార్జునులు భీముఁ డరిభయంకరుఁడు సింహబలుఁడు ధర్మజధర్మదీక్షారక్షకై పురుషకారము సిద్ధము సెయగల సమర్థుఁడు అర్జునుఁడు నరనారాయణులలో నరాంశసంభూతుఁడు నారాయణుని మనసు కెక్కిన రాజభక్తుఁడు అతిలౌకికశక్తి సంపన్నుఁడును దేవసంభావితుఁడు నగుటచే నతఁ డన్నకు దైవయత్నముఁ జేకూర్చి పెట్టఁ గల దిట్ట. ఒకఁడు బాహుశక్తియుక్తుఁడు మఱియొకఁడు దైవవిద్యాశక్తి సమన్వితుఁడు వీరిరువురి సుస్థిర సంరక్షణమున ఘటనిక్షిప్త మగు దీపకళికవోలె నెట్టి యవాంతరములు లేక యుధిష్ఠిరుఁడు తన జన్మవ్రతమును నిశ్చింతగా నిర్వహించెను భీమాదులు స్వయంసమర్థులైనను అన్న మాటను జవదాటరు! ఇట్టి యవాజ్య స్నేహసూత్రము పాండవుల నేకీకృతుల నొనర్చి కృష్ణాశ్రయులుగాఁ దీర్చి దిద్దుటచే వేదధర్మమున కుపనిషత్పురుమని సాంగత్య మబ్బినట్లైనది

శ్రీకృష్ణుని దృష్టిలో నాయకుఁ డగు ధర్మజు డు ధర్మతరువు ప్రతినాయకుఁడగు సుయోధనుఁడు రోషమయతరువు తన్నిరూపణము చేయుచు సంజయునితో శ్రీకృష్ణుఁ డనినిమాట లివి

"రోషమయ మహాతరువు సుయోధనుఁ; డుస
స్కంధ మందులోనఁ గర్ణుఁ; డలరుఁ
గొమ్మ సౌబలుండు; గుసుమఫలములు దు
శ్శాసనుండు; మూలశక్తి తండ్రి."

"ధర్మజుండు ధర్మతరు; వర్జునుఁడు ఘన
స్కంధ; మనిలసుతుఁడు శాఖ; కవలు
పుష్పఫలము; లేను భూసురులును వేద
ములుఁ దదీయ మైన మూలచయము." - ఉద్యో. 1. 355. 356.

వీనిలో దైవమూలమై ధర్మరూపమగు ధర్మజ మహావృక్షమే శ్రేష్ఠ మనుటలో నెట్టి సంశయమును లేదు. దుర్యోధనుఁడు అర్థకామనిష్ఠుఁడు. అతనికి ధర్మనిష్ఠ లేదు అర్థసాధనయందు పురుషకారమును మాత్రమే నమ్మి, దైవసహాయమును నిర్లక్ష్యము చేసిన దురభిమాని యఁతడు. అతని ననుసరించినవా రాతనితమ్ములు. అందువలననే వ్యాసభట్టారకుఁడు—

కం. "క్రూరులు విలుప్తధర్మా
చారులు ధృతరాష్ట్రసుతు లసద్వృత్తులు ని
ష్కారణవైరులు వీరల
కారణమున నెగులు బుట్టు కౌరవ్యులకున్." — ఆది. 5. 159.

అని నిరూపించి చెప్పినాఁడు. ధర్మజప్రవృత్తియందు ధర్మమున కరకామము లూడిగ మొనర్చినవి; సుయోధనునియందు అర్థకామములు బలీయములై ధర్మమును బహిష్కరించినవి.

రోషమయతరు వగు సుయోధనునకు స్కంధమువంటివాఁడు కర్ణుఁడని కృష్ణుని నిర్దేశము. వృక్షము మూలశక్తిచే బ్రతుకును; స్కంధము వలన నిలచును; శాఖలవలన విస్తృతమగును; పుష్పఫలములవలన శోభిల్లును. మూలశక్తి యున్నను బోదె దుల్లవోయినచో వృక్షమునకు పతనమే కదా ఫలము! కావున దుర్యోధనుని స్థిరత్వము కర్ణునిపై నాధారపడియున్నదన్నమాట! దుర్యోధనుఁడు పచ్చగా మూడుపూవు లాఱుకాయలు కావలెనన్న, కర్ణునియాదరు వవసరమని భావము.

కర్ణ దుర్యోధన ప్రథమసమావేశ మొక విచిత్ర సన్నివేశము. కుమారాస్త్ర ప్రదర్శన సందర్భమున అర్జునుని వివిధాద్భుతాస్త్ర విద్యాకౌశల్యమునకు దుర్యోధనుఁ డవమానపడి తెల్లబోయినాడు. ఘటబద్ధమైన యుగ్రోరగమురీతి తనలోఁ దాను బుసలు కొట్టుకొనినాఁడు. సహాయముకొఱకు ప్రతీక్షించినాఁడు. ఎదుట....

"సాలప్రాంశు నిజోజ్జ్వలత్కవచు శశ్వత్కుండలోద్భాసితున్
బాలార్కప్రతిమున్ శరాసనధరున్ బద్ధోగ్రనిస్త్రింశు శౌ
ర్యాలంకారు సువర్ణవర్ణు ఘనుఁ గర్ణాఖ్యున్ జగత్కర్ణపూ
ర్ణాలోలద్గుణుఁ జూచి."

తేరుకొనినాడు. అతని పరాక్రమము వీక్షించి "కౌగలించుకొని నాతో బద్ధసఖ్యుండవయి నాకును బాంధవులకును హితంబు సేసి నన్నుం గురురాజ్యం బేలించి నా యైశ్వర్యము లుపయోగింపు" మనినాఁడు. కర్ణుడును "అట్లు చేయుదు" నని యొడంబడినాఁడు. అతని స్నేహమునకు చిహ్నముగా దుర్యోధనుఁ డతని కంగ రాజ్య మిచ్చి గౌరవించెను. నాఁటినుండి కర్ణుఁడు దుర్యోధనునిఁ గురురాజ్య మేలించుటకై సమర్థించినాఁడు; ప్రాణమిత్రుఁడై వరలినాఁడు. నాఁటినుండి కర్ణుఁడు అన్న మాటకు కట్టుబడి, ఎన్నియో ఘట్టములందు దుర్యోధనునకు కుడిబుజమై నిలిచి కార్యసాధనము చేసిపెట్టినాడు.

శుభాంగీ స్వయంవరమహోత్సవమున బలిమిని నామెను దుర్యోధనుఁడు తెచ్చునపుడు, అతనిపైఁ దిరుగఁబడిన యరివర్గములను జయించి, జరాసంధుని నోడించి మాలినీనగరము నాక్రమించి కర్ణుఁడు మిత్రుని మానము కాపాడి, మగువను దక్కించినాఁడు. దుర్యోధనుడు చేయునది న్యాయమా అన్యాయమా యను ప్రశ్న యతనికి లేదు. చేసిన వాగ్దానము నెరవేర్చి తీరుటయే యాతని యాదర్శము! అందువలన దుర్యోధనున కతనియం దచంచల విశ్వాసము కుదిరినది.

"మనకుఁ బాండురాజతనయవర్గమునకు
నెట్లు పొందు గలుగు నేను రాజ్యభాగ మీను"

అని దుర్యోధనుని మతము. దాని ననుసరించి పాండవులపై నాతఁడు పన్నిన కుతంత్రములకు లెక్క లేదు. వానికన్నింటికిని కర్ణునిసమర్థనమే మూలకారణము. అయినను వాని నాచరించు విధములందు దుర్యోధనుఁడు సూచించు మార్గముకన్న కర్ణుడు ప్రతిపాదించు పద్ధతి సాధారణముగా నుచితము. గౌరవప్రదము,

పూర్వాపరసంబద్ధమునై యుండును. పాండవివాహానంతరము ద్రౌపదీపాండవుల మధ్య కలతలు కల్పించి యుపాంశుప్రయోగమున భీముని వధించి యర్జునిపైఁ గర్ణుని ప్రయోగింప దుర్యోధనుఁడు తలంపఁగా - కర్ణుఁడు భీమునిపట్ల విఫలము లైన ప్రయత్నములను పేర్కొని "....విక్రమము భూరియశఃప్రియులైన రాజనం, దనులకు సర్వసాధనము, దర్మవు శత్రునిబర్హణంబులన్" అని సూచించినాఁడు. దానిని నిరాదరించిన కురువృద్ధులను లెక్కచేయలేదు.

"ముదుసళులు దమ కిమ్మగాఁ జదివికొం(డు
గాక పతులకు హితవుఁగు కర్జ మేల
యెలసి చెప్పుదు రహితులఁ గలిపికొనుట
ధర్మ వని రిది నయవిరుద్ధంబు గాదె" అనినాఁడు.

దుర్యోధనుని సమర్థించు కర్ణునిఁ గురుసభలో నడుపునఁ బెట్టువా రెవ్వరును లేరు. రారా జతని కంతస్వాతంత్ర్య మిచ్చి యతనిప్రతినిధిగాఁ గురుసభలో చెలామణి చేయించినాడు!

దుర్యోధన దావాగ్నికిఁ గర్ణుఁ డను ఝంఝామారుతము తోడైనది. కౌర వాటవి సంపూర్ణముగా దహింపఁబడినది. ఇందు కర్ణునిపని అగ్నిని ప్రజ్వలింపఁ జేయుట. కర్ణుఁడు సమయము గమనించి దుర్యోధనుని మనోనిశ్చయమున కనుగుణముగా సందర్భములను బోషించును. దాని నండగాఁ గొని సుయో ధనుఁడు పెచ్చు పెరుగును.

సభాపర్వమునఁ గురుసభలో ద్రౌపదికి జరుగుచున్న యన్యాయమును జూచి వికర్ణుఁడు ఆమె యధర్మవిజిత యనియు, నక్కోమలిఁ దోడ్కొనివచ్చుట యన్యాయ మనియు నుపన్యసించెను. అంతవఱకు సభ్యు లన్యాయశ్రవణవికర్ణులై యుండుటం జేసి, దుర్యోధనునిచర్య లవిమృష్టములుగా నిరాఘాటముగా సాగి నవి. వికర్ణునిప్రశ్న దుర్యోధనుని ప్రయత్నమునకు 'మొదలంట నఱకు గొడ్డలి పెట్టు' వంటిది. దానిని సుయోధనుఁడు స్వయముగా సమర్థించుకొనునా? అతని చర్యలు న్యాయాన్యాయవిచక్షణతో సాగినవి కావు. అనాఁడు మయసభలో 'సహస్రవిలాసినీ పరివృత యయియున్న ద్రౌపది నగిన నవ్వు 'హృదయ శల్యమై' యుండ దానికిఁ బ్రతిచర్యఁ గావించి ద్రౌపదిని, పాండవులను అవమా నింపవలెన నెడు పట్టుదలతో మాత్రము చేసినవి. ఈ పగ సాధించుటయందు

ధర్మాధర్మములు లేవు. దానికి సమాధానము దుర్యోధనుఁ డేమని చెప్పఁగలఁడు? ఆ సమయమున కర్ణుఁడు - అంతవఱకును మూకీభావము వహించియున్నను - దుర్యోధనుని సమర్థించుచు నుపన్యసించినాఁడు.

రజస్వలయు, నేకవస్త్రయునైన ద్రౌపదిని సభకుఁ దెచ్చుట యన్యాయ మను వికర్ణుని మాటలను ఖండించుచు 'భార్యకు దైవహితుం డయిన భర్త యొక్క రుండ ఇది యనేక భర్తృక గావున బంధకి యనంబడు, నిట్టిదాని విగతవస్త్రం జేసి తెచ్చిన ధర్మవిరోధంబు లేదు' అని దుర్యోధనుని చర్యను సమర్థించినాఁడు కర్ణుఁడు. అసలే ప్రతీకారచర్యయందుఁ గన్నుమిన్ను గానక వర్తించుచున్న దుర్యోధనున కతని మాట లాలంబనములైనవి. 'ఇట్టిదానిని విగతవస్త్రం జేసినను పాపములే'దని కర్ణుఁడు నుడివెను గదా! నారీజనమున కవమానమునఁ బరాకాష్ఠ యనఁదగు నిట్టి చర్య ద్రౌపదికి నానహిల్లినచో నిఁకఁ గావలసిన దేమి? ఎదుట నున్న భర్తల కంతకంటె తలవంపు లేమి కావలెను? కర్ణుని సూచనకు దుర్యోధనుఁ డుబ్బిపోయినాఁడు. ఆవేశము కన్నుగప్పినది. దుర్యోధనుఁడు దుశ్శాసనుని బిలిచి "యిప్పాండవులయు, ద్రౌపదియు వస్త్రంబు లపహరింపు"మని యాజ్ఞాపించెను. దీనికి కర్ణుఁడు కారణము.

మఱియు - ద్రౌపది నుద్దేశించి :

"తరుణి యేపురకంటె నొక్కరుఁడ భర్త
యగుట లగ్గు, జూదంబున నాలి నోటు
వడని వానిఁగాఁ దగు భర్తఁ బడయు మింక
ననుచు రాధేయుఁ డుల్లసమాడె నంత."

ఇయ్యదియుఁ బాండవ హృదయపుటభేదకమును, ద్రౌపది కవమాన హేతువు నగుటంజేసి దుర్యోధనుఁడు సంతసించెను. 'తగు భర్తఁబడయు మింక' అన్న మాటలు మాయాద్యూతమందు విజయుఁడైయున్న దుర్యోధనుని పరముగా సూచింపఁబడినవి. అంత దుర్యోధనుఁడు పట్టపగ్గములు లేక విహరించినాఁడు.

"అమ్మదితన్ విభీతహరిణాక్షిఁ గలాపవిభాసి కేశభా
రమ్మన నొప్పుదానిఁ దనరమ్యపృథూరుతలంబు నెక్కఁగా
రమ్మని సన్న సేసె ధృతరాష్ట్రి సుతాగ్రజుఁడు."

దానితో భీమునిచేత సుయోధనుఁడును, అర్జునునిచేతఁ గర్ణుఁడును జచ్చుటకుఁ దమగోతులు తాము త్రవ్వుకొనినారు. దీనికి మూలము కర్ణుఁడు దుర్యోధనుని సమర్థించుటకై పల్కిన పల్కులే. అవి పాండవుల కాజన్మాంతము మరపురానివి. భారతమునం దచ్చటచ్చట పాండవుల సీతని పలుకు లెదయందు విరిగిన బల్లెపు ముక్కలవోలె కలఁచి బాధపెట్టుచుండుటఁ గాంచెదము.

ఇంతటితో నాగక - ఘోషయాత్రకు దుర్యోధనునిఁ బ్రేరేపించినవాఁడు కర్ణుఁడు. 'అనవరతశీతవాతాతపకర్శితాంగులై బహు దుఃఖసాగరమున మునింగి యున్న' పాండవులముందు నీవు 'సకల సామ్రాజ్యవిభవంబు మెఱసి చని, యందు నీ తేజంబు ఘర్మసమయంబునాటి తపనుతేజంబై పగతుర కన్నులు గమర నతి దుస్సహం బగునట్లుగాఁ జేయు' మనియు 'మిత్రజనమోదంబును శత్రుజనభేదంబునుఁ గదా సంపదలకుం దగియెడు ఫలంబు' అనియుఁ బ్రబోధించి, యతని చిత్తమునం దణగారియున్న మాత్సర్యాగ్నిని మఱియొకసారి కుళ్ళగించినాఁడు.

"అతుల సౌభాగ్య పుణ్య సమగ్ర గరిమ
నొప్పుచున్న నీ దేవుల యొప్పు సూచి
ధృతి దఱఁగి తన్నుఁ దాన నిందించుకొనుచు
హృదయమునఁ బాండవాంగన యెరియవలదె?"

అని రాజబెట్టినాఁడు. దానితో దుర్యోధనుని హృదయమున వెనుకటి పరాభవాగ్ని ప్రకోపించినది; తన యున్నతికి మిట్టిపడినది; తన సప్త జిహ్వలు చాచి ప్రజ్వరిల్లఁదలఁచినది; శత్రువులఁ దపింపఁజేయ వెడలినది. దానికిఁ గర్ణుఁ డను ఝంఝామారుతము తోడైనది.

పై కథాంశములనుబట్టి కర్ణుఁడు ప్రతి నాయకుఁడైన దుర్యోధనునకు సహాయులైనవారిలోఁ బ్రథమగణ్యుఁ డనుటలో నెట్టి విప్రతిపత్తియును లేదు. దుర్యోధనుఁడు సచివాయత్తసిద్ధుఁడు. కావున నతని చరిత్రలోఁ గర్ణాదిసచివుల -లేక- సహాయకుల ప్రాధాన్య మధికముగా నుండుట సహజము.

లాక్షణికులు పురుషార్థ సాధనయందు నాయకునికి ముఖ్యముగా నుపచరించువారు ఉపనాయకానునాయకు లని పేర్కొనియుండిరి. నాయకునకువలెనే ప్రతి నాయకునకును ఉప నాయకానునాయకులు సహాయకులుగా నుందురు,

మహాభారతమునఁ బ్రతినాయకుఁ డైన దుర్యోధనున కుపనాయకుఁడుగాఁ గర్ణుడు తీర్చిదిద్దఁబడినాఁడు. ఈ విషయమును స్పష్టముగాఁ దెలిసికొనవలయు ననిన లాక్షణికులు నిర్దేశించిన ఉపనాయకస్వభావములను గూర్చి కొంత విచారింప వలెను.

భరతమహర్షి నాయకులస్వరూపస్వభావాదులనుగూర్చి నిర్దేశ మొసఁగెనే గాని కడమవారినిగూర్చి తలపెట్టనే లేదు. కథానాయకునితోపాటు తరువాత రాఁదగినవాఁడు - రామాయణమున రామునితో సుగ్రీవునివలె మఱొక ప్రత్యేక వృత్తాంతము గలవాఁడు - అనఁగా ఉపవృత్తనాయకుఁడు - ఉండవలసి యుండు నని మొదట గుర్తించినవాఁడు ఆనందవర్ధనాచార్యులు. ఆయన "కథా నాయకః ధీరోదాత్తాది భేద భిన్నః పూర్వః తదనంతరో వా" అని చెప్పి, కథా నాయకుఁ లిరువు రనియు, వారు 'పూర్వ' (ప్రధాన) కథానాయకుఁ డనియు, 'తదనంతర' నాయకుఁడనియు నిర్దేశించెను. కాని, ఆ 'తదనంతర' కథా నాయకుఁ డెట్లుండవలయునో 'ధీరోదాత్తాదిభేదభిన్నః' అను పదముచే సూచించియు, నిదమిత్థ మని నిర్ణయింపఁడయ్యెను. తదనంతరము ధనంజయుఁడు అట్టి 'తదనంతర' నాయకుని నామ స్వరూప నిరూపణము చేయఁదలఁచి కామశాస్త్రమునుండి - యందలి నాయక సహాయులలోఁ బ్రధానుఁ డగు 'పీఠమర్దుని' గ్రహించి, యతని నా పేరుతో వ్యవహరించుటయే గాక 'విచక్షణుఁడు'నుఁ నాయకుని కనుచరుఁడును, భక్తుఁడును, అతనికంటె కించిన్న్యూనగుణుఁడు నగు ననియు, అతని కొక లక్షణము నేర్పఱచెను. కాని, రామచంద్రుఁడు అట్టి ఉపకథాబంధమునకు నాయకుఁడగువానిని ధనంజయునివలె పీఠమర్దుఁ డనుటకు (అతఁడు కామశాస్త్రమాత్రప్రయోజ్యుఁ డనదగినవాఁ డని కాబోలు!) సంకోచించి, తక్కిన లక్షణభాగమును దడవక అగ్రనాయకునికంటె కించిదూనవృత్తము గలవాఁ డనియు, 'అముఖ్యనాయకుఁ'డనియుఁ దెల్పినాఁడు. భోజరాజుకూడ నట్లే భావించి 'తతః కైశ్చిద్గుణైర్హీనః పూజ్య శ్చోపనాయకః' అని చెప్పి, అభినవగుప్తునిచేఁ బ్రవేశపెట్టఁబడిన 'ఉపనాయక' పదముతో నతనిని వ్యవహరించెను. శారదాతనయుఁడు "పతాకానాయక స్త్వేష ముపనాయక ఉచ్యతే తస్యైవానుచరో భక్తః కించిదూన శ్చ తద్గుణైః" అని స్పష్టముగా నుపనాయక లక్షణమును బేర్కొనెను. అతఁడు ధనంజయునిలక్షణమునందలి పీఠమర్దునకు బదులుగా నుపనాయకు నాదేశించి, యతని పతాకానాయకత్వముతోపాటు కడమ లక్షణములను గూడ నతనివలెనే నిర్దేశించెను. అందుచే ఉపనాయకుఁ డెప్పటికిని తల్లక్షణవిశిష్టుఁడై ఉపవృత్త (పతాకా) నాయకుఁడగు నని యేర్పడుచున్నది.

పైనిర్వచనమునం దభివర్ణింపఁబడిన ఉపనాయకగుణములలో తద్గుణైః అనునది ప్రధాననాయకసామాన్యగుణపదము కాగా కించిదూనశ్చ తద్గుణైః అను నదియే యతని స్వభావమును దెల్పుచు నాయకుని స్వభావముతోఁ గల భిన్నతను తదియత్తను గూడ విశదీకరించుచున్నది తస్యైవానుచరో భక్తః అను పదములు ఉపనాయకునికి నాయకునితోఁ గల సంబంధమును నిరూపించుటయే గాక యతని యనుచరత్వముచే ప్రధానేతివృత్తమునందు స్వోపవృత్తము లీనము కాఁగా నతఁడు ప్రధాననాయకు ననుసరించు ననియు స్పష్టమగుచున్నది భోజరాజు పూజ్య శ్చైవోపనాయకః అనినదానినిబట్టి ఉపనాయకుఁడు స్వాముగా పూజ్యుఁడే యైనను పూజ్యే ష్వనురాగో భక్తిః అనెడి నిరుక్తి ననుసరించి నాయకునితోఁ దన కేర్పడిన తాద్గుణ్య సంబంధ మతనియందుఁ దనకు విశేషమైన యనురాగము పెంచఁగా - నాయకునియందు పూజ్యభావము గల్గియుండు నని యన్వయించుకొనవచ్చును. అందువలన నితివృత్త నిర్వహణమున నాయకునికి సహాయుఁడగుచుండియు నుపనాయకుఁడు తన వృత్తముతో సామాజికులలోఁ బూజ్యభావము గడించు ననియు నేర్పడుచున్నది

కథానాయక శ్చ ధీరోదాత్తాదిభేదభిన్నః పూర్వ స్తదనంతరో వా అను ఆనందవర్ధనాచార్యుల యాదేశమునుబట్టి ప్రధాన నాయకుఁ డెట్లు ధీరోదాత్తాది భేదభిన్నుఁడో తదనంతర నాయకుఁడును లేక ఉపనాయకుఁడును అట్లే ధీరోదాత్తాది భేదభిన్నుఁడు గావలసివచ్చునని యేర్పడుచున్నది. దీనివలన నాయకుల వలెనే ఉపనాయకులును చతుర్విధు లగుదురు ఉదాత్తుఁడు ధర్మపురుషార్థసాధనమున సహాయుఁ డగును అట్లే ఉద్ధతుఁడు అర్థసాధనసహాయుఁ డగును లలితుఁడు కామపురుషార్థ సహాయుఁ డగును శాంతుఁడు మోక్షసాధన సహాయుఁ డగును ఇట్లు ఉపనాయకు లెప్పుడును పురుషార్థసాధనసహాయభూతు లగుచు విధిగా ప్రాసంగికేతివృత్తమున వ్యాపిత్వము పొందెడివారై యుందురు కథావ్యాపిత్వము లేక ఉపవృత్తాధికారులు గాకయున్నచో నెవ్వరును ఉపనాయకులు కాఁజాలరు· వారు సాధారణనాయకసహాయులు మాత్రమే కాఁగలరు రామాయణమున విభీషణాదులు సాధారణనాయకసహాయులు సుగ్రీవుఁ డుపనాయకుఁడు అట్లే భారతమున విరాట్ద్రుపదాదులు సాధారణనాయకసహాయులు శ్రీకృష్ణుఁ డుపనాయకుడు అట్లే యితరత్ర యూహించుకొనవచ్చును

ఇఁక అనునాయకోపనాయకుల భేదమునుగూడ స్పష్టముగా నెఱుఁగవలెను నాయకునితోఁ బెనవైచికొన్నవృత్తము గలవాఁడై నాయకాభ్యుదయమునం దభ్యు

దయము పొందును, నతనికి సహాయుఁడుగా నుండువాఁడు అనునాయకువాఁడు; అతఁడు నాయకునితో పాటు అధికారికేతివృత్తమున సమవ్యాపిత్వమును వహించియు, సమప్రాధాన్యము వహింపని - అస్వతంత్రమైన చరిత్రము గలవాఁడు. రామాయణమున లక్ష్మణాదులు, భారతమున భీమాదు లిట్టివారు. ఉపనాయకుఁ డన్ననో ప్రాసంగికేతివృత్తమునకు నాయకుఁడై, అనునాయకునియంత విలీనత పొందఁజాలని వృత్తము గలవాఁడై యుండును.

మహాకావ్యములందు నాయకానునాయకోపనాయకుల కెంత ప్రాధాన్యముండునో ప్రతినాయకునకును, అతనికి సహాయభూతులగు సమనాయకోపనాయకులకును అంత ప్రాముఖ్య ముండును. సామాన్యముగాఁ గావ్యములందు నాయకుఁడు ధీరోదాత్తుఁ డైనచోఁ బ్రతినాయకుఁడు ధీరోద్ధతుఁడై యుండును. ప్రతినాయక విజృంభణమున నతనికి సహాయకులుగా నిలుచువారును తత్తద్గుణ విశిష్టులై కానఁబడుదురు. కావున కావ్యనాయకోపనాయకవిభాగము ప్రతినాయకోపనాయకులకును వర్తింపఁజేయవచ్చును. అట్టియెడ మహాభారతమునఁ బ్రతినాయకుఁడైన దుర్యోధనునకు సహాయభూతుఁడై ప్రాసంగికేతివృత్తమును బొంది యుపవృత్తాధికారమును గలిగియున్న కర్ణుఁడు ప్రతినాయకపక్షమున నుపనాయకుఁ డనఁదగియున్నాఁడు. ఇట్టివారిని ఉపప్రతినాయకు లని వ్యవహరింపవచ్చునేమో విజ్ఞులు భావింపఁగలరు!

మహాభారతమున శ్రీకృష్ణుని వృత్తమువలెనే, కర్ణునివృత్తాంతమునకును బ్రత్యేకప్రతిపత్తి కలదు. కర్ణుఁడు కన్య యగు కుంతియందు సూర్యునివలన జన్మించి, సూతపుత్రుఁడుగాఁ బ్రసిద్ధి వడసినవాఁడు. సహజకవచకుండలధారియు, నసహాయపరాక్రమశాలియు నైన యతనియందు సహజక్షత్రతేజము సహస్ర కిరణములతో వెలుఁగొందుచుండెను. దానికి గుర్తింపు, గౌరవము కావలసివచ్చెను. అదియే యతని జీవితలక్ష్యము. తల్లక్ష్యసిద్ధికి సహాయమొనర్చి, యతని నాదరించినవాఁడు దుర్యోధనుఁడు. అందువలన నతనిబ్రతు కాసుయోధనునితో ముడిపడినది. ఉప(పతాకా) నాయకుఁ డెప్పుడును స్వకార్యసిద్ధికై నాయకుని నాశ్రయించును. నాయకుఁ డతనికార్యము సాధించి పెట్టును. ఆపైన నుపనాయకుఁడు నాయక కార్యసిద్ధికిఁ దోడ్పడును. తత్ప్రయత్నవిశేషములచే నతనికిఁ గథావ్యాపిత్వ మబ్బును. శ్రీకృష్ణుఁడు జరాసంధవధకై పాండవుల సాయము గైకొనెను. ఆపైన పాండవుల కతఁ డండదండయై నిలిచెను.

వినుకురుకుమార వశువిశ
సనమున రణయజ్ఞ మతఁడు (ధర్మజుఁడు) సమ్మతి చేయన్
అని యుద్యోగపర్వమున కర్ణుఁడు తన హృదయమును బైటపెట్టినాడు

ఇచ్చట మన ముఖ్యవిషయమును గమనింపవలెను కౌరవపక్షవర్తులైన భీష్మాదులు పాండవుల ధర్మవర్తనమును బాహాటముగా సమర్థించియు సేవాధర్మము నాశ్రయించి సుయోధనుపక్షమున యుద్ధ మొనర్చిరి వారిపాత్రల యందు గూఢత యెచ్చటను గానరాదు మఱి కర్ణునిపాత్ర యట్లుకాదు దాని యందు కొంత రహస్యము కలదు కొంత ప్రకాశము కలదు కర్ణుని హృదయము గూఢము దానిలో నున్న సత్యమును కృష్ణభీష్మాదు లొకకొన్నిసార్లు తత్కవాటములు తెరచి చూపించిరి కాని యాచింపించుటయు నొకరహస్యమే కర్ణుని హృదయము కృష్ణుఁ డెఱుఁగవచ్చును భీష్ముఁ డెఱుగవచ్చును కాని వారు బైటపెట్టు నుద్దేశముతో దాని నెఱిఁగిరా? కాదు కర్ణుని హృదయమును బైట పెట్టుటకే వా రెఱింగిరి దానివలన పాండవకార్యసాధనము సులభ మగునని వా రెఱింగిరి ఆ సత్య మాకర్ణునకుఁ దెలియును వారంపలు కర్ణుని హృదయము నందలి యర్జునవిజయార్థియైన యుత్సాహతేజమును జల్లపఱచుటకై యత్నించు చుండి రని యతఁడు తెలియనివాఁడు కాడు అట్లు కానిచో నతని జన్మరహస్య మెఱిగిన మహామహులందఱును దానిని గుండెలలో దాచి యతనికే ప్రత్యేకముగ రహస్యముగ స్వీయకార్య సాధనోపాయముగా నెందులకు జెప్పవలసి వచ్చినది? భీష్ముఁడు గాని కృష్ణుడు గాని కౌరవ సభలో నెందుల కీవిషయము చెప్పలేదు? ధర్మజున కెందులకు విన్నవింప లేదు కన్నతల్లి కుంతి మూగనో మెందులకు పట్టినది? పాండవసంరక్షణార్థమై కన్నతల్లి కర్ణ జన్మరహస్యమును జెప్పి యతనిని నీటిపాలు చేసినది చాలక మృత్యువుపాలఁ బడవేయఁ దలచినదే! అతని జన్మకథ దేవరహస్యము కావచ్చును మానవ రహస్యము కావచ్చును; నీతిరహస్యము కావచ్చును ఆ రహస్య మతని కిచ్చెడి తిత్తోదకములు గాని లోకమునఁ జాటలేవు ఆ సత్య మతనికిఁ దెలియును అది గోప్యముగా నుండుటయే విధి నిర్ణయము దైవాధీనము సర్వమున్ అని నిట్టూర్చిన కర్ణుఁడు విధిజ్ఞుఁడు కాదందుమా? ధర్మ మాతనికిఁ దెలియ దందుమా?

కర్ణునిహృదయము దుర్యోధనునకుఁ దెలియదు పాండవులకును దెలియదు విధి యతని జన్మరహస్యమును లోకమునకుఁ జెప్పలేదు కర్ణుఁడు తన

హృదయమును లోకమునకుఁ జాటలేదు కాని పఠిత కన్నీరహస్యములును దెలియును కథలోని యీ కీలకమే కర్ణుని కపార సానుభూతిని సంపాదించినది

కావ్యములందు ప్రతినాయికుఁడు విజితుఁ డగుటయో హతుఁ డగుటయో జరిగితీరు నని పఠిత కొక పరిజ్ఞానము మన దేశమున సామాన్యముగ నుండును అట్టియెడ ప్రతినాయకపక్షవర్తి యగు నుపనాయకుని వధ సంభావ్యమే యని తలంపఁబడును అప్పుడు పఠితలు అతఁ డెట్లు జీవించి యెట్టి పరిస్థితులలోఁ జని పోయినట్లు చిత్రింపఁబడునో గమనింప నుత్సుకులై యుందురు ప్రతినాయక పక్షము వారు నాయకున కడుగడుగున నగ్నిపరీక్షలు పెట్టఁగల విగ్రహశక్తియు ధైర్యసాహసములును గలిగి జీవింపఁగలుగుటయే జీవించుటయగును పురుష కారము శక్తివంచనలేకుండ చెయుచు నాయకునితోఁ బోటీపడి యోడి శరణు వేఁడుటయో లేక ప్రాణము లర్పించి పరువు గాపాడుకొనుటయో కావలెను కర్ణుఁడు శత్రువులకు సింహస్వప్నమై బ్రతికినాఁడు చివరకు రణనిహతుఁడై నాఁడు ఆ రణమరణము పరమదయనీయము కావున నంతటివాఁ డట్లు మరణించెఁ గదా యని పఠిత కన్నీరు కార్చును

ధర్మజునకు దుర్యోధనుఁ డనిన భయము లేదు కాని కర్ణుఁ డనిన కలవరపాటు ధర్మజుఁడు అరణ్యాజ్ఞాతవాసకాలమున—

సీ పదమూఁడు వర్షముల్ పగలును రేలును
గర్ణుదర్పం బెట్లు గడతు నొక్కొ
యనుచింతఁ జేసి యాహారనిద్రలు లేక
పరితాప మందితిఁ బహువుఁ జేయ
విప్రులు పట్టరా వెఱసొచ్చి యొదిగెడు
గవయంబుచాడ్పునఁ గర్ణభీతి
నుల్లల నుడుకుచు నుండుదు

నని చెప్పుకొనినాఁడు కర్ణునిశర పాండిత్యమే పార్థునిచెత తపస్సు చెయించినది. పాండవవీరులెల్లరు అంతియో ఇంతియో కర్ణునిచె నోడింపఁబడినవారే అర్జునుఁడు సైతము (కర్ణపర్వమున) కర్ణునిరణకౌశలముఁ గాంచి—

పట్టపగలింటిసూర్యుని పగిదిఁ గర్ణుఁ
డుగ్రమూర్తి యై వెలుఁగుచు నున్నవాఁడు

పునరథం బిష్ఠు మాధవ మరలనిమ్ము
బ్రతికియుండిన శుభములు వడయవచ్చు

అని భయపడి వణకినాఁడు కర్ణునితో యుద్ధ మనినతొడనె నఖశిఖాపర్యంతము ముచ్చెమటలు పట్టినవి కర్ణునికి దీటైనవిరుఁడు శ్రీకృష్ణుఁ డొక్కఁడే యని సీ (ధర్మరాజుయొక్క)నేర్పు భీము లావు నరుని విలుబల్మి యతనికి (కర్ణునికి) హరికిఁ గల్గు నని నారదుఁడు లెక్కవైచి చెప్పినాఁడు

ఇట్టి మేటివీరుఁడు పురుషకారము వెలార్చి కురుక్షేత్రమున నర్జునునిఁ దలపడి ఘోర యుద్ధ మొనర్చినాఁడు విక్రమ మున్నను విధిచాలక యతఁడు విఱిగిపోయినాఁడు దేవర్షియైన నారదుఁడు కర్ణుని విషాదాంతమునకుఁ గారణమైన విశిష్ట శక్తులను వివరించి యిట్లు చెప్పెను

వినుము నరేంద్ర విప్రు డలివెన్ జమదగ్నిసుతుండు శాప మి
చ్చె నమరభర్త వంచనము సేసె వరం బని కోరి కుంతి మా
న్చె నలుక భీష్మ దర్ధరథుఁ జేసి యదంచెఁ గలంచె మద్రరా
జనుచిత మాడి శౌరి విధి యయ్యె నరుం డనిఁ జంపెఁ గర్ణునిన్

కర్ణమహాగ్ని చల్లారుట కెన్నికాలమేఘములు గర్జించి శరవృష్టి కురిసినవి! ఇందఱి తీవ్రప్రయత్నమున కేకైకహేతు వగుటకంటె వీరునకుఁ గావలసిన దేమి? అట్టివాఁడు ప్రతినాయకోపనాయకుఁ డై యచో బ్రతుకవలసినదానికంటె ఘనముగా బ్రతికె నన్నమాట అట్టి కర్ణునకు - పరశురామునియొద్ద భార్గవాస్త్రాంతము రాజవిద్య నభ్యసించిన జోదునకు - కృష్ణుని మాయోపాయమున నింద్రదత్తమైన శక్తి సర్పముఖబాణము రౌద్రమంత్రపూరితమైన బాణము వమ్మైపోవుటతో కన్నీరు నిండినది రథము ధరఁ గ్రుంగుటతో మనమున ధైర్యము కుంటుపడినది భార్గవాస్త్రము స్ఫురింపకుండుటచే సర్వము ముగిసినది! కఠినమైనవిధి కసి తీర్చుకొనునప్పుడే కరుణమాలిన శత్రువు కుత్తుక ద్రెంచుటతోఁ గర్ణుని కన్నుమూత కరుణారసభరితమైనది

మహాభారత కథలోఁ గర్ణుఁడు చివరకు మరణించుట కంటె మఱొక ప్రత్యామ్నాయము లేదు కర్ణుఁ డుండగా దుర్యోధనునకు మృతి లేదు ధర్మజునకు విజయము లేదు కథకుఁ బ్రగతి లేదు ఒకవేళ దుర్యోధనుఁడు కర్ణుని కంటె ముందు చనిపోయెనా- కర్ణుఁడు బ్రదికి ఫలము లేదు పైపెచ్చు ధర్మజు

నకు రాజ్యసిద్ధి లేదు. అనగా నాయకునకు ఫలభుక్తి లేదు. ఇన్ని లేములకుఁ గలిమిఁ గూర్చినది యతని నిషాదాంతము! ఉపనాయకుడుగాఁ గావ్యమున నుపజీవించి, ప్రతినాయక ప్రతిష్ఠ నధిగమించి, శత్రుపక్షమువారినుండియు పూజ్యతను గడించి, ప్రతినాయక సహాయకునిగా మాత్రమే గాక స్వతంత్ర ప్రతిపత్తిగల పీరుఁడుగా రాణించిన కర్ణుఁడు భారతపాత్రలలో విశిష్టుఁడు.

ప్రతిపక్షమున నుపనాయకుఁడై యింత ప్రతిష్ఠ నార్జించిన కావ్యపాత్ర నభూతో న భవిష్యతి!

కర్ణపర్వాంతమున తిక్కనసోమయాజి సమరయజ్ఞప్రబంధమున కిట్లు మంగళాంత మొనరించి యున్నాఁడు:

"అనలుఁడు భాస్కరుండును సుధాంశుఁడు సధ్వర సంప్రవర్తకుల్
వినుము నరేంద్ర యీ క్రతువు విష్ణుమయం బిది నిర్వహించి ర
ర్జునుండును గర్ణుఁడున్ సమరయాపము నందఁగ నీ ప్రబంధ మిం
పొనరఁ బఠించినన్ వినినఁ బొందు నరుం జిర సౌఖ్యసంపదల్."

(1956)

ఌ౭౦౪౬

# నన్నయ రచనలో నాటకీయత

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తి లో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారతసంహితారచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగాన్."

నన్నయ భారతభాగము ప్రసన్నకథాకలితార్థయుక్తికి ప్రసిద్ధము. కథా కథన శిల్పమునఁ బాటింపఁబడు ననేకప్రక్రియలలో నాటకీయరచన మొకటి యని విమర్శకులు గుర్తించియుండిరి. శ్రవ్యకావ్యమునందు కవిగాని, కథకుఁడుగాని స్వయముగాఁ జెప్పు కథాంశములను తగ్గించి పాత్రల సంభాషణముల కధికప్రాధాన్యము కల్పించి, సన్నివేశమున రూపక రచనాప్రక్రియలోని వివిధాంశములను జొప్పించి రచించుట నాటకీయరచన మని విజ్ఞులు భావించుచున్నారు. భారత రచనలోఁ దిక్కన సోమయాజి యిట్టి నాటకీయరచనను విరివిగాఁ బ్రయోగించెనని విమర్శకులు తలంచుచున్నారు. అది సత్యమే కాని, నన్నయభట్టారకుని రచనమును నిశితముగాఁ బరిశీలించినచో నట్టి నాటకీయ శిల్పము ననుసంధింప వీలైన సన్నివేశములం దాతఁడు దానిని సామర్థ్యముతో నిర్వహించె నని తేటపడఁగలదు. అట్టి నన్నయ నాటకీయ రచనాశిల్పమును శిశుపాలవధఘట్టము నాధారముగా నిరూపించుట యీ వ్యాసతాత్పర్యము.

ఆంధ్రమహాభారత సభాపర్వ ద్వితీయాశ్వాసారంభమున శిశుపాలవధ ఘట్టమును నన్నయ 72 పద్యగద్యములలో రచించెను. ధర్మజరాజసూయాధ్వరమున శ్రీకృష్ణునిఁ బూజించు ప్రతిపాదనముతో నారంభమైన యీ ఘట్టము శిశుపాలవధానంతరము యజ్ఞ సమాప్తితో ముగియుచున్నది. ఆరంభ నిర్వహణములతోఁ గూడుకొనిన యీ ఘట్టమొక రూపకప్రయోగమువలెఁ బఠితల మనస్సులకు రూపుకట్టునట్లు నన్నయ రచించెను.

మహాభారతమున సభాపర్వమున కొక విశిష్టస్థానము కలదు. పాండవ కౌరవ సభలలో ప్రజ్వరిల్లిన పరస్పరద్వేషానలము భావిభారత మహారణముగాఁ బర్యవసించినది. అందు మయసభ పాండవ వైభవమున కెత్తిన పతాక యగు

టయే కాక సుయోధనావమానాగ్నికి రగిల్చిన యింధనమై భావిరణమునకు నాంది నాలపించినది. కౌరవ ద్యూతసభ పాండవ లక్ష్మికి పరమశాపమై, దుర్యోధనాదుల దౌష్ట్యమునకు పతాకస్థానమై, పాండవావమానాగ్నికి నింధనమై భావిరణమునకు ప్రస్తావన నిర్వహించినది. ఇట్లు భావిభారత కథకు బీజప్రాయముగా నావహిల్లిన ఈ పర్వమునఁ బాండవ కౌరవద్వేషమునకు ప్రాతిపదికను గల్పించినది శిశుపాల వధ. ధర్మజుని రాజసూయము ప్రశాంతముగా ముగిసినచో నీ ఘట్టమున రస లేదు. భావికథకు జిగి లేదు.

నన్నయ యీ ఘట్టము నుదాత్తముగాఁ జిత్రించెను. కథా స్వభావమును గాఢముగా భావించి, యందు సహజముగా భాసించు సార్థక శిల్పములను బరిపోషించుచుఁ, గావ్యమును నిర్మించుట సమర్థుఁడైన కవి చేయు పని. శిశుపాల వధ కథా ఘట్టమున దశరూపకములలో నొకటియైన 'వ్యాయోగము' యొక్క లక్షణము లధికముగా భాసించుచున్నవి. యుద్ధప్రాయ మగు వ్యాయోగమునఁ బురుషులు వర్తింతురు కావున దాని కా పేరు వచ్చెను. దాని లక్షణము[1] లీ కథా ఘట్టమునకు సమన్వయమగుచున్నవి. ఇందు వస్తువు ప్రఖ్యాతమే. నాయకుఁడు ప్రసిద్ధుఁడే. స్త్రీ పాత్రయే లేనే లేదు. ఇందు వీరరస మంగి; రౌద్ర మంగము. శిశుపాలాదుల పరుషవాక్యములతో నైన రణవిజృంభణము, భీష్మ కృత ధిక్కార వచనములు, భీమ సహదేవుల రౌద్రోద్రేకము, శ్రీకృష్ణ పౌరుషపరాక్రమ ప్రదర్శనము, ధర్మజుని నయనీతివర్తనము నీ ఘట్టమున బహుపురుషుల యుద్ధాభిముఖ్యమును గోచరింపఁజేయుచున్నవి. కావున శ్రవ్య కావ్యమర్యాదలో నొదిగి యున్న వ్యాయోగముగా నీ ఘట్టము సహజ స్వభావమును సంతరించుకొని యున్నది. నన్నయ యీ రహస్యమును గుర్తించి తద్గత రూపకాంగలక్షణ విస్ఫూర్తి ప్రస్ఫుట మగునట్లు రచించి, తన కథాకథన కౌశలమున కొక వైశిష్ట్యమును సంతరించుకొనినాఁడు.

---

1. "వ్యాయోగస్తు విధిజ్ఞైః కార్యః ప్రఖ్యాత నాయకశరీరః
అల్పస్త్రీజనయుక్తస్త్వేకాహకృతస్తథా చైవ॥
బహవస్తత్ర చ పురుషాః కవిభిః కార్యా యథా సమవకారే
న చ తత్ప్రమాణయుక్తాః కార్యా ఏకాంక ఏవాయమ్॥
న చ దివ్యనాయకకృతః కార్యో రాజర్షినాయకనిబద్ధః
యుద్ధనియుద్ధాక (ధ) ర్షణ సంహ (ఘ) ర్ష కృతశ్చ కర్తవ్యః॥
ఏవంవిధాస్తు కార్యో వ్యాయోగో దీప్తకావ్యరసయోనిః."

—భరత నాట్యశాస్త్రము. 18 అధ్యా. శ్లో. 142-145.

నాందీ ప్రయోగము సర్వరూపక సామాన్యము ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశోవాపి తన్ముఖ మ్మని దానికి నియమము ఆశీర్నమస్క్రియలలో నే యొక్కటి యున్నను వస్తునిర్దేశమును మాత్రము రూపకరచయితలు తప్పక పాటించుట పరిపాటి అది శబ్దముచేతను అర్థముచేతను సూచింపఁబడవచ్చును నన్నయ యీ యదను కనిపెట్టి సభాపర్వ ద్వితీయాశ్వాసారంభమునఁ గృతి పతిని సంబోధించు పద్యమునే నాందిగాఁ దీర్చి దిద్దెను ఇది యొక యపూర్వ మైన నాటకీయ రచనా ప్రయోగము

శ్రీరమణీప్రియ ధర్మవి
శారద వీరావతార సౌజన్యగుణా
ధార భువనైకసుందర
వీరశ్రీరమ్య బుధవివేకనిధానా —సభా 2 1.

ఇవి యన్నియు బహువ్రీహులై యన్యపదార్థ మగు రాజరాజనరేంద్రుఁడను నర్థమును గల్పించుచున్నవి ఈ పద్యము నన్నయ రాజరాజును సంబోధించె దని చెప్పకయే పఠితకైనను వినిపించినచో నది యతనిని సంబోధించుచుండె నని తెలియుట దుర్లభము ఇందు రాజరాజ నరేంద్ర సంబోధనము నిమిత్తమాత్రము కావ్యార్థసూచనము పరమప్రయోజనము

కథార్థసూచనమునఁ గథార్థమును సూచింపఁబడుట యొక పద్ధతి కావ్య పాత్రల నామముల నిర్దేశించి ముద్రాలంకారముగా నాందీపద్యమును రచించుట మఱియొక పద్ధతి నన్నయ రెండవ దానినిఁ బాటించెను ఈ కథాఘట్టమున వచ్చు నాయక పక్షవర్తులగు పాత్రలు ప్రధానముగా నేడుగురు అందు శ్రీకృష్ణు నకు పూజనీయ మగు స్థానమున్నది కావున నాతఁడు ప్రథమగణ్యుడు తరువాత ధర్మజాదు లగు పాండవులు అపై వారికి ధర్మనిర్దేశము చేసిన కురుపితా మహుఁడు భీష్ముఁడు వీరిని చెప్పినచోఁ గథార్థములు సూచితము లైనట్లగును నన్నయ నాందీ పద్యరచనా సంప్రదాయము నందలి యీ విధానము నిం దను సరించెను

శ్రీరమణీప్రియుఁ డనఁగా రమావల్లభుఁ డైన శ్రీమహావిష్ణువు ఇచ్చట తదవతార మూర్తియైన కృష్ణుఁడు ధర్మవిశారదుఁ డన ధర్మాచరణకోవిదుఁ డైన ధర్మరాజు వీరావతారుఁ డన భీముఁడు ధర్మతేజమైన ధర్మజునకు కొతఁడు

కార్యసాధనము (బురుషకార సాధకుఁడు ఉత్సాహమూర్తి సౌజన్యగుణాధారుఁ డను సమాసమునందలి గుణాధార శబ్దార్థశక్తిచే వ్యంగ్యమగు గాండీవమును దానిని ధరించు పార్థుఁడును సూచింపఁబడుచున్నారు భువనైకసుందరుఁ డన నకులుఁ డని గ్రహింప వీలగును స్వర్గారోహణ పర్వమున నకులున కున్న సౌందర్యగర్వాతిశయమే యతని పతనమునకుఁ గారణ మైనట్లు మనకు స్పష్ట మగును వీరశ్రీరమ్యుఁ డను విశేషణ మీ కథాఘట్టమున సహదేపుని కన్వర్థ మగుచున్నది శిశుపాల విజృంభణముచే సంకులమైన సభను దిన వీరోక్తులతో ననుశాసించి దేవతల మెప్పును పడసిన యా చిన్నవాఁడు పరాక్రమ సంపదచేత నందమైనవాఁ డనుట సార్థకము అందములో నకులునితో దీటైనవాఁ డయ్యును రణరంగములో నాతని కంటె రెండాకు లెక్కువ చదినవాఁడు సహదేవుఁడు ఇఁక బుధవివేకనిధానా! యను సంబుద్ధి భీష్ముని వ్యంజింపఁజేయుచున్నది బుధుఁ డనఁగా పండితుఁడు పండానామ ఆత్మ విషయకజ్ఞానః ఆత్మజ్ఞానవేత్త బుధుఁడు అతని వివేకము సదసద్వివేకము సత్తు పరమాత్మ తద్వివేకమునకు నిధానమైనవాఁడు జ్ఞాని భీష్ముఁ డట్టి జ్ఞాని కావుననే భావికదలో శ్రీకృష్ణుని పరమాత్మతత్త్వము నాతఁడు ధర్మజునకు నిరూపించి చెప్పినాఁడు ఆశ్వాసాది పద్యమును మనము సామాన్యముగా నంత పట్టించుకొనము- అందు రసభావము లుండవు కనుక కాని నన్నయ రచనలో నట్టి నీరసపద్యము కూడ నాటకీయ రచనా శిల్పమున నొక యనర్ఘ పద్యరత్నమై నాందీశ్లోక గౌరవముఁ గాంచఁ గలుగుచున్నది! మహా కవి సృష్టి యట్టిది!

నాంద్యంతమున స్థాపకుఁడను రెండవ సూత్రధారుఁడు రంగమునఁ బ్రవే శించి ప్రస్తావన యను పూర్వరంగ ప్రయోగమును నిర్వహించుట నాటక సంప్రదాయము ప్రస్తావనలోని చివరియంశము పాత్రప్రవేశ సూచనము నన్నయ యీ యంశమును నారదపాత్రను బ్రవేశపెట్టి నిర్వహించెను సభా పర్వ ద్వితీయాశ్వాస మీక్రింది వచనముతో నారంభమగుచున్నది

అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పె నట్లు రాజసూయ మహోత్సవంబు నొప్పను ధర్మరాజు ధర్మనిత్యతయును స్తుతియించి నారదుం డా సదంబున సకల రాజ సమూహంబును రాజలోకంబులో మనుష్యసామాన్యుం డయియున్న జగన్మాన్యు జనార్దనుం జూచి తొల్లి బ్రహ్మాదిసురగణ ప్రార్థితుం డయి యఖిల మహీభారావతరణార్థంబు నారాయణుండు యదువంశంబున నుద యించుటయు నయ్యయిక్షత్రియ కులంబుల సురదైత్యదానవ యక్షరాక్షస

గంధర్వాదుల యంశావతారంబులుం దలంచి భవిష్యద్భారత రణంబునకు సంహృష్టహృదయుం డయి యుండునంత
—సభా 2 2

మహాభారతమున నాయకుఁడు ధర్మరాజు అతఁడు ధర్మనిరతుడు అతని ధర్మనిత్యతను నారదుఁడు మొదట స్తుతించె నని చెప్పుటచే కథానాయక ప్రశస్తిని అంగిరస సూచనమును నన్నయ చేసెనని గ్రహింపఁదగును అపై నవతారపురుషుఁడైన శ్రీకృష్ణుని మహత్త్వము కీర్తింపఁబడినది అతనికిఁ బ్రత్యర్థులై యున్న రాజలోకమును పక్షమై యున్న పార్థసమూహమును జేర్కొనఁబడినవి కలహభోజను డైన నారదుని దృష్టి సహజవిరోధ వర్గములు బలసియున్న సభపైఁ బడిన దన్నచో నచ్చట చిచ్చుపుట్టినట్లే మనము భావింప వచ్చును ఈ కథాఘట్టమునకు సంబంధించినంతవఱకు శిశుపాలునితో నగు సంఘర్షణము ముఖ్యము కాని మహాభారతకథాదృష్టికి కురుక్షేత్ర సంగ్రామము ముఖ్యము ఆ మహాఫలము నందుకొనుట కేర్పడిన కథాసోపానములలో నీ ఘట్ట మొకటి మాత్రమే ఇట్లగుటచే ప్రస్తుత సంఘర్షణమును వ్యంగ్యముగను భారత రణమును వాచ్యముగను నన్నయ నారదుని తలంపులో సూచ్య మగు నట్లు నిబంధించెను ప్రస్తావనాంగతుల్యమైన యీ యంశమును నన్నయ కథా కథనముగాఁ జెప్పెను గాని నారదుఁడు దలంచిన వాక్యముల నొక సంభాషణ శిల్పమున నిబంధింపలేదు పూర్వరంగ ప్రక్రియకును రూపకప్రయోగ ప్రక్రియకును భేదమును సూచింప నెంచి నన్నయ యిట్లు రచించె నని భావింప వచ్చును

నన్నయ యీ ఘట్టమున కథాకథనమును సంగ్రహముగను సంభాషణ ముల నధికముగను రచించి నాటకీయత నచ్చుపడునట్లు చేసెను ఇందు వాక్క్రియారూప సంఘర్షణములో వాగ్రూపమైనది అధికము శ్రీకృష్ణుఁడు శిశుపాలుని వధించినక్రియ నన్నయ యొక పద్యమునఁ జెప్పెను మిగిలిన దంతయు ధర్మజ భీష్మ శ్రీకృష్ణాదులకును శిశుపాలునకును నడుమ జరిగిన వాగ్వివాదమే కావున నీ ఘట్టమున సంభాషణలు తీవ్రములై శక్తిమంతములై పూర్వాపరసమన్వయ సంబద్ధములై సంఘర్షణను సృష్టింపఁజేయఁగలుగు నట్టివిగా చిత్రించుటయందే నాటకీయ రచనాశిల్పము రాణింప వీలగుచున్నది నన్నయ దానిని నిపుణముగా నిర్వహించెను

నిజమున కీఘట్టమునఁ జెప్పుకొనఁదగిన కథయే లేదు రాజసూయము ఉత్తమ పూజతో ముగియవలెను అట్టి యుత్తముఁడు శ్రీకృష్ణుఁ డని భీష్ముఁడు

ప్రతిపాదించెను. ధర్మజుఁ డాతనిఁ బూజించెను. కార్య మంతటితో ముగియ నుండగా శిశుపాలుఁడు 'శ్రీకృష్ణుఁడు పూజార్హుఁడు కాఁ'డని యధిక్షేపించెను. అతఁడు ధర్మజునితో, భీష్మునితో వితండవాదము చేసెను. వారు యథాశక్తి నయమున భయమున నతని నొడఁబడఁ జేయ యత్నించిరి. అతఁడు సదము వెలువడి యుద్ధసన్నద్ధుఁ డయ్యెను. యజ్ఞదీక్షితుఁడైన ధర్మజుడు పోరుసలుప వీలులేదు. పైపెచ్చాతఁడు రాజలోకము నాహ్వానించిన యజమాని. భీష్ముఁడు సమర్థుఁడే. అతనినిగూడ శిశుపాలుఁడు పడతిట్టెను. కాని, శిశుపాలునిమరణము కృష్ణునిచేత వ్రాయబడి యున్న దని తెలిసిన విజ్ఞుఁ డాతఁడు. అందువలన భీష్ముడు శ్రీ కృష్ణుని మహత్త్వమును గీర్తించుటయే కాక, యతనిని శిశుపాల వధోన్ముఖునిగాఁ బురికొల్పెను. పూజగైకొన్న పురుషోత్తముఁడే తనయుత్తమత్వ మును స్థాపించుకొనవలసివచ్చెను. సమయము ననుసరించి శ్రీకృష్ణుఁడే శిశు పాలుని సమయింపవలసివచ్చెను దానితో సవనము సమాప్తమైనది. పాండవుల కార్యము సఫల మైనది. ఈ ఘట్టమున 'శ్రీకృష్ణుఁడు పూజార్హుఁడా?' యను సంశముపై జరిగిన వాదోపవాదములే కథావిస్తృతికి మూలములైనవి. ఆ వాదోప వాదము లెట్లొకదానిపై నొకటి కార్యకారణ సంబద్ధములై శిశుపాలవధకార్యము నకు దోహదము లైనవో గమనించుటయే సంభాషణరచనాశిల్పమును సమీక్షిం చుట యగును.

కథారంభమున నన్నయ - భీష్ముఁడు ప్రశాంతుఁ డనియు, ధర్మజుఁడు ధృతిమంతుఁడనియు, నత్యంతధర్మమతి యనియుఁ బఠితకుఁ బరిచయము చేసెను. ధర్మమతికి ప్రశాంతుని హితబోధ కలిగినది. అది ధృతిమంతమైన యుత్సాహముతో నాచరింపఁబడినది. అత్యంతక్లిష్ట పరిస్థితులయందును జలింపని దీశక్తి ధృతి. అది దీప్తిమంతము కావలయునన్నచో బంగారము పుటము బెట్టఁ బడినట్లు కథలో నత్యంతసంఘర్షణమునకు గుఱియై సమర్థవంతముగా విజ యము సాధింపవలెను. అనఁగా, శిశుపాలునిదుర్వ్యవసాయము ధర్మజుని ధృతిని, ధర్మనిరతిని ప్రకాశింపఁజేయునట్లు కథలో నిబంధింపఁబడిన దని నన్నయ సూచనము. పరమశాంతుఁ డగు భీష్ముఁడు పరతత్త్వప్రతిపాదనసమర్థుఁ డని తాత్పర్యము.

మత్తకోకిల :

"స్నాతకుండును ఋత్విజుండును సద్గురుండును నిష్టుఁడున్
భూతలేశుఁడు సంయుజుండును బూజనీయులు వీరిలోఁ

ప్రీతి నెవ్వఁడు సద్గుణంబులఁ బెద్ద యట్టి మహాత్మ వి
ఖ్యాతుఁ బూజితుఁ జేయు మొక్కనిఁ గౌరవాన్వయవర్ధనా!

—సభా 2 4

అని భీష్ముడు ధర్మజుని ప్రబోధించెను ధర్మజుఁడు సవనమున భీష్మద్రోణులను గృతాకృతపరిజ్ఞానంబునందు నియోగించెను అందువలన భీష్ముఁడు కర్త వ్యము నెఱుకపఱచెను ఆ చెప్పుటలోఁ బూజార్హుఁడైన మహాత్ముని లక్షణములఁ బేర్కొని భీష్ముఁ డాతనినామనిర్దేశము చేయక ధర్మజుని నిర్ణయమునకు వదలెను ధర్మజుఁడు తాతకు దగ్గులు నేర్పఁగలిగిన చతురుఁడు నిర్ణయము తాను చేసినచోఁ దరువాత బాధ్యుఁడు తానగును కావున నా పాప పుణ్యములు కూడ నా తాతపైఁ ద్రోయనెంచి అట్టివాఁ డెవ్వండు? నా కెఱింగింపు మని యతనినే యడిగెను మనుమ డిచ్చుచున్న పెద్దఱికమున కన్నింట తగిన పితామహుఁ డాతఁడు అందువలన నిశ్శంకగా నఖిలలోక పూజ్యుఁడైన నచ్యుతునిఁ బూజార్హు నిగా నిర్దేశించినాఁడు తాను తలంచినదే తాత చెప్పినాఁడు సహదేవుఁ డర్ఘ్య పాద్యాది పూజా ద్రవ్యములు తెచ్చినాఁడు ధర్మజుఁడు వాసుదేవునకుఁ బూజ నిచ్చినాడు శ్రీకృష్ణుఁడు కిమ్మనక పూజలు స్వీకరించినాఁడు

శిశుపాలుఁడు గోపాలునకు బద్ధవిరోధి భీష్ముని హితబోధయు ధర్మజుని వర్తనము శ్రీకృష్ణుని యంగీకార మొక్కటొక్కటి యతని చిత్తము నుదుకెక్కించినవి ఆ పూజకు కర్త ధర్మరాజు ప్రేరకుఁడు తాత ఫలభాక్కు గోవిందుఁడు శిశుపాలుఁ డందువలన ధర్మజుని కేంద్రముగాఁ జేసి యీముగ్గుర నధిక్షేపించెను గాంగేయుని దుర్వ్యవసాయమునకు లోఁగి కష్టచరితుఁడైన కృష్ణునిఁ బూజించి ధర్మజుఁడు తన యవివేకమును బ్రకటించెననియు దాశార్హుఁడు పూజార్హుఁడు కాఁడనియు నతని యభ్యంతరము వాది యెదుటి వాని వాదమును మొదట ఖండించును ఆపై దానియందలి యసంబద్ధములైన యంశముల నుటంకించి వరుసగా నధిక్షేపించును శిశుపాలుఁ డట్టివాద కౌశల మును బ్రకటింపఁ బూనినాఁడు

శిశుపాలుఁడు ధర్మతాత్పర్యమును బ్రతిపాదించు తలంపుతో వాదు నారంభించియు నందు వ్యక్తి దూషణమునకుఁ దావు కల్పించెను అది వాద కుశలుఁడు చేయు పనికాదు దానికితోడు శిశుపాలుఁడు తనకుఁ దలకు మించిన ధర్మప్రశ్నములు చదివి తన వివేకమును బ్రదర్శింపఁబోయి కొన్నియెడల స్వా

వాక్యములు తనకే తగిలివచ్చునట్లు మాటలాడి యెదుటివారి వాదమునకు బలము చేకూర్చు బలహీనతకు గుఱియైనాఁడు

కడుకొని ధర్మతత్త్వ మెఱుఁగంగ నశక్యము ధర్మబాహ్యు ని
న్నొడఁబడ నిష్టుఁడై కలపి యుత్తము లుండఁగ వాసుదేవుఁ ద
ష్టడునకుఁ బూజ యిమ్మని విచారవిదూరుఁడు భీష్ముఁ డెంతయున్
వెడఁగుఁదనంబునం బనిచె వృద్ధులఒద్దులు సంచలింపవే? —సభా 2 9

భీష్ముఁడు వృద్ధుఁడే కావచ్చును అతని బుద్ధి వార్ధక్యమువలన చలించియే యుండవచ్చును అతఁడు విచార విదూరుఁ డనుట అతనిది వెడఁగుఁదన మని వెక్కిరించుట ధర్మజుని ధర్మబాహ్యుఁ డని నిందించుట వాసుదేవుఁడు జడుఁ డని నోటికసి దీర్చుకొనుట - శిసుపాలుని వాదపక్షపాతముకంటె నెదుటివాని నధిక్షేపించు చిత్తవృత్తిని వాక్పారుష్యమును బట్టి యిచ్చుచున్నవి కడుకొని ధర్మతత్త్వ మెఱుఁగంగ నశక్య మను సత్యమును జెప్పిన శిశుపాలుఁడు మత్సర గ్రస్తుఁడగుట విచారము తా నన్నమాట తనకే తగిలివచ్చునన్న వివేకము లేదతనికి సద్ధర్మమును గాంచి అధర్మమని శంకించెడి యజ్ఞానినోట సాభిప్రాయ ముగా నా మాట నడిపించుట నన్నయ చేసిన చమత్కారము ధర్మజుని సభలో ధర్మస్థాపన మాతని యత్నము అది యనధికారిచేతఁ బడి హాస్యాస్పద మగుచున్నదని కవి సాధించిన వ్యంగ్యము!

ఇట్లు నోటికసి తీర్చుకొని శిశుపాలుఁడు పూజార్హుఁ డగు వాని కుండఁ దగు నని భీష్ముఁడు నిర్దేశించిన గుణగణములు శ్రీకృష్ణునియందు లేవని వరు సగా ఖండింప నారంభించెను పై మత్తకోకిలలోని గుణములన్నింటిలోఁ బాండవులు సమర్థించుకొనుట కత్యంత సులభమైనది శ్రీకృష్ణుఁడు వారి కిష్టుఁడై యుండుట ఇష్టుఁడైనంతమాత్రమున సభలో నర్హులైనవా రుండగా నతనికిఁ బూజ చేయుట పాడికాదని శిశుపాలుఁడు మొదట వాదించెను

ఇతనికిఁ గూర్తురేని ధన మిత్తు రభీష్టము లైన కార్యముల్
మతి నొనరింతు రిష్టుఁ డని మంతురుగాక మహాత్ములైన భూ
పతులయు విప్రముఖ్యులసభన్ విధిదృష్టవిశిష్టపూజనా
యతికి ననర్హు నర్హుఁ డని యచ్యుతు నెచ్చరుఁ జేయఁ బాడియే?

—సభా 2 10

పూజార్హుఁడగు వాఁ డిష్టుఁడై యున్నను తగిన యర్హతలు కలవాఁడై యుండవలె నని యీ పద్యముచే శిశుపాలుఁడు నిష్కర్షించెను ఆపైఁ దరువాతి యర్హత లాయచ్యుతుని యందు లేవని వరుసగా ఖండించెను వసుదేవాదు లుండఁగా నాతఁడు వృద్ధుఁడనియు ద్వైపాయనుఁ డుండ నాతఁడు ఋత్విజుఁడనియు ద్రోణకృపాదు లుండఁగా నాతఁ డాచార్యుఁడనియు భూనాథు లనేకులుండగా యాదవుఁడైన ఆతఁడు రాజనియు నెట్లు పూజించుట కర్హుఁ డయ్యెనని ప్రశ్నించెను అట్లు నిండుసభలో ననర్హునిఁ బూజించుట ధర్మజుని పూజ్యత్వమునకును భూమీశుల విశ్వాసమునకును గొడ్డలిపెట్టని వర్ణించెను ధర్మజుఁ డట్టి పనిచేసి సభికులైన ధారుణీశ్వరుల నవజ్ఞ చేసెననియు నది ధర్మవిరుద్ధమనియు నధిక్షేపించెను అంతటితో నాగక ధర్మనందనునితో—

క. నీ వెఱుఁగక యిచ్చిన నిది
నా విషయమె యని మనంబునం దలఁపక ల
జ్జావిరహితుఁ డయి యర్ఘ్యము
గోవిందుఁడు గొనియెఁ దనకుఁ గొను టుచితంబే?

—సభా 2 13

యని ముకుందుని మొగము మొత్తున నెత్తిపొడిచెను అంతటితో తనివితీరక—

క. చనఁ బేడికి దారక్రియ
యును జెవిటికి మధురగీతియును జీకున క
త్యనుపమసురూపదర్శన
మును జేయుటఁ బోలుఁ గృష్ణుఁ బూజించు టిలన్

—సభా 2 14

అని వాక్కంటూతిని దీర్చుకొనెను నాటితో ధర్మరాజు నామము నిరర్థకమై నవ్వులపాలైపోయిన దని నొవ్వఁబలుకుచు శిశుపాలుఁడు సపుత్త్రిబలుఁడై సదము వెల్వడిపోయెను

శిశుపాలుని అధిక్షేపమువలన కథలో రెండంశములు ప్రశ్నింపఁబడు చున్నవి ఒకటి శ్రీకృష్ణుని పరమేశ్వరత్వము రెండు పాండవులధర్మ పరత్వము మహాభారతమున నీ రెండును పరస్పర పోషకములు వీనిలో మొదట నిరూపింపఁబడవలసినది శ్రీకృష్ణుని పరమేశ్వరత్వము అప్పుడు రెండవది తనంతటతానే నిరూపిత మగును ధర్మజుఁ డీ యంశమును గుర్తించెను

సదస్యుల నాహ్వానించిన యజమానిగాఁ దనసభ్యతను వెల్లడిచేయుచు శిశుపాలుని వెంట నేఁగి ధర్మనందనుఁడు ప్రియవచనములతో నాతని ననునయించినాఁడు! సమయోచిత ప్రజ్ఞా ప్రదర్శనమునందు ధర్మజుఁ డందెవేసినచేయి!

ధర్మజుని అనునయవాక్యము లెంత మెత్తగా నుండునో అంత వాడిగాఁ గూడ నుండును. మెత్తనిపులియైన ధర్మజుని లక్షణ మది. అన్నిమాట లనిన శిశుపాలునిపై మఱొకఁడైనదో నగ్గిపై గుగ్గిలముగా భగ్గు మనెడివాఁడు. ప్రశాంతుఁ డని చెప్పిన భీష్ముఁడే యీ ఘట్టమున భీషణహుతాశనకీలవలె మండిపడినాఁడు. తాతకన్న మనుమఁడు ధృతిమంతుఁ డని నన్నయ అందులకే నిర్దేశించినాఁడు. ధర్మజుని మాటలు సంగ్రహములు, సారవంతములు, సార్థకములు, నారస తుల్యములు.

క. "భూరిగుణోన్నతు లనఁదగు
వారికి ధీరులకు ధరణివల్లభులకు వా
క్పారుష్యము చన్నె మహా
దారుణ మది విషముకంటె దహనముకంటెన్." —సభా. 2.17.

శిశుపాలుని వాదనలో వాక్పారుష్యము తొలగించినచో వాక్యతాత్పర్యము మిగులును. పారుష్యము భావప్రకటనమున వ్యక్తి సంస్కారమును దెల్పును. వాక్య తాత్పర్యము వ్యక్తి వివేకమును దెల్పును. ధర్మజుఁడు మొదట అతని సంస్కారము నెత్తి చూపించెను. వాక్పారుష్య ముండకూడదనివాని కున్నచో నాతని భూరి గుణౌన్నత్యము, ధీరత్వము, ప్రభుత్వము రాణింపవని ధర్మజుని తాత్పర్యము. అనఁగా, శిశుపాలునియం దా మూఁడు లక్షణములు వాక్పారుష్యమువలన దూషితము లైనవని వ్యంగ్యమైన ధర్మజుని యధిక్షేపము. వాక్పారుష్యము విషము కంటెను, దహనముకంటెను మహాదారుణ మైనదని ధర్మజుని బెదరింపు. విషమువలన మూర్ఛ కలుగును. అది మంత్రతంత్రముల వలన నివారింపఁదగినది. దహన మట్టిది కాదు. నరుని నీ ఱొనరించునది. వాక్పారుష్య మీరెండింటి కంటె మహాభయంకర మైనదఁట! వాక్శక్తి యెఱిగినవాఁడు ధర్మజుఁడు. అందు వలననే యింత తీవ్రమైన విషయమును బ్రతిపాదించుచున్నను పారుష్యము కానుపించ దాతని పలుకులలో! ఎత్తుకొనుటలోనే ప్రతివాని దోషమును నిరూపించి, యతని న్ప్రతిభు నొసర్చెడి వాదకౌశలము ధర్మజుఁడు ప్రదర్శించినాఁడు. అపైఁ దనయందు దోసము లే దని వాదించినాఁడు.

ఉ ఆదిజుఁడైన బ్రహ్మయుదయంబున కాస్పద మైనవాఁడు వే
దాది సమస్తవాఙ్మయములందుఁ బ్రశంసిత డైనవాఁడు లో
కాది త్రిలోకపూజ్యుఁ డని యాత్మ నెఱింగి పితామహుండు దా
మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁ డని యుక్తమ కా కిది యేమిదోసమే
—సభా 2 18

ఆదిదేవుఁడైన బ్రహ్మకు ఆదియై ఆదివాఙ్మయమైన వేదమున కాదియై త్రిలోక సృష్టికి మూలమైనవాఁడు దామోదరుఁ డని పితామహుఁడు చెప్పెనఁట పితామహ శబ్దమున నీ పద్యప్రాణ మున్నది దానికి బ్రహ్మ యనియు భీష్ముఁ డనియు నర్థము చెప్పవచ్చును భీష్మార్థము ప్రకృతము అప్రకృతార్థము వ్యంగ్యము బ్రహ్మ చెప్పినదే తాత చెప్పెనని చమత్కారము పూర్వప్రసిద్ధ సిద్ధాంతములఁ బ్రమాణముగాఁ జూపించి వాదమునకు బలము కల్పించుకొను నేర్పు ధర్మజుని వాక్కులయందు ధ్వనింపఁబడుచున్నది

క పరమార్థ ప్రతిభఁ దమో
హరు నచ్యుతు భీష్ముఁ డెఱిఁగిన ట్లెఱుఁగఁగ నీ
కరిది శిశుపాల పెద్దల
చరితం బల్పులకు నెఱుఁగ శక్యమె యెందున్? -సభా 2-19.

అచ్యుతుని తత్త్వము నిరూపించుటకు పరమార్థ ప్రతిభ కావలె ననియు నది భీష్మునియందువలె శిశుపాలునియందు లేదని చెప్పి ప్రతివాది యజ్ఞానమును ధర్మజుఁడు బయటపెట్టుటయే కాక పెద్దలచరితం బల్పులకు నెఱుఁగశక్యమె యెందున్? అను నర్థాంతరన్యాసమున తన వాక్యార్థములను సమర్థించుకొని నాఁడు పిన్నలకు అని వాడినను సరిపోవుచోట అల్పుల కని వాఁడుట ధర్మజుని వాక్కులోని గూఢమైన తీక్ష్ణత!

ఇప్పటికి ధర్మజుఁడు శిశుపాలుని దోషమును కృష్ణుని పూజార్హతను, భీష్ముని పరమార్థ ప్రతిభను వరుసగా నిరూపించినాఁడు శిశుపాలుఁడు పూజనీయులైన పురుషులు సభలో నుండఁగా కృష్ణుఁ డెట్లు పూజ్యుఁ డయ్యె నని వాదించిన వితండవాదమునకు కీ లెఱిఁగి వాత పెట్టినట్లు సమాధానము చెప్పినాఁడు.

క ...రు డని సముస్తలోకో
త్తరుఁ డని నీకంటె వృద్ధతము లైన నరే

శ్వరు లచ్యుతునర్చనసేడఁ
గర మభినందింప నీకుఁ గా దనఁ దగునే? —సభా 2 20

పూజార్హులని శిశుపాలుఁడు చెప్పినవారే అచ్యుతునిఁ బూజార్హుఁ డని యభినందింపఁ గాదనిన శిశుపాలుని వాదమునకంటె వ్యక్తి స్వభావమునందే దోషము కల దని ధర్మజుఁ డీ వాక్యమువలన నిరూపించెను అది తరువాతి భీష్ముని వాక్యములకును శిశుపాలునివధకును బోషకమై యుండుట సంభాషణ క్రమవిన్యాస శిల్పమునకు చక్కని యుదాహరణము

ధర్మజుఁడు ఈ పద్యచతుష్టయమునఁ బ్రతిపాదించిన అంశములు శిశుపాలుని వాదమును నిర్వీర్య మొనర్చినవి శిశుపాలు నొక యవివేకిగా నిరూపించినవి ధర్మజుని పాత్ర యీఘట్టమున నిర్వహింపవలసిన పని యైపోయి నది ఇఁక నాపాత్ర యీవిషయమై మాటలాడిన చర్వితచర్వణ మగును. ధర్మజునివాక్యములలో గూఢమైన వాడిమి కలదు అది ప్రజ్వలన ప్రక్రియకు తోడుపడదు సన్నివేశమున సంఘర్షణ సృష్టింపఁబడవలెను యజమానివాక్యములనునయవాక్య లగుటచే ప్రతినాయకునియందు కోపాగ్నిని బ్రజ్వలింపఁ జేయవు అందువలన కథలో భీష్ముఁ డుద్రేకము దాల్చి శిశుపాలుని కుడు కెక్కించుమాట లనినట్లు చిత్రింపఁబడినది

భీష్ముఁడు ధర్మజునితో ననినమాట లివి

ఉ. పాలితదుర్ణయుండు శిశుపాలుఁడు బాలుఁడు వీని నేల భూ
పాలక నీకుఁ బట్టువఱువన్ మఱి ధర్మ వెఱుంగ వీనికిం
బోలునె రాగకోపపరిభూత మనస్కుల కల్పరాజ్యల
క్ష్మీలలనాంధబుద్ధి కనిమిత్తమహత్పరివాదశీలికిన్ —సభా 2 22

ఎదుటివాఁడు తూలనాడినప్పుడు ఓరిమితో పరువము చెడకుండ ప్రవర్తించు నిగ్రహము ధర్మజుని కున్నంతగా భీష్మునికి లేదు అందువలననే భారతమున లాతకన్న మనుమనికి గౌరవము భీష్ముఁ డుపాలంభనముతో మొదలు పెట్టి నాఁడు సంభాషణమును శిశుపాలుఁడు తన నన్నమాటల కావృద్ధసింహము క్రుద్ధమై నెమురువేసికొనుచు నెమరుదెబ్బతీయుటకు యత్నించినది శిశుపాలు నిలో మొదట విమర్శింపఁబడినది యవినయము దానివలన పెద్దలను దూషించు వాక్పారుష్య మేర్పడినది తరువాతివి అజ్ఞానము అప్రౌఢత్వము వాని వలన నాతఁడు ధర్మాధర్మవివేచనము లేని మాటలు వ్యక్తిదూషణ ప్రధానముగా

మాటలాడెను ధర్మరాజు వానిని ప్రతిమిలాడవలసిన పని లేదనుటలో శిశుపాలుని అయోగ్యత నిరూపింపఁబడినది ఈ మాటలన్నియు నొకయెత్తు మఱి ధర్మ వెఱుఁగ వీనికింబోలునె అనువాక్య మొకయెత్తు కడుకొని ధర్మతత్త్వ మెఱుఁగంగ నశక్య మను అధిక్షేపమున కీవాక్యము ప్రత్యాఖ్యానము అతనిగూఢామర్షకు తార్కాణము ధర్మ నిర్ణయవేత్త యగు వాని కుండఁగూడని మూఁడుగుణములు శిశుపాలునియందుఁ గల వని భీష్మ(ఁడధిక్షేపించెను. అవి 1 రాగకోపదూషితమైన మనస్సు కలిగి యుండుట 2 రాజ్య సంపద వలని మదముచే వివేకము కోల్పోవుట 3 నిష్కారణవాదబుద్ధి తుల్యపరిశీలన మున పరిత కీయవలక్షణములు ధర్మజునియందు లెకపోవుటచే నతని ఉత్తమత్వమును గ్రహించుటకు వీలుపడుచున్నది

భీష్మఁడు ధర్మజుని వారించి శిశుపాలునితో ముఖాముఖి వాదమునకుఁ దిగినాఁడు అతని వాదమంతయు శ్రీకృష్ణుని పూజార్హతను నిరూపించుటకు వెచ్చింపఁబడినది వాదాంశ విశ్లేషణమునందును విశ్లిష్టాంశవివరణమునందును తాత్పర్యాంశప్రతిష్ఠాపనమునందును భీష్మ(ఁడు కడుశ్రద్ధ వహించెను వృద్ధుల బుద్ధులు సంచలింపవే యను శిశుపాలునితో సుసంబద్ధతాత్పర్యములు గల వాక్యములను మాట్లాడి తన సుస్థిర వివేకచిత్తమును సభకు వ్యక్తము చేసికొనెను

సభలో శ్రీకృష్ణునిపూజార్హతను ప్రతిపాదించినవాఁడు భీష్మ(ఁడు కావున నతఁడే దానిని సమర్థించుచు మాటలాడుట సమంజసముగా నున్నది దానికి శిశుపాలుఁ డొడంబడునట్లు లేఁడు ధర్మజుని నయవాక్యముల వెంట వెలువడిన భీష్మని వివేక వాక్యములుకూడ విఫలము లైనచో కార్యము సఫలమగుట యెట్లు? కోపము వచ్చి కొలుపు వీడిపోవు కొరకరాని కొయ్యపై కటుకుమాటలు చేష్టలు పనిచేయు నని భావించి సహదేవుఁడు సంక్షుభిత సభ స్తంభించునట్లు భీషణ ప్రతిజ్ఞ చేసెను

చ ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితి మిచ్చిన దీనికిం దొడం
బడ మని దుర్జనత్వమునఁ బల్కెడు విరులమస్తకంబుపై
నిడియెద నంచు దాఁ బరణ మెత్తె నభన్ సహదేవుఁ డట్టిచో
మడిగి ప్రభాసదుల్ వలుకకుండిరి తద్దయు భీతచిత్తులై —సభా 2.30

ఇది సహదేవుని సమయోచిత ప్రజ్ఞాప్రదర్శనము దీనికి దేవతలు పూలవాన కురిపించిరి సభికులు విస్మయభావావిష్టులైరి వారందు దానందముతోఁ జిందులు ద్రొక్కెను

కథ కిది యొక విశ్రాంతి స్థానము నాయక పక్షమున ఆరంభ, ప్రయత్నావస్థలు స్ఫురించినవి బీజబిందువులను అర్థప్రకృతులు సార్థకముగాఁ బ్రయుక్తములైనవి గర్భసంధి కున్ముఖమై యున్న యీ కథాఘట్టమున ముఖ సంధియందలి బీజార్థములు విచ్ఛిన్నమగునంతటి సంఘర్షణము సృష్టింపఁబడ వలెను అందువలననే అంతకు సహదేవ ప్రతిజ్ఞను ధిక్కరించి శిశుపాలుని సేనాపతియగు సునీథుఁడు విజృంభించినాఁడు ప్రళయ జలధివలె పరవాహిను లుప్పొంగి వచ్చినవి క్రియాబహుళమైన యీ సన్నివేశమును నన్నయ రసోదంచిత ఛందోవిన్యాసముచే వ్యంగ్య రమణీయము చేసెను

చ రయవిచలత్తురంగమతరంగములన్ మదనాగనక్రసం
చయముల సంచలచ్చటులసైనికమత్స్యములన్ భయంకరం
బయి యదువృష్ణిభోజకుకురాంధక వాహినియుం గలంగె ని
ర్దయతరరోషమారుతనితాంతసమీరిత మై క్షణంబునన్ —సభా 2 33

ఇందలి శ్లేష సన్నివేశమునందలి సంశ్లిష్టతను రూపకము రూపకరసప్రక్రియన వ్యంజింపఁజేయుచున్నవి

ఈ సైన్య సంక్షోభమును గాంచి ధర్మజుఁడు భయసంభ్రమాక్రాంత మనస్కుఁడై తాతతో నిట్లని విన్నవించుకొనెను

తరలము ధరణిలోఁ గలరాజు లెల్లను దారుణక్షయకాలసా
గరములట్లు గలంగి రిప్పు మఖప్రయోగము విఘ్నముం
బొరయకుండఁ బ్రజాపకారము పుట్టకుండఁగ నీవు చె
ప్పరఁ పితామహ యిది కిచ్చట చిత్తశాంతి యొనర్పవే!
—సభా 2 35.

నన్నయ కథాకథనమునఁ బ్రయోగించిన రూపకాలంకారమును ధర్మజపాత్ర ముఖమున నుపమాలంకారమును నిబంధించి నాటకీయ సంభాషణ శిల్పమును పోషించెను పై వర్ణనాత్మక పద్యమును పిదప ధర్మజుని పద్య మొక్కటి చదివి కొనినను కథా ప్రభావము చెడకుండ రక్షించుట యీ రచనలోని శిల్పము! తాత చెప్పిన సలహాను పాటించుటవలన ధర్మజునకు శత్రుప్రాతము నెదుర్కొనవలసి వచ్చినది వారి నుపశాంతింపఁజేయు బాధ్యత మరల నాతఁడా తాతపై నుంచుట లౌకిక ప్రజ్ఞావిశేషము కథ భీష్ముని సంభాషణతో ముందుకు సాగునని సూచన

రంగముపై ప్రదర్శన కసాధ్యమగు యుద్ధక్రీడకు బదులు వాగ్వివాదము ప్రవేశ పెట్టు నవకాశ మీ ధర్మజుని వాక్యమువలన కథలో సిద్ధించుచున్నది.

భీష్ముఁడు తన బాధ్యతను నిపుణముగా శ్రీకృష్ణునిపై నుంచినాఁడు.

క. "నీ యజ్ఞమునకు విఘ్నము
సేయఁగ నోపుదురె యొరులు జితదైత్యుఁడు నా
రాయణుఁడు యజ్ఞపురుషుఁ డ
జేయ పరాక్రముఁడు దీనిఁ జేకొని కావన్" —సభా. 2.37.

అనుటలో కథ యొక క్రొత్త మలుపునకు తిరిగినది. సవనప్రయోగభీతి కలిగిన నాయకునకు శ్రీకృష్ణుని ప్రాపు చూపి భీష్ముఁడు ప్రాప్త్యాశ యను నవస్థను గల్పించుచున్నాఁడు; శ్రీకృష్ణుఁడే సవనరక్షకుఁ డనుసరికి శిశుపాలునికి మహా మర్షము పొడుచుకొని వచ్చినది. శ్రీకృష్ణుని పరాక్రమము లన్నియు ప్రగల్భము లని నిరూపించుచు నిష్ఠురములకు దిగినాఁడు శిశుపాలుఁడు. స్త్రీ గోవధ పాప ముల నా గోవిందుని కంటఁగట్టి నిండుసభలో నాతని గర్హించినాఁడు. ఆపై భీష్ముని దుర్వ్యవసాయమును దృష్టాంతరూపముగాఁ జెప్పి దుయ్యఁబట్టుటకు వృద్ధహంసోపాఖ్యానము చెప్పినాఁడు. నన్నయ శిశుపాలుఁడు 'రూక్షాక్షర వచ నంబు'ల నాక్షేపించెనని వర్ణించి సంభాషణ స్వభావమును వ్యంజింపఁజేసెను.

గురునిందఁ జేయుచున్న శిశుపాలుని వాక్కులు భీమునికి భీషణరౌద్రో ద్రేకమును గల్గించినవి.

చ. "ప్రకటిత కోప వేగమునఁ బద్మదళాయత నేత్రముల్ భయా
నకతరలీలఁ దాల్చె నరుణద్యుతి నుద్యతమై త్రిశాఖ మై
భ్రుకుటి లలాటదేశమునఁ బొల్చెఁ ద్రికూటతటి త్రిమార్గగా
నుకృతిఁ బ్రభంజన ప్రియతనూజున కంతకమూర్తి కచ్చటన్."
—సభా. 2.51

భీముఁడు శిశుపాల నిర్మూలనాపేక్ష సంరంభమున ముందు కురికినాఁడు. భీష్ము డతనిని వారించి శిశుపాలుని వృత్తాంతమంతయుఁ జెప్పి, యతఁడు శ్రీకృష్ణుని వలనఁ దప్ప నన్యులచే నసాధ్యుఁడని తేటపఱచెను. అట్లు కానిచో—

చ. "ఇతనికి నిట్లు నన్ను నొక యెగ్గులు పల్కఁగఁ బోలెఁగాక యు
ద్ధతమతి నన్య లీలనవిధంబునఁ బల్కి మదీయచాపని

ర్గతచటులోగ్ర మార్గణనికాయపయోధి మునుంగ కిట్లు ద
ర్పితులయి పోవనేర్తురె గభీర పరాక్రమ మారుతాత్మజా
—సభా 2 61.

అని యనునయించి మనుమని క్రోధోద్రేకము మాన్పెను

కథయందు శ్రీకృష్ణుఁడే శిశుపాలుని వధింపఁ గలిగినవాఁడను తాత్పర్య మీ సంభాషణలచే స్థిరీకరించి నాటకీయతను బోషించుటతోపాటు కథలో నవ మర్శసంధిని సూచించినాఁడు నన్నయ వృద్ధహంసోపాఖ్యానమును శిశుపాల వృత్తాంతమును పాత్ర సంభాషణలయందు నిబంధించుట రూపకమర్యాద

శిశుపాలుఁడు శ్రీకృష్ణుని యుద్ధమున కాహ్వానించుటకంటె వేఱు గత్యంతరము లేనిస్థితిలోఁ బడినాఁడు అతని యుద్ధాహ్వానమును మన్నించిన శ్రీకృష్ణుఁడాతని వధార్హతను నిరూపించు దుశ్చేష్టితముల నేకరువుపెట్టినాఁడు సమయపాలనమునకు సమయము దీరినదని సూచించినాఁడు శిశుపాలుఁడు శ్రీకృష్ణుని మనసును మండించు మాటలనినాఁడు

క నీ కూర్మి యు ని యలుకయు
నాకవి యేమిటికి దుర్గణప్రియ మొదలన్
నా కిచ్చిన యక్కన్యకఁ
జేకొని నీ కిట్లు పలుక సిగ్గును లేదే? —సభా 2 67

అర్హతానర్హతల చర్చతో నారంభమైన వాదులాట అంతఃపుర చరిత్రలను దడవు కొనువఱకు ముదఱఁ జొచ్చినది చక్రధారి యిఁక శిశుపాలుని కథకు చక్రము నడ్డము వైచినాఁడు శిశుపాలుని మొండెము నేలకొఱిగినది తేజము విశ్వాత్మ యగు కృష్ణునిలో లీనమైనది రూపక తుల్యమైన యీ సన్నివేశము నిర్వహణమున నద్భుతముగా ముగిసినది

నన్నయ యీ ఘట్టమున యజ్ఞవిధానమును బేర్కొనుచు ప్రయోగ శబ్దమును వాడుట గమనింపఁదగినది

మఖప్రయోగము విఘ్నముం బొరయకుండ (సభా 2 35)

జగన్నాథ రక్షితంబయి రాజసూయ మహాధ్వరంబు సమాప్త సంప్రయోగంబయి (సభా 2 72)

ఈ ప్రయోగమ్ము వెనుక నాందినుండి నిర్వహణమువఱకు సాంగముగా నిర్వహించిన తన రూపక ప్రయోగ సంవిధానమును నన్నయ వ్యంగ్యముగా సూచించె నఁట కావ్యశిల్పాంశము! నన్నయ నాటకీయ శిల్ప ప్రపంచ మొక నది ఘోక కళా రేఖ (1958)

# శబ్దగుణశాలి నన్నయ చతురశైలి

ఒక కవికవితా తత్త్వాన్ని సమీక్షించటానికి ముందు అతని సాహిత్య దర్శనాన్ని సందర్శించాలి ఆంధ్ర కవితా రంగంలో మార్గకవితా ప్రస్థానభేరి మ్రోయించినవాడు నన్నయభట్టారకుడు మార్గశబ్దాన్ని రీతికి పర్యాయవాచిగా దండ్యాదులు పేర్కొన్నారు భోజాదులు ఆ మాటకు ప్రాచుర్యాన్ని కల్పించారు

వైదర్భ్యాదికృతః పంథా కావ్యే మార్గ ఇతి స్మృతః
రీఙ్ గతా వితి ధాతోః సా వ్యుత్పత్త్యా రీతి రుచ్యతే

అని భోజుడు సరస్వతీ కంఠాభరణంలో పేర్కొన్నాడు గత్యర్థమైన రీఙ్ ధాతువు నుండి రీతి శబ్దం వ్యుత్పన్నమైంది వైదర్భ్యాది రీతులకు మార్గాలని పేరు పరితలు రీతి నాశ్రయించి పరంపరగా రసస్థానాన్ని పొందుతారు కాబట్టి రీతి కాపేరు వచ్చింది కావ్యాలంకార సూత్ర వృత్తికి కామధేను వ్యాఖ్య వ్రాసిన గోపేంద్ర త్రిపురహర భూపాలుడు- రిణంతి గచ్ఛంతి అస్యాం గుణాః ఇతి రీయతే క్షరతి అస్యాం వాఙ్మధుధారా ఇతివా రీతిః అని రీతికి రెండు విధాలుగా వ్యుత్పత్తులను చెప్పాడు గుణాలు దేనియందు ప్రవర్తిల్లుతాయో అది రీతి దేనియందు వాగ్రూపమైన రసధార ప్రవహిస్తుందో అది రీతి అదే మార్గం రసానుభూతి నందించే వాగ్రూప మధుధార గల కవిత మార్గకవిత నన్నయ అట్టి కవితను హృద్యమైన పద్యపణితిలో పరితృలోకానికి అందించాడు

నన్నయ ప్రధానంగా గుణవాది శబ్ద గుణసంయోజన శిల్పంతో కవితలో సౌందర్యాన్ని ఆస్వాదనీయతనూ కల్పించటంలో ఆయన సిద్ధహస్తుడు అతని కవితలోని రుచిసర్వస్వమూ కవితా నామ గిని గుణపోషకంగా సంవదించుకోవటంలో నిక్షిప్తమై ఉంది నన్నయ వాగ్వృత్తికి ప్రసాదగుణం ప్రాణ చైతన్యం ప్రసాదం సర్వగుణ సంయోజనానికి సమర్థవంతమైనది ఓజోగుణ యుక్తమైన శిథిల బంధం శబ్ద ప్రసాద గుణలక్షణం నన్నయ వాక్పాకానికి ఇటువంటి ప్రవృత్తి నైజం ప్రసాదగుణంచేత వైదర్భీరీతి రూపు కట్టుతుంది

అస్పృష్టా దోషమాత్రాభిః సమగ్ర గుణగుంభితా
విపంచీ స్వర సౌభాగ్యా వైదర్భీరీతి రిష్యతే

అని వామనుడు వక్కాణించాడు నన్నయ కవితలో పదరచన విపంచీ స్వర సౌభాగ్యాన్ని వెలారుస్తుంది రీతి గతిని సూచిస్తుంది కాబట్టి నన్నయ పద్యం కుంటుపడకుండా ప్రవాహగతిని భజిస్తుంది హృద్యమైనగతిని పద్యానికి నేర్పిన ఆచార్యుడు నన్నయభట్టు-

గుణవ్యంజకాలైనవి వర్ణాలు ప్రసాదగుణవ్యంజకాలైన వర్ణాలను- అక్షరాలను - రచనలో కూర్చి రమ్యతను కల్పించటం నన్నయ కవితాశిల్పం రమ్యత అంటే రమింపదగిన భావం - అంటే ఆస్వాదనీయత్వం కవితలో ఆస్వాదనీయత్వం సర్వసాధారణంగా సహృదయ హృదయాలకు అందే గుణం ఇతరు లక్షర రమ్యత నాదరింప అని నన్నయ అనటంలోని తాత్పర్యం అదే నానా రుచిరార్థ సూక్తినిధిత్వం ఆయన వాగ్వృత్తి లక్షణం రసధర్మాలైన గుణాలచేత విశిష్టాలైన పదాలను పరమ సార్థకంగా వాడటంలో ఆ లక్షణం విశ్వరూపం తాలుస్తుంది

కథ నాటక శరీరం రమణీయార్థ ప్రతిపాదక శబ్దం కావ్యశరీరం నన్నయ దృశ్యశ్రవ్యకావ్యశరీర వివేచనానికి ఒక సమన్వయ మార్గం చూపాడు. అదే ఆయన పేర్కొన్న ప్రసన్నకథాకలితార్థయుక్తి ప్రసాదగుణ ప్రధానంగా కావ్య వస్తువు వ్యంగ్యసుందరంగా ప్రతీయమానం కావటం అలా కావటానికి రమణీయార్థాన్ని పోషకంగా నిలిపే సంయోజనశిల్పాన్ని సంతరించటం నన్నయ కవితలో ప్రత్యక్షమౌతాయి ఇటువంటి అభివ్యక్తి ఆంధ్రకవిత కొక అపూర్వ శక్తిని ప్రసాదించింది తరువాతి కవులు ఎన్ని ప్రయోగాలు చేసినా నన్నయ కవితారుచి వారికి పాదుగా నిలిచింది ఉదాహరణకు చెప్పుకోవాలంటే- నన్నయ శబ్దగుణాలకు ప్రాధాన్య మిస్తే తిక్కన అర్థగుణాలకు ప్రాధాన్య మిచ్చాడు. శ్రీనాథుడు రీతిని రూపుకట్టించాడు ఎట్టిన గుణాలకు అలంకారాలతో శోభాతిశయిత్వాన్ని కల్పించటం ప్రారంభిస్తే ప్రబంధకవులు అలంకారశిల్పాన్ని అమూలాగ్రం చిత్రించటం మొదలుపెట్టారు తెలుగులో మార్గకవులు పోయిన కవితాప్రస్థానాలన్నింటికీ నన్నయ చూపిన వన్నెచిన్నెలే తీరుతెన్నులను దిద్ది తీర్చాయి

నన్నయ కవితలోని ఆస్వాదనీయమైన సౌందర్యం శబ్దగుణసంయోజనం వలన ఏర్పడింది గుణవర్ధకమైన శబ్దం అతని రచనకు ప్రాణం దానివలన రచనకు నాదమాధుర్యం ఏర్పడింది సహజశోభాహేతువులైన గుణాలను రచనలో కల్పించినా ప్రకృష్టమైనరీతిని నన్నయ నిర్మిస్తున్నట్లు కనపడడు ప్రసాదగుణంవలన వైదర్భి రూపుకట్టుతుంది కాని దానికోసం నన్నయ ప్రత్యే కించి ప్రయత్నం చేయడు అయత్నకృత వైదర్భిమాధుర్యం కవితలో రుచిగా కల్పించేది నన్నయవాక్పాకం ఆయన పద్యం అందువలననే హృద్యంగా ఉంటుంది రమణీయార్థ ప్రతిపాదక శబ్దాన్ని నన్నయ ఎన్నుకొని ప్రయో గిస్తాడు కాని శబ్దం అర్థ సమర్పణం చేసి అంతర్హితం కాదు అర్థాన్ని సమర్పిస్తూ తానూ ఉన్నానని అనిపిస్తుంది సహజశోభను అలంకృతం చేసి అతిశయింపచేయాలన్న యత్నం నన్నయలో ఎక్కువగా కనపడద గుణంతోనే ఆయన కవితకు రుచిగౌరవం వచ్చింది ప్రాణచైతన్యంతోపాటు రూపలావణ్యాం కూడా ఉన్న ఆకృతి నన్నయ తెలుగు కవితకు ప్రసాదించాడు

వివిధోత్తుంగ తరంగఘట్టిత చలద్వేలావనై లావళీ
లవలీలుంగ లవంగ సంగతలతా లాస్యంబు లీక్షించుచున్
ధవళాక్షుల్ సని కాంచి రంత నెదురం దత్తీర దేశంబునన్
దవదాతాంబుజ ఫేనపుంజనిభు నయ్యాశ్చోత్తమున్ దవ్వులన్

ఎత్తుగడ ఓజోగుణ గుంఫితంగా సాగినా క్రమంగా బంధం శిథిలమై రచన ప్రసాదసుందరంగా స్ఫురిస్తుంది పై పద్యంలో బిందుపూర్వక గకారా వృత్తి రీతిస్ఫూర్తికంటె గుణవృత్తిని వ్యజింపచేస్తుంది

గుణప్రధానమైన రచనలో ఒక వైలక్షణ్యం గోచరిస్తుంది ఆది రీతిని పోషిస్తే రచనలోని శైలికి ప్రాధాన్యం ఏర్పడుతుంది వృత్తులను రూపొందిస్తే సాక్షాత్ రసస్ఫూర్తికి దోహదకారి అవుతుంది నన్నయ గుణాలతో వృత్తులను వ్యక్తీకరింపచేస్తాడు

దాని శరీసౌరభము దాని విలోల విలోకనంబులున్
దాని మనోహరాకృతియు దాని శుచిస్మిత వక్త్రకాంతియున్
దాని విలాసముం గడుముదంబున జూచి మనోజబాణసం
తానహతాత్ముడై నృపతి దానికి నిట్లనియెం బ్రియంబునన్

ఇందులో ప్రసాదగుణం సమతాగుణం సత్యవతీపాత్రగతమైన శృంగార వృత్తులను వ్యక్తీకరింపజేస్తూ ఉండటం గమనింపదగింది ఈ పద్యంలో గుణం రీతిపోషకమైనా రీతియందు పరితను రమింపజెసి ఊరుకోదు వృత్తిని వ్యక్తీకరించి శృంగార విభావ విస్ఫూర్తిని వెలారుస్తుంది నన్నయకవిత గుణాన్ని మెచ్చేది కాని రూపాన్ని వరించేది కాదు రూపంలో గుణంవలన గోచరించే హావభావ విలాసాన్ని నన్నయ కవిత వ్యక్తీకరిస్తుంది

విమలయశోనిధీ పురుషవృత్త మెఱుంగుచునుండు జూవె వే
దములును బంచభూతములు ధర్మువు సంధ్యలు నంతరాత్మయున్
యముఁడును జంద్రసూర్యులు నహంబును రాత్రియు నన్మహాపదా
ర్థము లివియుండ గా నరుడు దక్కొన నేర్చునె తన్ను బ్రముచ్చిలన్

ఇందులో మాధుర్యగుణం ఉంది అనునయంతో బోధించే ధర్మ విషయాలను నన్నయ మాదుర్యగుణంలో వ్యక్తీకరిస్తాడు ఒక్కొక్కప్పుడు అటువంటి పద్యాలు సూక్తులుగా రాణిస్తుంటాయి పై పద్యంలోని పదముల కూర్పు పరితలను పరవశింపచేస్తుంది పృదక్ పదత్వం మాదుర్యమ్మని అన్నాడు వామనుడు ఇది శబ్దగుణలక్షణం ఇదే అర్థగుణమైతే ఉక్తివైచిత్ర్యం కావాలి నన్నయి రచనలో గుణం శబ్దాన్ని ఆశ్రయిస్తుంది కాని అర్థాన్ని ఆశ్రయించరు

చందన తమాలతరులందు నగరుద్రుమములందు గదళీవనములందు
లవలీ మా
కంద తరుషండములయందు ననిమీల దరవిందసరసీవనములందు
వనరాజీ
కందళిత పుష్పమకరంద రసముం దగులుచుం దనువు సౌరభము
నొంది జనచిత్తా
నందముగఁ బ్రోషితుల డెందము లలందురఁగ మందమలయానిల
మమందగతి వీచెన్

మలయానిల వర్ణనం చేసిన నన్నయ సౌకుమార్యమనే శబ్దగుణాన్ని ప్రసాదంతో మిశ్రితం చేసి ప్రయోగిస్తాడు కాని దాన్ని అలంకృతంచేసి గాఢతరం చేయడు శబ్దాలంకారం ఉన్నట్లు భాసించిన రచన అలంకార ప్రధానం

కాదు వస్తుతత్త్వ వ్యంజకం మలయానిల స్వభావాన్ని గుణప్రచనంతో వ్యంజింపజేయటం వలన నన్నయ - గుణమే వస్తువును వ్యంజింపజేసే విశిష్ట కవితాగుణమని తీర్పు చెప్పినట్లైంది నన్నయ వస్తువును వ్యక్తిని వృత్తిని గుణవ్యంజకంగా చేసే కవితాశిల్పాన్ని తెలుగువాణికి ప్రసాదించాడు

గుణప్రధానమైన రచనలో కనపడె మరొక విశేష మేమంటే - కవి కథను చెపుతున్నా ఆ కథలో గుణమే వ్యంజనసామగ్రిగా నిలవటం ఇది నన్నయ సాధించిన కథాకథన శిల్పరహస్యం

జలధివిలోల వీచివిలసత్కలకాంచి సమంచితావనీ
తల వహనక్షమం బయిన దక్షిణహస్తము నం దదున్నమ
ద్గళదురుఘర్మ వారికణక్రమ కరాబ్జము వట్టి నూతిలో
వెలువడ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్

ఇది ప్రసాదంలో పొంగులువారే అర్థవ్యక్తి యయాతి దక్షిణహస్తం దేవయాని కరాబ్జం ఇందులో వర్ణ్యవస్తువులు నూతిలోనుండి కోమలిని వెలుపలికి తీయటం కథాకార్యం విభావ వర్ణనంలో వృత్తి వ్యక్తమౌతోంది నన్నయ కథ చెపుతున్నట్లున్నా అందులో రతిభావధ్వని ప్రతీయమానమౌతోంది దానికి కవిత లోని గుణయోజనం హేతువౌతోంది వస్తుధ్వనికి గుణప్రధానమైన రచనం గొప్ప సాధనమని నన్నయపద్యం నిరూపిస్తున్నది

నన్నయ భారతావతారికలో తన కవితాలక్షణాలను పేర్కొన్నా తన సాహిత్య దర్శన ప్రస్థానాన్ని ప్రత్యేకించి పేర్కొని వాచ్యం చేయలేదు కాని నన్నయ ధ్వని ప్రస్థానాన్ని ఆశ్రయించి కావ్యరచనం చేసిన మహాకవి తిక్కనకు ఎఱ్ఱనకూ ఆ ప్రస్థానాన్నే మార్గంగా చూపించినవాడు అయితే నన్నయ వస్తుధ్వనిని విశేషించి పోషించగా తిక్కన సోమయాజి రసధ్వనిని ప్రబంధ పరమేశ్వరుడు అలంకారధ్వనినీ ఆ ప్రస్థానంలో స్వీకరించారు ధ్వని ప్రస్థానంలో గుణవర్ధకమైన రచన చేయటం ఆంధ్ర కవితకు మొదట నేర్పిన ఆచార్యుడు నన్నయ ఇతిహాసాన్ని కావ్యంగా మలచే మర్మాన్ని తెలిపిన మనీషి కథను ప్రసన్నంగా సాగిస్తూ గుణసంయోజనంతో పాత్రల వ్యక్తిత్వాలనూ అనుభావసాత్త్విక భావాలనూ రసభావాలనూ వ్యంజింపజేసే సూక్ష్మమార్గాన్ని ఆవిష్కరించిన ఆదికవి నన్నయ భట్టారకుడు

ఉత్తమ కవిత్వం కవి యొక్క సాహితీ దర్శనంలో నుంచి ఆవిర్భ స్తుంది దర్శనం లేని కవి రచించిన రచన చమత్కారానికి రంగభూమి య్యే ప్రమాదం ఉంది ఆంధ్రుల అదృష్టవశాత్తు ఆదికవి నన్నయ కవితను లంకార ప్రస్థానంలో సాగించి ఆత్మకు దూరం చేయలేదు రీతి ప్రస్థానంలో ంగించి భావంకంటె ఫణితికి ప్రాధాన్యం కల్పించలేదు వ్యంజనసూత్రాన్ని శ్రయించి రచన సాగించినా శబ్దార్థాలలో శబ్దాలకు ప్రాధాన్యత నిచ్చి వాటిని ర్థవ్యక్తికి వ్యంజకద్రవ్యాలుగా వాడుకొన్నాడు శబ్దం గుణమార్గంలో నడవక తే ఆడంబర రచన మౌతుంది ఆడంబరం నన్నయకు గిట్టదు వినయంతో లుగును వెదజల్లే విద్యుత్తులా గుణంతో ధ్వనించే శబ్దం నన్నయ కవితకు పాణం గుణప్రాధాన్య మున్న ధ్వనిప్రస్థానం నన్నయ సాహిత్య కళా ర్శనం *

(1982)

* [ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం వారి సౌజన్యంతో]
[నన్నయను గురించిన సంచికా కార్యక్రమంలో 1-12-1982 రాత్రి 8-15 గం లకు ప్రసారితం]

# అర్థగుణశాలి తిక్కనయజ్వశైలి

ఏ భాషాసాహిత్యంలోనైనా మహాకవుల రచనలను వారివారి శైలినిబట్టి సులభంగా గుర్తించవచ్చు శైలిలో మహాకవిఉక్తియందు ప్రతిబింబించే అతని శీలమే ప్రాణభూతమైన చైతన్యంలాగా భాసిస్తుంది తను గావించినసృష్టి తక్కొరుల చేతంగాదు నాన్ విశిష్టంగా ఉంటుందని ఎఱ్ఱాప్రెగడ తిక్కన కవితను ప్రశంసించాడు తెలుగులో నన్నయలాగా ఎఱ్ఱయలాగా శ్రీనాథాదు ల్లాగా పద్యం-ప్రయత్నం చేస్తే-వ్రాయవచ్చునుగాని తిక్కనలాగా పోతనలాగా పద్యం వ్రాయటం సాధ్యం కాదని సాహితిమర్మజ్ఞులు సర్వసాధారణంగా భావించటం ప్రసిద్ధి అంటే-తిక్కన్న పోతన్నల శైలులు అనుకరణసాధ్యాం కానివన్నమాట తిక్కనసోమయాజిరచననుగురించి ప్రస్తుతాంశం ఆయన శైలికి ఆ ప్రత్యేకత ఎలా వచ్చిం పని యోచించటం ప్రకృతం ఆయన శైలి ఆయన వ్యక్తిత్వముద్రతో ఉంటుందనేమాట నిర్వివాదాంశం ఆయనవ్యక్తిత్వం ఆయన ఉక్తి నాశ్రయించి అభివ్యక్తమౌతుంది ఆయన కావ్యపాత్రలను రసాభిముఖంగా దిద్దితీరుస్తున్నప్పుడు తత్తద్భావోచితమైన వాక్క్రియావిన్యా సంతో అవి ప్రవర్తిల్లుతూ ఉంటాయి సంభాషిస్తూ ఉంటాయి ఆయాపాత్రల ప్రవృత్తుల్లో పలుకుబడుల్లో తిక్కన వాగ్వృత్తి అంతర్లీనంగా ప్రవహించి వాటి మీద కవిశైలీముద్రను ప్రపంచింపచేస్తూంటుం దన్నమాట ఈ లక్షణం మహా కవులందరికీ సాధారణమైనప్పటికీ తిక్కనశైలిలో ఒక ప్రత్యేకత భాసిస్తున్న దన్నమాట దానిని వివేచించటం విమర్శకుల కర్తవ్య మౌతుంది

రచనకు రూపాన్నిచ్చేది శబ్దం ప్రాణచైతన్యాన్ని ప్రసాదించేది అర్థం ప్రాణచైతన్యంతో కూడుకొన్న రూపమే శరీరం అందువల్లనే భామహాదులు కవితకు శబ్దార్థాలు రెండూ కలిపి శరీరమన్నారు కావ్యశరీరమైన శబ్దార్థాల్లో శబ్దానికి ప్రాముఖ్యం ఉండే రచన చేసేవారు కొందరూ అర్థానికి ప్రాముఖ్య ముండే రచనను చేసేవారు కొందరూ ఉభయప్రాధాన్యం ఉండేటట్లు రచించే వారు కొందరూ కవుల్లో కనపడతారు కవిత్రయంలో శబ్దార్థోభయప్రాధాన్య మున్న రచన చేసినవాడు నన్నయ అర్థప్రాధాన్యాన్ని మన్నించినవాడు

తిక్కన శబ్ద మాధుర్యం చేత అర్థాన్ని దీపింప చేసినవాడు ఎఱ్ఱన అందువల్ల ముగ్గురి శైలులూ మూడు విధాలైనాయి ప్రాణచైతన్యంతోపాటు రూప వైభవంకూడా ఉన్న ఆకృతి మాధుర్యాన్ని నన్నయ తెలుగు కవితకు ప్రసా దించాడు ఆ మార్గాన్ని తరతరాల కవులు తన్మయత్వంతో భజించారు ఆకృతి వైభవంకంటె ఆత్మచైతన్యం అనంతంగా ప్రకాశించే తేజశ్శరీరాన్ని కవితకు తిక్కన ప్రసాదించాడు నన్నయ కవిత వివేకానందుడులాగా రూపకాంతి మనో జ్ఞంగా ఉంటుంది తిక్కన కవిత రామకృష్ణపరమహంసలా భావతేజస్సుంద రంగా ఉంటుంది ఎఱ్ఱన ఆకృతిని అలంకృతం చేస్తాడు భావం చేత రూపా రాధనం చేయిస్తాడు ఆహార్యంచేత అలంకృతుడైన రాజకుమారుడులా ఎఱ్ఱయ కవిత భాసిస్తుంది ఈ ముగ్గురిలో తిక్కన కవిత తేజస్వి భావతపస్వి అటు వంటి కవితను సృష్టించే ప్రతిభావంతుడు ఏ సాహిత్యంలోనైనా ఎప్పుడోకాని పుట్టడు

ఆకారం అందంగా ఉంటే అభినయం తక్కువైనా ఆత్మతేజస్సు అంతగా లేకపోయినా ఆస్వాదనీయంగానే ఉంటుంది రూపం రాగమోహనంగా లేనప్పుడు అభినయం ఆత్మతేజస్సూ గౌరవాదరాలను కల్పించి దానిని ఆస్వాద యోగ్యం చేస్తాయి తిక్కన రచన ఈ రెండో కోవకు చెందింది తిక్కన పద్యం నన్నయ పద్యంలాగా రాగస్రవంతిలా ప్రవహించకపోయినా భావ యుక్తంగా భంగిమలను వెలారుస్తుంది హృద్యమైన నాద మాధుర్యాన్ని అందించకపోయినా భవ్యమైన భావామృతాన్ని వర్షిస్తుంది సాగి నడిచే సంవి ధానంకన్న ఆగి నడిచే సంయమాన్ని ప్రకటిస్తుంది ఈ వైఖరిలో ఉన్న విశేషం అర్థగుణ సంయోజనం వల్ల కలిగే రీతివిన్యాసమని సాహితీమర్మజ్ఞులు గుర్తించాలి ఈ అంశాన్ని కొంత వివరించటం ఈ వ్యాస తాత్పర్యం

కావ్యశోభా హేతువులు గుణాలనీ శోభాతిశయ హేతువులు అలంకారాలనీ వామనాదులు వివేచించారు గుణవిశిష్టమైన పదరచన రీతి యని పేర్కొన్నారు రీతి కవితయొక్క పణితి అది రసాన్ని చేరుకొనే మార్గం శైలిని అనుశీలించ టానికి రీతి శ్రుతిగా తోడుపడుతుంది రీతిలో పాత్రల వాగ్వృత్తి కవివాగ్వృత్తితో అద్వైతసిద్ధిని పొందుతుంది అంటే-కవియే పాత్రగా మాట్లాడినట్లుంది పాత్రలో కవి ఎంత గూఢంగా దాక్కుంటే కవిత అంత శిల్పసుందరంగా ఉంటుంది తిక్కన కీశిల్పం బాగా తెలుసు తిక్కన పాత్రల్లో పరకాయ ప్రవేశం చేయ

గలిగిన ప్రజ్ఞావంతుడు తిక్కన పాత్రల్లో ప్రవేశిస్తే వాటికి క్రొత్త తెలివి వచ్చినట్లు మనకు కనిపిస్తుంది ఆ తెలివి పాత్రలదే అనిపిస్తాడు తిక్కన అయినా వాటి ప్రవృత్తుల్లో ప్రజ్ఞానంగా తిక్కనను సహృదయుడు స్మరిస్తుంటాడు ఈ అద్వైతంలోని అంతరార్థం అర్థగుణసంయోజనం

కావ్యశరీరం శబ్దార్థోభయరూపమైతే - ఆ శరీరానికి శోభను గలిగించే గుణాలుకూడా శబ్దార్థగుణాలుగా ఉండాలని వామనుడు వింగడించాడు ఉదాహరణకు ఒక యువతి ఉన్నది ఆ యువతి శరీరానికి శోభను కలిగించెది యౌవనం ఇది కావ్యంలోని శబ్దగుణంలాంటిది శరీరశోభను కలిగించే యౌవనం యువతికి ఉన్నా ఆమె ముగ్ధ కాకుండా గయ్యాళిగా ఉన్నదనుకోండి ఆమె ఆస్వాద యోగ్యతను కోల్పోతుంది లజ్జమొదలైన ముగ్ధాలక్షణాలు ఆమె శరీరగుణాలు కావు ఆమె సంస్కారంనుండి పుట్టిన ఆత్మగుణాలు కావ్యానికి అర్థగుణాల్లాంటి వవి యువతి లజ్జావతి యైనప్పుడే ఉపభోగంలో ఔచిత్యం ఉపజీవిస్తుంది లేకపోతే రసభంగహేతు వౌతుంది ఈ తార్కాణంవల్ల కావ్యానికి శబ్దగుణాలెంతముఖ్యమో అర్థగుణాయా అంతకంటె ముఖ్యమన్న తాత్పర్యం స్పష్టమౌతున్నది అయితే అలంకారశాస్త్రంలో శబ్దార్థగుణాల వివేచనం విస్పష్టంగా సాగించి కవితలో వాటిని వ్యక్తీకరింపజేయటంవల్ల రచనకు కలిగే వైవిధ్యాన్ని వైలక్షణ్యాన్ని పరిశీలించి ప్రపంచించే పరిశ్రమ చాలమంది లాక్షణికులు చేయకుండా వదలివేశారు శబ్దార్థగుణాల్లో సర్వజన సులభంగా సంభావింపబడే శబ్దగుణాలకే ప్రాచుర్యం కల్పించారు

తిక్కన సోమయాజి శబ్ద గుణాలకంటె అర్థ గుణాల సంయోజనం వల్ల రీతిని రూపుకట్టించే కావ్యకళాశిల్పంలో అందెవేసిన చేయి శబ్దగుణాలతో రూపుకట్టే రీతి అందమైన ఆకృతితో ఒయ్యారాలు పోతుంది అర్థగుణాలతో రూపుకట్టేరీతి స్నిగ్ధమైన శీలంతో జీవనరాగాన్ని ఒలకపోస్తుంది శీలధాతు నిష్పన్నమైన శైలీశబ్దం శబ్దగుణాలకంటె అర్థగుణాలకే సన్నిహితమైనది నన్నయ రచనలో శబ్దగుణం రీతిని రూపుకట్టిస్తే తిక్కన రచనలో అర్థగుణం రీతిని రూపొందిస్తుంది నన్నయ కవితలో ఫణితి ప్రవృత్తిని వ్యంజింపజేస్తే తిక్కన కవితలో ప్రవృత్తి ఫణితిని ఆలంబనంగా గ్రహించి రసవృత్తిని వ్యంజింపజేస్తుంది ప్రవృత్తి అర్థగుణంచేత ప్రతీయమాన మౌతుంది పాత్రల అకృతులకంటె ప్రవృత్తులను చిత్రించే మార్గాన్ని తిక్కన ఎక్కువగా ఆదరిస్తాడు

ఆకృతి ప్రవృత్తిచేత అవస్థాచైతన్యాన్ని భజిస్తుంది అవస్థలను దీపింపచేసేవి అనుభావ సాత్త్వికభావాలు అనుభావాదులు రసభావ వ్యంజకాలు అనుభావాదుల వ్యక్తీకరణం వల్ల శ్రవ్యకావ్యంలో దృశ్యకావ్య చిత్రణ విస్ఫూర్తి వెల్లివిరుస్తుంది దానికి భావవ్యంజకాలైన సంభాషణాదులు రసవద్వృత్తిని అనుసంధింపజేస్తాయి దానివల్ల కావ్యానికి రూపరామణీయకత్వంతో పాటు రసజీవితప్రవృత్తి అలవడుతుంది తిక్కన రచనలో రసాభ్యుదయోల్లాసం రక్తికట్టే గుణసూత్రం ఇది

తిక్కన రచనలోని అర్థగుణ ప్రాధాన్యాన్ని నిరూపింపబోయేముందు వామనుడు పేర్కొన్న శబ్దార్థగుణస్వరూపవివేచనాన్ని సూత్రప్రాయంగా గమనించటం అవసరం —

| | గుణం | శబ్దగుణం | అర్థగుణం |
|---|---|---|---|
| 1 | ఓజస్సు | గాఢ బంధత్వం | అర్థ ప్రౌఢి |
| 2 | ప్రసాదం | బంధశైథిల్యం | అర్థవైమల్యం |
| 3 | శ్లేషము | మసృణత్వం | ఘటన |
| 4 | సమత | మార్గాభేదం | అవైషమ్యం ప్రక్రమాభేదం |
| 5 | సమాధి | ఆరోహావరోహాక్రమం | అర్థదర్శనం |
| 6 | మాదుర్యం | పృథక్పదత్వం | అపారుష్యం (ఉక్తివైచిత్ర్యం) |
| 7 | సౌకుమార్యం | అజరఠత్వం | అపారుష్యం |
| 8 | ఉదారత | బంధము యొక్క అవికటత్వం | సభ్యప్రసంగంలో అగ్రామ్యత్వం |
| 9 | అర్థవ్యక్తి | అర్థవ్యక్తిహేతుత్వం | వస్తుస్వభావస్ఫుటత్వం |
| 10 | కాంతి | బంధౌజ్జ్వల్యత్వం | దీప్తరసత్వం |

ఎట్టి వివరాలకూ పోకుండానే పై శబ్దార్థగుణనిర్వచనాలను ముందుంచుకొని పర్యాలోచించినా సహృదయలోకానికి తిక్కన రచనలో అర్థగుణప్రాధాన్యం ఉన్నదన్న విషయం ఊహ కందుతుంది శబ్దబంధానికి సంబంధించినవి శబ్దగుణాలు - అర్థప్రకటనకు సంబంధించినవి అర్థగుణాలు తిక్కనకు శబ్దబంధం కంటె భావ శబలత ముఖ్యం శబ్దగుణప్రధానమైన రచన చక్కగా చిక్కగా అల్లినపూలదండలా ఉంటుంది. దానిలోని అర్థం సుగంధంలా పరిమళిస్తుంది అర్థగుణప్రధానమైన రచనంలోని శబ్దం పానకంలో చక్కెరలా ఉంటుంది

చక్కెరపలుకులు నీటిలో కరిగి పానకానికి తమ గుణాన్ని సమర్పించి తమ ఆకృతిని కోల్పోతాయి అలాగే తిక్కన రచనలో శబ్దాలు అర్థసమర్పణం చేసి తమ బంధ ప్రాముఖ్యాన్ని రసంకోసం త్యాగం చేస్తాయి తిక్కన రచనలోని శబ్దం పానకంలో రుచిగా పరిణమించే చక్కెరవంటిది ఒకవిధంగా చూస్తే నన్నయరచనలో రసం చెరకుగడను నమలితే వచ్చే రసంలాంటిది తిక్కన రచనలో రసం చెరకురసం త్రాగితే కలిగే రుచిలాంటిది శబ్దార్థగుణప్రాధాన్యం గల ఆయా రచనల్లో రసికుల హృదయాలు ఈ భేదాన్ని గ్రహించటం సులభం

తిక్కన రచనలో శబ్దగుణ సంయోజనంకంటె అర్థగుణసంసిద్ధి ఎలా రాణిస్తుందో స్థాలీపులాకన్యాయంగా సమీక్షించటం ప్రస్తుతం

ఓజోగుణాన్ని శబ్దగుణాశ్రితంగా వెలార్చే విధానానికి తిక్కన రచనలో ఈ పద్యం ప్రసిద్ధోదాహరణం

దుర్వారోద్యమ బాహువిక్రమరసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీర నిర్మథనవిద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్పు నిను దోర్గీలన్ వెస న్గిట్టి గం
ధర్వుల్ మానము ప్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా

—విరా 2-55

పాండవుల రౌద్ర విభావ విస్ఫూర్తిని ప్రకటింప జేసే ద్రౌపది వాక్యాల్లో ఆకృతి నిరూపణ సామర్థ్యం గల శబ్దగుణమైన ఓజస్సును కూర్చటం ఔచిత్యం అయితే తిక్కన రచనలో విభావాలను భావమూర్తులుగా చిత్రించే శిల్పమే అధికం భౌతికరూప చిత్రణంకంటె భావక్రియారూపచిత్రణమే విస్తారం పైపద్యంలో రౌద్రవిభావ ప్రదర్శనం చేసిన పద్ధతి శబ్దగుణాశ్రయంగా తిక్కన రచించి చూపించినా ఆయన ప్రధానంగా భావోచితవాక్య విన్యాసంద్వారా పాత్రల ప్రవృత్తులను వ్యంజింపజేసే అర్థగుణాశ్రితమైన రచనాశక్తిని ప్రకటించ టంలో తన ప్రజ్ఞాప్రాభవాన్ని ప్రసిద్ధంగా ప్రదర్శించాడు అప్పుడు తిక్కన రచనలో అర్థగుణదీప్తి భాసిస్తుంది ఉదాహరణకు భీముని రౌద్రప్రవృత్తిని ప్రకటించే ఈ పద్యం చూడండి

అవనీచక్రము సంచలింప గ దివం బల్లాడ నాశాచయం
బవధూతంబుగ గోత్రశైలనికరం బాకంపముం బొంద న

ర్ణవముల్ ఘూర్ణన మొందఁ గ్రోధము గృతార్థత్వంబు నొందించి చి
త్రవధప్రౌఢి వహించి సూతునకు రౌద్రం బేర్పడం జూపెదన్
—విరా 2-284

రౌద్రరసోన్నిద్ర మైన ఈ పద్యంలో నిజానికి తిక్కన శబ్దగుణప్రధాన మైన సమాస సంఘటనను ప్రవేశపెట్టియుండవలసింది కాని గాఢబంధత్వంతోకాక అర్థప్రౌఢితో భీమరౌద్రాన్ని తిక్కన వ్యక్తీకరించాడు తిక్కన కిట్టిరచన అత్యంత ప్రీతిపాత్రం ఓజస్సును రౌద్రంలో నిబంధించటం రసవద్రచనా ధర్మం అయితే దానిని శబ్దగుణంగా వెలార్చాలనా అర్థగుణంగా వెలార్చాలనా అన్నది కవి ఇచ్ఛాధీనం తిక్కన పైపద్యంలో అర్థగుణ మైన ఓజస్సును కూర్చటంవల్ల భీముడు వాక్యశూరత్వంకంటె కార్యశూరత్వాన్ని ప్రదర్శించే పాత్రగా మనకు గోచరిస్తాడు శబ్దగుణం పాత్రయొక్క ఆకృతిని ప్రదర్శిస్తుంది అర్థగుణం పాత్రయొక్క ప్రవృత్తిని వ్యంజింపజేస్తుంది శబ్దగుణం కంటె అర్థగుణం సాత్త్వికమైనదీ సూక్ష్మమైనదీ సుందరమైనదీ అయి ఆస్వాద మాధుర్యాన్ని పఠితకు భావనామయంగా అందిస్తుంది

ప్రసాదగుణం శబ్దగుణ మైతే బంధశైథిల్యంగా కనపడుతుంది బంధం శిథిలమైనా అర్థవైమల్యం ఉండకపోవచ్చు అర్థవైమల్యం అర్థగుణమైన ప్రసాద లక్షణం నన్నయ శబ్దగుణమైన ప్రసాదాన్ని ఆదరిస్తే తిక్కన అర్థగుణమైన ప్రసాదాన్నే ఎక్కువ రమిస్తాడు

దక్కెఁ కు రాజ్య మంచు నకటా యిటు దమ్మునిభాగ మీక నీ
వెక్కటి మ్రింగఁజూచె దది యెట్లరుగున్ విను మీను లోలతన్
గ్రక్కున నామిషంబుచవి గాలము మ్రింగినచాడ్పు సూవె యి
ట్లుక్కివుఁడైన నీ కొడుకు నుల్లము నున్నటులాడఁగూడునే"
—ఉద్యో 2-52

ఈ పద్యంలో బంధ శైథిల్యం ఉన్నా దాన్ని మించిన భావనైర్మల్యం ఉంది ప్రసన్నంగా చెప్పే పద్ధతికి సంబంధించి శబ్దగుణ మైన ప్రసాదం పద్ధతి నాశ్రయించి ప్రతిపాద్యాంశాన్ని ప్రవిమలంగా ప్రతీయమానం చేసే ప్రసన్నతకు సంబంధించింది అర్థగుణం ప్రతిపాద్యాంశంకంటె పద రచనాన్ని చూపించి పరవశింపచేసేది శబ్దగుణమైన ప్రసాదం రచనాన్ని ఆలంబనంగా చేసికొ్న రమణీయభావాభివ్యక్తిని రమింపచేసేది అర్థగుణమైన ప్రసాదం

తిక్కన ఉభయగుణ నిర్వహణ ప్రౌఢిని ప్రకటించే ప్రజ్ఞావంతుడైనా ఉత్త రోత్తరాలు బలీయాలని భావించి ప్రయోగించే పరమ వివేకి

శ్లేష తిక్కన అర్థగుణ ప్రయోగ పాండిత్యాన్ని పట్టియిచ్చే గుణం పద బంధంలోని మసృణత్వమే శబ్ద గుణమైన శ్లేషలక్షణం బహు పదాలున్నప్పటికీ ఏకపదంలాగానే భాసించటం శ్లేష అర్థగుణమైన శ్లేష అర్థఘటనకు సంబం ధించింది అనేక భావాలున్నప్పటికీ అవన్నీ నీరక్షీరన్యాయంగా కలిసి వేరుపరచ టానికి వీలుకాకుండా మెలగుతూ ఉండే ఐక్యఘటనాన్ని సంపదింపజేసేదిగా అది కనపడుతుంది మచ్చుకు - తిక్కన ప్రసిద్ధ పద్యం

పగ యడగించు టెంతయు శుభం బది లెస్స యడంగునే పగం
బగ వగ గొన్న మార్కొనక పల్కక యుండఁగ వచ్చునే కడుం
దెగ మొద లెత్తిపోవ బగ దీర్పఁగ వచ్చిన గ్రౌర్య మొందు నే
మిగతి దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు గేశవా

—ఉద్యో 3-21

శ్లేషలో క్రమమూ కౌటిల్యమూ అనుల్బణత్వమూ ఉపపన్నమై ఉండా లని వామనుడు పేర్కొన్నాడు ఈ మూడు లక్షణాలూ ధర్మజుని వాక్యఘటనలో అర్థ గుణసిద్ధిని పొందాయి తిక్కన పాత్రలు ఆలోచిస్తూ మాట్లాడుతున్న ట్లుండటం ప్రసిద్ధి వారి మాటల పొందికలో ఎంత మన్నిక ఉంటుందో వాక్యాల కూర్పులో అంత అర్థసంఘటన ఉంటుంది మాటలను అతకటం శబ్దగుణం ఊటగా ఉరే భావాలను బహు వాక్యాలలో ప్రవహింపజేసి ఏక ధారను అర్థస్ఫూర్తియందు సంఘటింపచెయ్యడం అర్థగుణం తిక్కన రచనలో శబ్దగుణమైన శ్లేష అర్థగుణమైన శ్లేషకు ఉడిగం చేస్తుంది వాక్య విన్యాసంలో ఏకసూత్రంగా ఉండే ఆలోచనాక్రమం ఒక్కొక్కప్పుడు వక్రతతో కూడివున్నా అనుల్బణత్వాన్ని ఆద్యంతమూ సమాదరిస్తుంది ఇది తిక్కన సంభాషణ శిల్పంలోని ఆయుస్సూత్రం పై పద్యంలోని ధర్మజుని వాక్యరచన అర్థగుణమైన శ్లేషకు శీర్షప్రాయమైన ఉదాహరణం

ఒక పద్యంగాని ఒక కావ్యంగాని ఏ మార్గాన ఆరంభింపబడుతుందో ఆ మార్గాన్ని విడువకుండా చివరిదాకా నిర్వహింపబడటం శబ్దగుణమైన సమతా లక్షణం ప్రారంభింపబడిన అర్థముయొక్క పద్ధతి ప్రక్రమంలో భేదం లేకుండా ఉండే అవైషమ్యమే అర్థగుణ మైన సమతాగుణం అంటే కవిభావాలకు పూర్వో

త్తర విరోధం లేకుండా ఒకదాని కొకటి క్రమవికాసానికి తోడ్పడేటట్లు చేసి అర్థముయొక్క సుగమత్వాన్ని కల్గించట మని తాత్పర్యం తిక్కన రచనలో అర్థగుణ మైన సమత కీ శబ్దగుణ మైన సమత ఎప్పుడూ అంగంగానో పోషకం గానో ఉండటం గమనిస్తాం ఉదా

లీల నా ముందట నా లేమ వాలసినఁ
　　జూడ్కికిఁ జాబ్బనచూఱ గాదె
కను విచ్చి నన్ను నా తనుమధ్య సూచినఁ
　　దనువున కమృతసేచనము గాదె
చిఱునవ్వు బెరయ నచ్చెలువ నాతోడఁ బ
　　ల్కినఁ జెవులకు రసాయనము గాదె
యెలమి నమ్మెలఁత న న్నెలయింపఁ దివిరిన
　　నెడఁద కానందంబు నిక్క గాదె
యా నితంబిని మక్కువ ననఁగి పెనఁగి
యింపుపొంపిరివోవ న న్నేలికొనఁగఁ
దలఁచి పొందిన నది జన్మఫలము గాదె
యనుచు వలరాజుబారికి నగ్గమయ్యె　　—విరా 2.86

ఈ పద్యనిర్మాణంలో శబ్దగుణ మైన సమత పాటింపబడినా మూడవ చరణంలో స్వల్పవిపర్యయం సూక్ష్మదృష్టికి గోచరిస్తుంది అయినా అది అంత పట్టింపుకు రాదు కాని ఇందులో అర్థగుణ లక్షణాలైన అవైషమ్యమూ ప్రక్రమాభేదమూ సలక్షణంగా నిర్వహింపబడటం విశేషం సైరంధ్రి క్రమంగా పొలయుట చూచుట పల్కుట ఎలయింపదివురుట ఏలికొనుట అనే అనుభవాలవలన కీచకుడు పొందే అనుభవ విశేషాన్ని ప్రక్రమభంగం లేకుండా సుగమం చేసే సమతను తిక్కన శిల్పసుందరంగా అన్వయబంధురంగా ఇందులో సాధించాడు తిక్కన దృష్టి అర్థగుణపుష్టిని కల్గించటంలో వ్యగ్రత వహించినంతగా శబ్దగుణసృష్టియందు వ్యామోహాన్ని ప్రకటించ దని దీనివలన స్పష్టమౌతుంది

ఆరోహావరోహక్రమం శబ్దగుణమైన సమాధి లక్షణం పద్యంలోని పద్య రచనాబంధం క్రమంగా హెచ్చుతూ తగ్గుతూ దిగుతూ ఎక్కుతూ శ్రోతలకు ఓటు మీద రక్తి కలిగించటమే ఈ శబ్దగుణ ప్రయోజనం అర్థగుణమైన సమాధి

పద్యంలోని తాత్పర్యం మీద పఠితబుద్ధిని సమాహితం చేయటానికి తోడుపడు తుంది తిక్కన రచనలలో మిక్కుటంగా కనిపించే గుణాల్లో అర్థదృష్టి గల సమాధిగుణం ఒకటి

ఆనయము పుట్టి జూదమున యప్పుడ యెంతయు జిచ్చువెట్టి కా
ల్చినయది నీ యుపేక్షయ వశీకృతచిత్తు డు ధర్మసూతి మె
త్తనిపులి యెల్లవారలు నధర్మము నీపయి బెట్టునంతకు
న్విన డును గాన డుం బిదప నీకును నాకు మసల్పవచ్చునే

—ఉద్యో 2-14

లఘ్వక్షర విన్యాసమున్న ఈ రచనలో అవరోహం గుర్వక్షరవిన్యాస మున్న రచనలో ఆరోహం అధికంగా భాసిస్తాయి అవరోహం నుండి ఆరోహాన్ని అందుకొన్న శబ్దగుణమైన సమాధి ఈ సంజయుని వాక్యాల్లో ఉంది వక్తవ్యాం శాన్ని క్రమపరిణామ వికాసంగానూ ఆరంభ వివరణక్రమంగానూ చెప్పే ప్రతి పాదన విధానంలో ఈ శబ్దగుణం రాణిస్తుంది ఈ పద్యంలోని రచన రక్తిని కలిగించినా అది అంతటితో ఆగకుండా ప్రతిపాద్యాంశంలో పఠిత మనస్సును అవహితం చెసే గుణాన్ని ప్రధానంగా ప్రకటిస్తున్నది అక్షరవిన్యాసంతో కంటె అర్థప్రతిపాదనంతో చిత్తానికి సమాహితత్వాన్ని కలిగిస్తున్నది కాబట్టి ఇందులో అర్థగుణమైన సమాధికే అగ్రతాంబూల మందుతున్నది ధృతరాష్ట్రునికి అమో దముకాని తాత్పర్యాన్ని సత్యకథన ఓక్యవథంతో చెప్పిన సంజయుని వాక్యా లలో రచన అవరోహం నుండి ఆరోహాని కెక్కటం రచనలో శబ్దగుణ సార్థక్యం ఆపై అర్థగుణవ్యక్తి తిక్కన వ్యక్తిత్వం

శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రునితో చెప్పిన వాక్యాల్లో దీర్ఘాక్షరవిన్యాసంలో కూడుకొన్న ఆరోహాన్ని అధికంగా చిత్రించటం తిక్కన శిల్పం. వాటిల్లోకూడా అర్థగుణమైన సమాధికె శబ్దగుణం సేవలు చేస్తుంది చూడండి-

కౌరవ పాండవుల్ తెఱగు గైకొని శాంతత బొంది యున్కి మే
లారయ నాకు నీకు గులమంతకు ని నృపకోటికి నుర్వికిం
ఘోరత మైన నింతకును బుట్టు మహాపద గావునన్ ధరి
త్రీరమణాగ్రగణ్య గణుతించి యవశ్యము బొం దొనర్పవే

—ఉద్యో 3 262

అందు వృకోదరార్జునుల నాహవరంగమునందు మీఱువా
రెందఱొ యెన్నుమా యిచట నీగురుభీష్ములఁ గ్రేణి సేయువా
రెందఱొ వారు వీరు నని నీల్గుటకంటె శివద్భులంబులై
యందఱుఁ గూడు టొప్పదె జనాధిప శాంతి యొనర్పు మెమ్మెయిన్
ఉద్యో 3-264

సచివుడైన సంజయుడు అవరోహంతో ఆరంభించి అర్థసమాధిని కల్పించటం స్వతంత్రుఁడైన శ్రీకృష్ణుడు ఆరోహంతో ఆరంభించి బోధించటం తిక్కన సందర్భశుద్ధి నెఱిగి శబ్దార్థగుణాలను సార్థకంగా ప్రయోగించె విధానాన్ని చాటి చెపుతున్నాయి ఉపదేశానికి అవరోహక్రమం ఉపన్యాసానికి ఆరోహక్రమం ఉచితంగా ఉంటా యని తిక్కన తీర్పు

పృథక్పదత్వం కంటె ఉక్తివైచిత్ర్యం ఉండటం అర్థగుణమైన మాధుర్యం

ఆ రాజు మా దెసం గల
కారుణ్యము కతముననుసుఖంబున నిట్లు
న్నారము నినుఁ బుత్తెంచిన
గారవమున నాదు మది వికాసముఁ బొందెన్ —ఉద్యో 1-276

ఇందులో కాకువువల్ల ఏర్పడే అర్థవైచిత్రియే అర్థగుణం శబ్దగుణం అర్థగుణంలో మునిగిపోయిం దీపద్యంలో వివరణ అనవసరం

పదబంధం చెవికి కటువుగా తోపకుండటం శబ్దగుణమైన సౌకుమార్యం దాన్నే అజరరత్వ మంటారు కఠినమైన విషయాన్ని చెప్పవలసివచ్చినప్పుడు ఆ కాఠిన్యం స్ఫురింపకుండా చెప్పటమే అర్థగుణమైన సౌకుమార్యం సంజయుని వాక్యాల్లో తిక్కన ఈ గుణానికి విశ్వరూపం చూపించాడు మచ్చుకు—

పాలిక కౌరవులు దు
శ్శీలతఁ జెడఁ దలఁచిరేనిఁ జెప్పెద రుధిరా
భీలాన్నంబునకంటెను
మేలగు భిక్షాన్నమైన మీ నడవడికిన్ —ఉద్యో 1 329

సంజయుని పలుకులకు ధర్మజు డిచ్చిన ధ్రువపత్రమే ఇందుకు సాక్ష్యం

ఎదురున్న రూపు పలుకఁగ
దది గటకటఁ బడవు నీవు దుర్ణయమును బె

ట్టిదమును బెండును నగుపలు
కొదవదు నీ నాలుకకు నెమోన్నత యెపుడున్ —ఉద్యో 1 363

కౌరవులవంటి అర్థాలను కుసుమపేశలంగా నయనీతితో ఆవిష్కరించే నేర్పు తిక్కన సంజయునికీ ధర్మరాజుకూ నేర్పాడు దూషణలుకూడా సౌకుమార్య మనే అర్థగుణం వల్ల వాగ్భూషలుగా మారటం ఆ గుణంలో ఉన్న విశేషం మహామంత్రి తిక్కన వాక్యానికి వాడితోపాటు వాల్లభ్యం కూడా నేర్పిన అర్థగుణం సౌకుమార్యం

ఏ రచనలో శబ్దాల నృత్యం చెస్తున్నట్లు వికటత్వాన్ని ప్రకటిస్తాయో అది శబ్దగుణమైన ఉదారతాగుణంతో కూడికొని ఉన్నదని చెప్పాలి కాని ఉదారతాగుణం అర్థగుణంగా అగ్రామ్యత్వంలో శోభిస్తుంది ఉపాలంభనాదుల్లో ఔచిత్యపోషణకు ఉదారతాగుణం ఉదాత్తపాత్రలకు ఉపాలంబనంగా ఉంటుంది తిక్కన రసౌచిత్యదృష్టికి ఈ గుణం తిరుమంత్రంగా భాసిస్తుంది అర్జునుడు దుర్యోధనుణ్ణి ఉపాలంభించటంలోని ఒక్క పద్యం మచ్చుతునక

క్షత్త్రియు డోడునే తగదు కౌరవ రాజ యొకండ నేఁ బృథా
పుత్త్రులలోన బిన్న నినుఁ బోరికి బిల్వ గ మాని నాఁగ ని
ద్ధాత్త్రి బ్రసిద్ధికెక్క బలదర్ప సమగ్రు డ వైన నీవు నీ
మిత్త్రులు గూడ నిట్లయి మెత్తురె వత్తురె కొల్వ భూభుజుల్?

—విరా 5 203

ఇట్టిపట్టుల్లో శబ్దగుణాన్ని వాడి చమత్కారం కొసం పాటుపడే కవులు కోకొల్లలు తిక్కన శబ్దలాస్యం చేయించడు అర్థాన్ని గ్రామ్యదూషితం కాకుండా ఔచిత్యంతో ఉపజీవింపచెస్తాడు అర్థగుణాలకు ఔచిత్యాన్ని నేర్పిన కవిబ్రహ్మ తిక్కన

ఝటితర్థ ప్రతిపత్తిహేతుత్వం శబ్దగుణమైన అర్థవ్యక్తి లక్షణం వస్తు స్వభావ స్ఫుటత్వమే అర్థగుణమైన అర్థవ్యక్తి తిక్కన కీ అర్థగుణ మంటె అలవిమాలిన వలపు ఈ అర్థగుణబలంతో ఎన్నో అనర్ఘపద్యరత్నాలను తిక్కన కల్పించాడు ప్రసిద్ధమైన ఒక్క ఉదాహరణం

సారపుధర్మమున్ విమలసత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారము నొందలేక చెడఁబారినదైన యవస్థ దక్షు రె

వ్వార యుపేక్ష సేసి రది వారలచే ఎగుఁ గాని ధర్మని
స్తారకమయ్యు సత్యశుభదాయక మయ్యును దైవ ముండెడున్
—ఉద్యో 3-273

దీనికి వివరణం వ్రాయటం దివాకరునకు దివ్వెచూపటం

శబ్దబంధానికి ఔజ్జ్వల్యాన్ని కూర్చటమే శబ్దగుణమైన కాంతి లక్షణం తిక్కన దీన్ని పాటించినా దీనికన్న దీప్తరసత్వమనే అర్థగుణాన్నే తన కవితకు ప్రాణలక్షణంగా పోషించాడు ఉదాహరణకు -

కనుఁగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల నంగము
ల్గనలఁగ సాంద్రఘర్మసలిలంబులు గ్రమ్మ నితాంతదంతపీ
డనరటదాస్యరంగ వికటభ్రుకుటీచటుల ప్రవృత్త న
ర్తన ఘటనా ప్రకారభయదస్ఫురణా పరిణద్ధమూర్తియై
—విరా 2-133

అన్నపద్యంలో ఓజఃకాంతిగుణాలను విభావవిస్ఫూర్తికి తిక్కన వాడి చూపించాడు అది ఆయన మార్గానికి అంత అనువైంది కాదు శబ్దగుణ ప్రధానమైన ఇటువంటి పద్యం మరోకవి ప్రయత్నిస్తే వ్రాయగలడు కాని తిక్కన ఆ తరువాత వ్రాసిన సీసపద్యం అన్యులకు సాధ్యం కానిది ఆయన కవితాప్రవృత్తికి పతాకవంటిది

నేలయు నింగియుఁ దాళముల్ గాఁ జేసి
యేపున రేఁగి వాయించి యూడఁ
గులపర్వతంబులు గూల్చి యొంటొంటితోఁ
దాఁకంగ వీఁకమైఁ దన్ని యాడ
నేడు సాగరములు నిక్కడక్కడఁబెట్టి
పలుచనిరొంపి మై నలఁదకొనఁగ
దిక్కులు నాలుగు నొక్కచోటికి దెచ్చి
పిసికి పిండలి సేసి పిడుచగొనఁగ
మిగిలి బ్రహ్మాండభాండంబు పగుల వ్రేయ
నప్పళించుచుఁ బ్రళయకాలానలమున
గంకరించిన రూపంబు కరణి భీముఁ
డతిభయంకరాకారత నతిశయిల్లె
—విరా 2 134

స్వరూపాన్ని సాక్షాత్కరింపజేసే శబ్దగుణ ప్రధానమైన రచన పై మొదటి పద్యం స్వభావాన్ని భావనామయం చేసి మనోనేత్రానికి ప్రత్యక్షీకరింపజేసి రసభావాభివ్యక్తికి తోడ్పడె అర్థగుణప్రధాన మైన రచన పై సీసపద్యం రెండింటినీ వ్రాసి ఉభయకవిత్వతత్త్వ విభవోజ్జ్వలు డనిపించుకొన్నాడు తిక్కన దీప్తరసత్వం తిక్కన కవితాగుణసర్వస్వం

మూలభారతంలోని కథ వ్యాసునిదైనా తెలుగులో తీర్చిదిద్దిన పద్యాలూ అందులోని గుణాలూ కవిత్రయ ప్రతిభాజన్యాలే అందులో శబ్దాన్ని చికిలి పెట్టి శిల్పీకరించి గుణవృద్ధిని సాధించే తారకమంత్రం నన్నయ తెలుగు కవితకు ఉపదేశిస్తే తిక్కన అర్థాన్ని ఆవిష్కరించే అనల్పగుణసిద్ధిని బ్రహ్మసూత్రంలా తెలుగు కవితకు ప్రబోధించాడు శబ్ద గుణమార్గం రథాలు నడిచే రాజమార్గంలా తెలుగు కవితలో సాగింది అర్థగుణమార్గం ఓడలు సాగే జలమార్గంలా మిగిలి పోయింది రాజమార్గం నలుగురూ నడవటానికీ వింతలూ వినోదాలూ సాములూ గరిడీలూ ప్రదర్శించటానికీ వీలైన త్రోవ జలమార్గం రసలోకంలో విహరింప నేర్చినవారు మాత్రమే నిపుణంగా పయనించటానికి వీలైన త్రోవ పాద యాత్రతో బాటను తరింపవచ్చు యానపాత్ర ఉంటేనే నీటిని తరింపగలిగేది శబ్దగుణం రచనకు పాదయాత్ర అర్థగుణం కవితకు యానయాత్ర తెలుగులో అర్థగుణ పస్థానానికి కర్ణధారి తిక్కన సోమయాజి ఈ పరిశీలన పరమార్థం ఒక్కమాటలో చెప్పాలంటే— అర్థగుణశాలి తిక్కన యజ్వశైలి *

(1980)

---

* తిక్కన తిరునాళ్ళ - నెల్లూరులో జరిగిన 716 వ తిక్కన వర్ధంతి సందర్భాన (1980 జులై) స్మృతివిశేషాంకంలో ప్రచురణార్థం పంపిన వ్యాసం (26 6-1980) తిక్కన తిరునాళ్ళ సంచికలో ప్రచురితం

# బసవపురాణ నిర్మాణము–
# జైనపురాణ ప్రభావము

బసవపురాణము పాల్కురికి సోమనాథుని ప్రసిద్ధరచన దానికిఁ దెలుఁగు సాహిత్యమున నొక ప్రత్యేక స్థానము కలదు అది ప్రథమాంధ్ర దేశిపురాణము అది తెలుగులో తొలిసారి వెలసిన స్వతంత్ర పురాణము అది ద్విపదకు కావ్య గౌరవము కల్పించి సాహిత్య క్షేత్రమున బట్టాభిషేకము గావించిన గ్రంథ రాజము

బసవపురాణము ప్రథమాంధ్రదేశిపురాణ మంటిమి ఇట్టి వ్యవహారమింతకు పూర్వము కనఁబడదు నన్నెచోడాదికవులు తెలుఁగు కవిత్వమును మార్గ కవిత్వ మనియు దేశీకవిత్వమనియు విభజించి వాని లక్షణముల నేర్పఱచుటకు యత్నించిరి కాని మార్గ పురాణములనిగాని దేశి పురాణములనిగాని వారు భావింపలేదు దేశి కవిత్వ మార్గమున బసవపురాణము రచించిన పాల్కురికి సోమనాథుఁడును దన కావ్యమును దేశిపురాణ మని ప్రత్యేకించి పేర్కొనలేదు అట్లయినప్పుడు బసవపురాణము దేశిపురాణ మని పరిగణించుటలోఁ గల సార్థక్యమేమియో ముందు విచారింపవలెను

సంస్కృతమున పురాణములని పిలువఁబడు ప్రత్యేక సాహిత్యశాఖ కలదు అష్టాదశమహాపురాణములు ఉపపురాణములు ఆ శాఖను సుసంపన్న మొనర్చియున్నవి దేశీయభాషలలో నవి పరివర్తితములై పురాణాఖ్యలతోఁ బ్రసిద్ధి చెందియున్నవి పురాణ మనినతోడనే పంచలక్షణ విశిష్టమైన సంస్కృత పురాణమే యను నభిప్రాయము సాహిత్య విమర్శకులయందు సామాన్యముగా వ్యాపించియున్నది సంస్కృత పురాణముల కనువాదములైన పురాణముల కాలక్షణము వర్తించును కాని బసవపురాణము పురాణాఖ్యతో వెలసినను అందు సంస్కృత పురాణ లక్షణములు కానరావు అది గీర్వాణ మహా పురాణ సంప్రదాయము ననుసరించి వ్రాయఁబడలేదు అయినను దానిని సోమనాథుడు పురాణ మనినాడు ఆంధ్ర విమర్శకు లీతఁ డా గ్రంథమును పురాణ మని యెందుకు

పిలిచినా డను నంశముపై నంతగా బట్టించుకొనినట్లు కానరాదు పైపెచ్చు బసవపురాణము పురాణమని ఎలువ బడుచున్నను దానిని సోమనాథుఁ డొక కావ్యముగా దీర్చిదిద్దెనని భావించి తృప్తిపడిరి అందుల కొక కారణము లేకపోలేదు మన ప్రాచీనకవులు పురాణము రచించినను ఇతిహాసము ననువదించినను అందు కావ్యచ్ఛాయలు వెలయించి యుండిరి అందుల కాదికవి యగు నన్నయ రచనయే సాక్ష్యము నన్నయ తెలుగుసాహిత్యమునకు శ్రీకారము చుట్టునాటికే సంస్కృతమున కావ్యరచనము పరిపక్వదశ నందుకొని యుండెను తత్కావ్య సంస్కారముతో సాహిత్యము నిర్మించిన తెలు గుకవు లందఱు తమ రచనల యందు రసవత్కావ్యసంపద నందగించియుండిరి కావున నది యాంధ్ర కవుల సర్వసామాన్యలక్షణము దానిని పురస్కరించుకొని యాంధ్రవిమర్శకులు బసవపురాణ మొకరసవత్కావ్య మని పరామర్శించుట యైనది కాని తత్పురాణత్వ స్వరూపస్వభావములును తన్నిర్మాణవైశిష్ట్యమును వారిదృష్టి నాకర్షింపలేదు

బసవపురాణము మహాపురాణసంప్రదాయము ననుసరింపలే దనుటకు పిడుపర్తి సోమనాథుని బసవపురాణమునందలి యీ క్రింది యైతిహ్యము కొంత తోడుపడ గలదు

సీ ఒకనా డు శివభక్తు లోరు గంటను స్వయం
భూదేవుమంటపమున వసించి
బసవపురాణంబు పాటించి వినువేళ
హరుని గొల్వ ప్రతాపు డచటి కేఁగి
యాసంభ్రమం బేమి యనుడు భక్తులు బస
వనిపురాణం బర్థి వినెద రనిన
విని నాపురాణంబువిధ మెట్లొకో యన్న
ధూర్తవిప్రుం డొకకర్త యరి

ఆ పాలకురికి సోమపతితుఁ డీ నడుమను
బెనచె మధ్య (ప్రాస) వట్ల పెట్టి ద్విపద
యప్రమాణ మిది యనాద్యంబు వద మన్న
నరిగె రాజు

(పీఠిక 28 వ పద్యము.)

ఇందలి విప్రుఁడు వీరశైవులకు దూర్తుఁడు కావచ్చును. కాని, యతఁడు పురాణ సంప్రదాయజ్ఞుఁడు. అతనికి పాలకురికి సోమనాథుఁడు పతితుఁడు కావచ్చును. కాని, అతఁడు దేశిసంప్రదాయము ననుసరించి పురాణము నిర్మించిన పరమ మాహేశ్వరుఁడు.

పైకథలో రాజు "ఆ పురాణవిధ మెట్టి?" దని ప్రశ్నించెను. "ఆ పురాణ మును సోమనాథుఁ డీనడుమ ప్రాసవళ్ళు పెట్టి ద్విపదలో రచించె" నని విప్రుఁడు పేర్కొనెను; అది యప్రమాణ మనియు, ననాద్య మనియు విమర్శించెను. ఈ విమర్శ ద్విపదకు మాత్రము పరిమితమైనది కాదు. ఛందము కావ్య రచనాంగములలో నొక్కటి మాత్రమే. పురాణవిధ మనఁగా తత్పురాణలక్షణ విధమును, తన్నిర్మాణ నిర్వహణ విధమును గూర్చియు ప్రశ్నించె నని భావించు టకు వీలున్నది. కావున నా విప్రుఁడు బసవపురాణము సంస్కృతపురాణముల వలెఁగాక వేదప్రామాణ్యము లేనిదనియు, అనార్షమనియు, వానివలెఁ బ్రాచీనము కాదనియు, నవీనమనియు విమర్శించె నని గ్రహింపవచ్చును. బసవపురాణము ప్రాచీనార్ష పురాణ సంప్రదాయానుసారి కానిచో నది పాటించిన నవీన పురాణ సంప్రదాయ మెట్టిది?

పురాణములలో నత్యంత ప్రాచీనములైనవానియందు సర్గప్రతిసర్గముల కధిక ప్రాముఖ్య ముండెడిది. క్రమముగా వంశమన్వంతరములను, రాజవంశ చరిత్రలకును ప్రాధాన్యము హెచ్చినది. ఆపైన శైవశాక్తాదిమత ప్రబోధైక దృష్టితో నిర్మింపఁబడిన పురాణోపపురాణములయందు దేవతామహిమాభివర్ణ నాత్మకములైన కథలును, అవతార గాథలును, మతధర్మబోధలును, భక్త చరిత్రములును విశేషముగాఁ జోటు చేసికొనినవి. అయినను అవి మహాపురాణ సంప్రదాయమునకుఁ జెందిన పంచలక్షణములను యథావకాశముగాఁ దమ యందుఁ బ్రతిబింబించుకొని పురాణత్వమును సార్థకపఱచుకొనినవి. పురాణ ములు మహాకావ్యములవలెఁ గాక జనసామాన్యము నుద్దేశించి రచింపఁబడినవి. శైవవైష్ణవాది మతములు జనాదరణ పొందుటకు తత్తన్మత దేవతాకములైన పురాణములు రచింపఁబడినవి. అవి ప్రజల హృదయములను జూఱగొనినవి. ఇట్లు మన దేశమున మతప్రవక్తల ప్రత్యక్ష ప్రవచనములకంటె పురాణకర్తల పరోక్షహితోపదేశములు మతవ్యాప్తికి మధుర మార్గముల నావిష్కరించినవి.

ఆర్ష సంప్రదాయ విరుద్ధములైన జైన బౌద్ధములు ప్రజాదరణ పాత్రము లగుట కనువైన సాహిత్య ప్రక్రియల నన్వేషించినవి మత వ్యాప్తికి పురాణములు శక్తిమంతములైన సాధనములుగా నా మతస్థులకుఁ గానవచ్చినవి కాని వేదోపనిషత్తాత్పర్యములకును షడ్దర్శన సిద్ధాంతములకును ప్రతీకలైన సర్గ ప్రతి సర్గాది లక్షణముల కాకరములైన పురాణముల విధము వారి కంగీకారము కాలేదు బౌద్ధు లవతారగాధలకు ప్రతిగా జాతక కథలు సృష్టించి బుద్ధదేవుని మహిమలు వర్ణించిరి అవి ప్రజల హృదయముల నాకర్షించినవి జైనులు బౌద్ధులకంటె విలక్షణమైన మార్గము ననుసరించిరి వారు పురాణాఖ్య ను గ్రహించి జైనపురాణములను వెలయించిరి సంస్కృత పురాణములవలె వానిని పంచలక్షణవిశిష్టములుగా రూపొందించిరి కాని వారి పంచలక్షణములు సంప్రదాయబద్ధము లైన పంచలక్షణములు కావు జైన మత సంప్రదాయాను కూలమైన పంచ లక్షణము లవి వా రంతటితో నాగలేదు ప్రసిద్ధ సంస్కృతేతిహాస కావ్యపురాణగాథల ను జైనమతానుగుణముగా మార్చి తిరుగ వ్రాసిరి వానిలో గొన్నింటిని తమ పురాణములందు వస్తువులుగా గ్రహించిరి బౌద్ధులు బుద్ధుని జన్మగాథలు జాతక కథలలో వర్ణింప గా జైనులు తీర్థంకరుల జన్మమహిమాదికములను దెల్పుకథలను పురాణవస్తువులుగా గ్రహించిరి ఇట్లు జైనులు మహాపురాణ సంప్రదాయముకంటె భిన్నమైన యొక పురాణరచనా సంప్రదాయమును రూపకల్పన చేసికొని దానియందు పురాణరచనావ్యాసంగము లను నిర్వహించి పురాణసాహిత్యమునం దాసక్తమై యున్న ప్రజాహృదయ మును ప్రచ్ఛన్నముగఁ గొల్లగొట్టి మతప్రచారము సాగించిరి

ప్రాచీన పురాణ సంప్రదాయమున పరతత్త్వమునకును వేదతాత్పర్యమున కును భగవల్లీలలకును అవతారగాథలకును ప్రాధాన్యము లభింపఁగా నవీన మగు జైనపురాణ సంప్రదాయమున మతప్రబోధమునకును మతాచార్య మహి మాభివర్ణనమునకును ఆచార్య పూర్వజన్మ గాథలకును ప్రాచీన సమకాలీన భక్తచరిత్రలకును పట్టాభిషేకము చేయ బడినది కేవల జ్ఞానసిద్ధిచే ముక్తులైన తీర్థంకరుల జన్మ మహిమాది విశేషములఁ బ్రతిపాదించుచు తన్మతసూత్రాను గుణముగా నిర్మింపఁబడినవి జైనపురాణములు ఇట్టివి సంస్కృత ప్రాకృతము లందు కొన్ని వేలసియున్నను సామాన్యజనుల కందుబాటులోనికి వచ్చునట్లు జైనకవులు దేశీయభాషలలో ననువాదము గావించిరి అవి మత ప్రవక్తలను భగవన్మూర్తులుగా భావించి భజించుటకును తన్మతానుయాయులగు మహాత్ముల

వైశిష్ట్యమును మహిమలను గ్రహించుటకును పరమతఖండన - స్వీయమత పోషణానుసరణాదులకైన పరిజ్ఞానము నందించుటకును నేర్పడిన కథాకావ్యములుగా రూపొందినవి ఇందు చరిత్ర కందని సనాతనుల చరిత్ర లుండక పోవచ్చును ప్రతీకాత్మక సృష్టి కనుపట్టకపోవచ్చును సమకాలికులే పురాణ పురుషులుగాఁ గీర్తింపఁబడవచ్చును పురాణగౌరవము నభిలషించెడి నవీన మతముల యాకాంక్షలు నామశ్రవణమాత్రముననే పురాణత్వము స్ఫురింపఁ జేయు నిట్టి నవీన కావ్యలతికలకు దోహదక్రియ లొనర్చినవి

దక్షిణదేశ భాషా సాహిత్యములలో నిట్టి పురాణములు మత వాఙ్మయముల కెత్తిన కీర్తిపతాకలై విరాజిల్లుచున్నవి కన్నడమున ప్రసిద్ధ జైనకవులు తీర్థంకరుల చరిత్రలను పురాణములుగా వెలయించిరి ఆదికవి యని ప్రసిద్ధిగాంచిన పంపకవి (క్రి శ 941) జైన ప్రథమ తీర్థంకరుఁడైన పురుదేవుని చరిత్రమును ఆది పురాణ మను పేర చంపువుగా రచించెను అది జినసేనుని సంస్కృత కృతి కనుకృతి ఇట్లే ఉభయకవిచక్రవర్తి యైన పొన్నకవి పదునాఱవ జైన తీర్థంకరుని జీవితచరిత్రమును చంపువుగ శాంతి పురాణ మను పేర రచించెను కవి చక్రవర్తి రన్నఁడు ద్వితీయ తీర్థంకరుని చరిత్రను అజితపురాణ మను చంపువుగా నిర్మించెను ఇవికాక నాగచంద్రకవి మల్లినాథపురాణము నయసేనుని ధర్మనాథపురాణము జన్నకవి యనంతనాథపురాణము మొదలగునవి ప్రసిద్ధ కన్నడ జైన పురాణములు ద్రావిడ వాఙ్మయమునందు అఱువత్తు మూవురునయనారు లను శివభక్తుల చరిత్రలను గూర్చి శేక్కిళ్లార్ అను కవి రచించిన పెరియపురాణము కడుప్రసిద్ధి కెక్కియున్నది ఇట్లు మతాచార్యుల యొక్కయు భక్తులయొక్కయు కథలను గుదిగ్రుచ్చి కూర్చి యొక కథాహారముగా సంతరించి పురాణమను పేరఁ బ్రవర్తిల్లఁజేయుట కర్ణాట ద్రవిడ కావ్య వస్తు నిర్మాణ పద్ధతులలో నొకటిగా క్రి శ 10 వ శతాబ్దమునుండియే గుర్తింపఁ బడియున్నదని తెలియుచున్నది ఇది ఆర్షము ఆద్యమునైన సంప్రదాయము కాక దేశీయము నవీనమునైన పురాణ నిర్మాణ ప్రక్రియ బసవపురాణ మీ సంప్రదాయము ననుసరించి పురాణాఖ్యను ధరించి ప్రప్రథమ వీరశైవ పురాణమై వాసికెక్కినది ఇట్టి రచనల కిదియే తెలుఁగున శ్రీకారము చుట్టినది

సంస్కృత పురాణ పంచ లక్షణములకుఁ బ్రతిగా జైనులు తమ పురాణములందలి తీర్థంకర చరిత్రలలో నుత్సవ పంచకమును లేక పంచజిన

మహా కల్యాణములను వర్ణించిరి. రన్నకవి జైనపురాణములం దీ ఉత్సవ - లేక- కల్యాణ పంచకము సవిస్తరముగ వర్ణింపఁబడవలెనని పేర్కొనియుండెను.[1] అవి: 1. సురలోకావతరోత్సవము లేక గర్భావతరణ కల్యాణము, 2. జన్మాభిషేకోత్సవము లేక జన్మాభిషేక కల్యాణము, 3. పరినిష్క్రాంతిమహోత్సవము లేక పరినిష్క్రమణకల్యాణము 4. కైవల్యబోధోత్సవము లేక కేవలజ్ఞాన కల్యాణము, 5. పరినిర్వాణమహోత్సవము లేక పరినిర్వాణ కల్యాణము. జైన సాహిత్యమున నీ ఉత్సవ కల్యాణపదములు పర్యాయపదములుగా వాడఁబడినవి. తీర్థంకరుని దివ్యజన్మకు హేతుభూతమైన కథాభాగము ప్రథమ కల్యాణము. తీర్థంకరజన్మసమయమున నింద్రాదిదేవతలు భువి కవతరించి క్షీరాభిషేకాదులతో నామహామహుని పూజించి యాతని మహిమాన్విత గాథకు నాంది నాలపించు ఘట్టము ద్వితీయకల్యాణము. తీర్థంకరుఁడు సంసారమును రోసి జ్ఞానసిద్ధికై తపోవనమున కరుదెంచు ఘట్టము తృతీయకల్యాణము జ్ఞానసిద్ధియు, తత్త్వబోధ నిర్వాణములు చతుర్థపంచమ కల్యాణములు. ఈ విభాగములను గమనించి నచో జినబుద్ధదేవులజీవితచరిత్రల కవి సమముగా వర్తించునని యూహింప వచ్చును. అవియొక మహాజ్ఞానిజీవితప్రథమోషస్సునుండి చరమోషస్సు వఱకు సహజముగా నేర్పడు నైదుసోపానములు; కావున తీర్థంకరచరిత్రల కవి యవశ్యలక్షణములై ప్రవర్తిల్లినవి. జైనపురాణములును పంచకల్యాణలక్షణలక్షితములై, పురాణగౌరవము నందుకొనినవి.

జైనపురాణములయందు మతసంబంధములైన శాస్త్రవిచారాంశములను వదలినచో ప్రధానముగా నెన్నఁదగిన లక్షణములు మఱిరెండు కలవు. అవి 1. భవావళి, 2. త్రిషష్టిశలాకాపురుషచరిత్రముల వర్ణనము. భవావళి యనఁగా తీర్థంకరుల పూర్వజన్మల వరుస యని యర్థము. జైనసిద్ధాంతమున కర్మవాసనా బద్ధుడైన జీవుఁడు జ్ఞానోన్ముఖుఁడై పయనించుచు నీచజన్మలనుండి క్రమముగా నుత్తమజన్మలను బొందుచు చివరకు కేవలజ్ఞానసిద్ధిని బడసి ముక్తుఁడగుటకు

---

1. "సురలోకావతరోత్సవం, పరికృతం జన్మాభిషేకోత్సవం, పరినిష్క్రాంతి మహోత్సవం, ప్రవిమలం కైవల్యబోధోత్సవం, పరినిర్వాణ మహోత్సవం జిన మహా కల్యాణ మైదుం సవిస్తర దిందుర్పువు" —రన్నకవి. [చూడు: ఆది పురాణ సంగ్రహ పీఠిక. పుట 56; సంపాదకుఁడు: ఎల్. గుండప్ప. ఎం.ఏ.,]

తీర్థంకరుఁ జన్మము నెత్తునని విశ్వసింపఁబడును తదనుగుణముగా జైనపురాణము లందు ప్రథమ కల్యాణకథావసరమున నాతీర్థంకరజీవసంస్కార పరిణామ నిరూపకములైన పెక్కు పూర్వజన్మగాథలు చెప్పఁబడును అవియన్నియు తీర్థంకరజీవితకథారూపకమునకు ప్రస్తావనాంగతుల్యములై రక్తికట్టుచుండును ఆ కథా భాగము భవావళి మహాపురాణ సంప్రదాయమున సర్గ ప్రతిసర్గాదులలో బ్రహ్మాండ జీవోత్పత్తి క్రమవికాసము పురాణారంభమున వర్ణింపఁబడుచుండ జైన పురాణములు తీర్థంకర జీవపరిపక్వ దశాభివర్ణన మారంభమున నిబంధించు కొనినవి

జినధర్మమును నమ్మి సద్గతిఁ బడసిన మహాపురుషు లఱువదిముగ్గురు కల రని జైనసంప్రదాయము వారిని త్రిషష్టిశలాకామహాపురుషు లందురు వారు చతుర్వింశతి తీర్థంకరులకంటె భిన్నులు వారి గణన మిట్లు కలదు 12 మంది చక్రవర్తులు 24 మంది కామదేవులు 9 మంది బలదేవులు 9 మంది వాసుదేవులు 9 మంది ప్రతివాసుదేవులు వారిలో నధములు ప్రతివాసుదేవులు వారు భవబంధమగ్నులు పైవారిలో నుత్తములు చక్రవర్తులు వారు సత్త్వగుణ సంపన్నులు వీరందరికంటె సర్వోత్తములు తీర్థంకరులు అట్టి తీర్థంకరుల చరిత్రలలోఁ బై త్రిషష్టిశలాకామహాపురుషుల చరిత్రలు యథావకాశముగాఁ జెప్పఁబడుట జైనపురాణవస్తు లక్షణములలోఁ బ్రధానమైన దని విమర్శకులు పేర్కొనియున్నారు [1] పరిపూర్ణ జీవితులైన మతప్రవక్తల చరిత్రలలో తరతమ భేదాదికారసమన్వితులైన మహాపురుషుల చరిత్రలు వర్ణింపఁబడినచో సామాన్య ప్రజలకు నిర్వాణమార్గ సోపానక్రమము నేర్పఱచుకొనుటకు వీలు కలుగు ననుట నిర్వివాదాంశము

పై పర్యాలోచనమువలన జైనపురాణనిర్మాణవిధానము తల్లక్షణవిధము స్థూలముగాఁ దెలియవచ్చును అవి పంచకల్యాణ లక్షణములయ్యు సర్గాదిపంచ లక్షణములు కావు అవి మహాపురాణములవలె భగవల్లీలలను జెప్పక ఆచార్య మహత్త్వమును చెప్పునవి పౌరాణికైతిహాసికవ్యక్తులనే గాక సమకాలీనభక్తులను వారి కథలను తనయందుఁ జిత్రించినవి అధునాతనము లైన పురాణములు సమ కాలీన సాంఘికవృత్తములను దమయందు గ్రహించి ప్రజాదరణము పొంద

1 అదిపురాణసంగ్రహపీఠిక పుట 154 సంపాదకుడు ఎల్ గుండప్ప ఎం ఏ మైసూరు విశ్వవిద్యాలయ కన్నడ గ్రంథమాల 20 (1959)

యత్నించును వానియందు పౌరాణిక కల్పన యెంతయుండునో దేశీయతాముద్ర యంత యుండును ఏతద్విధకారణముల నన్నింటిని గ్రోడీకరించి మహాపురాణ సంప్రదాయము మార్గపురాణ సంప్రదాయ మనియు తద్భిన్నమైన జైనపురాణ సంప్రదాయము దేశిపురాణసంప్రదాయ మనియు నిందు భావింప బడినది

సోమనాథుడు జైనపురాణసంప్రదాయముల నెఱుంగుట కతని నివాసస్థల మైన ఓరుగల్లుప్రాంత మెంతయో తోడ్పడియుండును ఓరుగల్లు బహుమతస్థుల కావాసమైన మహాంధ్రనగర మని విఖ్యాతి నందినది నన్నయనాఁటికి తూర్పు చాళుక్యరాజుల వైదికమతాభినివేశముచే వేంగిదేశమున జైనబౌద్ధముల ప్రాబల్యము సడలినది కాని తెలంగాణమున నంతగా తగ్గలేదు అందుల కప్పుడా ప్రాంతము నేలు రాజులు తూర్పుచళుక్యులవలె వైదికమతపోషకులు కాక పోవుటయే ప్రధాన కారణము అనుమకొండలోఁ గాకతీయ సామ్రాజ్యమును సుమారు పదునొకండవ శతాబ్ద్యారంభముననే మొదటి బేతరాజు స్థాపించి యుండెను అతడు జైనమతావలంబుఁడుగాఁ గానవచ్చుచున్నాడు అతని తరువాతివా డగు మొదటి ప్రోలరాజును జైనుడే కాకతీయ ప్రభువులలో మొట్టమొదట శైవము నవలంబించినవాఁడు రెండవ బేతరాజు అతడు పరమ మహేశ్వరుఁడని కీర్తింపఁబడినాడు అతఁడు 11 వ శతాబ్ది చరమ పాదమున పాలనకు వచ్చినవాడు అప్పటి నుండియు నోరుగల్లున శైవమునకుఁ బ్రాబల్య మేర్పడినది అది శైవ జైన మతముల సంఘర్షణకు దారి తీసినది గణపతిదేవ చక్రవర్తి వీరశైవాచార దీక్షావ్రతుఁ డగుటచే జైనులను వారి మతమును క్రూర ముగా హింసించినట్లు తెలియుచున్నది తిక్కన యోరుగల్లు దర్శించినప్పుడు ఆ రాజు జైన బౌద్ధులతో నాతనిని వాదు సేయించెన ట తిక్కన వారి నోడించి వైదికమతమును స్థాపించెనఁట అప్పుడు గణపతిదేవుఁడు జినసమయార్థుల శిరములఁ దునిమె ననియు విద్వేషబౌద్ధుల విలుమాడె ననియు సిద్ధేశ్వర చరిత్రవలనఁ దెలయుచున్నది ఓరుగల్లు పతనమునకు జైనమతస్థుల పగయు నొక కారణమని చారిత్రకులు భావించుచున్నారు ఇట్లు కాకతీయుల పాలనమున నోరుగల్లులో రాజమతముగా దాదాపొక శతాబ్ది వెలసిన జైనము తన పూర్వ గౌరవము నిలుపుకొనుట కొఱకు మరియొకటిన్నర శతాబ్ది కాలము శైవమత ముతో నెదురొడ్డి పోరుచు నంతరించినది జైనము నెదిరించి విజయము సాధించు చున్న శైవము సోమనాథునకు నూతనశక్తిని పుట్టుకతోనే ప్రసాదించియుండును జైనమతము జనబాహుళ్యమునందు వ్యాపించుట కుపయోగపడిన వారి పురాణ ముల విధము సోమనాథుని చిత్తముపైఁ గొంత ప్రభావము వైచియుండును

తత్సంస్కారముతో నతఁడు వీరశైవ సముద్ధరణ మొనర్చి యాంధ్ర కర్ణాటక జనహృదయ సీమలయందు స్వర్ణపీఠము నధిరోహించు బసవపురాణ నిర్మాణము చేపట్టినాఁడు

బసవచరిత్రమే బసవపురాణ ప్రధానేతివృత్తము సోమనాథుఁడు తన పురాణ కథావస్తువును సేకరించుకొనిన విధము నిట్లు చెప్పుకొనినాఁడు

అతత బసవపురాతనభక్త
గీతార్థసమితియే మాతృకగా గఁ
బూరితంబై యొప్పు పూసలలోన
దారంబుక్రియఁ బురాతనభక్త వితతి
చరితల లోపల సంధిల్ల బసవ
చరిత మే వర్ణింతు సత్కృతి యనఁగ

ప్రస్తుతింపంగ సద్భక్తి విస్ఫురణఁ
బ్రస్తుతి కెక్కిన బసవనిచరితఁ
జెప్పితి భక్తులచే విన్నమాడ్కి
దప్పకుండఁగను యథాశక్తిఁ జేసి

ఈ వాక్యములనుబట్టి బసవపురాణ మేపురాణమునకును అనువాదము కాదనియు శివభక్తుల వాక్కులయందును పురాతన భక్తిగీతార్థములయందును వ్యాపించి యున్న బసవకథార్థములను ప్రోగుచేసి స్వీయప్రతిభతో వానిని రసవత్తరము లొనరించి సంవిధానము చెడకుండ వానిని గుదికూర్చి సోమనాథుఁడు పురాణ నిర్మాణ మొనర్చెననియు స్పష్టమగుచున్నది సోమనాథుఁ డీపురాణమును భక్త జన కథామంజరిగా నలంకరించినను అందైక్యమను సూత్రమును బసవని చరిత్రతో సాధించుటవలన నాతని కావ్యవస్తువునకు ప్రబంధ సౌందర్య మబ్బి నది. సోమనాథుఁడే పండితారాధ్య చరిత్రమున భక్తులు తన బసవపురాణ నూతనత్వమును అందితిహాసఘటనవలన కథాకథనమున కేర్పడిన ప్రాబంధ్య మును గీర్తించినట్లు ప్రత్యేకముగఁ జెప్పుకొనెను [1]

1 ఖ్యాతిగా సద్భక్తగణలాలనముగ - నూతనంబుగ జగన్నుతముగా మున్ను బసవపురాణ మొప్పఁగ రచించితివి బసవపురాణ ప్రబం ధంబునందు - ప్రథిత పురాతనభక్త సంఘాను - కథనంబు లితిహాసఘటనఁ గూర్చితివి —పండితారాధ్యచరిత్ర దీక్షాప్రకరణము పుట 11 (ఆం. గ్రం. మా 30 పరిష్కర్త - చా చి నారాయణరావుగారు - 1939)

సోమనాథుఁడు బసవపురాణము నేడాశ్వాసములకృతిగా భావించి సప్త పర్వవతె రూపొందించెను అందు ప్రథమాశ్వాసమున నందికేశ్వరుఁడు బసవేశ్వరుఁడుగా భువి నవతరించుటయు నుపనయన సంస్కారమును ద్యజించి వీరమాహేశ్వర వ్రతనిష్ఠు డగుటయు వివాహితు డై సంగమేశ్వరుని శరణు వే డుటయు వర్ణింప బడినవి ద్వితీయాశ్వాసమున బిజ్జలుఁడు బసవేశ్వరునకు దండనాయక పద మిచ్చుటయు కళ్యాణ కటకమున బసవేశ్వరుఁడు శివాచార నిరతు డగుటయు చెన్నబసవ డు బసవు నారాధించుటయు అల్లమప్రభువు బసవని విం దారగించి వరము లిచ్చుటయు బసవేశ్వరుఁడు తన మహిమలు ప్రదర్శించుటయు జెప్ప బడియున్నవి తృతీయాశ్వాసము జంగములకు బసవేశ్వరు డు తన భార్య చీర నిప్పించి తన జంగమసేవానిరతిని ప్రకటించిన కథతో నారంభమై సంగయ్య యను ముగ్ధభక్తుని చరిత్రమునకు ముగ్ధుఁడైన చెన్నబసవనికి బసవేశ్వరు డు ముగ్ధభక్తుల కథల నెఱిఁగించుటతో విస్తరించినది చతుర్థాశ్వాసము మడివాలు మాచయ్య కదతొ నారంభమగును వీరశైవులు తమ బాసలను భక్తి మహిమతోఁ బాటించి జంగమ లింగరూపులై అనన్యసాధ్యులై వెలుగొందెది రనుట కాభక్తుని కథ తార్కాణము బసవేశ్వరుఁ డాతనిని సాక్షాచ్ఛివునిగా భావించి సేవించెను అత డె యొకసారి బసవనిగీతములో విని వచ్చిన యహంకారమును గర్హించి భక్తివలన భక్తున కత్యంత వినయ సంపద యేర్పడవలయునని ప్రాచీన భక్తుల చరిత్రములను బెక్కంటిని దృష్టాంతములుగ బేర్కొనినట్లు వర్ణించుచుచె ని యాశ్వాసము కడు దీర్ఘమైనది బసవని సమకాలికులగు కిన్నర బ్రహ్మయాది భక్తుల మహా మహిమలను ప్రతిపాదించుటతో పంచమాశ్వాసమైనది షష్ఠాశ్వాసము జైనులతో వాదుపడి శిరమిచ్చి మహిమాతిశయములను బ్రదర్శించిన ఏకాంత రామాదులవంటి శివభక్తుల కథలతో నిండియున్నది సప్తమాశ్వాసము కులమున కంత్యజుఁడయ్యు మహిమచె నున్నతు డైన శివనాగుమయ్యవంటి భక్తుల చరిత్రలతొ సాగి బిజ్జలుఁ డకారణముగా నెల్లయ్య మధువయ్య లను భక్తుల కన్నులు తీయించుటచె బసవేశ్వరున కాగ్రహము గలిగి కల్యాణ కటకమును శపించి భక్తమండలితోఁ గూడి సంగమేశ్వరమున కే గి లింగైక్యమందుటయు జగదేవాదులు బిజ్జలుని వధించుటయు నంతికాలములో రాజ సంతతియు రాజ్యము నాశనమగుటయు నను కథాంశములతో ముగియుచున్నది

వీరశైవమతాచార్యుఁ డగు బసవేశ్వరు నవతార పురుషునిగా నిరూపించు టయేగాక తత్పూర్వజన్మ విశేషముల నభివర్ణించి యాదిమూలమైన యతని స్వరూపము నెఱిఁగించి ప్రస్తుతావతార హేతువును నిర్దేశించిన కథా భాగ మీ పురాణేతి వృత్తమున ప్రస్తావనగా నలరారుచున్నది బసవేశ్వరుఁడు తొలుత సృష్ట్యాదియందున్న ధర్మస్వరూపుఁడగు నాదివృషభేంద్రుఁడు ఆపైన శిలాదముని తపఃఫలముగా నాతఁడు నందీశ్వరుఁడై జన్మమెత్తి ద్వితీయ శంభుఁడని కీర్తిఁ గాంచెను నందీశ్వరుఁడే శైవమతోద్ధరణార్థము బసవేశ్వరాఖ్యతో మఱల భువియం దవతరించెను దినికి సూత్రధారుడగు బసవేశ్వరుడు ఇంతకంటె పురాణమున కుదాత్తాంచ మేమి కావలయును? సృష్ట్యారంభాఖ్యసర్గాది కథన మార్షపురాణారంభమై యుండఁగా నాచార్య పూర్వావతార కథాకధన మీ పురాణ ప్రస్తావనమై పరిఢవిల్లినది

బసవేశ్వర పూర్వజన్మాది కధనముపై జైనపురాణములందలి భవావళి ప్రభావము ప్రస్ఫుటముగాఁ గనవచ్చుచున్నది కాని భవావళిలోఁ జెప్పఁబడిన జన్మక్రమము వేఱు బసవపురాణకర్త చెప్పిన విధము వేఱు అది మతసిద్ధాంత భేదమువలన నేర్పడిన మార్పు తీర్థంకరులు పశుమానవస్థితులనుండి దేవస్థితి కారోహణక్రమమున గమించి సిద్ధులైనట్లు జైనపురాణములు వర్ణించెను బసవేశ్వరుఁడు ఆదివృషభరూప దేవస్థితినుండి కారణజన్ముఁడైన మానవుఁడుగా నవతరించినట్లు బసవపురాణమున నిరూపింపఁబడెను ఇచ్చట నొక విషయము స్పష్టముగా నెఱుఁగవలెను అవతారకథావర్ణనము మహాపురాణసంప్రదాయము నకుఁ జెందిన శైవ వైష్ణవ పురాణములందుఁ గానఁబడినను అవి సర్గారంభములు కావున బసవపురాణారంభమందలి యవతారకథాకథన మాసంప్రదాయమునకుఁ జెందినది కాదు కావున జైనుల భవావళిని స్వీయమతానుసారముగా మార్చుకొని వీరశైవపురాణారంభమున సోమనాథుఁడు నిలుపుకొనినాఁడు

వీరశైవులకుఁ బ్రత్యక్షప్రత్యర్థులు జైనులు జనాదరణ పాత్రము లైన జైనపురాణ నిర్మాణ శిల్పలక్షణముల నెఱింగి సోమనాథుఁడు ప్రథమవీరశైవ పురాణమును నిర్మించి ప్రజాహృదయమును జూఱగొన యత్నించినాఁ డనుటలో నాశ్చర్యము లేదు అతఁడు భవావళితోనే ఆగిపోలేదు తదితర లక్షణములను గూడ తన పురాణమునఁ బరోక్షముగాఁ బాటించినాఁడు వానిని గొంత పరి శీలింతము

జైనపురాణప్రధానవస్తువులైన తీర్థంకరచరిత్రలలోఁ బంచకల్యాణములు (లేక పంచమహోత్సవములు) విపులముగా వర్ణింపఁబడినవని గమనించితిమి. బసవపురాణమునందును బసవేశ్వరుని చరిత్రమున వాని ప్రతిబింబములు స్పష్టముగాఁ గానవచ్చుచున్నవి. మాదాంబాగర్భసంజాతునిగా బసవేశ్వరుని జన్మవృత్తాంతము వర్ణించునెడ గర్భావతరణకల్యాణకథాసాదృశ్యము స్పష్టమగుచున్నది. జైనుల జన్మాభిషేక కల్యాణమున నింద్రాదులు శిశువునకు క్షీరాభిషేకాదులు చేయుట వర్ణింపఁబడఁగా బసవనిజన్మాభిషేకోత్సవము మఱియొక విధముగా సాగినది. ఇచ్చట బసవేశ్వరజననశుభవేళ సంగమేశ్వరుఁడు ప్రత్యక్షమై, "ఈ భవమున కేన చూ గురుఁడ''నని చెప్పి, లోకహితార్థమైన యాతని యవతారవిశేషము నుగ్గడించుటయు, నాపై తల్లిదండ్రులు జంగమపాదతీర్థముచే నాబాలుని మేను గడిగి, విబూదిపూఁతలు పూయుటయు మొదలగునవి జన్మాభిషేకోత్సవములు. జైనులకు క్షీరాభిషేక మెంతపవిత్రమో వీరశైవులకు జంగమపాదతీర్థసేచన మంతపవిత్రము. ఇఁక జైనపురాణములందలి పరినిష్క్రాంతికి బదులు బసవేశ్వరుఁ డుపనయనము మాని వీరమాహేశ్వరవ్రతదీక్ష వహించుట వర్ణింపఁబడినది. కైవల్యబోధోత్సవమునకు బదులు సంగమేశ్వరుఁడు బసవేశ్వరున కొనర్చిన ప్రబోధకథాఘట్టము నిర్వహింపఁబడినది. పరినిర్వాణ మహోత్సవస్థానమున బసవని జ్ఞానబోధలు, లింగైక్యము వర్ణింపఁబడినవి. ఇవి యిట్లుండగా శైవమతసంబంధములైన పంచాచారములును, అష్టావరణాదులును బసవేశ్వర జీవిత వృత్తాంతమునఁ బ్రతిబింబించునట్లు సోమనాథుఁడు కథాకల్పనలు గావించెను. ఇట్లు తీర్థంకరజీవితకథాకథనమునందలి జైనపురాణలక్షణములను స్థూలముగా గ్రహించి, ప్రజాదరణసంపాదనార్థము వీరశైవప్రథమపురాణమునందుఁ బ్రవేశపెట్టినను, బసవేశ్వర చరిత్రమును పాల్కురికి సోమనాథుఁడు స్వతంత్ర ప్రతిభతోఁ దీర్చిదిద్ది తన వ్యక్తిత్వమును ప్రదర్శించెను.

బసవపురాణమున శివభక్తులకథలు పెక్కు వర్ణింపఁబడినవి. ఆ భక్తులలో బసవేశ్వరునకు సమకాలీనులైనవా రున్నారు. వారిలో అల్లమప్రభువు, ముగ్ధసంగయ్య, మడివాలు మాచయ్య, సిద్ధ రామయ్య, సకలేశ్వర మాదిరాజయ్య, కిన్నర బ్రహ్మయ్య, కన్నడ బ్రహ్మయ్య, కలకేత బ్రహ్మయ్య, మోళిగ మారయ్య, మసిడి చౌడయ్య, సురియ చౌడయ్య, తెలుగు జొమ్మయ్య, ఏకాంత రామయ్య, షోడ్డలదేవు బాచయ్య, సివ నాగుమయ్య మొదలగువారు ముఖ్యులు. వీరుకాక పురాతన భక్తులు పెక్కు రీపురాణమున కెక్కి యున్నారు. వారిలో

చాలమంది ద్రవిడదేశమున నయనార్లుగాఁ బ్రసిద్ధి చెందియున్న 'అఱువత్తు మూవుర్'లోనివారే. వారి చరిత్రలు తమిళమున పెరియపురాణమునందే కాక కన్నడమున హరీశ్వరుని శివగణదరగళె యను గ్రంథమునందును గాననగుచున్నవి. వానిని సోమనాథుఁడు యథావకాశముగాఁ దన పురాణమునఁ బొందుపఱచెను. అయినను సోమనాథుఁడు చిత్రించిన భక్తకథ లొకమూలమునకుఁ గట్టుబడినవి కావు; స్వతంత్రకల్పనామహనీయములు.[1]

జైనపురాణములందు ప్రధానకథలో త్రిషష్టిశలాకమహాపురుషుల చరిత్రములు యథావకాశముగాఁ, బొందుపఱచుట యొకప్రధానలక్షణము. జైనులకు వలె శైవుల కఱువదిమూవురు నయనార్లు కలరు. ఇచ్చట వీరిరువురికి సంఖ్యాసామ్య ముండుట గమనింపఁదగిన యంశము. ఈ సామ్యమును గమనించియే కాఁబోలు సోమనాథుఁడు జైనపురాణ సంప్రదాయమునకుఁ బ్రతిగా నఱువత్తు మూవురు నయనార్ల కథలను (వారందఱు వీరశైవులు కాకపోయినను) గ్రహించి దేశియ మైన సంప్రదాయముతోపాటు శివభక్తాభీష్టమును గూడ పాటించె నని తలంప వీలగుచున్నది.

సమకాలీన భక్తుల చరిత్రములు బసవనితో ముడిపడియున్నను, పురాతన భక్త చరిత్రములు తత్కథా సందర్భములందు దృష్టాంత రూపములుగాఁ జెప్పఁబడినట్లు కూర్చుట సోమనాథుని కథాసంవిధాన నైపుణ్యము. పురాతనభక్తులలో ముగ్ధభక్తులు కొందరు కలరు. ''నిక్క మీశ్వరుఁ గాని నిజ మెఱుంగమిని, ముక్కంటి భక్తులు ముగ్ధలుగారె?" అని బసవేశ్వరుఁడు ముగ్ధభక్తుల స్వభావమును బేర్కొనినాఁడు. వీ రన్యభక్తులవలె వీరమాహేశ్వర వ్రతపారీణులై యున్నను అధికముగా నమాయకులు, నిరాడంబరులు, స్నిగ్ధ ప్రవృత్తి కలవారు. స్వచ్ఛమైన వాత్సల్యము, పారవశ్యముతోఁ గూడిన భక్తిభావము, వెన్నవంటి హృదయమును, శివునిఁ గాంచినంతనే ఆప్తుని వలె, మిత్రునివలె, పుత్రునివలె భావించి ముగ్ధభావముతోఁ గీర్తించి, సేవించి లాలించెడి స్నేహభావము వారికి వెన్నతోఁ బెట్టిన సుగుణజాలము. వీరు శివుని కొఱకై ప్రాణములనైనను త్యజింప సిద్ధమై త్యాగోత్సాహముతో భక్తివీరులై యొప్పువారు. రుద్రపశుపతి, నక్కనైనారు, బెజ్జమహాదేవి, గొడగూచి, దీపదకళియారు, నాట్యన

1. బసవపురాణ పీఠిక - కర్త : శ్రీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. (ఆంధ్ర గ్రంథమాల) పుట 29.

మిత్తండి, ఉడుమూరు కన్నప్ప, కళియంబ నయనారు, సకలేశ్వర మాదిరాజయ, ముగ్ధ సంగయ్య మొదలగు ముగ్ధభక్తుల చరిత్రము లీపురాణ తృతీయాశ్వాస మున వర్ణింపఁబడియున్నవి.

వీరశైవము భక్తి ప్రధానమైన మతము. ఆ భక్తి అవేశప్రధానమై సాహ సోపేతములైన యద్భుత కార్యములచేఁ బ్రపంచిత మగుచుండును. వీరశైవు లందు స్వీయమతాభినివేశ మెంత యుండునో పరమత ద్వేషమంత కానవచ్చును. వీర మాహేశ్వరవ్రతుఁడైన జంగముఁ డేకులమునకు, ఏ వృత్తికిఁ జెందినవాఁడై నను శివునివలెఁ బూజనీయుఁడే; సహపంక్తి భోజనాదుల కర్హుఁడే. ఇట్టి భక్తి సంప్రదాయము వీరశైవమత ప్రత్యేకతను వ్యక్తీకరించుచున్నది. సోమనాథుఁడు వీరశైవమత స్వభావములను స్పష్టపఱచునట్టి విధముగా భక్తకథాసంవిధానమును బసవపురాణమున నిర్వహించెను. బసవపురాణపాత్ర లందఱిలో సాత్త్వికుఁడుగా, ఆత్యుత్తముఁడుగా మహామహిమాన్వితుఁడుగా బసవేశ్వరుఁడు కానవచ్చుచున్నాఁడు. బసవేశ్వరుఁడు జంగమారాధన మొనర్చు వీరమాహేశ్వరవ్రతాచార్యుఁ డయ్యును అవతారపురుషుఁ డనియు, శివునకును బసవనికిని భేదము లేదనియు నిరూపిం చుట యీ పురాణ తాత్పర్యము. శివభక్తి యన్నను, బసవభక్తి యన్నను భేదము లేదు. పరమశివుఁడే "తప్ప దే నతఁ డని తర్కించి చూడ!" అని పలికి యున్నాఁడు. శివుఁ డవ్యక్తలింగము, బసవఁడు సాకారలింగము. ఇట్లు బసవని శివునితో నభేద మొనర్చుటకై యీ పురాణము పుట్టినది. సాకారలింగరూపుఁ డైన బసవేశ్వరుఁడు వీరశైవులకు పరమ ప్రామాణికుఁడు. వారి పురాణమున కతఁడే నాయకుఁడు. అతనియందు భక్త్యావేశము పరాకాష్ఠ నొందినట్లు సోమ నాథుఁడు చిత్రించెను.

"పడిఁ బారుజలమున కొఁడలెల్ల కాళ్ళు
పడిఁ గాలు చిచ్చున కొడలెల్ల నోళ్ళు
పడి వీచు గాడ్పున కొడలెల్లఁ దలలు
పడి చేయు బసవన కొడలెల్ల భక్తి."

ఇట్టి నాయకుని వీరశైవభక్తి చరిత్రము వర్ణింపఁబడిన పురాణము 'భక్తివీర' రస ప్రధాన మనఁదగియున్నది.[1] తద్రసపుష్టి సర్వాంగసుందరముగా నిర్వహింపఁ బడునట్లు సోమనాథుఁడు కథలను తీర్చిదిద్దెను.

1. వివరములకు చూడు: వీర రసము - జి. వి. సుబ్రహ్మణ్యం. పుట 253.

మతమునకు విశ్వాస మాధారము; శక్తి భక్తి. విశ్వాసము వీరశైవభక్తుల యద్భుతమహిమలవలనను వారు సాధించిన మతవాదవిజయములవలనను పఠిత చిత్తమునం దేర్పడును. శివభక్తుల శివారాధన విధాన విశేషములవలనఁ బఠితకు భక్తి స్ఫురించును. అందును ముగ్ధభక్తుల చరిత్రములు హృదయవాదులను, వీర భక్తులచరిత్రలు బుద్ధివాదులను అధికముగా నాకర్షింపఁగలుగును. సోమనాథుఁడు బసవపురాణమున బసవనియుదాత్తచరిత్రము ముందుగాఁ గొంత వర్ణించి, యతని యందు ప్రామాణ్యబుద్ధిని బఠితకుఁ గల్పించి, ముగ్ధభక్తులచరిత్రలచేఁ బఠిత హృదయము నార్ద్రపఱచి భక్తిబీజములు నాటి, మడివాలు మాచయ్యవంటి వీర భక్తులకథలు చెప్పి శివభక్తి సిద్ధివలన గలిగెడు మహిమలను గీర్తించి, యహంకార విరహితమైన భక్తిప్రపత్తిని పోషింపఁగలుగు దృష్టాంత రూప భక్త కథలను జెప్పియు, కిన్నర బ్రహ్మయ్యవంటి భక్తులకు శివునిఁ బలికించు మహిమలు గల వనియు, ముసిడి చౌడయ్యవంటి భక్తులు ప్రాణప్రదాన సమర్థు లనియు, ఏకాంత రామయ్యవంటి భక్తులు జైనాదులగు పరమతస్థులను స్వీయ మహిమలచే నిగ్రహింపఁగలుగుదు రనియుఁ దెల్పెను; షోడ్డలదేవు బాచయ్య కథవలన పరమత ఖండన, శైవమత సంస్థాపనల కవసరమైన పరిజ్ఞానమును, శివనాగుమయ్య కథ వలన శివభక్తి సిద్ధి కంత్యజులైన నర్హులగుదు రనియు నిరూపించెను. భక్తి యుక్తములైన చిత్తములందే విశ్వాసము నిశ్చలమై నిలుచును. నిశ్చలమైన విశ్వాసము భక్తిని ప్రదీప్త మొనర్చును. కావున పరస్పర పోషకములైన భక్తి విశ్వాసములను సోమనాథుఁడు క్రమవికాసరమణీయముగా పురాణమునఁ బొందు పఱచెను.

బసవపురాణమున నాయకుఁడు బసవేశ్వరుఁ డైనచోఁ బ్రతినాయకుఁడు బిజ్జలుఁ డగును. బిజ్జలుఁ డొక వింతప్రకృతి కలవాఁడు బసవనివెలుఁగుక్రింది క్రీనీడవంటివాఁ డాతఁడు. వీరమాహేశ్వరాచారుల మహిమలు చెవులార వినుచు, కన్నులారఁ గాంచుచు, బసవనిఁ బూజించుచు, తన్మతమును గౌరవించుచు నాతఁడు మాత్రము వీరశైవుఁడు కాలేదు. అనుటకుఁ దగిన మౌలికమైన గుణము-విశ్వాస మతనికి లేదు. దానివలన భక్తి జనింపలేదు. లేనిచో విస మారగించి యపరగరళ కంఠునివలె నొప్పారిన బసవనియొక్క చరితము ప్రత్యక్షముగఁ జూచిన తర్వు వాతఁగూడ వీరశైవులకు నిష్కారణహాని తలపెట్టఁగల్గునా? మహారాజైనను, మహాభక్తునిఁ దన కొలువున బండారిగా నియమించుకొన్న పుణ్యాత్ముఁ డయ్యును,

అతఁడు భక్తిబీజములు మొలకెత్తఁజాలని శుష్కకఠినహృదయక్షేత్రము కలవాఁడు. అతనికిఁ గలిగిన కావ్యాంతమరణము సార్థకమే. శివాపరాధమునకు వీరశైవమున మరణమే దండనము కదా! మతపురాణమున మతమూలప్రకృతులైన భక్తివిశ్వాసములు లేని కఠినునిఁ బ్రతినాయకునిగాఁ జిత్రించుట సోమనాథుని కథానిర్మాణరహస్యము.

బసవపురాణమున బిజ్జలసంహారఘట్టము చిత్రముగాఁ దీర్పఁబడినది. శివభక్తుల కపచారము గావించిన బిజ్జలుని శపించి కల్యాణకటకమును వీడి బసవేశ్వరుఁడు సంగమక్షేత్రము చేరుకొనెను. జగదేవదండనాయకు నదివఱకే బిజ్జల సంహారార్థము బసవేశ్వరుఁడు నిర్దేశించియుండెను. అతఁ డాపని చేసి బాసను గాపాడుకొనెను. శాపానుగ్రహశక్తియుక్తుఁడును, ప్రాణప్రదానోపసంహరణ సమర్థుఁడునైన బసవఁడే బిజ్జలునిఁ జంపి, వీరశైవధర్మమును గాపాడుకొని యుండవచ్చును కదా! సోమనాథు డట్లేల కల్పింపలేదు? దీనికి సమాధానము, చరిత్ర అడ్డము వచ్చెనని యైనను జెప్పవలెను: లేక కవి బసవని యుదాత్తచరిత్రము నౌచిత్యసంభరితము చేయనెంచె నని యైనను తలంపవలెను. లేనిచో కథ నిట్లు చిత్రించుటలో జైనపురాణ ప్రభావ మున్న దని యూహింపవలెను. మునిసువ్రతుఁడను నిరువదియవ తీర్థంకరుని చరిత్రమున బలదేవుఁ డగు రామచంద్రుఁడును, వాసుదేవుఁ డగు లక్ష్మణుఁడు నన్నదమ్ములైనట్లును, ప్రతివాసుదేవుఁడు రావణుఁడై నట్లును జెప్పఁబడి యున్నను, రామచంద్రుఁ డాసన్నభవ్యుఁ డగుటచే రావణసంహారము చేయ నొల్లక దూరభవ్యుఁడైన లక్ష్మణునిచే తత్సంహారము నిర్వహింపఁ జేసె ననియుఁ గల్పింపఁబడినది. జైనులలో దూరభవ్యులకంటె నాసన్నభవ్యులు కర్మబంధవిముక్తి నధికముగా సాధించి కేవలజ్ఞానసిద్ధి కతిసన్నిహితులై యున్నవారుగాఁ బరిగణింపఁ బడుదురు. కావున నట్టి పాత్రముల కెట్టి హింసాకాండయు నంటఁగట్టరు. ఇట్టి జైనపురాణకథాపాత్రసంవిధాన సంస్కారమును సోమనాథుఁడు గ్రహించి లింగైక్యము నొందఁబోవుచున్న బసవనిచే బిజ్జలునిసంహారము గావింపఁజేయక, వైదికకర్మాసక్తి కలిగియు బసవనిఁ బూజించిన జగదేవదండనాయకుని ద్వారమున దానిని నిర్వహింపఁజేసి బసవని విశుద్ధ సాత్త్వికశీలసంపదను బరిపోషించెను.

కర్ణాటాంధ్రములయందు జైనపురాణములు వైదికపురాణముల కెదురు నిలిచి ప్రజాదరణఁ బొందుటకు యత్నించినవి. కొంతకాల మాపురాణములు ప్రజల హృదయసీమలపై రాజ్యము చేసినవి. వానిపైఁ బోటీపడి అనాదరణము

నొందుటకై వీరశైవులు ప్రథమపురాణనిర్మాణయత్నము గావించిరి. సోమనాథునిపై నాభార ముంచిరి. అతఁడు జైనపురాణనిర్మాణములోని లోగుట్టులు తెలిసి వానినిఁ బ్రచ్ఛన్నముగఁ గొల్లగొట్టి వీరశైవపురాణము ప్రజల నాకట్టుకొనఁ గలుగునట్లు నిర్మించెను. ఇట్లనుటచే జైనపురాణలక్షణము లన్నింటిని సోమనాథుఁ డనుకరించెనని తాత్పర్యము కాదు. తనగ్రంథప్రణాళిక కొదిగినంతవఱకు వానిని నిపుణముగా గ్రహించి స్వీయప్రతిభతో స్వతంత్రపురాణ రచనా విధానము నాతఁ దేర్పఱచుకొనెను.

బసవపురాణము పుట్టుటతో నాంధ్రమున నార్షపురాణరచనాసంప్రదాయ మంతరించుచున్న దనియే కాఁబోలు తిక్కనసోమయాజి శిష్యుఁడైన మారన యోరుగల్లులోనే మఱల మహాపురాణ రచనోద్యమము నారంభించెను. ఆపైన పోతన భాగవతమహాపురాణమును తెలుగున వినిర్మించెను. ఇట్లు తెలుఁగున మహాపురాణసంప్రదాయమునకుఁ జెందిన మార్కండేయాదిపురాణముల ఆవిర్భావములకు దేశిపురాణమైన బసవపురాణము ప్రబలహేతు వైనది. సోమనాథుని పుణ్యమా యని దేశి మార్గసంప్రదాయములలోఁ బుట్టిన యాంధ్రపురాణ తరంగిణుల కోరుగల్లు సంగమతీర్థమై తారసిల్లినది. (1969)

# ప్రబంధ పరమేశ్వరుని ప్రక్రియా ప్రస్థానం

ఒక మహాకవి ఒక విశిష్ట సాహిత్య ప్రక్రియను అపూర్వంగా పోషించిన తరువాత మరొక కవి ఎంతవాడైనా సరే అదే ప్రక్రియను చేపట్టి అంతకంటె గొప్పగా నిర్వహించటం అసంభవం. అందువలన ప్రక్రియను మార్చి ప్రతిభను ప్రదర్శించటానికో, మిశ్రప్రయోగాన్ని చేసి మన్నన గడించటానికో పూను కొంటాడు. నన్నయ తిక్కనలు కావ్యేతిహాసప్రక్రియను సమున్నతంగా పరి పోషించిన తరువాత తెలుగు కవులకు ఆ ప్రక్రియను చేపట్టటం అసాధ్యమై పోయింది. తిక్కన శిష్యుడు మారన ఇతిహాసం జోలికి పోకుండా మహాపురా ణాన్ని ఎత్తుకొని మరొక మార్గానికి మహారంభం చేశాడు. భాస్కరాదులు, గోన బుద్ధారెడ్డి ప్రభృతులు రామాయణాన్ని చేపట్టి చంపూ ద్విపద కావ్యాలుగా సంతరించారు. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశాన్ని, నృసింహపురాణాన్ని రచించి తన ప్రత్యేకతను ప్రకటించుకొన్నాడు. ఆ తరువాత నాచన సోముడు ఉత్తర హరి వంశాన్ని ఉజ్జ్వలంగా సంవిధానం చేశాడు. వీరిలో తిక్కన మహాభారత రచనకు ఏదోవిధంగా సంబంధం కల్పించుకొని తమ కృతులను నిర్మించినవారు మారన, ఎఱ్ఱన, నాచన సోముడు. వీరిలో నన్నయ తిక్కనల బాటలో కొంత నడిచినవాడు, వారి పక్కన నిల్వదగినవాడు ఎఱ్ఱన. దానికి అతని యోగ్యత ఎంత కారణమో అతడు నిర్వహించిన ప్రక్రియలు అంత కారణం.

ఎఱ్ఱన కృతులు లెక్కకు నాలుగు. 1. రామాయణము, 2. హరివంశము, 3. అరణ్య పర్వశేషము, 4. నృసింహపురాణము. వీటిలో అరణ్యపర్వశేషము కావ్యేతిహాస ప్రక్రియాంతర్గత భాగం. దానిని నిర్వహించటంలో నన్నయ రచనాశక్తిని ఆవహింపచేసికొనటంతోనూ, తిక్కన పలుకుబడిని రంగరించు కొనటంతోనూ ఎఱ్ఱన కవిత్రయంలో ఒకడుగా మాన్యత గడించుకొన్నాడు. మొదటి కృతి రామాయణం వాల్మీకాన్ని అనుసరించి రచించినా - అది నేడు లభ్యం కాకపోవటంతో దాని ప్రక్రియా స్వరూపాన్ని ఇదమిత్థంగా నిర్ణయించలేక

పోతున్నాం. ఎఱ్ఱన రామాయణంలోని పద్యాలుగా చెప్పబడుతున్న వాటిని గమనిస్తే ఆయన సత్కవి కావచ్చునేమో కాని, మహాకవి కావటం కష్టం. అందువలననే భాస్కర రామాయణం ముందు ఎఱ్ఱన రామాయణం సాహితీ రంగంలో నిలవలేక తెరమరుగై పోయి ఉండవచ్చు నని విమర్శకులు భావించటం. ఎఱ్ఱనకు కీర్తి తెచ్చినవి మూడు కృతులు. వాటిలో రెండు ఆయన పేరుతో నిండుగా ఉన్నవి.

ప్రక్రియాపరంగా ఎఱ్ఱన రచనలను గురించి చర్చించవలసిన అంశా లింకా ఎన్నో ఉన్నాయి. అందులో ఒకటి—

ఎఱ్ఱన హరివంశం ఏ ప్రక్రియలో రచించాడు?

ఈ ప్రశ్నకు సాహిత్యచరిత్రలలో సూటి జవాబు దొరకదు. అందువలన ఎఱ్ఱన ప్రక్రియాపరంగా చేసిన ప్రయోగాన్ని గురించిన అధ్యయనం అవధానంతో జరుగలేదనే చెప్పాలి. సంస్కృత హరివంశం మహాభారత ఖిలభాగమైనా దానిని ప్రత్యేకంగా పురాణంగానూ, ఇతిహాసంగానూ అనుశీలించే విమర్శలు సంస్కృతంలోనూ, ఇంగ్లీషులోనూ వెలువడి ఉన్నాయి. తెలుగు హరివంశాల ప్రక్రియా ప్రయోగ వివేచనం తెలుగులో మృగ్యం కావటం విచారింపదగిన అంశం.

కాగా, పురిపండా అప్పలస్వామిగారు హరివంశము (సంక్షేపప్రతి) పూర్వ భాగానికి (ఆం. ప్ర. సాహిత్య అకాడమీ 1968) పీఠిక వ్రాస్తూ "మహాభారతం ఇతిహాసం, పురాణం కూడా. హరివంశం ఇతిహాసం కాదు, పురాణం" అనే వింటర్‌నిట్జ్ అభిప్రాయంతో ఏకీభవించారు. మహాభారతానికి హరివంశం ఖిలభాగం కాదనీ, కృష్ణభక్తు లెవరో రచించి దానికి అతుకుపెట్టి ఉంటారనీ విశ్వసించారు. దానికి ఉపబలకంగా బాంగ్లా గద్యలో మహాభారతాన్ని అనువదించిన కాళీ ప్రసన్న సింహ (1840 - 1890) గారి అభిప్రాయాన్ని ఉట్టంకించారు. అయినా, ఎఱ్ఱయ మాత్రం "భారతపరాంశముని యింపారగఁ జెప్పుదురు బుధులు హరివంశము" నని నమ్మినవాడు. మరి ఎఱ్ఱయ గారి హరివంశం పురాణమా? కాదా? అనే అంశాన్ని అప్పలస్వామిగారు వివరించలేదు. అనువాదం స్వతంత్రంగా ఉన్నదన్నారే కాని ప్రక్రియాపరమైన చర్చ జోలికి పోలేదు. "నిజంచెప్పాలంటే ఇది అనువాదం కాదు; అనుసరణ. 'తెనుంగుగ నిర్వహించటం' అంటే ఇదే కవి అభిప్రాయం.... హరివంశం అనువాదంలో అతడు మూలంలోంచి కొంత

కొంత విడిచిపెట్టాడు లేంది కొంత చేర్చాడు చిన్న చిన్న మార్పులున్నా చేసి కావ్యానికి తెలుగుదనం తీర్చిదిద్దాడు - అని పేర్కొన్నారు నన్నయ తిక్కన ల్లాగా ఎఱ్ఱన సంస్కృత కృతి యొక్క ప్రక్రియా స్వభావాన్ని తెలుగులో మార్చాడా లేదా అన్న విషయం స్పష్టం చెయలేదు ఆ లెక్కకు వస్తే అప్పల స్వామి గారికి భారతం ఇతిహాసమూ పురాణమూ కూడా హరివంశం పురాణం కాదనే విమర్శను ఆయన అంతగా పట్టించుకోలేదు సంస్కృత హరివంశంలా ఎఱ్ఱన హరివంశం కూడా పురాణమని నిర్ధారించలేదు అందువలన పురాణపండ వారి పురాణవాదం పునాది లేనిది

తెలుగులోని హరివంశాలమీద పరిశోధనచేసిన డా శ్రీమతి పి యశోదా రెడ్డి గారు ప్రక్రియాపరంగా వివిధ విమర్శకులు చేసిన చర్చలను క్రోడీకరించి తమ నిశ్చయాన్ని యిలా చెప్పారు- పురాణశబ్ద మక్కడక్కడ భారతమునకు ప్రయుక్త మైనప్పటికి ప్రధానముగ నది యెట్లు ఇతిహాస శాఖకుఁ జెందిన గ్రంథమో అవిధముగానే మహాభారతమునకు ఖిల పర్వముగ నెంచబడుచున్న హరివంశమును గూడ ప్రధానముగ నితిహాస మనియే చెప్పవచ్చును (తెలుగులో హరి వంశములు (1973) పు 18 )

స్థూల దృష్టికి భారతమూ ఇతిహాసమే హరివంశమూ ఇతిహాసమే పురాణ భాగమైన వంశానుచరితానికి ప్రాముఖ్యం కలిగించి అందులో ధర్మసాధకుడైన సూర్యవంశ చక్రవర్తియో చంద్రవంశ చక్రవర్తియో ఒకని చరిత్రను విస్తృతంగా - పురుషార్థ సాధనాత్మకమైన సమగ్రజీవితస్ఫూర్తితో - రచించిన దానిని ఇతిహాసం అని వ్యవహరించటం సాహిత్య మర్యాద అందువలననే - భారతంలో సర్గాది విషయాలు సంగ్రహంగా ఉన్నా చంద్రవంశ ప్రసిద్ధ చక్రవర్తులకథలు మొదట చెప్పబడినా ఆదిపర్వంలోనే మొదలైన పాండవుల చరిత్ర స్వర్గారోహణ పర్వందాకా సాంగంగా సాగుతుంది కాబట్టి అది ఇతిహాస మనబడింది ధర్మరాజు అందులో నాయకుడు అతడు ధర్మసాధకుడు సాధకుడైన నాయకుని జీవిత వృత్తం ఇతిహాసంలో నిబంధింపబడితే అది కావ్యస్ఫూర్తితో శోభించి కావ్యేతిహాసంగా రూపొందే వీలుంది ఆంధ్రమహాభారతం నన్నయ తిక్కనల చేతుల్లో అలా రూపొందిందే అంటే-కావ్యస్వభావంగల ఇతిహాసం ఆంధ్ర మహాభారతం

కాగా వంశానుచరితంలో ప్రధానపాత్ర - లేదా - నాయకుడు సాధకుడు కాకుండా సిద్ధుడో అవతార పురుషుడో దివ్యుడో దివ్యాదివ్యుడో అయితే ఆ

ఇతిహాసంలో కావ్యత్వస్ఫూర్తికంటె పురాణ కథాచ్ఛాయ లెక్కువగా గోచరించే అవకాశం ఉన్నది. మహాభారతంలోకంటె హరివంశంలో ఉన్న విశేషం ఇదే. హరివంశనాయకుడు శ్రీకృష్ణుడు. అతడే హరి. ఎఱ్ఱన మూలంలోని పర్వత్రయ విభాగాన్ని పాటించకుండా హరివంశాన్ని పూర్వోత్తర భాగాలుగా విభజించాడు. పూర్వభాగంలోని మొదటి నాల్గాశ్వాసాలలో సంగ్రహంగా ప్రపంచసృష్టిని, చంద్రాది రాజవంశానుచరితాలనూ వర్ణించాడు. అయిదవ ఆశ్వాసం నుండి ఉత్తరభాగంలోని ఎనిమిదవ ఆశ్వాసంవరకూ శ్రీకృష్ణజీవితచరిత్రను వివరించాడు భవిష్య పర్వార్థాలను సంగ్రహంగా చివరి రెండాశ్వాసాలలో నిబంధించాడు. మొత్తం 19 ఆశ్వాసాలలో శ్రీకృష్ణచరితం 13 ఆశ్వాసాలు. శ్రీకృష్ణుడు విష్ణువు యొక్క పూర్ణావతారం. దుష్టశిక్షణం, శిష్టరక్షణం ఆయనవ్రతాలు. కథలన్నీ అవతారలీలలే; లీలామానుషచర్యలే, విష్ణుమహత్త్వ వ్యంజకాలే కావటంచేత భగవల్లీలాకథాకావ్యంగా, పురాణగాథాస్రవంతిలా హరివంశం అనుభవానికి అందుతుంది హరివంశం భాగవత దశమస్కంధ పూర్వరూపమా అనిపిస్తుంది. ఈ వస్తుస్వభావ ప్రక్రియలో ఒక విశిష్ట ప్రయోగంగా పఠితల మనసులకు పట్టి యిస్తుంది. కావ్యస్వభావం గల ఇతిహాసం ఆంధ్రమహాభారత మైతే - పురాణ స్వభావం గల ఇతిహాసం ఎఱ్ఱన హరివంశం.

హరివంశ కవితా ప్రాశస్త్యాన్ని ప్రశంసించిన సాహిత్యచరిత్ర కర్తలలో ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారి మాటలు పేర్కొనదగినవి - "ఎఱ్ఱన రచనలలో ఉద్గ్రంథం హరివంశం. హరియొక్క తక్కిన అవతార విశేషాలు క్లుప్తంగా ఉండి, ఇందులో కృష్ణావతార కథాసౌందర్యప్రస్తారమే ఎక్కువగా కనబడు తుంది. పోతరాజు భాగవతమే వ్రాయకుండా ఉంటే ఆ స్థానంలో నిలబడగలి గింది ఒక్క హరివంశమే. జ్ఞానం వెన్నంటగా భక్తిమాధుర్యం వెల్లివిరియించి పోతన భాగవత కథలు చెపితే, ఎఱ్ఱన భక్తిని వెనక ఉంచి జ్ఞానపరిమళంతో సంయమనంతో హరివంశం నిర్వహించాడు''.... "సంస్కృత మూలం ఉన్నా దాని వాసన ఏమీ తగలకుండా తెలుగులో ప్రౌఢసుందరంగా హరివంశ రచన సాగి నన్నయ తిక్కనల తర్వాత ఆ స్థాయిలో మళ్ళా ఒక ఉద్గ్రంథం పుట్టింది అనే అనుభూతి కలుగుతుంది." (ఆరు యుగాల ఆంధ్రకవిత-పు. 167; 163).

ఎఱ్ఱనప్రశంసలకు పాత్రులైన తెలుగు కవులు నన్నయ తిక్కనలు. మఱెవ్వరూ - ఆయన దృష్టికి ఆనలేదు. హరివంశావతారికలో ఎఱ్ఱన వారిద్దరినీ

క్రీరించిన వైఖరిలో కొంత భేదం వున్నది. నన్నయను భద్రజాతి గజంలా రూపించి, అతని 'నిరంకుశోక్తిగతి'ని ప్రస్తుతించాడు. తిక్కనను కవిబ్రహ్మగా భావించి, అతని కవిత 'తన కావించిన సృష్టి తక్కొరులచేతం గాదునాన్" ఒప్పారుతుందని వినుతించాడు. నన్నయ కవితలోని 'నిరంకుశోక్తిగతి' ఎఱ్ఱ యకు నచ్చింది. తానూ నిరంకుశోక్తిగతితో నడవాలని సాహితీ ప్రస్థానం సాగించాడు. ఆ గతిలో నడుస్తూ అందుకోవలసిన గమ్యం "తన కావించిన సృష్టి తక్కొరులచేతం గాదునాన్" రచించే రచన. ఎఱ్ఱయ ప్రస్థానంలో నిరంకుశోక్తి గతికి శ్రీకారం హరివంశం; పరాకాష్ఠ నృసింహపురాణం.

నిరంకుశోక్తిగతి అంటే స్వేచ్ఛాగతి అని అర్థం స్ఫురిస్తుంది. అనగా, తబ్బిబ్బు నడక అని కాదు భావం. ఒకే మూసలో, ఒకే ధోరణిలో, ఒకే శైలిలో రచించేపద్ధతి కాకుండా ప్రక్రియాస్వభావాన్నిబట్టి, పాత్ర ప్రవృత్తినిబట్టి, ప్రకర ణౌచిత్యాన్నిబట్టి రచన చేయగలిగే నైపుణ్యం అని భావం. ఈ పద్ధతిలో ఎఱ్ఱయకు నన్నయ ఆదర్శప్రాయుడైనాడు. అలా కావటం నైజం కూడా. హరివంశం పురాణశైలిలో వ్రాయబడిన ఇతిహాసం. పురాణరచనకు తిక్కనకంటె నన్నయ శైలియే ఉపాదేయ మని మారన మార్కండేయంలో నిరూపించాడు. ఎఱ్ఱన కూడా హరివంశ రచనలో నన్నయ వాక్పాకాన్నే మిన్నగా సాధించాడు. హరి వంశ శైలి అరణ్యపర్వశేషశైలికంటె వన్నెకెక్కింది కాదు; నృసింహపురాణ శైలికంటె ప్రౌఢికెక్కింది కాదు. కాని, ఒడుదుడుకులు లేని ప్రసన్నధారా మధురమైన శైలి. ఎడనెడ కావ్యకళాకాంతులతో జిగేల్‌మనే పద్యరత్నాలు కన బడతాయి; పూర్వాపరఘట్టాలను రక్తి కట్టిస్తుంటాయి. హరివంశకర్తయైన ఎఱ్ఱ నకు నన్నయ వాక్కంటే రక్తి; తిక్కన శిల్పమంటే భక్తి. ఎఱ్ఱయ కవితకు శీలం నన్నయది; శిల్పం తిక్కనది.

కావ్యేతిహాసం నన్నయ తిక్కనలు అపూర్వంగా దిద్ది తీర్చిన ప్రక్రియ. దానిని మించేటట్లు మరొక రచన చేయటం ఎఱ్ఱనకు కూడా అసాధ్యం. కాని, మహాభారతంమీది భక్తి చొప్పున ఖిలభాగమైన హరివంశాన్ని తెలుగుచేసి ఎఱ్ఱన మేలు చేశాడు. హరివంశంలోని సహజ పురాణ స్వభావం ఎఱ్ఱనకు తోడ్పడింది. కావ్యేతిహాసంకంటె [illegible]లక్షణమైనది. 'పురాణేతిహాసం' అనదగింది అయిన ప్రక్రియా ప్రయోగాన్ని ఆయన రూపొందించాడు. దానికి సమకాలీనాంధ్ర సాహిత్య ప్రక్రియలు కూడా తోడ్పడి ఉంటాయి. తిక్కన యుగంలో మహా

పురాణం వెలసింది. మారన దాని కొక కవితాశైలిని ఏర్పరచాడు. ఎఱ్ఱన హరి వంశ వస్తువును ఇతిహాసగతిలో సాగించి, కవితను పురాణశైలిలో నిబంధించాడు. ఆకృతికి ఇతిహాసం; అనుభూతికి పురాణంగా ఎఱ్ఱన చేతిలో హరివంశం రూపొందింది. నన్నయ తిక్కనలకంటె భిన్నమైన కవితాశైలి కావటం చేత, కావ్యేతిహాసంకంటె విలక్షణమైన మిశ్రప్రవృత్తిగల ప్రక్రియ కావటంచేత ఎఱ్ఱన హరివంశానికి ప్రత్యేక గౌరవం ఏర్పడింది.

హరివంశంలో పురాణ కవితను సారించి ఎఱ్ఱన అరణ్యపర్వ శేష రచనలో కావ్యరచనా స్పృహను ప్రదర్శించాడు. కావ్యేతిహాస నిర్మాణానికి అనువైన నన్నయ వాక్పాకాన్నీ, తిక్కన వర్ణనాత్మక ఫణితినీ జోడించాడు. అప్పటికే ఎఱ్ఱనకు నన్నయలాగా కవిత్వం వ్రాయగలడనే ప్రశస్తి ఉంది. హరివంశం వలన ఆ కీర్తి వచ్చి ఉంటుంది. ఆ ధైర్యంతో నన్నయ రచనగానే అరణ్యపర్వశేషాన్ని పూరించాడు ఎఱ్ఱన. అందులో పరార్థంతోపాటు స్వార్థం కూడా లేకపోలేదు. నృసింహపురాణావతారికలో ఇలా చెప్పుకొన్నాడుకూడా:

"మించినవేడ్క వీనులకు మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ రా
యంచలుగూయ, క్రౌంచమును నావలఁ గూయఁగడంగుభంగిఁ బ్రౌ
ఢాంచితశబ్దసారులు మహాకవు లాద్యులు కావ్యశయ్యఁ గీ
లించిన కీర్తి సంగసుఖ లీలకు నేనును గాంక్షఁ జేసితిన్."

సౌభాగ్యత కలిగియుండే కోరాడు; కవిత్రయంలో ఒకడుగా నిలిచాడు.

ప్రక్రియకు తగిన కవితాశైలిని సంతరించుకోవటం ఎఱ్ఱయకు ఉగ్గుతో పెట్టిన విద్య. పూర్వ కవులు ప్రయోగించిన ప్రక్రియలకంటె విశిష్టమైన ప్రయోగాన్ని వినిర్మించుకోవటం ఎఱ్ఱయగారి ప్రజ్ఞ. అందువలన కృతి కొకరీతిగా ఎఱ్ఱయ కవిత ప్రత్యక్షమౌతుంది. హరివంశ రచనకంటె అరణ్యపర్వ రచన భిన్న; దానికంటె నృసింహ పురాణ రచన భిన్న. ఒకటి కథాకథన ప్రధానమైన పురాణశైలి; మరొకటి కథావర్ణనల మేలికలయిక గల కావ్యశైలి; చివరిది ప్రౌఢవర్ణనా ప్రధానమైన ప్రబంధశైలి

అనుకర్తలుగా సాహిత్య జీవితాన్ని ప్రారంభించి యుగకర్తలుగా పరిణతి చెందిన మహాకవులు ముఖ్యంగా ముగ్గురు కనపడతారు ఆంధ్ర సాహిత్య చరిత్రలో. మొదటివాడు ఎఱ్ఱాప్రెగడ, రెండవవాడు రామరాజ భూషణుడు, మూడవవాడు శ్రీశ్రీ. వీరు ముగ్గురూ మొదట పూర్వకవుల ప్రభావంతో

మునిగినవారే. కానీ, క్రమంగా ఆ ప్రభావం నుండి వెలికివచ్చి స్వతంత్ర మార్గాన్ని నిర్మించుకొన్నవారే. శ్రీశ్రీ భావకవిత్వ ప్రభావంతో 'ప్రభవ' ప్రకటించాడు. ఆ తరువాత తన మహాప్రస్థానంతో అభ్యుదయ కవితాయుగకర్త అయినాడు. రామరాజ భూషణుడు పింగళి సూరన ప్రభావంలో మునిగి ద్వ్యర్థి కావ్యరచనం చేశాడు. ఆ తరువాత వసుచరిత్ర రచించి శ్లేషకవితా చక్రవర్తి అయి, పిల్లవసుచరిత్రలకు మార్గదర్శి అయినాడు. ఎఱ్ఱన - నన్నయతిక్కనల ప్రభావంలో ఉన్నప్పుడే హరివంశ, అరణ్యపర్వశేషాలు రచించాడు. ఆ తరువాత నృసింహపురాణ రచనలో వారిరువురికంటె విలక్షణమైన కవితాశైలితో సాహిత్య క్షేత్రంలో నిలువబడ్డాడు. విచిత్ర మేమంటే, ఎఱ్ఱయగారి హరివంశ రచననూ, నృసింహ పురాణ రచననూ అనుసరించే కవులు తరువాతి కాలంలో బహుళంగా కనపడతారు.

తిక్కన తరువాత క్రొత్తబాట నిర్మించటం తేలికైనపని కాదు. ఎఱ్ఱన ఆ పని చేశాడు. వినయంతో వివేకాన్ని ప్రకటించాడు; వివేకంతో వ్యక్తిత్వాన్ని ప్రదర్శించాడు; పట్టిన ప్రక్రియను బంగారం చేశాడు; ముందుబాట చూపించి యుగకర్త అయినాడు.

## 2

ఎఱ్ఱనయుగం బిరుదాలకూ, ప్రయోగాలకూ, కవితా స్పృహకూ, నవ్య చైతన్యానికీ ఎన్నిక గడించింది. నన్నయకు బిరుదాలపై ఆసక్తియే ఉన్నట్లు కనపడదు. ఆయన తనకు వేసుకొన్న ఒకే ఒక్క విశేషణం - 'సకల సుకవి జనవినుత' - బిరుదంగా గాక నిత్య సత్యంగా గోచరిస్తుంది. నన్నయను వినుతించనివాడు సుకవి కాడేమో అన్న స్ఫూర్తిని కలిగిస్తుంది. తెలుగులోని సుకవులందరూ నన్నయను ముందుంచుకొని బారులు తీరినట్లు తోస్తుంది. నన్నెచోడుడు తనను 'కవిరాజ శిఖామణి'గా పేర్కొన్నాడు. ఎంత నిజమనుకొన్నా ఆ బిరుదు అలంకృతోక్తిగా మాత్రమే మన మనసుల్లో మసలుతుంది. తిక్కన వినయంగా బిరుదు నందుకోగలడు; ఏతరణంగా బిరుదు సీయగలడు. 'ఉభయకవి మిత్ర' ప్రశంస మనుమసిద్ధి సభలో మారుమ్రోగిందే; మహాభారత గద్యలోకి ఎక్కింది. సవినయంగా గ్రహించిన ఆ సన్మాన బిరుదం తిక్కన గారికి గండపెండేరంగా భాసిస్తే, ఆయన ఇచ్చిన బిరుదం - 'అభినవదండి' - కేతన తల మాయలేని కిరీటం. ఎఱ్ఱనకు నన్నయగారి వినయం ఉన్నది; తిక్కన

గారి వివరణం కూడా ఉన్నది. గద్యల్లో తనను శంభుదాసునిగా చెప్పుకొని గురు భక్తిని, శివభక్తిని ప్రకటించాడే కాని బిరుదుల జోలికిపోలేదు. అయితే, అయన తాత ఎఱపోతసూరి 'ప్రబంధ పరమేశ్వరు'డని ఎఱ్ఱనను పొగిడాడు. అది అన్న మాటగా ఉన్నా అందరికీ ఉన్నమాటగా అనిపించింది. ఎఱ్ఱనను ప్రబంధ పరమేశ్వరునిగా తరువాతి వారందరూ గౌరవించారు. ఎఱ్ఱన తిక్కనగారిని 'కవి బ్రహ్మ'గా సంభావించాడు. తిక్కన కాబిరుదు బంగారానికి తావిలా అమరింది. బిరుదులు కోరని నన్నయకు ఎఱ్ఱన బిరుదులు స్ఫురించే విశేషణాలు వేయక పోవటం విశేషం. బిరుదును పరోక్షంగా చెప్పుకొని ఔచిత్యాన్ని పాటించిన ప్రాజ్ఞుడు ఎఱ్ఱనగారైతే, బిరుదులను ప్రత్యక్షంగా గద్యలో కొట్టవచ్చినట్లు చెప్పి గరువపుతనాన్ని ప్రకటించిన గడుసరి - ఆ యుగంలోనే నివసించిన నాచన సోముడు. ప్రాచీనాంధ్ర సాహిత్యంలో నాచనసోమునిలాగా బిరుదాల సరదాను తీర్చుకొన్నవాడు మరొకడు లేడు. ఆయన బిరుదాలను విన్న తరువాత, వివేచించిన తరువాత - ప్రాసకోసం పెట్టుకొన్న పది బిరుదాలకంటె పరువు కోసం ఒక్కటి చాలన్న గుణపాఠం మనకే అనిపిస్తుంది; ఇక మహాకవుల మాట వేరే చెప్పాలా!

బిరుదాల్లో కూడా నన్నయ నుంచి తిక్కనదాకా ఉన్నవి కవి వ్యక్తిత్వా లను గురించి చెప్పేవి ఎఱ్ఱన యుగంలోవి ఆయా కవుల కావ్య కవితా వ్యక్తిత్వా లను వెలువరించేవి. ఎఱ్ఱన యుగ కవుల బిరుదాల సమాలోచనం వారివారి కవితా గుణాల వివేచనం కావటం విశేషం. అందువలన మొట్టమొదట ఎఱ్ఱనగారి 'ప్రబంధపరమేశ్వర' ప్రశంసలోని పరమార్థం చర్చనీయాంశమౌతుంది.

బిరుదాలకు వాచ్యార్థం చెప్పుకొంటే వాస్తవం తేలదు; ఒక్కొక్కసారి అర్థం కుదరదుకూడా. లక్ష్యార్థం చెప్పుకొని కొన్నిచోట్ల సరిపుచ్చుకోవాలి; అదీ అన్నిచోట్లా వీలుపడదు. తాత్పర్యార్థమే చాలచోట్ల శరణ్యం. ఒక కవి సాహితీ వ్యక్తిత్వం పఠితలకు కలిగించే అనుభవ విశేషాన్ని,రుచిస్వభావాన్ని వ్యక్తీకరించే పదబంధం బిరుదం.దానిని అలాగే వ్యాఖ్యానించుకోవాలి. ప్రతిపదార్థ చర్చచేసి, సమాసవిగ్రహాలు చెప్పి ప్రయోజనం లేదు. మరొకటి - మనకాలంలోని రూఢ్యర్థాలను పూర్వకాలంలో ఉన్నట్లు వ్యాఖ్యానించటం కూడా తప్పే. అందుకే దివాకర్ల వేంకటావధాని గారిలా అన్నారు-"ప్రబంధపరమేశ్వరుఁ డనఁగా కావ్య కల్పనా కౌశలమున పారంగతుఁడను నర్థము వచ్చును. పకారాది యైన ప్రబంధ

శబ్దము తరువాత పరమేశ్వర శబ్దము వాడుటకు శ్రుతిసుభగత్వమే కారణము. కవిబ్రహ్మ యను బిరుదమువలెనే ప్రబంధ పరమేశ్వరు డను బిరుదమును కావ్య రచనా దక్షతను సూచించునట్టిదే. ఈ బిరుదమునందలి ప్రబంధ శబ్దమునకును మనుచరిత్రాదుల విషయమున మనము వాడు ప్రబంధశబ్దమునకును కొంత భేద మున్నది. ఒకటి సామాన్య లక్షణోపేతము, రెండవది ప్రత్యేకలక్షణసంపన్నము. అందుచే మనుచరిత్రాది ప్రబంధములు కొన్ని నృసింహ పురాణమందో ఆరణ్య పర్వమందలి ఉపాఖ్యానములందో యాదృచ్ఛికముగా కానవచ్చుచుండుటచే ఎఱ్ఱనకు ప్రబంధ పరమేశ్వరు డను బిరుదము కలిగెననుట యుచితము కాదు. కావ్యరచనాకుశలుఁ డగుటచే యాతని కాబిరుదము కలిగియుండును." (నృ.పు పీఠిక పు. 12; ఆం. సా. అకాడమీ ప్రచురణ 1967.)

ప్రబంధపరమేశ్వర బిరుదం ఎందుకు వచ్చింది? - అనే అంశంమీద పండితులు తలకొకరీతిగా భావించారు. వాటిలో స్పష్టతగల కారణం చెప్పినవారు పింగళి లక్ష్మీకాంతంగారు- "ఇతివృత్తమును వర్ణనలచే అలంకరించెడి నూత్న పద్ధతికి సూత్రధారు డగుటచేతనే ఎఱ్ఱన ప్రబంధపరమేశ్వరు డయ్యెను-'' అని. (ఆంధ్రసాహిత్యచరిత్ర. పు. 275.)

బిరుదాలకు అర్థం చెప్పటం కష్టం. 'కవిబ్రహ్మ', 'ప్రబంధపరమేశ్వరుడూ'- ఈ రెండూ సమానార్థకాలని అవధానిగా రన్నారు. అయినా, బ్రహ్మ శబ్దం సృజనాత్మకశక్తిని, పరమేశ్వరశబ్దం సర్వశక్తిమత్వాన్ని వ్యంజింప చేస్తాయి. 'ప్రబంధపరమేశ్వరు' డన్నప్పుడు ప్రబంధశబ్దం కావ్యవాచియే కావచ్చు. కాని, దాని రచనాబంధం అందులో ముఖ్యంగా గ్రాహ్యం. ఒక్కొక్క ప్రబంధానికి ఒక్కొక్క రచనాబంధం సహజంగా రాణిస్తుంది. ప్రక్రియకు అనువైన రచనాబంధం ప్రసిద్ధంగా రాణించేటట్లు ప్రపంచించటం ప్రబంధ పరమేశ్వరత్వం. ఎఱ్ఱన పురాణశైలి వ్రాయగలడు. కావ్యశైలి కూర్చగలడు. ప్రబంధశైలి ప్రదర్శింపనూ గలడు. తిక్కన పద్ధతి వేరు. ప్రక్రియలు వేరైనా అతని శైలి ఒక్కటే - కావ్యరూపక మిశ్ర శైలి. కాని, ఎఱ్ఱన బహురూప శైలిని ప్రక్రియానుగుణంగా ప్రకటింపగలిగాడు. అప్పటికి అది గొప్ప వైచిత్రి; అపూర్వం. అందువలన ఆ బిరుదం. ఎఱ్ఱన కవిత్వాన్ని గురించి ప్రజల అనుభవం అది. దాని తాత్పర్యాన్ని ధ్వనింపచేసేటట్లు పిలిచిన బిరుద మది. ప్రబంధ మంటే మరే విధంగా చెప్పినా సత్యదూరమేకాక, అన్వయానికి కూడా దూరం అవుతుంది.

అందాకా ఏందుకు? ఎఱ్ఱన 'ప్రబంధపరమేశ్వరుడు' ఎప్పుడయ్యాడు? ఏ కావ్య రచనంవలన ఆయన కాబిరుదం వచ్చింది? అనే ప్రశ్నలు కూడా మన కిప్పటికీ వెన్నాడుతూనే ఉన్నాయి. విచిత్రమేమంటే - అరణ్యపర్వశేషరచనం వలన ఆ బిరుదం వచ్చినట్లు ఎఱపోతసూరి మాటల సందర్భం చెపుతున్నది. దానికీ సంగతి సందర్భాలు కుదరక నేటికీ విమర్శకులు క్రిందమీద పడు తున్నారు.

శ్రీనాథుడు "సత్ప్రబంధ పరమేశ్వరు శంభుదాసు(న్)" - అని కాశీ ఖండంలో కీర్తించాడు. "పంథవింతు ప్రబంధ పరమేశ్వరునితేవ, సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు" అని అతని గుణం తన కవితలో ఉన్నదని ఉల్లేఖించాడు. జక్కన విక్రమార్క చరిత్రలో - ఎఱ్ఱన 'ప్రబంధ పరమేశ్వరు'డనీ, 'చిత్ర కవిత్వ వాగ్విభవజృంభితు'డనీ పేర్కొన్నాడు. 'సూక్తివైచిత్రి', 'చిత్రకవిత్వ వాగ్విభవం' - అనే విశేషణాలు - ప్రక్రియ కనుగుణమైన వాగ్వృత్తిని, సూక్తి శక్తిని, వాగ్వైభవాన్ని వెలార్చగల వాగ్వైదగ్ధ్యం ఎఱ్ఱనకు ఉన్నాయని చెప్పక చెపుతున్నాయి.

ఆధునికులలో విశ్వనాథ సత్యనారాయణగారు "ఎఱ్ఱన్న సర్వ మార్గేచ్ఛా విధాతృండు" అని ప్రశంసించారు. పురాణమార్గం, ఇతిహాసమార్గం, కావ్య మార్గం మొదలైన వాటిల్లో ఇచ్ఛవచ్చినట్లు సంచరించే సృజనాత్మక శక్తి కలవాడు అని విశ్వనాథవారి అభిప్రాయం. ఇది సత్యానికి చాల దగ్గరైనది; 'ప్రబంధ పరమేశ్వర' బిరుదానికి పరోక్ష వ్యాఖ్య.

ప్రక్రియలో వైచిత్రి, వైవిధ్యం, వైశిష్ట్యం, వైలక్షణ్యం ఉన్నప్పుడే ఆయా కృతుల్లో వాడే శైలిలో కూడా ఆయా విశేషాలు కనపడేది. ఎఱ్ఱన చేసే ప్రతి ప్రయోగం యౌగికంగా ఒక ప్రబంధం. ప్రబంధమంటే ప్రక్రియాపరంగా - రెండు కాని అంతకంటే ఎక్కువకాని ప్రక్రియలయొక్క లక్షణాలకూ, గుణా లకూ, స్వభావాలకూ ఏర్పడే గాఢమైన అనుబంధం; అంటుకట్టు. దానికి తగి నట్లు రచనలో సాగించే శబ్దార్థరూపమైన శైలికూడా ప్రబంధమే. అంటే - ప్రక్రియోచితమైన శైలిని ప్రదర్శించ గల ఉక్తి వైచిత్రి ప్రబంధ పరమేశ్వ రత్వం.

ఎఱ్ఱన ప్రయోగాల ప్రబంధ స్వరూపాలను ఇలా పేర్కొనవచ్చు :

1. హరివంశము—పురాణకవితాశైలి + ఇతిహాసవస్తువు + కథాకథన పద్ధతి.
2. ఆరణ్యపర్వశేషము — కావ్యకవితాశైలి + ఇతిహాసవస్తువు + ఉభయ (కథ + వర్ణన) పద్ధతి.
3. నృసింహపురాణము - ప్రబంధకవితాశైలి + పురాణవస్తువు + వర్ణనాత్మక పద్ధతి

వీటిలో నన్నయ తిక్కనల కనుపుగా ఎఱ్ఱన మలచుకొన్నది రెండవ ప్రబంధశైలి. స్వయంగా తన కృతులకోసం రూపొందించుకొన్నవి మొదటిది, మూడవది: మొదటిది ఇతిహాసప్రక్రియలో ఒక నూత్న ప్రయోగం; రెండవది ఇదివరకే వెలువడిన కావ్యేతిహాసానికి అనువైన అలంకరణం: మూడవది ఒక నూత్న ప్రస్థానానికే నాంది పలికిన నాణెమైన రచనం. 'ప్రబంధ పురాణం'గా పిలువదగిన ప్రక్రియ.

నృసింహ పురాణ మని పిలువబడే ఎఱ్ఱన రచనను "నరసింహావతారం బను పురాణ కథ" అని కవి గద్యలో చెప్పకొన్నాడు. అంటే- దశావతారాలలో ఒకటైన నృసింహావతార కథను పురాణకథగా ఎఱ్ఱన రూపొందించదలచుకొన్నాడన్నమాట. అదే కథానిర్మాణ ధ్యేయమైతే నృసింహావతారానికి మూలమైన కథార్థాలను సంవిధానం చేయటమే కావ్యనిర్మాణమర్మ మౌతుంది. కాని, ఎఱ్ఱన దానికి క్షేత్రమాహాత్మ్య లక్షణాన్ని కూడా జోడించాడు. అందువలన మొదటా చివరా అహోబిలక్షేత్ర ప్రశస్తి అమర్చటం జరిగింది. క్షేత్ర మాహాత్మ్యంలో దైవ, క్షేత్ర, తీర్థ, పర్వ, భక్తి వర్ణనలు చోటు చేసుకొనే అవకాశం ఉన్నది. ఎఱ్ఱన అంతటితో కూడా ఆగలేదు. కావ్యలక్షణమైన అష్టాదశ వర్ణనలు కూడా యథావకాశంగా పొందుపరచాడు. ఆ వర్ణనల్లో కొంత అలంకృత శైలిని ప్రవేశ పెట్టి రచనకు ప్రాధాన్య మిచ్చి ప్రబంధ స్పృహను పోషించాడు. ఇలా తయారైన ఈ రచన నాలుగు ప్రక్రియల నాణెమైన మిశ్రమం. పురాణకథ + క్షేత్రమాహాత్మ్యం + కావ్యవర్ణనలు + ప్రబంధశైలి. ఇట్టి మిశ్ర ప్రయోగం అంతకు ముందు ఎవ్వరూ చేయలేదు. అందువలన ఈ కావ్యం అపూర్వప్రక్రియా ప్రయోగంగా ఆ యుగంలో ప్రకాశించింది. అదే ప్రబంధ పురాణం.

ప్రబంధపరమేశ్వరుడనే బిరుదు ఎఱ్ఱనకు హరివంశముతోనే వచ్చినా, ఆరణ్యపర్వశేషంతో అది ధ్రువపడింది; నృసింహపురాణంతో అది ధ్రువతార

స్థాయికి చేరింది. "రామాయణ హరివంశ రచనలచే ప్రబంధపరమేశ్వర బిరుదమునకు అర్హత సంపాదించు కొన్న శంభుదాసుడు ఈ గ్రంథరచనచే ఆ బిరుదమును అధిక్షేపణలకు, ఆక్షేపణలకు అవకాశం లేని రీతిగా నొనర్చి సార్థక బిరుదనాము డయ్యెను" అని పింగళివారు సార్థకంగా చెప్పారు.

ఎఱ్ఱాప్రెగడ నన్నయ తిక్కనల్లాగా ప్రధానంగా గుణవాది. హరివంశంలో ఎఱ్ఱన శబ్దార్థగుణాలను రచనలో పాటించినా, అర్థగుణాలకంటె శబ్ద గుణాలకే మొగ్గు చూపించాడు. ఆ శబ్దగుణాల్లోనూ నన్నయలాగా ప్రసాదానికే పెద్దపీట వేశాడు. అరణ్యపర్వశేషంలో ప్రసాద మాధుర్యాలకు ప్రాధాన్యాన్ని కల్పించాడు. నృసింహ పురాణ రచనలో ఓజస్సుకు తేజస్సును కల్పించాడు. తిక్కనలో అర్థగుణాలకు ప్రయోగ గౌరవం లభించింది. ఎఱ్ఱన అర్థగుణదీప్తిని తగ్గించి శబ్దగుణ ప్రాచుర్యానికి ప్రయత్నం చేశాడు. శ్రీనాథు డాపని పూర్తి చేశాడు. తిక్కన శైలి తెలుగులో అరుదైపోయింది. నన్నయ శైలి ఎఱ్ఱనలో పునర్భవించి ఆపై యుగాలలో పొంగులువోయింది. అయితే ఎఱ్ఱన తన కవిత్వ రుచిని తాను సొంతంగా నిర్మించుకొన్నాడు నృసింహపురాణంలో. గుణాలను అలంకారాలతో అతిశయింపజేయాలన్న ప్రవృత్తి ఎఱ్ఱన వాక్కుకు సహజ స్వభావం. శబ్దార్థాలను అంకృతంచేసి, అర్థాలంకారమండితమైన గుణవద్రచనను కవితకు అలవరచాడు ఎఱ్ఱన. అలంకారశక్తిని గుణప్రధానమైన రచనలో మొదటిసారి తెలుగువాణికి రుచి చూపించా డాయన. ఎఱ్ఱనకు రసంకంటె రచనయే ముఖ్యం. అలంకారధ్వనితో కథార్థాలను కాంతిమంతం చేయటం ఆయన కవితకు జీవితం. రుచ్యమైన వంటకాన్ని రుచిని పెంచించే వ్యంజనంతో నంజుకొని తిన్నప్పుడు కలిగే రుచివంటిది ఎఱ్ఱయ కవిత్వపురుచి.

ఎఱ్ఱన గారివి మూడు ప్రబంధోక్తులు. హరివంశ రచనలో కానవచ్చేవి హృద్యోక్తులు (హరి. పూ. 1.51); అరణ్య పర్వశేషంలో చతురోక్తులు (నృ. పు. అవ. 17) నృసింహపురాణంలో మధురోక్తులు (నృ. పు. అవ. 21).

"పొలుపారఁగా బోరగిలి పాన్పు నొల్లుమూ
 ఉలుకును వచ్చును మెలఁగి మెలఁగి
లలిఁ గపోలంబులు గిలిగిలింతలు వుచ్చి
 నవ్వింపఁ గలకల నవ్వి నవ్వి
ముద్దులు దొలకాడ మ్రోఁకాలఁగేలను

దదవుచు నెందును దారి తారి
నిఁచుందఁబెట్టి యంగుళు లూతనూపఁగా
ప్రీతిఁ దప్పడుగులు వెట్టివెట్టి
యన్నఁగంటి దండ్రిని గంటి నయ్యఁ గంటి
నింద రావయ్య విందులవింద వనుచు
నర్థిఁ దనుఁ బిలువగఁ నదయాడియాడి
యుల్లసిల్లెఁ గృష్ణుఁడు శైశవోత్సవముల." (హరి. పూ. 5.193)

హరివంశాన్నంతా ఉదాత్తతరహృద్యోక్తులతో చెప్పించాడు ఎఱ్ఱన వైశంపాయ మునిచేత. పై సీసంలోని శ్రీకృష్ణుని బాల్యక్రీడలు వర్ణించిన శైలి ఉదాత్తతర హృద్యోక్తిమయం. ఇటువంటి శైలి హరివంశంలో సర్వసామాన్యం.

"కన్నులు వచ్చి యెల్లెడలుఁ గన్గొని వృద్ధనరేంద్రుఁ డాత్మకుం
గన్నులుఁ బోలె నైన తన గాదిలి పుత్రుఁడు గాననంబులో
నెన్నఁడు లేనియంత తడ వేటికిఁ జిక్కెనొ యంచు నార్తితోఁ
గన్నులు లేనియ ట్లొకఁడుఁ గానక యేడ్చె సతీసమేతుఁడై." (అరణ్య. 7.209)

సావిత్ర్యుపాఖ్యానంలోని పైపద్యం చతురోక్తికి చక్కని ఉదాహరణం. ఈ శైలి అరణ్య పర్వ శేష రచనంలో అధికం. ఇక నృసింహ పురాణ రచన మధురోక్తి గుంఫనతో మనీషులు మెచ్చేటట్లుండే దని ఎఱ్ఱయ తాతగారి నోట చెప్పించు కొన్నాడు.

"శ్రీస్తన కుంకుమ ద్రవ నిషిక్త భుజాంతరభాగ విస్ఫుర
త్కౌస్తుభరత్న నూత్నరుచి గర్వితనాభి సరోజ సౌరభ
ప్రస్తుత మత్తభృంగ రవరాగ రసోల్బణ భోగి భోగ త
ల్పాస్తరణుం దలంచు సుకృతాత్ము లపాస్త సమస్త కల్మషుల్." (నృ. పు. 2.37)

ఉదాత్త విభావ వర్ణనంలో ఎఱ్ఱన సంస్కృత పద గుంఫనం ప్రదర్శిస్తాడు కాని, ఇలా మూడు చరణాల సమాసాన్ని నడిపే ఆవేశం ఆయనకు అరుదు. సంస్కృతాంధ్రోక్తులను నిబిడబంధంగాని నిస్తుల మధుర వాక్పాకంతో పరిమళింప చేయటమే ఆయన స్వభావం. అలంకృతాలైన వర్ణనల్లో అతని వాక్కు అటువంటి వైభవాన్ని వెలాదుస్తుంది.

"క్షీరాబ్ధి తరఁగల పేరణిఁ గూడిన
ఫేనసంహతి చిక్కఁబేరె నాక్కా" (న.పు. 1.40)

మొదలైన పద్యాలను గమనిస్తే-గాఢంగా భావించి వర్ణించే సమయాల్లో ఎఱ్ఱన అర్థం కంటె శబ్దం మించేటట్లు రచించాడని తెలుస్తుంది. ఎడనెడ అతడు శబ్దాలంకారాలు వాడినా అవి సహజ శబ్ద తరంగాలులాగానే ఉంటాయి. ఎఱ్ఱన శైలిలో అర్థానికి శబ్దం వలన దీప్తి కలుగుతుంది. అర్థ సమర్థాలైన మధుర శబ్దాల కూర్పు అతని శైలికి ఒక వ్యక్తిత్వాన్ని కల్పిస్తాయి.

అపూర్వ వర్ణనా నైపుణ్యంతో కూడిన కావ్యశైలికీ, సంస్కృతాంధ్ర పద విశిష్టాలైన చతుర మధురోక్తులతో కూడిన ప్రబంధ పదశయ్యకూ ఎఱ్ఱన యత్నించి కృతకృత్యుడయ్యాడు.

అబ్బుర మేమంటే - పదహారవ శతాబ్దంలో ప్రబంధ నిర్మాణం చేసిన అల్లసాని పెద్దన కూడా ఎఱ్ఱనవలె 'చతురవచోనిధి', 'శిరీష కుసుమ పేశల సుధామయోక్తులకు' కాణాచి. ఎఱ్ఱన కవితలో కవి ప్రౌఢోక్తులుగా కానవచ్చే చతుర మధురోక్తులే ప్రబంధ యుగంలో స్వతంత్ర ప్రతిపత్తిని గడించి వక్రోక్తి, అతిశయోక్తి, సహోక్తి, వినోక్తి, సమాసోక్తి, స్వభావోక్తి, వ్యాజోక్తి మొదలైన భంగ్యంతరాలను పొంది అలంకృతోక్తులుగా గడుసుపోకడలు పోయాయి.

ఆంధ్ర కవితా పితామహుని అలంకృతోక్తులకు ప్రబంధ పరమేశ్వరుని చతుర మధురోక్తులు "స్ఫురదరుణాంశు రాగరుచులు." అవి 'ప్రబంధపురాణ ప్రక్రియ'లో ప్రస్ఫుటంగా గోచరించాయి.

(1988)

# హంసడిభకోపాఖ్యానము – సంవిధాన శిల్పము

"ఋషివంటి నన్నయ రెండవ వాల్మీకి, తిక్కన శిల్పపుఁదెనుఁగుతోట,
యెఱ్ఱన్న సర్వమార్గేచ్ఛావిధాతృండు, పోతన్న తెలుఁగులపుణ్యపేటి,
శ్రీనాథుఁడు రసప్రసిద్ధధారాధుని, కృష్ణరాయఁ డనన్యకృతిప్రబంధ,
పెద్దన్న వడపోతపెట్టి నిక్షురసంబు, రామకృష్ణుఁడు సురారామగజము,
ఒకఁడు నాచనసోమన్న; యుక్కివుండు
బెఱిపి పదిసార్లు తిరుగవ్రాసిననుగాని
మొక్కవోని యీ కవిలోకమూర్ధమణుల
మద్గురుస్థానములుగ నమస్కరించి"

కావ్యరచన కుపక్రమించితినని కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు తమ రామాయణ కల్పవృక్షమున పేర్కొనిరి. కావ్యావతారికలలో పూర్వకవి స్తుతి యొక ముఖ్యాంగము. ఆంధ్రకవు లెందఱో దానిని నిర్వహించిరి. కాని కొందఱి స్తుతులకు మాత్రమే కొండంత విలువ వచ్చినది. నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, మారన, శ్రీనాథుఁడు, రామరాజభూషణుఁడు, తెనాలి రామకృష్ణుఁడు - ఇట్లు కొందఱిని మాత్రమే యీవరుసలో పేర్కొనవచ్చును. నవ్యులలో ఆ వరుస నలంకరించినవారు శ్రీ విశ్వనాథ. ఈ వరుసకవు లందఱు పూర్వకవుల నామములను గుదిగ్రుచ్చి స్మరించి మ్రొక్కు చెల్లించుకొనినవారు కారు. వారి కవితాతత్త్వమును మథించి తత్సారమును ఛందమున సూత్రప్రాయముగ సంగ్రథించిన సారవివేకులు. పూర్వకవి కవితాలోకనమున కీ మహాకవు లందించిన సూత్రవ్యాఖ్యానములు సూక్ష్మవాతాయనములు!

శ్రీ విశ్వనాథవారు పై పద్యమున నన్నయనుండి రామకృష్ణునివరకుగల ప్రాచీనాంధ్ర మహాకవులను కాలానుక్రమణిక ననుసరించియే పేర్కొనినారు. కాని నాచనసోమన్నను మాత్రము 'ఒకఁ'డని ప్రత్యేకముగా వరుస తప్పించి, యెత్తి చూపినారు. అనఁగా అతనియందు తనకున్న ప్రత్యేకాభిమానమును,

సాహిత్యచరిత్రయందు సోమన కున్న వైలక్షణ్యమును ఈ విధముగా విశ్వనాథ వారు వ్యంగ్య మొనర్చినారన్నమాట! 'ఒకఁడు నాచనసోమన్న' అని విశ్వనాథ ప్రశంస! దీని తాత్పర్యము నిట్లూహింపవచ్చును. నన్నయాది మహాకవుల కావ్యములందుఁ గానవచ్చు కవితావిశేషములన్నియు నొకయెత్తు, నాచనసోముని యొక్కని కావ్యగుణము లొకయెత్తు. నాచనసోముఁడు పూర్వమహాకవులు పోయిన త్రోవఁబడిపోయినవాఁడు కాడు; అతని దొక్కనిది యొక్క ప్రత్యేక మార్గము. అది అనన్యసామాన్యమైనది. అందువలన నట్టిమార్గమున నాచనసోముఁడే కనిష్ఠికాధిష్ఠితుఁడై మిగిలియున్నాఁడు. కావున ఆంధ్రకవి జగత్తులో నాచనసోముఁడు ప్రత్యేకప్రతిపత్తి గల ప్రముఖ కవి!

క. "ఘను నన్నయభట్టును ది
క్కన నేఱ్ఱాప్రెగడఁ బొగడి యలికంబున న
క్షిని డాఁచినట్టి సర్వ
జ్ఞుని నాచనసోమనాథు స్తుతి యొనరింతున్"

అని చిన్నయసూరిగారు - మూడవకన్ను డాచికొని యవతరించిన సర్వజ్ఞుఁడగు నపరపరమేశ్వరుఁ డని నాచనసోముని ప్రస్తుతించినారు. సోమనాథశబ్దములోని పరమేశ్వరార్థము నధికరించి, యా మహాకవి సర్వజ్ఞత్వము నుగ్గడించుట చిన్నయసూరి తాత్పర్యము. కవిమహత్త్వమున కీస్తుతి పతాకయయ్యె, నాతని కవిత్వమహత్త్వము వ్యాఖ్యానించు వైఖరిని సూచింపనిచే చిన్నయసూరి స్తుతికంటె విశ్వనాథవారిసూక్తి సోముని కవిత్వతత్త్వావలోకనమునకు సూక్ష్మదృష్టిని ప్రసాదించుచున్నది.

నాచనసోముఁడు ఉత్తర హరివంశ కావ్యాశ్వాసాంతగద్యలయందు తాను-సకల భాషాభూషణుఁ డనియు, సాహిత్యరసపోషకుఁ డనియు, సంవిధాన చక్రవర్తి యనియు, నవీనగుణసనాథుఁ డనియు, సంపూర్ణకీర్తి యనియు పేర్కొని యుండెను. అతని కావ్యగుణములను ప్రాచీనాధునాతనకవులు కీర్తించియుండ, ఆధునిక విమర్శకు లాతని బిరుదముల సార్థక్యమును గూడ సవిమర్శముగ సాధించియున్నారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, మానవల్లి రామకృష్ణకవిగారు, నడకుదుటి వీరరాజుపంతులుగారు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, విశ్వనాథ సత్యనారాయణగారు, నిడుదవోలు వెంకటరావుగారు, డా. శ్రీమతి పి. యశోదా రెడ్డిగారు మొదలగు విద్వన్మణు లాకవికులాలంకారుని కావ్యముపై విలువయైన

పీఠికలను విమర్శన వ్యాసములను గ్రంథములను వెలయించియున్నారు ఎంత తెలిపి చెప్పినను ఇంకను ఎంతయో చెప్పుటకు వీలున్నది

ఉత్తర హరివంశ కావ్య విమర్శనాపరములగు నంధ్ర విమర్శకు లాకవి కవిత్వ మహత్త్వమును నిరూపించునెడ ప్రధానముగా నరకాసురవృత్తాంత మునే యుదాహరించుచుందురు ఆ తరువాత ఉషానిరుద్ధుల వృత్తాంతము పౌండ్రకవాసుదేవవృత్తాంతము శ్రీకృష్ణుడు బ్రాహ్మణపుత్రులను రక్షించిన వృత్తాంతము వారి దృష్టి నాకర్షించినట్లు కనబడుచున్నది ఉత్తర హరివంశ చతుర్థాశ్వాసమునం దభివర్ణింపబడిన హంసడిభకోపాఖ్యానము అందలి యన్ని కథలలో విలక్షణమైనది దానిని విమర్శకులు కొందరెడ స్పృశించి యుండిరి గాని సమగ్ర విమర్శ నాగించి యుండరైరి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు మాత్రము ఒకడు నాచన సోమన్న యను వ్యాససంకలన గ్రంథమునందీ యుపాఖ్యానమును గూర్చియు జనార్దనుని పాత్రచిత్రణమును గూర్చియు కొంత వివరించి వ్రాసిరి అదియును సమగ్రము కాదు అందువలన నీ వ్యాసమున హంసడిభకోపాఖ్యానమునందలి నాచన సోముని సంవిధాన సామర్థ్యము మరి కొంత పరామర్శింపబడుచున్నది

## ఉత్తర హరివంశము – కథాసంవిధానము :

కావ్యవిమర్శకు ప్రధానముగా నుపకరించు అంశములు నాలుగు 1 వస్తువు 2 నాయకుడు పాత్రలు 3 రసము 4 కవిత్వము నాచన సోముని సంవిధాన శిల్ప మీ నాలుగంశములపై విస్తరించి వివేచించుట యీ వ్యాసతాత్పర్యము

ఉత్తర హరివంశము సమగ్రమా? అసమగ్రమా? అను వివాద మొకటి యున్నది పూర్వ హరివంశము సోముడు రచించియున్నను అది ప్రస్తుత మలభ్యము ఉత్తర హరివంశమునం దైనను సోమన మూలమునందలి కథల నన్నింటిని గ్రహింపలేదు కొన్నింటిని గ్రహించినను మూలమునం దున్న క్రమమున వాని నివర్చలేదు షష్ఠాశ్వాసముతో కావ్యము సంపూర్ణమైన దని యైనను సూచింపలేదు ఏమైనను మన కిప్పుడు లభించు కావ్య మాఱాశ్వాసములు కలది దీని ననుసరించియే మన మాలోచింపవలయును

ఉత్తర హరివంశమును యథాతథముగా పరిగణించినచో నొక కథా కావ్యము కాఁగలదు. ఇందు విష్ణుమహిమాభివర్ణనము పరమతాత్పర్యము. కథా వ్యాపి యైన విష్ణువు - లేక - కృష్ణుఁడు ఇందు నాయకుఁడు. అతని దుష్టశిక్షణ, శిష్టరక్షణ వ్యాపార మీ కావ్య కథా వస్తువు. ఈ కావ్యమునందు మొత్తము ఈ క్రింది కథ లున్నవి: ప్రథమాశ్వాసమున నరకాసుర వృత్తాంతము, ద్వితీయాశ్వాసమున విప్రకుమార ప్రాణరక్షణము, ఘంటాకర్ణుని కింద్రపద ప్రదానము, శ్రీకృష్ణుని పుత్త్రలబ్ధి, తృతీయాశ్వాసమున పౌండ్రక వాసుదేవ వృత్తాంతము, చతుర్థాశ్వాసమున హంసడిభకోపాఖ్యానము, పంచమషష్ఠా శ్వాసములందు బాణాసుర వృత్తాంతము - క్రమముగా నభివర్ణితములై యున్నవి. ఇందు కథా స్వభావమునుబట్టి వివేచించినచో ద్వితీశ్వాసమునందలి కథలు ప్రధానముగా శిష్టజన సముద్ధరణమునకును, హరివంశోద్ధరణమునకును సంబంధించినవి. మిగిలినకథలు దుష్టశిక్షణప్రధానములైనవి. ఈ కథలలో ప్రతినాయకులైన నరకాసుర, పౌండ్రక వాసుదేవ, హంస డిభక, బాణాసురా దుల విజృంభణను విస్తృతముగా నభివర్ణితమై, వారిని వాసుదేవుఁడు తన పరాక్రమప్రభావాదులచే ఖండించినట్లు చెప్పఁబడెను. ప్రబలు లైన ప్రతివీరుల నిర్జించు శౌరి పరాక్రమాతిశయము సర్వకథాసారమైన వ్యంగ్యముగా సంవిధానము చేయుట సోముని కావ్యకథాసంవిధానశిల్పము.

ఇంతకంటె లోతుగా నాలోచించినచో మఱియొక వింతసమన్వయ సూత్రము స్ఫురింపఁగలదు. కావ్యము పేరు హరివంశము. వంశాభ్యుదయ వర్ణన మిందు పాటింపఁదగిన సూత్రము. వంశము పుత్త్ర పౌత్త్రోదయముల వలన వృద్ధిచెందును. పుత్త్రపౌత్త్రుల వివాహము మఱల ఆ వంశవృద్ధికి బీజ మగును. ఇట్లు ఎడతెగక వంశవర్ధన కావ్యములకు సహజముగా నాయు సూత్రము కావలెను. సోమన ఉత్తర హరివంశ - కథా సంవిధానమున నట్టి శిల్పమును పాటించినట్లు భావింప వీలగుచున్నది.

ప్రథమాశ్వాసమున నరకాసురసంహారమైనది. విష్ణువునకు భూదేవివలన కలిగిన సంతానము నరకాసురుఁడు. నిజ సంతానమును బలిపెట్టుటతో ఉత్తర హరివంశ కథ యారంభమగుచున్నది. ఇదియొక వింతయైన ఆరంభము! దీనితో పాఠకునకు భావి వంశ వృత్తాంతముపై నుత్కంఠ జనించును. హరి తన కొడుకును చంపుట కేదేని యొక బలమైన కారణము కావలెను. దానిని హరియే

చివరకు వివరించినాఁడు: "వాఁడు (నరకాసురుఁడు) సురముని వర్గంబునకు నెగ్గు చేసెం గావున వధియింప వలసె దుష్టశిక్షణంబునుం జేయ నవతరించిన నాకుం బుత్త్రమిత్త్రాదులని చూచుట ధర్మంబుగాదు." (1.188). దీని తాత్పర్య మిది: దుష్టసంతానమువలనైన వంశవృద్ధి - వృద్ధికాదు. . దుష్టులు పుత్త్రులైనను వధ్యులు. అట్లగుటచే హరి స్వీయమగు దుష్టసంతతిని సంహరించి లోకమును రక్షించెను. విశ్వశ్రేయస్సూత్రము వంశచరిత్రమున పాటింపఁబడుటచే నా వంశ కథ సాహిత్య ప్రయోజనమును సాధించు కావ్య వస్తువుగా నెన్నుకొనఁబడుటకు యోగ్యతను సంపాదించుకొనినది.

నరకాసుర సంహార వృత్తాంతమువలన కావ్య కథా సంవిధానమునకు సంబంధించిన శిల్ప సూత్రములు కొన్ని లభించుచున్నవి. హరి తన వంశము నుద్ధరించుటకు దుష్టపుత్త్ర శిక్షణ మాచరించి యుండ, అన్యవంశములం దుద్భవించి లోక కంటకులైన వారిని సంహరించుటయందు సంకోచపడడు. హంసడిభకాదుల నా ధర్మమును చేపట్టియే వాసుదేవుఁడు తుదముట్టించెనని స్పష్ట మగుచున్నది. కాగా, తరువాతి కథల నానుపూర్వక్రమమున సంవిధానము చేయుట లోని నాచన సోముని నైపుణ్యము నరయవలసియున్నది.

దుష్టుఁడైన నరకాసురుని సంహరించిన చేతులతోడనే వాసుదేవుఁడు మృతులైన విప్రబాలకులకు ప్రాణదానము చేసెను. ఇది యాతని శిష్టవంశ రక్షణైకశీలమునకు చక్కని యుదాహరణము. నరకాసుర వధా వృత్తాంతము తరువాతనే దాని ననుసంధించుట సోమన యౌచిత్యదృష్టికి నికషోపలము. ఆపైన శ్రీకృష్ణుఁడు స్వీయవంశాభివృద్ధికి బీజభూతమైన సంతానలబ్ధికై ప్రయత్నించు కథార్థముల నభివర్ణించుట సార్థకము. ప్రథమాశ్వాసమున వికలమైనట్లు భాసించుచున్న వంశాభ్యుదయ కథాబీజము ద్వితీయాశ్వాసమున కారణాంతరముచే ప్రవృద్ధమానమైనట్లు చిత్రించి కథా జీవితమున కాయువు పోయుట సోమన సాధించిన కథా సంవిధాన సంజీవనీ విద్య!

శ్రీకృష్ణుని ప్రథమ సంతానము ప్రద్యుమ్నుఁడు. ఇతఁడు పుట్టుట, పెరిగి పెద్దవాఁడగుట మొదలైన యంశములు చెప్పినచో నది యొక విలక్షణమైన కావ్యమగును. కాని, సోముఁడు భావించిన వంశ కథా కావ్యము కాదు. అందు వలన తృతీయ చతుర్థాశ్వాసములు సోమన ప్రణాళిక కనువుగా ననుసంధింపఁబడినవి.

వంశోద్ధారకుఁడైన పుత్త్రుని గనుటతో తండ్రి బాధ్యత తీరలేదు. వంశ పరంపరానుగతముగా వచ్చుచున్న ఆస్తిపాస్తులను సంరక్షించి,వీలైనచో నభివృద్ధి పఱచి, నిష్కంటకముగా వానిని పుత్రులకు మనుమలకు అందించిపోవలెను. ఇది లోకధర్మము. ఈ దృష్టితో తృతీయ చతుర్థాశ్వాసములందలి కథార్థముల నన్వయించుకోనవలెను. వాసుదేవుఁడు పెద్ద బలగ మున్న వీర వంశమునకు నాయకుఁడు. పౌరుష మా వంశమునకు జీవగఱ్ఱ. అట్టి వంశముపై పగతురు దండెత్తి రాజ్యమును కబళింప యత్నించినచో వారిని తమవారిచేతగాని, వారికి చేయిమించినచో తానే స్వయముగా గాని సంహరించి వంశగౌరవమును నిలువఁ బెట్టుకొనుట వాసుదేవుని విధి. సాత్యకిబలరాములు వాసుదేవునికి భుజద్వయము వంటివారు. వారి శౌర్యపరాక్రమములు రణరంగమున నతని కండదండలై నిలువఁగలవు. ఇట్లు అనునాయకోపనాయక సహాయుఁడైన శ్రీకృష్ణుఁ డీ రెండాశ్వాసములలో తన నాయకత్వమును స్థాపించుకొని వీరుఁడై భాసించినాఁడు. అతని శత్రువులైన పౌండ్రకవాసుదేవ హంసడిభకాదులు కూడ సామాన్యులు గారు. వరశక్తియుక్తులు, మిత్రరాజన్యసైన్యసహాయసమేతులు. వారి దండయాత్రలచే యాదవరాజ్యము భగ్నము గాకుండ రక్షించుటకు శత్రుసంహార మొనరించుట యీ కథాద్వయ పరమ ప్రయోజనము. కన్న కొడుకు కొఱకు మనుమలకొఱకు కొఱకరానికొయ్యలైన శత్రువులతో తలపడి కృష్ణుఁడు వంశగౌరవ సంరక్షణము చేసెనని వ్యంగ్యము చేయుటకై సోముఁ డీ కథల నను సంధించుట.

"మన నాచన సోమన తెల్గు హరివంశమునకు మూలమయిన సంస్కృత హరివంశ మున్నదేమో యెఱుఁగరాదు. ఇప్పుడు ముద్రితమయి యున్న హరివంశమునకు నీ తెల్గునకు మిక్కిలి భేదము లున్నవి. కథలు పెక్కు లిందు చేరనేలేదు. ఉన్న కథలు గూడ వెనుకముందులుగా నున్నవి. సంస్కృత హరివంశమున హంసడిభక కథ గ్రంథాంతమం దున్నది; ఇందు చతుర్థాశ్వాసమున నున్నది. సంస్కృతమున హంసడిభక కథకు మిక్కిలి పూర్వమం దున్న బాణాసుర కథ తెల్గునఁ గట్టకడపటిదిగా నున్నది. మూలమున నుండి కొన్ని కథలను మాత్రమే కయికొని సోమనాథుఁడు తద్వాత ప్రబంధరచనకు మార్గ దర్శకముగా నవీనగుణసనాథుఁడై యీ హరివంశము నిచ్చమెచ్చునట్లు రచించి యుండు నని నేను దలఁచుచున్నాఁడను" అని కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి

గారు ఉత్తర హరివంశ కావ్య పీఠికలో పేర్కొనియున్నారు. (వావిళ్ళ ప్రతి, 1937.)

ప్రభాకరశాస్త్రిగారు బాణాసురవృత్తాంతమునకుఁ బూర్వమే హంసడిభకుల కథను నాచన సోముఁడు చెప్పె నని పేర్కొనిరే కాని యందలి కథాసంవిధాన శిల్పమును వివరింపరైరి. నే నిట్లు భావించుచున్నాను: మొదట పౌండ్రక వాసుదేవుని వృత్తాంతము నరయుదము. హరి పుత్రలబ్ధికై తపము సేయ నేఁగె నని తెలిసి పౌండ్రకుఁడు యాదవ నగరమును నిశీధిని ముట్టడించెను. బలరామ సాత్యకులారాత్రి యాతనిని దీకొని పోరు చేసిరి. తెల్లవారుసరికి శ్రీకృష్ణుఁడు బదరికాశ్రమమునుండి ద్వారకకు తిరిగివచ్చెను. పోరుసంగతి తెలిసి తే రెక్కి రణరంగమున కుఱికెను. పౌండ్రకుని దురుక్తులను సహింపక చక్రమున నాతని తలఁ దునిమెను. మిగిలిన శత్రువులు పంచబంగాళమైరి. సమరవిజయోత్సాహమున వాసుదేవుఁ డంతఃపురమునఁ బ్రవేశించి దేవేరులతో తన వరలాభవృత్తాంతము నెఱిఁగించెను. ఆపైన కాశీపతి ద్వారకపైఁ గృత్యను బ్రయోగించుటయు. కృష్ణుఁడు దానిని చక్రముచే నుపసంహరించుటయు మొదలగు కథార్థములు గలవు. దీనివలన ద్వితీయాశ్వాసకథానంతరము తృతీయాశ్వాసకథయే రావలె నని స్పష్టమగుచున్నది కదా!

ఇఁక హంసడిభకోపాఖ్యానము దాని ననుసరించుటతో గల సార్థక్యము నరయుదము. దీనివలన నీకథ బాణాసురవృత్తాంతముకంటె ముందే యెంతుల కుండవలయునో మఱింత స్పష్టపడఁగలదు. బాణాసురవృత్తాంతమున శ్రీకృష్ణుని మనుమ డగు అనిరుద్ధుఁడు పడుచువాఁడు. పరిణయయోగ్యమైన వయఃపరిపాకము కలవాఁడు. మేటి వీరుఁడు. కాని, హంసడిభకోపాఖ్యానమున అనిరుద్ధుని తండ్రి ప్రద్యుమ్నుఁ డున్నాఁడు. కాని, అతఁడు బాలుఁడు. ఆ కథను సూక్ష్మేక్షికతోఁ బరిశీలించినచో హరికి ఇరువురు సుతులు కలిగి రనియు, వారు బాల్యావస్థలో నుండియుండి రనియు మనకు తేటపడఁగలదు. అందుల కొండు రెండు తార్కాణముల నిచ్చుచున్నాను.

(1) హంసడిభకులచే బరాభూతుఁడైన దుర్వాసమహర్షి హరిని దర్శించుటకు ద్వారకానగర ద్వారమునఁ బ్రవేశించిన తరుణమున వాసుదేవుఁడు అంతఃపురమున సాత్యకి మొదలైన యదువీరులతోడనే కాక, కుమారులతోగూడ కలసి గోళము లాడుచుండెనఁట! (4.80.) గోళము లాడుట కాయదుసింహుఁడు పసి

బాలుఁడు కాదుకదా! కాని కుమారులు పసివారు వారిపైఁ గల మక్కువతో, సాత్యకినిగూడ తనతోఁ గలుపుకొని వినోదక్రీడలకుఁ బూనుకొంటినాఁ డని యిక్కడ సోమన సూచించినాఁడు ఈ యొక్క ప్రశంసచే శ్రీకృష్ణుఁడు సంతానవంతుఁ డయ్యె నని యు బాలురు పసివా రనియు వ్యంగ్య మొనర్చినాఁ డీ సంవిధాన చక్రవర్తి.

(2) మఱియొక విశేషము కుమారశబ్దశక్తిచేతనే వారు బాలు రని స్పష్టమగుచున్నది కాగా జనార్దనుఁడు యాదవుల నిండుసభలో వాసుదేవుని దర్శించినప్పుడు అందాసీనులై యున్న యదువీరులలో హరితనయులు ప్రస్తావింపఁబడలేదు (4.141.) దానివలన వారికి రాజసభాప్రవేశమున కర్హమైన వయస్సు లేదని స్పష్ట మగుచున్నది

(3) హంసుఁడు సాత్యకితో యాదవుల కుశల మడిగిన సందర్భమున వాసుదేవ పుత్రుల సంగతి ప్రస్తావింపఁబడలేదు. (4-177) దీనినిబట్టి శత్రువులకు గుర్తింపఁగలుగునట్టి వయఃపరిమాణము గలవారు వారు కారని తెలియుచున్నది

(4) హంసునితో సాత్యకి శ్రీకృష్ణుని కండదండలై నిలచు వీరులను క్రమానుసారముగా నుగ్గడించుచు నిట్లనెను

సీ. హలపాణి ప్రథముఁ డాహవశాలి సాత్యకి నేను రెండవవాఁడ నిట్టివాఁడ
మొగజోదు కృతవర్మ మూఁడవవాఁడు నాలవవాఁడు నిశరుఁ డుల్లఅపుబిరుదు
కంసుఁ డేనవవాఁడు ఘనవిక్రమాఢ్యుండు వివిధుఁ డాఱవవాఁడు విజయధనుఁడు
వివిధాస్త్రనిపుణుఁ డేడవవాఁడు ప్రఘనుఁ డష్టముఁడు సారంగుఁ డుత్సాహశీలి

తే. నవముఁడు ఎమారదుండు సన్నాహమహితుఁ
డుద్ధవుండు పదముఁ డింక నున్నవారి
నెన్నఁ గొలఁదిగా దిట్లొట యెఱిఁగి కృష్ణు
వెదకి తిప్పుడు పులిఁ గోల ప్రేసినట్లు

ఇందు ప్రౌఢులైన పదిమంది వీరులు పేర్కొనఁబడినారు అందు వాసుదేవనందనులు లేరు కాని వారు బాలురై యున్నారు పైయదువీరు లోడి వంశ

గౌరవమును మంట గలిపినచో వారును, వారి తరువాత వాసుదేవనందనులును. హంసడిభకులకు కప్పము చెల్లించుచు సామంతులుగఁ బడియుండవలసివచ్చును. సాత్యకి యీ యంశమును గుర్తించి సాభిమానముగా హంసునితో నిట్లనినాఁడు.

క. "హరితనయు లిరువురును మీ
యిరువురకును ముందు కప్ప మెవ్వని కెవ్వం
దరుపఁగలవాడు వెఱ్ఱి
సురపతిపతిఁ బాసి రాజసూయము గలవే!" (4 - 201)

హరివంశమున నీకథనాఁటికి పిన్నవారు హరితనయులు. వాసుదేవుని తరువాత వారిది రాజ్యము. బొందిలో ప్రాణవాయు వున్నంతవఱ కాయదువీరులు యాదవ రాజ్యము శత్రుభోజ్య మగునట్లు చేయరు. అది వంశాభిమానమునకు, ఆత్మరక్షణకు సంబంధించిన యంశము. అందుకే సాత్యకి యట్లు మాటలాడి నాఁడు.

5) హంసడిభకులతో నైన యుద్ధమున నాహరితనయులు పాల్గొనినట్లు వర్ణింపఁబడలేదు.

పై అంశములను పరిశీలించినచో హంసడిభకోపాఖ్యానము ప్రవర్తిల్లిన కాలమునకు హరికి కుమారులు కలిగి రనియు, వారు బాలురై యుండిరనియు, గోళక్రీడాదులఁ దేలుచుండి రనియు, వారికి వారసత్వముగా వచ్చు యాదవ సార్వభౌమత్వమును రక్షింపవలసి వచ్చిన సమయము హంసడిభకులతోడి యుద్ధ కాలమున నేర్పడినదనియు, శ్రీకృష్ణుఁడు వారిని సంహరించి రాజ్యమును నిష్కం టక మొనర్చెననియు స్పష్టమగుచున్నది. బాణాసుర వృత్తాంతమునాఁటికి ప్రద్యుమ్నాదులు పెద్దవారగుటయే కాక వారి తనయులగు అనిరుద్ధాదులు యువ కులై యుద్ధవిశారదులై యుండిన ట్లాకథవలన తేటతెల్లము. కావున సంస్కృత హరివంశమునం దున్నట్లు బాణాసుర వృత్తాంతము తరువాత హంసడిభకోపా ఖ్యాన ముండుటకు వీలులేదు. హంసడిభకోపాఖ్యానము శ్రీకృష్ణుని తనయులను పేర్కొనుచున్నది. బాణాసుర వృత్తాంతము మనుమలను పేర్కొనుచున్నది. కావున నీవరుసయే సమంజసము. వంశాంకురోత్పత్తిని హంసడిభకోపాఖ్యానమున వ్యంగ్య మొనర్చి, బాణాసుర వృత్తాంతమున మనుమని పెండిలిని సంధించుటచే వంశాభ్యుదయ కావ్యమున నీ రెండు కథలకు అవశ్యక మేర్పడినది. శ్రీకృష్ణుఁ డొక కథలో కన్నతండ్రి యైనాఁడు. చివరి కథలో తాత యగుటయేకాక,

మనుమని రక్షించి వంగడపు మనుగడ నిలుపుకొనినాఁడు. సోముని రచన కొనసాగియున్నచో నాతఁడు ముత్తాతయైన మురిపెము గూడ చూపించెడి వాడేమో! మొత్తమునకు మూఁడుఁతరముల కథను ముప్పేటగా నల్లి ముచ్చటైన వంశకథా కావ్యమును గూర్చి, నాచన సోముఁడు కూడ సంవిధానచక్రవర్తిత్వమును నిల్పుకొనినాఁడు!

ఈ సంవిధానశిల్పమును గమనించినచో నాచన సోముఁడు యాదృచ్ఛికముగాఁ గొన్ని హరివంశకథలను తన యిచ్చవచ్చినట్లు పేర్చినట్లు చెప్పుటకు వీలులేదు. కథాసంవిధాన ప్రయోజనమును లెస్సగా యోచించి, దుష్టవంశాంకుర విచ్ఛేదమును, శిష్టవంశాంకుర పరిరక్షణమును సూచించి, క్రమపరిణామ విన్యాసమును పాటించి వంశకథాకావ్యమును సంతరించినట్లు విశదమగుచున్నది. తెలుగులో వెలువడిన వంశకథాకావ్యములలో నింతటి సమన్వయ వికాస సూత్రములతో వస్తుసంవిధానము చేయఁబడిన కావ్యము కానరాదు! అందు వలననే నాచన సోముని సంవిధాన చక్రవర్తిత్వమునకు శైథిల్యము కలుగలేదు!

నాచన సోముఁ డంతటితో నాగలేదు. అంతర్నిబిడమైన కథాకథన శిల్పసూత్రములతో పాటు తన కావ్యకథాసంవిధానమును తాత్త్విక సమన్వయ వ్యక్తితో శక్తిమంత మొనర్చినాఁడు. ఇది సామాన్యకవి చేయఁగలిగిన పని కాదు. హరివంశమున హరికథామాహాత్మ్యముల కెంత ప్రాముఖ్య మీయఁబడినదో హరిహరాద్వైతమున కంత ప్రాధాన్య మీయఁబడినది. కావున, నాచన సోముని కావ్యసంవిధానమున అనుబంధ ప్రయోజనము హరిహరాద్వైత మని నిస్సంశయముగఁ జెప్పవచ్చును!

నాచన సోముఁడు తిక్కన సోమయాజి ననుసరించి తన కావ్యమును హరిహరనాథున కంకిత మిచ్చెను. ఆశ్వాసారంభ పరిసమాప్తులయందు హరిహరనాథసంబోధన లుండుటచే కావ్యకథ లన్నియు నాపరద్వైతముయొక్క తత్త్వపరివేషముచే దీప్తిమంతములైనవి. ఐనను, కృతిపతి సంబోధనాత్మకములైన పద్యములు సర్వకావ్య సామాన్యములగుటచే వాని కంత ప్రాముఖ్య మిచ్చుటకు కొందఱు అంగీకరింపకపోవచ్చును. కాని, హరిహరాభేద తత్త్వ బోధకములైన యంశములు కథాంగములుగా నిబంధింపఁబడినచో నట్లనుటకు వీలుండదు. నాచన సోముఁ డట్టి సంవిధానమునుగూడ పాటించెను.

ఇక్కడ నొక విషయమును గమనింపవలెను. హరివంశమున ప్రధాన ప్రతిపాద్య వస్తువు హరిమాహాత్మ్యము. ఈ కావ్యమునందలి సర్వకథలును ఆ యంశమును పరమ తాత్పర్యముగా ప్రతిపాదింపవలసియుండును. అప్పుడు హరిహరాభేదతత్త్వ మనుబంధ ప్రతిపాద్యాంశ మగును. ఈ రెండింటికిని అంగికిని - అంగమునకును ఉండవలసిన సంబంధ ముండును. అంగము అంగికి పోషక మగును. అట్లు కానిచో కావ్యతాత్పర్యము దెబ్బతినును. నాచన సోముఁ డీయంశమును గుర్తించియే హరిహరాద్వైతమును ప్రతిపాదించెను. అతఁ డా తత్త్వమును ద్వితీయాశ్వాసమున ప్రధానకథాంశముగా నిబంధించెను. పుత్రార్థియైన కృష్ణుఁడు శివునిగూర్చి తప మొనరించెను. శివుఁడు సాక్షాత్కరించి కృష్ణునకుఁ బుత్త్రి నొసగెను. ఇచ్చట కృష్ణుఁ డర్థి: శివుడు దాత. ఇం దెవ రెక్కువ? స్థూలదృష్టికి శివుఁ డెక్కువ. కృష్ణుఁడు విష్ణువుయొక్క అవతారము. పుత్త్రార్థి యగునెడ అతఁ డాదినారాయణుఁడు కాడు. అందువలన అది పొసగినది. కాని, ఆపై వరప్రదాత యైన శివుఁడే కృష్ణుని హరిహరాత్మకుఁ డైన పరతత్త్వముగా స్తుతించినాఁడు.

గీ. "అవ్యబీజాయ, విశ్వక ర్త్రే౽క్షరాయ
నిర్గుణాయ గుణాత్మనే నిర్మలాయ
హరిహరాత్మనే ప్రవరదివ్యాయ యజ్ఞ
సూకరాయ నమో యనుచు న్నుతింతు." (2-219)

ఇప్పు డెవరు గొప్పవారు? విష్ణు వందుమా? కుదురదు. శివకేశవులు సమాన మనవలెను. నాచన సోముఁ డా కథాఘట్టమును ప్రవేశపెట్టిన తీరు గాంచినచో అబ్బురము కలుగును. జనమేజయుఁ డి ట్లనినాఁడు:

మ. "పరివాదాస్పదవాదమోదమదిరాపానంబుచే మత్తులై
హరి మేలంచు హరుండు మేలనుచు నాహా కొంద ఱీపొం దెఱుం
గరు కైలాసనగంబునందు మును లేకత్వంబు భావించి రా
మురవైరిం బురవైరిఁ బాపుట మహామోహంబు ద్రోహంబగున్." (2-68)

హరిహరాద్వైతమును కథార్థములందు నిబంధించు సందర్భమున నీపద్యము నాందివలె నమరినది. అభేదదృష్టి కద్వైతమంత్రమువలె కీర్తి కెక్కినది. ఉత్తర హరివంశ కథలలో కృష్ణునిపుత్త్రుఁడు శివవరప్రసాదుఁడు, కృష్ణునిశత్రువులు

శివవరప్రసాదులు. కృష్ణునకు కొడుకు నెత్తి ముద్దాడినను, పగవానిని తెగటార్చి నను శివద్వేషము లేదు. పగవానిపక్షమున పరమశివునిశక్తులు పోరునకు తలపడ వచ్చును. కృష్ణుఁడు తన శక్తులను వాని కెదురు నడిపింపవచ్చును. ఆశ్రితుల యార్భాటములవలన శివకేశవు లంతలో మోహింతురే కాని, దాని తత్త్వ మఱయ నిచో మనలను మోహమునందు ముంచి వైచెదరు. నిజమునకు హరివంశము విష్ణుమాహాత్మ్యమునే ప్రతిపాదించుచున్నది. కాని, ఆ విష్ణువునకును శివునకును భేదము లేదనినది. విరోధమును తొలగించి వివేకమును ప్రసాదించినది. ఇంత కంటె అంగికి అంగపుష్టి యేమి కావలెను? కావుననే నాచన సోముఁ డాతత్త్వము నీ కావ్యమున నుపదేశమంత్రముగా ద్వితీయాశ్వాసమున నిబంధించినాఁడు. దానిని తరువాతికథలలో పునరుక్తిచేయక వ్యంగ్యముగా సాధించి ఔచిత్యము పాటించినాఁడు. ఈ రహస్య మెఱిఁగిన వివేకి కావ్యార్థచర్వణమున శివకేశవాభేద రూపమైన సమన్వయమును రచనమున కనుసంధాన మొనర్చుకొనఁగలుగునట్లు కథాసంవిధాన మొనర్చినాఁడు.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ఉత్తర హరివంశములోని మహాతాత్ప ర్యమును వివరించుచు ప్రతి కథ కున్న ప్రత్యేకత నిట్లు పేర్కొనియున్నారు: "నరకాసురుని కథ చేత శ్రీకృష్ణుడు సర్వఖగోళ సర్వగ్రహాధికారియై యనంతా కాశమునందలి గోళసంచారమునకు తానే యధిపతి యగుట నిరూపింపఁబడినది. రెండవ కథయందు శ్రీకృష్ణుఁడు తాను పరమాత్మయై మృత్యువున నధిపతి యని నిరూపింపఁబడినది. ప్రణవస్వరూపము శ్రీకృష్ణుఁడే యని నిరూపింపఁ బడినది. ఈ పిశాచకథయందు దేవేంద్రాది పదవులిచ్చు మహాధికారి శ్రీకృష్ణుఁ డని నిరూపింపఁబడినది. మూఁడు నాలుగాశ్వాసములలోని పౌండ్రకవాసుదేవాది దైత్యమథనముచే దుష్టశిక్షకుఁడని నిరూపింపఁబడినది. పంచమషష్ఠాశ్వాసముల లోని బాణాసురకథలో శివతత్త్వముకంటె విష్ణుతత్త్వము శ్రేష్ఠమని నిరూపింపఁ బడినది. మాయావిహితమైన లోకప్రవర్తనయందు, లోకపాలనయందు శివ కేశవుల తత్త్వములకు సమానప్రతిపత్తి యున్నను, పరమేశ్వరభావమైన యాత్మ లక్షణమున విష్ణుతత్త్వ మధికమని నిరూపింపఁబడినది." (తెలుగు విజ్ఞాన సర్వ స్వము-శివ సం. పు. 1223.) విష్ణుమహత్త్వ ప్రతిపాదనమును మహాతాత్పర్య మును నాచనసోమన తన కావ్యమున నెట్లు సాధించెనో శ్రీ విశ్వనాథవారు

పైవాక్యములందు పేర్కొనియున్నారు. వారే పై వ్యాసమున మఱియొకచోట నిట్లనినారు: "ఈ యుత్తర హరివంశమునందు నాచన సోమన యేతత్ప్రంచ మహా కార్యనిర్ణాయకములైన కథలే తీసికొని వ్రాయుట విష్ణుపారమ్యబోధకత్వము తన కావ్యమునందలి మహాప్రబంధ ధ్వనిగా నిరూపించుట కుద్దేశించినాఁడని స్పష్టమగుచున్నది. అట్టి యుద్దేశమే, యాయుద్దేశ్యమును కార్యరూపముగ ధ్వనితము చేయుటయే మహాకవి లక్షణము."

శ్రీ విశ్వనాథవారు చెప్పిన విష్ణుపారమ్య ప్రతిపాదనము సోముఁడు భావించిన ముఖ్యాంశము. కథల నెన్నికచేయుటలో, వాని నాక్రమముననే సంధించుటలో, శివకేశవాభేదతత్త్వమును ప్రతిపాదించుటలో-ఇట్లెన్నింటిలోనో సోముఁడు సాధించిన ప్రయోజనము లెన్నియో కలవు. తత్సమాహార సంపుటియైన యతని కావ్యకథారచనమున సంవిధాన సార్వభౌమత్వము సాక్షాత్కరించు చున్నదని యీ వ్యాసమున ప్రతిపాదింపఁబడినది.

## హంసడిభకోపాఖ్యానము-కథాసంవిధానము :

గీ. "హంసడిభకులు లోసుగా నఖిలధరణిఁ
బెరుగు కంటకకోటిచేఁ బేదలైన
నరపతుల కీర్తిపటములు సిరుగకుండ
వెరపుతో నుద్ధరించిన వేల్పు శౌరి." (4.2)

అనెడి వైశంపాయనుని వాక్కులతో నుపాఖ్యానమును నాచన సోముఁ డారంభించెను. కథార్థసూచనయు, కథాకథన విధానమును సోముఁడీ పద్యమున, సూత్రధారుఁడు నాందీపద్యమునందువలె, సూచించి కథారంభశిల్పమును బాటించినాఁడు. ఆపై జనమేజయుని యభ్యర్థనపై 'తత్కథాప్రపంచమును వివరింపఁ బోవుచు వైశంపాయనుఁ'డనిన (4.6) మాటలతో కథాసంగ్రహమును పేర్కొని కథావిస్తృతి కుపక్రమించి యుపాఖ్యానశిల్పమును పాటించినాఁడు.

సాల్వదేశాధీశుఁడైన బ్రహ్మదత్తుఁడు భార్యాద్వయమునందు సంతానము లేమిచే శివునిగూర్చి పదియేండ్లు నిశ్చలతప మాచరించెను. ఒకనాఁ డతని కలలో శివుఁడు ప్రత్యక్షమై వరము వేడుకొనుమనెను. ఆ రా జిరువురు సుతులను కోరెను. శివుఁ డావరమిచ్చెను. రాణు లిరువురును గర్భవతులై శైవాత్మ లగు నిరువుర కొడుకులను గాంచిరి. వారే హంస డిభకులు.

బ్రహ్మదత్తునకు మిత్రసహుఁ డను విప్రుఁడు మిత్రుఁడు. అతఁడును సంతానార్థియై హరినిగూర్చి యైదేండ్లు తప మాచరించెను. అతనికి విష్ణువు చిత్రములోఁ బొడసూపి పుత్త్రుని ప్రసాదించెను. అతఁడే వైష్ణవాత్మకుఁ డగు జనార్దనుఁడు.

హంసడిబికులును, జనార్దనుఁడును బాల్యస్నేహితులై కలసి యాడు చుండిరి. సర్వవిద్యలను సాధించిరి. హంసడిబికులు శివుని గూర్చి తపమాచరింప హిమవన్నగమున కేగిరి. విద్యావివేకనిధి యైన జనార్దనుఁడు నిజగృహము నందే మురారి నారాధించెను. హంసడిబికు లైదేండ్లు జలవాయుమాత్రభక్షణ మున ఘోరతప మాచరించి శివునివలన నమరాసురాది సైన్యాధిపతుల కోడ కుండునట్లును, ఈశానరౌద్ర మహేశ్వరాద్యస్త్రములు వశమగునట్లును, కయ్యములలోఁ బ్రమథద్వయము వారికిఁ గాపుగా నుండునట్లును వరములను సాధించిరి. శివుడు భృంగిరిటి కుండోదరులను వారికిఁగాపుగానుండునట్లు నియమించెను. హంసడిబికు లంత వరప్రసాదసమ్మదభరితహృదయు లై వీరాభిమానవిజృంభితు లై నిజజనకరాజ్యవిభవమును విలసిల్లఁజేయుచుండిరి. జనార్దనుఁడు కులపతియై రాజకుమారుల నెయ్యమునకుఁ బాత్రుఁడై యుండెను. వీరు మువ్వురును వివాహితులై, యేకపత్నీవ్రతమును పాటించుచుండిరి.

ఇదియంతయు నసలుకథకు పూర్వరంగము. నాచన సోముఁడు దీనిని సంగ్రహముగను, సారవంతముగను రచించెను. ఇందు కవి హంసడిబికుల యొక్కయు, జనార్దనుని యొక్కయు స్వభావసంస్కారములందలి బీజభూతము లగు కొన్ని యంశములను నిక్షేపించి కథ చెప్పెను. రాజకుమారులు శైవాత్మకులు; జనార్దనుఁడు వైష్ణవాత్మకుఁడు. వారు మువ్వురును విద్యావంతులైనను వారిలో వివేకముతోఁ గూడిన విద్యావేత్త జనార్దనుఁడు. హంసడిబికులు హిమవన్నగమున ఘోరతప మాచరించి, శివుని మెప్పించి అస్త్రశక్తి గడించిరి. జనార్దనుఁ డింటనే యుండి జనార్దనుని భజించి భక్తిని జ్ఞానమును మనముసఁ బండించుకొని జ్ఞానియై, కులపతియై, వైదికమార్గనిష్ఠ మగు వర్తనమును సాధించెను. వారు శైవుల మని తెల్పుకొనుటకు ధనురస్త్రకవచధారణములతోపాటు రుద్రాక్షమాలికలను, ధవళవిభూతిని, 'హరహర' 'శివశివ' శబ్దోచ్చారణములను దాల్చి యార్భాటము చేయుచుండిరి. అతఁ డట్టి వేషములజోలికి పోక సాత్త్వికుఁడై జీవితము సాగించుచుండెను. పరశక్తులవలన రాజకుమారుల

కభిమానగర్వములు విజృంభించినవి జనార్దనున కంతర్వివేకమువలన భక్తి జ్ఞానసిద్ధులు లభించినవి

హంస డిభకు లాడంబరవర్తనులు వారి తపశ్శక్తి బాహుశక్తికి పుష్టి నిచ్చినది కాని జనార్దనునకువలె బుద్ధిశక్తికి పోషకము కాలేదు అందువలన భావికథలో నీపాత్రల యొక్క ప్రవర్తనలలో నీ సంస్కార తారతమ్యము తప్పక కానవచ్చు ననుటకు నాచన సోముఁ డీకథార్థముల నిట్లు రచించెను హంస డిభకుల వర్తనములచే వారి శీలములు రూపుకట్టించుటయు సార్థక విశేషణ ప్రయోగముచే జనార్దనుని శీలమును వ్యంజింప జేయుటయు సోముని రచనా శిల్పము పై కథలో కథాగతివలస రాజకుమారుల శీలములను విద్యా వివేకనిధి కులపతి యను రెండు విశేషణములవలననే జనార్దనుని వ్యక్తిత్వ మును మనము తెలిసికొన గలుగుచున్నా మను నంశము దీనికి తార్కాణము!

పరమేశ్వర వరప్రసాదగర్వులైన హంస డిభకులు సాధించిన ప్రథను విజయమెట్టిదై యుండునో తెలియవలయునని పరిత తబ్బిబ్బగుచుండును అది యే స్వర్గ విజయమాత్రమో లేక భూలోక దిగ్విజయ సంరంభమో యై యుండు నని యువ్విళ్ళూరుచుండును కాని హంసడిభకులు మొదట చెసిన ఘనకార్యము చిన్నవేట దానికి వారు చేసిన యార్భాట మంత యింత కాదు చతురంగ బలము లనే యడవులకు తరలించినారు ఇక వేటసామగ్రికి లెక్కయేలేదు జనార్దనుని గూడ వెంట తీసికొనిపోయినారు వేటకు ప్రారంభము పందులవేట ఆపై మను బోతులు లేళ్ళు దుప్పులు గంధర్వమృగములు ఉడుములు యేదుపందులు సివంగులు - ఇట్లు కానవచ్చిన వన్యమృగముల నన్నింటిని ఆ మహావీరులు చెండాడి చివర కొక తటాకతీరమును జేరినారు

ఓం మాత్రము వేటకు మహాస్త్రబలులు కావలయునా? పిచ్చుకమీద బ్రహ్మాస్త్రము వేసినట్లుండదా? పరితకు నవ్వు పుట్టింపదా? అట్లు పుట్టింపవలె ననియే నాచన సోముఁడు వ్రాసినాడు లేనిచో మహాస్త్ర సంపాదనఘట్టము తరువాత మనుబోతులవేట యేమి? కొందఱు వెటవర్ణన సోమునికాలమునాటి మృగయావినోద విశేషములను వెల్లడించుచున్నదనిగాని అంగాంగ వివర ణాత్మకమైన వర్ణనలలో సోమన సిద్ధహస్తుఁ డనిగాని వరాహకుల మృగయా వర్ణనమునందు సోమన సహజోక్తి ప్రయోగ పాండిత్యము వెల్లడియగుచున్నదని గాని ప్రబల ఘోణాగ్రపర్యస్త ముస్తాస్తంబజంబాలశబలవేశంతపంక్తి

(4-24) వంటి పద్యములు రచించుట సోమునికే సాధ్యమనిగాని, (4-19) వచన రచన జిలిబిలి తెలుఁగు పలుకులకును, జాతివార్తా విశేష వర్ణనమునకును పెన్నిధివంటిదని గాని,

చ. "కనిరి కుమారు లంత శశికాంతశిలాతల శీతలస్థలీ
వనఘన పాదపాదపనివారితవారితరంగరంగ న
ర్తన పరివర్తన ద్విరదదాన సదానమదాళిమాలికా
తను వనజాత నూతన బతాకముఁ బుష్కర మన్ తటాకమున్" (4-30)

అను పద్యరచనాశిల్పము, సార్థకశబ్దాలంకార సంవిధానము భావి ప్రబంధ కవుల కట్టి యుదాత్త వస్తు వర్ణనములం దొక యొరవడి తీర్చిదిద్దినదనిగాని ప్రశంసింప వచ్చును! నాచనసోముఁ డాసంగ్రహ సన్నివేశము నుదాత్తీకరించుట కన్ని కవితా విశేషముల నందు చొప్పించె ననుటలో నెట్టి సందియమును లేదు. సాధారణమైన వేటకు నైతము తన కవితా శక్తినే నసాధారణ స్వరూపము నీయఁగలిగిన మేటికవి యతఁడు. అయినను, అతఁడా సన్నివేశము నా కథా సందర్భమున సంవిధానము చేయుటచేత పాత్రస్వభావవ్యంజకమైన యొక విలక్షణ ప్రయోజనము సాధించె ననుట గమనింపఁదగిన యంశము. హంస డిభకుల యార్భాటమునకు, అయోగ్యచిత్త క్షేత్రములందు పతితమైన మహా శక్తుల శోచనీయ స్థితికి, వివేక విరహితమైన మహావీర్యవిలాసములకు ఈ సన్ని వేశమును సూచకముగా నీ కవి సంధించినాఁడు. దీనిని చదివినవాఁడు "కనకపు సింహాసనమున...." అన్న పద్యము జ్ఞప్తికివచ్చి హంస డిభకుల మేడిపండువంటి స్వభావమునకు చిఱునవ్వు నవ్వుకొనకమానఁడు. రాజకుమారుల 'వివేకభ్రష్ట సంపాతముల' కిది మొదటిపాటు!

రాజకుమారులు తనివితీర నీరములు గ్రోలి తరుచ్ఛాయల విశ్రమించిరి. ఆ సమీపముననే కాశ్యపమహాముని యజ్ఞము చేయుచుండెను. అందుండి సుస్వర శోభితమైన వేదధ్వని వినవచ్చుచుండెను.ఆ వేదసముచ్చారణ విధాన మారాజకుమా రుల నాకర్షించినది. నిస్సందేహముగా వా రాయ జ్ఞభూమికి పాదచారులై పయనిం చిరి. ఆపోవుటలో తమ సంపద, తనూవిలాసములు, బలపరాక్రమములు అచ్చ పడునట్లుగా, ధనుశ్శరధారణము చేసికొనిపోయిరి. సభాచార్యులకు సముచితముగా నమస్కరించిరి. వారు చేసిన సపర్యలను సంతోషముతో స్వీకరించిరి.

పరస్పర సమ్మానములందు గల సదాచారసంపత్తి వారి వేషములలో లేదు. ఆ వేషములు వారి యహంకారమునకు వ్యాఖ్యానములు. యోగ్యతాయోగ్యతల నెఱుంగనివారి యహంకారములు వింతపోకడలు పోవుచుండును. హంసుఁడు యజ్ఞమును నిర్వహించుచున్న కాశ్యపుని గాంచెను. తాను యజ్ఞము చేయలేదు. ఆ యంశమున నెదుటనున్న కాశ్యపుఁడు తనకంటె మిన్నయగును. అట్టి భావమతని యహంకారము సహింపలేదు. అతని చిత్తవృత్తి చిత్రముగా పని చేసినది. వెంటనే మునులతో నిట్లనినాఁడు:

క. "మా తండ్రి రాజసూయముఁ
బ్రీతిం జేయఁగఁ దలంచి పిలువం బనిచెన్
భూతలమునఁ గల నృపతి
వ్రాతంబుల; మీరు నరుగవలయు నచటికిన్." (4. 38)

మ. "క్షితి నాతమ్ముఁడు నేను దిగ్విజయముం జేయంగ డాయం గడున్
బ్రతివీర ప్రకరంబు డంబు మెయిఁ గప్పం బొప్పనం బీక యే
కత మాడం గలరే? నరేశ్వరశిరోగర్వంబు సర్వంబుఁ బా
పితి మీశానవర ప్రసాదమున మాపెం పెల్లడం జెల్లఁగన్." (4. 39)

బ్రహ్మదత్తుఁ డప్పటికి రాజసూయము సంకల్పింపలేదు. హంసుఁడు వేట నుండి తిరిగి యింటికిపోయి తండ్రిచేత రాజసూయము తలపెట్టింపఁజేసెనని భావి కథలో (4. 118) స్పష్టమగును. సంకల్పమే లేనప్పుడు నృపాలకుల కాహ్వానము లెక్కడివి? హంసుని యహంకారమునుండి రాజసూయ సంకల్పము తత్కాలమున పుట్టినది. అతఁడు దాని నొక కథగా నల్లినాఁడు. ఈశానవర ప్రసాదజనితమైన పెంపునకు నరేశ్వర శిరో గర్వము లణగిపోయినవి గాన దిగ్విజయ మనాయాస పని గొప్పలు చెప్పుకొనినాఁడు, స్థూలముగా హంసుఁ మున కది సూచకమనుట తథ్యము; అందువలననే ఋషుల కందించెడి యాహ్వానములో నంతటి దురహంకారము గుబాళించుచున్నది! ఇట్టి విచిత్రమైన దుష్టలక్షణములను హంసుని చర్యలవలన వ్యంజింపఁజేయుటయే సోమన సాధించిన కథాసంవిధాన శిల్పము.

నాచన సోముఁడు పాత్రోచిత సంభాషణములను రచించుటలో నందెవేసిన చేయి. కాశ్యపాదులు మహర్షులు. కర్మఠు లయ్యు తపస్వులు. లోకాచారవిదు

లయ్యు త్రికాల వేదులు. హంసుఁ డావులింపంఁగనే ప్రేవులు లెక్కపెట్టినారు. కాని, అంత తేలికగా బయటపడలేదు. నిపుణములైన వాక్కులచే నధిక్షేప గర్భములైన వినయోక్తుల నుగ్గడించినారు:

క. "అనుటయు వాసంయములు హం
సునితో నిట్లనిరి రాజసూయమునకు మీ
జనకుఁడు దొడగినఁ జాలును
మునుముట్టన వత్తు మిందు మోసము గలదే." (4.40)

"మీ తండ్రిగారు రాజసూయ మారంభించిన చాలును, మేమందరము మునుముందుగనే వచ్చెదము. ఇందు కపటమేమియు లేదు" అనునది సామాన్య మైన భావము. "అసలు మీ తండ్రిగారు యాగము మొదలిడినప్పటికి కదా! అప్పటికి వచ్చెదము. కాని, ఇందేమైనా మోసము కలదా యేమి? (లేక ఇందు నీకు కీడు కలదు సుమా!)" అనియు కాకువుచే సాధింపఁదగు నర్థవిశేషము గలదు. హంసుఁ డంత వివేకి కాడు. మహర్షి వాక్కులలోని గండము నెఱిఁగెడి దండి యైన తెలివితేట లతనికి లేవు. అట్లు లేకపోవుటకు గర్వాంధ్యము కారణము.

హంసుఁ డంతఁ దమ్మునితో, జనార్దనునితోఁ గలిసి కొంత ముందుకు సాగినాఁడు. అచ్చట దుర్వాస మునీంద్రుఁడు గోచరించినాఁడు. అతఁడు యజ్ఞయాగములు చేయుటలేదు. శిష్యనికాయమునకు బ్రహ్మానందస్థితి నందఁ జేయు సాధనమున సాయపడుచు జ్ఞానముద్రతో బ్రహ్మోపదేశము నొసంగు చున్నాఁడు. అది యొక నిశ్చలము, నిరంతరాయము నైన జ్ఞాన యజ్ఞము సాగించుచున్నట్లున్నది. అతని బడుగుదేహము, సన్న్యాసి వేషము రాచబిడ్డలకు హాస్యాస్పదముగానే గాక, అసహ్యముగఁ గూడ నైనది. హంసడిభకుల యాగ మనము నా మహర్షి గమనింపనే లేదు. కన్నులు తెరచి చూడలేదు. కాశ్యపునివలె సమాహ్వానవిధులను నిర్వహింపలేదు. హంసుని యహంకారము దెబ్బతినినది. ఒడలు తెలియని కోపము మోసు లెత్తినది.

క. "మిడికెదు పెదవులు వ్రేఁకలు
ముడిచెదు కనుదోయి మొగిడి మాయెడఁ గడున్
వెడవీఁక యొడలు చేసెదు
కడపల జపమునకు నేఁడు గలదో లేదో?" (4.41)

అని యదలించినాఁడు. యోగసమాధిలో నున్న దుర్వాసమహర్షి హంసుని కన్ను లకు "కడున్ వెడపికఁ యొదలు చేసెడి" దాంభికునిగాఁ బొడకట్టినాఁడు. అహంకారము కన్నుల కెగఁబుస్సుట యసఁగా నట్టిది. సన్న్యాసియైన దుర్వా సుఁడు చేసెడి నిరాదరణ మాతనికి సన్న్యాసాశ్రమదూషణమునకుఁ బేరేచినది. గార్హస్థ్యమును గ్రహింపనిచో దుర్వాసుని ప్రాణములు తీసెద నని పై కురికి నాఁడు హంసుఁడు.

ప్రక్కనున్న జనార్దనుఁ డీ హఠాత్పరిణామమున కదలిపోయినాఁడు. 'మాన్యావస్కంద క్రులికఠోర వచనములు' తేజస్కరములు కా వని హంసుని మందలించినాఁడు. ఆశ్రమచతుష్టము ప్రాధాన్యము నుగ్గడించినాఁడు. ఎంత చెప్పినను వినునట్లు కనఁబడలేదు హంసుఁడు. కటకటపడి వారితోడి చెలిమి చేయుటయే చెట్ట యని చీదరించుకొనినాఁడు.

గీ. "చెలిమి మీతోడఁ జేయుట చెట్టతనము
దానఁ గీ డెంత పుట్టినఁ దగిలె నాకు
ననుభవింపక పోవునే యక్కటకట!
వరుగుతో దాఁగరయు నెండవలసినట్లు" (4.54)

అని వాపోయినాఁడు. ఇంతలో దుర్వాసుఁడు కన్నులు దెఱచి యంతయు గమ నించినాఁడు. 'ఒకచంటఁ బాలు నొకచంటను నెత్తురు గురియుగతి' కరుణయు, కోపము కనుగవ నొరయగా జనార్దనుని, హంస డిభకులను వీక్షించినాఁడు. హంస డిభకులపై నఖండ కోపము వచ్చియు నామహర్షి నిగ్రహించుకొనినాఁడు.

గీ. "నన్నుఁ గనలించి బ్రదుకఁ గన్నారు లేరు
పొలిసితిరి పొలిసితిరి వే పొందు తొలఁగి
బమ్మ దరికొను కోపంబు మ్రింగికొంటి."

వ. అది యెట్లనిన—

ఆ. "చక్రధరుఁడు బారిసమర నున్నాఁడు మి
మ్మింక వేఱె కోప మేల నాకు
తెలుఁగుమాలి తవుడు దిని చచ్చువానికి
విషము పెట్టువాఁడు వెఱ్ఱివాఁడు" (4.60-62)

అని యేవగించుకొని వదలినాఁడు. హంసునికి అగ్నియందు ఆజ్యము పోసిన ట్లయినది. ''తాను స్నికృమ పెద్దవాఁడుబలె నీతం డిత్తఱి న్నకృఁ బగ్గానం

బట్టినయట్లు బిట్టుబిగియంగా నెంత సేపైన నిచ్చో నుండన్ సమకూరునే మనకు" ననుచు హంసుఁ డాముని కౌపీనమును జించి యవమానించెను. జనార్దనుఁడు వారింప యత్నించెను. కాని, లాభము లేకపోయెను. యతులు భయపడి నలు దిక్కులఁ బరువెత్తిపోయిరి. దుర్వాసుని యెలుఁగు సన్నగిల్లినది.

"చేయఁదగని కీ డెల్లఁ జేసితిరి మీరు
చెలువనోపుదు శాపంబుచేత మిమ్ము
నయిన యతినైన నా కేల యాగ్రహంబు
దానవాంతకుఁ డిటమీదఁ దాన చెలుచు." (4.67)

అని హుంకరించి హంసుని పోపొమ్మని తిరస్కరించినాఁడు. జనార్దనుని దీవించి 'త్వరలో నీకు శ్రీవల్లభుని దర్శన మగును, ఇహపర సుఖము లబ్బును. ఈ వృత్తాంతము నీ జనకునితోఁ జెప్పుము' అని సాదరముగాఁ బంపించినాఁడు.

ఉత్తరహరివంశమున పఠితల నాకర్షించు రసవత్తరఘట్టములలో నిది యొకటి. అందువలన నింతగాఁ జెప్పితిని.

ఈ సన్నివేశ సంవిధాన రహస్యము కథాగతికి సంబంధించినది. సమర్థుఁడైన కవి కథాగతి నత్యంతసహజముగా నడుపును. సహజ మనఁగా పూర్వాపర సన్నివేశములు కృత్రిమములు గాని హేతువులచే ఒక దానినుండి యొకటి అలవోకగా పుట్టునట్లు చిత్రించుట. నాచన సోముఁడు హంసడిభకులయందు గర్వ మున్న దని చెప్పెను. వేటవలన వివేకము లే దని సూచించెను. కాశ్యపాశ్రమ సన్నివేశమున నహంకారవిస్ఫూర్తిని ప్రకాశింపఁ జేసెను. ప్రతినాయక పాత్రయొక్క శీలచిత్రణమునందలి క్రమోన్మీలన దశలను చిత్రించు ప్రయోజనము శిల్పసంబంధమైనది. దానికిని కథాగతికిని సోమన చక్కని సంవిధానము చేసినాఁడు. వరలాభఘట్టమున కథాగతికి హేతువైన చైతన్యశక్తి సిద్ధమైనది. మృగయావినోదఘట్టమున నాశక్తి కార్యోన్ముఖమైనది. కాశ్యపాశ్రమమున కథాకార్యమునకు బీజావాపనము జరిగినది. హంసుడు రాజసూయయాగసంకల్పము చేయుటయే యీ కథకు బీజము. అంతకు ముందున్న కథయంతయు పూర్వరంగము. అసలు కథకు అప్పటినుండి ఆరంభము!

హంసుఁడు తండ్రిచే రాజసూయమును చేయింప సంకల్పించి, నగరి కేఁగి తండ్రిచే నట్లు చేయించినచో కథ సాగుట కభ్యంతరము లేదు. కాని, నాచన

సోముఁడు నడుమ దుర్వాస పరాభవఘట్టమును జేర్చెను. దీనివలన కథానిర్మాణమునకు సంబంధించిన ప్రయోజనములు కొన్ని సాధింపఁబడినవి. శైవులైన హంసడిభకులకు విష్ణు వన్నను, కృష్ణుఁ డన్నను మొదట ద్వేషము లేదు. జనార్దనస్నేహమే యందులకు సాక్ష్యము. జనార్దన ప్రభావముచె కృష్ణుని మిత్రునిగా యజ్ఞమున కాహ్వానించు నవకాశము లేకపోలేదు. రాజులచే కప్పములను గొనుట తథ్యమని హంసుఁ డాశ్రమమున నన్నను. అవి అనాలోచితములైన మాటలు. కావున ఈ కథలో హరితోడి విరోధమునకు బలమైన హేతువు కావలెను అందువలన దుర్వాసపరాభవఘట్ట మవసరమైనది. పరమకోపిష్టి యైన దుర్వాసుఁడు "యతి నైన నాకేల యాగ్రహంబు, దానవాంతకుఁ డిట మీఁదఁ దాన వెలుచు" నని శాంతమును ప్రకటించుటయే అపూర్వమైన యంశము: పైపెచ్చు వాసుదేవుడు హంసడిభకులహంతకుఁ డగు నని సూచించుట విచిత్రము. దానిచే హంసునికి దుర్వాసునిపై కసి పుట్టినది, గోవిందునిపై పంతము కలిగినది. కసితో యతుల సొమ్ములు మసిచేసినాఁడు. హరిపై పంతము తీర్చుకొనుటకు రాజసూయము నాసటగాఁ జేసికొనినాఁడు. కావున, దుర్వాసుని కథ లేనిచో ప్రతినాయకునియందు నాయక ప్రతీకారవాంఛ లేదు; అతని మరణమున కనువైన పాప పరిపాకము సిద్ధముకాదు; నాయకుని దుష్టశిక్షణకళా వ్యాపారమున కవసరమైన రౌద్రోద్రేకము భాసింపదు. ఒక విధముగా కాశ్యపాశ్రమ ఘట్టము కథలో ముఖసంధిని సూచించుచుండ, దుర్వాసాశ్రమఘట్టము ప్రతిముఖసంధిని సాధించుచున్నది.

కాశ్యప దుర్వాసాశ్రమ ఘట్టములు సహజ విరుద్ధ స్వభావములు కలవి యగుటచే నొక దానివెంట నొకటి రాణించినవి. ఒకటి కర్మఠుల యావాసము, మఱియొకటి జ్ఞానుల నివాసము. ఒకటి లౌకికపారలౌకిక క్రియాకలాపనిపుణము, మఱియొకటి మోక్షైకలక్షితమైన తత్త్వచేతనము. హంసడిభకులు కర్మలను. కర్మఠులను గౌరవించిరి; జ్ఞానమును, యతులను హింసించిరి. కర్మలవలన మోక్షము రాదు. జ్ఞానమును వీడి మోక్షము లేదు. కావున ప్రతినాయకులు మోక్షార్హమైన యోగ్యత లేని కర్మవాదులు. జనార్దనుఁడు జ్ఞాని. అందువలననే దుర్వాసుఁ డాతని కిహపరసుఖావాప్తి కల దని యాశీర్వదించెను. ఇట్లు నలుపు తెలుపుల వర్ణచిత్రములుగా ఘట్టములను చిత్రించి కథ కాస్వాదనీయశక్తిని పెంపొందించుట సోముని సంవిధానశిల్పము!

హంసడిభకు లాశ్రమము వీడి వెడలిన తరువాత దుర్వాసమహర్షి చిత్తమున రోష శోకము లుద్భవించినది.

శా. "దుర్వారోద్గమరోషపోషణములై దూర్త ప్రలాపంబు లం
తర్విద్యామహిమం గలంప యతు లంతం జేర నేతేర నీ
నిర్వేదం బుడిగింప నచ్యుతుఁడ హో నిర్వాహకుం డంచు నా
దుర్వాసోమునిపుంగవుండు గదలెన్ దుఃఖాకులస్వాంతుఁడై." (4-74)

దగ్ధశేషములైన కౌపీనములను, దండములను, ఆసనములను, కమండ శకలములను మూటలు కట్టించి సహస్రయతిప్రవరుల మూపుల కెత్తించి, ద్వారకాపురీద్వారమున నిలిచినాఁడు దుర్వాసుఁడు. పణిహారులు గోశక్రీడలో మునిఁగి యున్న గోపాలున కీవార్త నందించినారు. వాసుదేవుఁడు సంభ్రమమున నేతెంచినాఁడు. ఎదుట —

మ. "వసుదేవాత్మజుఁడుం గనుంగొనియె దుర్వాసఃపరివ్రాడ్విభున్
రసనారూపకలాపశాపవచనప్రారంభసంభావితున్
వ్యసనవ్యాప్తరిరంసహంసడిభకవ్యాళవ్యథావ్యాకులో
ల్లసనున్ వేషవిశేషరోషవిషయోల్లాసోద్భృతభ్రూకుటిన్." (4-82)

శ్వాసాక్షరానుప్రాసమండితమైన ఛందమున దుర్వాసుని క్రోధవిషాదమూర్తిని విభావముగా దర్శించినాఁడు వాసుదేవుఁడు. యతులకు యథోచిత సత్కారముల నొసంగినాఁడు. దుర్వాసుని జ్ఞానసిద్ధిని ప్రశంసించినాఁడు. నిరీహుఁడైన యా యతీంద్రుని యాగమన కారణము నడిగినాఁడు. సర్వజ్ఞుఁడైన కృష్ణుఁడే అమాయకునివలె నాగమన కారణమడుగుటతో దుర్వాసునిగుండె భగభగ మండినది; ఒడలు కంపించినది; నిట్టూర్పులు నిబిడము లైనవి; మొగము జేవురించినది. అట్లయ్యు నాయతి యంతరంగము నడుపులోఁ బెట్టుకొని నారాయణునితో నిష్ఠురములు మొదలుపెట్టినాఁడు: "ముకుందా! త్రైలోక్య రక్షాదీక్ష గైకొన్న గదాధరుఁడవుగదా నీవు! మా సంగతి తెలియ దని నంగనాచివలెఁ బల్కినచో మా చిత్తము లుత్తలమందవా? చతుర్ముఖాదులు, దిక్పాలకులు సేవింప వైకుంఠమున వసించు నిన్ను నే నెఱుఁగనా? దాగంబోయి తలారివాని యెదురన్ దాగంగ నీకేటికిన్? నీకు మేము ప్రాతవారమే. నీ వీయవతారము లెత్తక పూర్వము నీ నిజరూపము నెఱింగినవారము. మా మనములకు, కనులకు

నీ రూపము నిత్యసాక్షాత్కారము కావున మమ్ము పరాయివారినిగా భావించి యిట్లలయింపకుము మాముం దిట్టేమియు తెలియనివానివలె మెలంగెదవేల? ప్రేళ్ళతో మొదలు చూచి చెట్టెటుఁ(బవాని కాకులు సిదుమనేల? ఇంతటి నీవు మాకుఁ గల్గిన దుఃఖ మెఱుంగవా? యని శ్రీకృష్ణునితో నాతని యాదినారాయణ స్వరూపస్మృతి వచ్చున ట్లుపాలంభించి నిజవృత్తాంత మారంభించినాఁడు దుర్వాసుఁడు హంస డిభకుల గర్వాతిశయమును వివరించి వారివలన యతులు పడినపాట్లను నివేదింప నుద్యుక్తుడై తాము తెచ్చిన భగ్నవస్తుసంభారమును మూటలువిప్పి ముందుంచినాఁడు కమలలోచన ముంజేతికంకణమున కద్ద మేటికి? నీసొమ్ము లరయరాదె యని వానిని వేర్వేర చూపించినాఁడు తన నిర్వేదమును దనుజాంతకుని కర్తవ్యమును దేటపడునట్లు నిపుణముగా నిట్లు నివేదించినాడు.

సీ ఈ కమండలుపఙ్క్తి నెటుచూతు నిట్ల త
 త్పావమస్తకంబులు వగులకున్న
నీదండనివహంబు నెటుసూతు నిట్ల త
 ద్ధూర్తహస్తంబులు దునియకున్న
నీవల్కలవ్రాత మెటు చూతు నిట్ల త
 త్కపట చర్మంబులు గాలకున్న
నీశిక్యసముదాయ మెటు చూతు నిట్ల త
 ద్వేషదాంత్రంబులు ద్రెవ్వకున్న
తే నకట మోమోచ లేక తా రంత చేసి
 బ్రదికిపోయిరె పులి పేదవడినఁ బసుల
వాండ్రె యెక్కడి రనుకత వచ్చె నాకు
 ముసలలోపల నాలుకముల్లు విఱిగె (4-102)

శత్రుకృతపరాభవప్రతిఫలము లైన భగ్నవస్తువులను ఇంధనసామగ్రిగా ప్రదర్శించి నాయకుఁడైన కృష్ణుని చిత్తమునందు క్రోధాగ్నిని ప్రజ్వలింపఁజేసెడి ప్రసిద్ధ సన్నివేశ మిది కమండలములు - మస్తకములు దండములు - హస్తములు వల్కలవ్రాతము - చర్మములు శిక్యసముదాయము - ఆంత్రములు ఎంత చక్కని యుపమాన ద్రవ్యముల నెన్ని శత్రుసంహారకృత్యమున కుద్దీపనములుగా కల్పించినాఁడు పులి పేదవడిన నాలుక ముల్లువిఱిగె అను

జాతీయోక్తులతో తన దైన్యావస్థను మూర్తీభవింపఁజేసి దానవాంతకుని కోప తీక్ష్ణత కూడదర వెట్టినాఁడు.

క. "మాకేది దిక్కుఁ దెరవో
లోకంబులు మూఁడు నింతలో నే మగునో
నీకడు పట సర్వంబును
జేకొనవే దుష్టశిక్ష చేసి మురారీ!" (4. 104)

అని మొరపెట్టుకొనినాఁడు. శ్రీకృష్ణునియందు విష్ణుచైతన్య ముద్బోధింపఁబడినది. హంస డిభకుల సంహరించుట కాదానవాంతకుఁడు ప్రతినఁబట్టినాఁడు. యతులను నమ్మించుటకు సాత్యకిపై నొట్టుపెట్టినాఁడు. దుర్వాసునితో విరోధము వన్ని హంస డిభకులు కొఱవితోఁ దల బఱికికొన్నారని సమాశ్వాసించినాఁడు. బ్రహ్మదు లడ్డము వచ్చినను ఆ పనిని సాధించెద నని ధైర్యము చెప్పినాఁడు. రణరంగ మున హంస డిభకులను కండకండలుగా నఱకి కాకులకుఁ గ్రద్దలకు వైచెదనని కసితీర మాట్లాడినాఁడు. యతిసమూహ మా ప్రతినతో నుపశమించినది. సర సాన్నములు కుడిచి శాంతి చెందినవి.

హంస డిభకోపాఖ్యాన మొకయంక మైనచో నిది యొక రసవత్తరమైన రంగమగును. యాదవనాథునియందు దుర్వాసుఁడు లోకనాథుని దర్శించినాఁడు, దుష్టశిక్షణ శిష్టరక్షణావశ్యకతను అతనికి సూచించినాఁడు. దుర్వాసుని నివేదనము నాయక క్రోధోద్దీప్తికి క్రమసోపానము. ఆలంబనవిభావములైన యతికదంబ ములు, ఉద్దీపనవిభావములైన భగ్నవస్తు ప్రదర్శనములు, నిర్వేద క్రోధాది భావవ్యంజకములైన దుర్వాస వాక్య విన్యాసములు నాయక రసభావోత్పత్తికి నాణెమైన సాధనములు. గోవిందుని వాక్యములు తద్భావ వ్యంజకములైన వాచికాభినయములు. పరోక్షముగానైన ప్రత్యర్థి దుశ్చేష్టితములు ప్రత్యక్ష నివేదనముచే చర్వ్యమాణములగుటకు నిపుణముగా ప్రయోగింపఁబడుట యీ సన్నివేశ రామణీయకము! నాయక క్రోధోద్దీప్తికి మూలహేతువైన యీ సన్ని వేశము సాహిత్య రసపోషకుఁడైన నాచన సోముని రసోదయ సామగ్రి సంవిధాన మునకు చక్కని యుదాహరణము!

ద్వారకనుండి రంగము మఱల సాల్వనగరమునకు మాఱినది. హంస డిభకులు తండ్రి నొప్పించి రాజసూయాధ్వరయత్నములు సాగించిరి. జనార్ద నుఁడు రాజకుమారులకు హితవు బోధించినాఁడు:

"రాజసూయంబు చేయ నేరాజు దలఁచు
నాతనికి రాజు లరిగాఁపు లయినఁ గాని
నిర్వహింపదు మన మెల్లి నేఁడు సేయు
లావు మెఱయునె? ధర యింగలాలపుట్ట" (4-120)

అని హెచ్చరించుటయే కాక, భీష్మద్రోణబాహ్లిక భీమ శ్రీకృష్ణ బలభద్రసాత్యక్యాది వీరుల నోడించుట యసాధ్యమని నొక్కి వక్కాణించినాఁడు. దుర్వాస పరాభవ వృత్తాంత శ్రవణముచే కృష్ణుఁ డాగ్రహించిన వృత్తాంతము నెఱిఁగించినాఁడు. ఆప్తమంత్రిగా తన బాధ్యత తాను నిర్వహించినాఁడు హంస డిభకుల కది తలకెక్కలేమ. జరాసందుని యండదండలు చూచుకొని రాజసూయము నిర్వహింప నుద్యుక్తులైనారు.

హంస డిభకులు యాదవుల నుప్పు కప్పముగాఁ గొని యాగమునకు రమ్మని జనార్దనుని రాయబారిగాఁ బంపినారు. యాదవులు కప్పమున కంగీ రింప రని వారికి తెలియును. అందును ఉప్పు కప్ప మన్నతోడనే చిటపట లాడెద రనియు తెలియును. అయినను విష్ణుభక్తుఁ డగు జనార్దనుని పంపిరి. శత్రువుల నవహేళనము చేయుటలో నది యొక విచిత్రమైన పద్ధతి. జనార్దనుని కీరాయబారము విఫల మౌనని తెలియును. కాని, శ్రీకృష్ణ దర్శనభాగ్య మీకారణ మున నాతనికి లభించుచున్నది. తీర్థము స్వార్థము కలిసివచ్చె నని యాతఁడు ద్వారకకు పయనమయ్యెను. దారిపొడుగున నాకమలాక్షుని దర్శనవిశేషభాగ్యమును స్మరించుచు నాతఁడు తన్మయుఁ డయ్యెను. భక్తిపారవశ్యముతో గోవిందుని సభలో ప్రవేశించెను. శ్రీకృష్ణుఁ డతనిని కుశలప్రశ్నలు వేసెను. అందుకు సమాధానము చెప్పుచునే 'సర్వాంతర్యామి వైన నీ వెఱుఁగవా? విశ్వపతీ!' యని వచ్చినపనిమాట వదలి యప్పటి తన శోచనీయస్థితిని ఆ యాపద్బాంధవునకు నివేదించుకొనెను.

ఉ. "ఉండుట తప్పు వారికడ, నుండమి త, ప్పేటి రాక తప్పు, రా
కుండుట తప్పు, తప్పులకు నొప్పులకున్ గతి నీవ దేవ! యే
నొండొకరుండనే, పలుక నేరక నేరకయుండఁ జేయు నీ
యొండితనంబుచేత నిసిఱంతలు వాఱెడి చిత్త మిప్పుడున్." —(4.148)

రాయబారిగా వచ్చిన జనార్దనుఁడు ప్రపన్నుఁడుగాఁ బలుకుచున్నాఁడుఁ ఇది కార్యమునకు విరుద్ధము. కృష్ణుఁ డాతనియం దార్ద్రుఁడయ్యు నాతనిచే

నివేదింపఁబడు శత్రుసందేశమునకు ప్రాధాన్య మిచ్చి మాట్లాడినాఁడు. ''చల్లకు వచ్చి ముంత దాఁచినగతి నింత మాటువడఁ జేసినఁ గార్యము గానవచ్చునే?''

"రావలదే పంచిన పని
సేవకులకుఁ బాముకాటు సీరఁ చుడిచినం
బోవునె వా రే మనిరో
నీ వేలా దాఁచె దేమి నేరమి నీకున్'' (4.150)

అని యదలించినాఁడు. అప్పటికిగాని అసలు విషయము బయట పెట్టలేదు జనార్దనుఁడు. అదియును వెన్నకంటె మెత్తగాఁ జెప్పినాఁడు. అంతియ చాలని కృష్ణుఁ డాగ్రహోదగ్రుఁ డైనాఁడు.

రాయబారి గడుసరి యైనచో కృష్ణునిపని తేలికయ్యెడిది. యాదవసభలో కోపము ప్రజ్వలింపవలె నన్న ఆ జనార్దనునివాక్కులు చాలవు. అందువలన వాసుదేవుఁడు చేసిన యర్భాట మంతింత కాదు. మెత్తగా వినఁబడిన జనార్దనుని మాటలవెంటనే కృష్ణుఁడు 'రోసంబునకు మూలంబైన హాసము' చేసినాఁడు. దానితో సభలో రోసము మోసులెత్తినది. గోవిందుఁడు ఉప్పుపై చమత్కరించి శత్రువు నధిక్షేపించినాఁడు.

ఉ. "అప్పన మెంత గావలె సహంకరణంబు దొలంగి యిచ్చినం
గప్పము పేర, నేఁడు నొడికారితనంబున మోసపుచ్చఁగా
నుప్పులు దెత్తురే సమయోగ్యతలంబున వైరికోటితో
నుప్పునఁబట్టి లాడునెడ నుప్పులు దెత్తురుగాక యాదవుల్." (4.155)

సభలో నున్న సర్వజనుల కందుబాటులో నున్న లోకోక్తి నెన్నుకొని తద్భావ తీవ్రత నాస్వాదించు సౌలభ్యము కల్పించినాఁడు. యాదవులు తమలో తాము నాయకుని తాత్పర్యము నెంచికొని యాతని వలె వారును శత్రువు నవమానించినారు. కృష్ణుఁడు వారితో కలిసి కలకల నవ్వినాఁడు. 'వీరులైనవారు అలుగుమొనఁ గాక కప్పంబు లడుగ నగునె?" యని యవహేళనము చేసినాఁడు. హంస డిభకులను సంహరించు నుపాయము నాలోచించుచున్న కృష్ణున కీయవకాశము తగిన సమయమునకు వచ్చినది.

మ. "వెదుకం బోయిన తీవ కాలఁ దవిలెన్ వేయేల దుర్వాసుచే
మొదలన్ సంచకరంబు హంసడిభకోన్మూలక్రియా కేళికిం
గుదురై యున్నది సాటిగాక యిట మత్కోదండకాండోదర
ప్రదరప్రావరణాంబుద ప్రకటశంపాకంపశాత్కారముల్" (4.163)

అని హుంకరించినాఁడు. హరునివరబలము తన బాహుబలముముం దాగదని హెచ్చరించుచు 'పిడుగు[వేసినఁ దలటొప్పి యాగునే' యని ధిక్కరించినాఁడు. యుద్ధమునకు సిద్ధమని సమాధానము చెప్పినాఁడు.

కాని, తన వేడి మాటలను జనార్దనుఁ దండఁ జేయఁగలఁ డను నమ్మక మాతనికి లేదు. అందువలన ఏరావతారుఁ డగు సాత్యకిని జనార్దనుని వెంట పంపినాఁడు. జనార్దనుఁడు సాల్వనగరమునఁ జేరి హంసడిభకుల యెదుట సాత్యకినిఁ గీర్తించుచు పరిచయము చేసినాఁడు. కుశల ప్రశ్నానంతరము జనార్దనునిఁ గాంచి వోయిన కార్య మేమయ్యె నని హంసుఁడు ప్రశ్నించినాఁడు. జనార్దనున కాజగన్మోహనుని దర్శించిన తన్మయత్వము వీడలేదు. ప్రహ్లాదునివలె హరిని గీర్తించినాఁడు. తాను చెప్పిన మాటలకు యాదవ సభలో నవ్వనివారు లేరని నాఁడు. శ్రీకృష్ణుఁడు రాయబారి యగు తనపట్ల చూపిన నిరాదరమును వాక్రుచ్చినాఁడు. చివరకు తన యభిప్రాయము నిట్లు జోడించి హితవు పలికినాఁడు:

"అకట నేరనివా రైరి హంసడిభకు
లేమిగా నిందుఁ బుత్తెంచి రే నిదేల
వచ్చి వీటిఁడి నైతి నివ్వాసుదేవుఁ
డేటిచూడరా దని చాల దిగులు గుడిచి."

"మానితిఁ బని, యామాటలు
మాని తిరుగుఁ డింక మీరు; మనమాటలకుం
బూని మఱుమాట లాడఁగ
శైనేయుఁడు వచ్చెఁ దాన చాలుం బనికిన్." (4.184-185)

"చెఱుపు విడిచి కాలువఁ బొగడు" నట్లున్న ఈ మాటలకు హంసుని యొదలు మండినది.

శా. "ఓరీ బ్రాహ్మణమూర్త సాయెనుర నోహో సాహసం బెట్టిదో
వైరం గోరి నుతించుమాట లెటుగా వచ్చెం గృతఘ్నా యిదిన్
నోరే యెవ్వరి కెప్పు డయ్యెదరు నిన్నుం బెంచి మన్నించినన్
గారామై యిటు చేసితే తొలఁగు మింకం జాలు నీ కార్యముల్." (4.187)

అని యేవగించుకొని, "కలపఁగ వచ్చునే బలిమి గాడిదకుం బులితోలు గప్పినన్" అని యపహసించి, యతనిని పురమునుండి బహిష్కృతుని గావించెను.

ఈ సన్నివేశ మంతయు జనార్దనాధ్యాయముగాఁ జెప్పవచ్చును. జనార్దనుఁడు జ్ఞాని యైన భక్తుఁడు. ఇతనికి ధర్మము తెలిసినంతగా రాజనీతి తెలియదు. మంత్రి నని తాను చెప్పుకొన్నను మిత్రునికంటె నాతని కెక్కువ యర్హతలు లేవు. హంస డిభకు లాతనిని ప్రాణముగాఁ బ్రేమించిరి. రాయబారమున నతనికి స్వేచ్ఛ నిచ్చిరి. కాని, యతని భక్తిరససామ్రాజ్యరక్షణమునే యాతఁడు చూచుకొనెను. కాని, మిత్రకార్యమును నేర్పుతో సాధింపఁజాలకపోయెను. అం దాతని చిత్తశుద్ధిని శంకించుటకంటె సామర్థ్యము లేమిని యంగీకరించుట మేలు. కొందఱీతనిని సంజయునితోఁ బోల్చి చెప్పెదరు. అతనికిని ఇతనికిని హస్తిమశకాంతరమున్నది. ఇట్టిపాత్ర నెందు కీ కథయందు సోమన నిర్మించినాఁడో పరామర్శింపఁ దగిన యంశము. దీనిని తెలియవలయునన్న కథాతత్త్వమును కొంత గాఢముగా భావింపవలెను.

సాల్వనగరమున నున్నది ముగ్గురు మిత్రులు. ఆ ముగ్గురును మూఁడు విధముల వారు. జనార్దనుఁడు వివేకి; హంసుఁడు అహంకారి; డిభకుఁడు అన్నకు నీడవంటివాఁడు. ఈ పాత్రలు భౌతిక దృష్టికి ఇట్లు కనఁబడును. సోముఁడు వీనిని ప్రతీకాత్మకములుగా సృష్టించెనని తోచుచున్నది. మానవుని బుద్ధికి - మనస్సుకు - ఇంద్రియములకు వీరు సంకేతములు. ఇందు మనస్సు సంకల్ప వికల్పాత్మక మైనది. హంసుఁడు తత్స్థానీయుఁడు. కథయంతయు నతని సంకల్పము వెంట నడచుచున్నది. డిభకు డింద్రియస్థానీయుఁడు. మనస్సంకల్పము నింద్రియములు కిమ్మనకుండ అనుసరించును. డిభకున కందులకే కథలో ప్రత్యేక ప్రతిపత్తి లేదు. బ్రతికినన్నాళ్ళు అన్ననీడలో నొదిగియుండెను. అన్న చనిపోయినతోడనే యతఁడు విలవిల తన్నుకొని చనిపోయెను. ఇఁక జనార్దనుఁడు బుద్ధి స్థానీయుఁడు. మనస్సున పాపసంకల్పము లుదయించును. వానిని వివేక ప్రధానమైన బుద్ధి బాధించును. మానవుఁడు లోకమునఁ దాను చేయు పని దోషమని తెలిసియు, బుద్ధిని త్రోసిరాజని తన కామమును దీర్చుకొనుచున్నాఁడు. బుద్ధి జ్ఞానమునకు స్థానము. దానియం దాత్మచైతన్యము ప్రతిబింబించును. జనార్దనుఁడు వివేకి. అతనియందు ఆత్మచైతన్య మను విష్ణుశక్తి ప్రకాశించుచున్నది. బుద్ధి యెల్లప్పుడును ఆత్మరతిని గోరును. బ్రహ్మానందము దానికి ఫలము. దుర్వాసుఁడు జనార్దనునకు విష్ణుసాన్నిధ్యము సిద్ధించు నని

యాశీర్వదించెను. ఇట్లన్వయించుకొనుచో హంసడిభకోపాఖ్యానము మానవుని అంతఃకరణ చరిత్రము! శ్రీకృష్ణుఁడు శుద్ధసత్త్వరూపమైన ఆత్మ. ఆత్మశక్తి రజోమిశ్రితమై బుద్ధియందు ప్రసరించి, మనస్సును శాసింప యత్నించును. మనస్సు శుద్ధరజోమూర్తి. ఇంద్రియవ్యాపారము శుద్ధతమోగుణరూపము. వివేక ప్రధానమైన బుద్ధిని మన్నించు మనస్సెన్ని పాపపుపోకడలు పోయినను చివరకు పశ్చాత్తాపతప్తమై ఆత్మోన్ముఖము కావచ్చును. వివేకమును త్యజించిన మనస్సున కాయవకాశమేలేదు. కావున జనార్దనుని మన్నించు హంసుఁడు పరిశుద్ధుఁడగుటకు వీలున్నది. జనార్దనుని బహిష్కరించిన హంసునకు తరణోపాయము లేదు. వివేకరహితుఁడైన మానవుని మనస్సునకు విశృంఖలత్వము కలుగును. అది యింద్రియసహాయముతో స్వేచ్ఛను సాధింప యత్నించును. దానికి ఫలము సంసార పాపకూప పతనము. అధఃపతితమైన మనస్సు నాశ్రయించిన యింద్రియములు దానితో కలిసి నశించును. అందువలననే జనార్దనుఁడు హంస డిభకులను వీడునంతవఱకు శ్రీకృష్ణుఁడు మిన్నకుండెను. ఆపై హంసుని నీట ముంచి చంపెను, అంతట అన్నను గానక డిభకుఁడు తలబాదుకొని చచ్చెను. కావున నీ కథలో జనార్దనుని పాత్ర యుపసరమైనది,

అంతియకాదు, జనార్దనుని పాత్ర సంతకంటె విశేషముగాఁ దీర్చి దిద్దుటకును వీలులేదు. బుద్ధి తనను మనస్సు మన్నించినచో కలదు, లేనిచో లేదు. అది అంత నిర్లిప్తమైనది. మనస్సుచేత కుంఠిత మైన బుద్ధి తత్త్వానమున నశించును. కాని, ఆత్మ రతితో నిత్యానందము నందును. జనార్ధనుడుఁ దందువలననే చెప్పఁదగిన హితవు చెప్పినాఁడు; కాదన్ననాఁడు తాను విష్ణు చింతనారతి యందు తన్మయుఁ డైనాఁడు. సాల్వనగరము వీడినను అతనికి చ్యుతి లేదు.

కథలో నీ ముగ్గురు కుమారులు ప్రతిపక్షమున నున్నారు. వివేకరహితమైన మనోవ్యాపారముయొక్క విషాదాంతమును వీరు సూచించుచున్నారు.. నాచన సోముఁ డీకథలో విష్ణుపారమ్యమును బోధించుట పరమతాత్పర్యముకదా! దాని నెట్లు సమన్వయింపవలెను?

ఈ కథలో దుర్వాసుఁ డున్నాడు. అతఁడు యతి. సన్న్యాసాశ్రమము నందున్న పరిపూర్ణ జ్ఞాని. అతని యాశ్రమమును నిందించి గార్హస్థ్యాశ్రమమును గైకొననిచోఁ జంపెదనన్నాఁడు హంసుడు. దుర్వాసుఁడు నేను కాదురా చంపునది కృష్ణుఁ డున్నాఁ డని చెప్పినాఁడు. హంసుఁ డతనిని అవమానముల

పాలు చేసినాఁడు, అతఁడు పోయి శ్రీకృష్ణుని ప్రేరేచి హంసవధ కతని నాయత్త పఱచినాఁడు. అతఁ డీతనిని చం[illegible] స్థూలదృష్టికి కథ యిది కదా!

లోకమున జ్ఞానులు కలరు. వారికిని అంతఃకరణ[illegible] సత్త్వ స్వరూపమైన ఆత్మశక్తిని బుద్ధియందు నిక్షిప్తమొనర్చుకొని యోగసా[illegible] మనసును చంపుకొని యింద్రియములను జయించి ముక్తిని పొందుదురు. అది జీవిత పరమార్థము. కోర్కెలు చంపుకొనినవాఁడే సన్న్యాసి. శ్రీకృష్ణుఁడు దుర్వాసునితోఁ బలికినమాటలను గమనింపుడు:

ఉ. "అసలఁ ద్రంపి వెట్టి హృదయం బను కాఁగున యోగవాసనా
ఖ్యాసపునీరు గాఁచుటకు నాగమపావకముం దగిల్చి యా
యాసవిహారమత్కృణగణైహికశయ్యకుఁ దజ్జలంబు పైఁ
బోసిన నీశరీర మది పొందియుఁ బొందనియట్లు యూఱడున్." (4.86)

నాచనసోమన యీసత్యమును నాయకాశ్రయముగాఁ జెప్పఁదలఁచినాఁడు. మనస్సుచే పరాభూతమైన బుద్ధి యాత్మశక్తిచే విజృంభించి మనస్సుతో తలపడి దానిని సాధించి కోర్కెల నంత మొనర్చును. దుర్వాసుఁడు శ్రీకృష్ణునిచే సాధింపఁదలచిన కార్యము సంధలి పరమార్థ మిది. కోర్కెలను జయింపలేక నిర్లిప్తమైన యంతరాత్మ జనార్దనుఁడు; సంకల్పస్థానమైన మనస్సును మట్టుపెట్టి జ్ఞానమును సాధించిన యంతరాత్మ దుర్వాసుఁడు. రెండింటికిని వెనుక నున్న శక్తిస్వరూపుఁడు పరమాత్మ యగు శ్రీకృష్ణుఁడు. ఇట్లు పరమ వ్యంగ్యముగా పరమార్థమును వ్యంజింపఁజేయుటకు నాచన సోమన యీ కథా సంవిధానము చేపట్టెను. అందువలననే ఆ విద్యలో నతఁడు చక్రవర్తియైనాఁడు.

కథలో తాత్త్వికమైన పరమార్థ మొకయెత్తు; రస మొకయెత్తు. అయినను మొదటిది రెండవదానికి గౌణమే యగును. కావున నాచన సోముఁడు సంవిధాన మున గౌణమైన ప్రయోజనముల నన్నింటిని రసాభిముఖముగా సాధించినాఁడు. పై తత్త్వ మెఱుఁగక పోయినను హంసడిబకోపాఖ్యానమునందు రసప్రతీతి కెట్టి యాటంకమును రాదు. కాని, పై యంశము తెలిసినచో తదనుభూతి గాఢతర మగును. ఇది రససంవిధానములోని యొక రహస్యము.

జనార్దనుని రాయబారముయొక్క వైఫల్యము కథాప్రగతికి సాధనము. ప్రతినాయకహతికి దోహదము. కావున జనార్దనాధ్యాయము కథలో గర్భసంధి

సాధించు ప్రయోజనమును సాధించి పెట్టినది. ఆపై జరుగు సాత్యకి రాయబారము, యుద్ధము ఫలప్రాప్తి కున్ముఖమై నడచు కథార్థములు. ఇవి మొత్తము కథాపరిమాణములో మూడవవంతు నాక్రమించి యున్నవి.

సాత్యకి సంభాషణము రోషభీషణమై పరస్పర బలపరామర్శకు దోహదమైనది. పుష్కరతీర్థ ప్రాంతమునందలి యుద్ధము వీరరౌద్రరసోన్నిద్రము. తిక్కనవలె నాచన సోముఁడు యుద్ధమును సాంగముగా రసోల్లాసముగా వర్ణించు నేర్పు గలవాఁడు. శ్రీకృష్ణుఁ డాగ్నేయాస్త్రమున విచక్రుని సంహరించుట, సాత్యకి డిభకుల సంకులసమరము, శ్రీకృష్ణుఁడు భూతద్వయమును గైలాసాద్రిపైఁ బడవేయుట, హంసుని యమునలో నణఁగఁ ద్రొక్కుట మొదలగు సమర సన్నివేశములు నాయక యుద్ధమునకు ప్రసిద్ధోదాహరణములు. నాయక రౌద్ర కృత్యమగు హంస సంహారము, ప్రతినాయకానునాయకుఁ డగు డిభకుని యందు కరుణము నుత్పాదించి, యతని విషాదాంతమునఁ బర్యవసించి జన్యజనక రస సమన్వయ విస్ఫూర్తిని విడంబించుచున్నది. యమునా జలమున నణఁగిన హంసునిఁ గానక డిభకుఁడు పొందిన శోకమును నాచన సోముఁడు వర్ణించిన విధము విమర్శకుల మన్ననల నందు కొనినది:

సీ. "నాయెల్లినీడన నరలోక మేలుదు నసులావు వఱితిపాలయ్యె నన్న!
దేవేంద్రునకునైనఁ దేఱిచూఁడగ రాని గౌరవోన్నతి నీటఁ గలసె నన్న!
పార్వతీపతిచేతఁ బడసిన దివ్యాస్త్రభూరిసంపద వెల్లిఁ బోయె నన్న!
వలరాజునకు నైన వర్ణింపఁగాఁ దగు తనువిలాసం బేఱు గొనియె నన్న!
తే. యన్న! నీయట్టియన్న న న్ననుదినంబు
గారవింపఁగ నుండ నేఁకరుదు నింక
నింకఁ జాల నెవ్వగలచే నిచట నిలువ
నాకు నేల నీతోడిదే లోక మన్న!" (4.300)

అని హృదయవిదారకముగా డిభకుఁ డన్నకై విలపించుచు, యమునలో మునుఁగుచు, లేచుచు, హంసునిఁ గానక—

క. "వ్రేలెడువెంట్రుక లిరుగడఁ
దూలఁగఁ దలయూఁచుఁ దొప్పదొప్పన నోరుం
గేల నడిచికొను నెలవుల
లాలలు దొరుఁగంగ నన్నఁ బలవని యొఱలున్" (4.302)

క. "ఱాలం దల యడిచికొనుసన్
నేలం బడి పొరలు లేచు నెత్తురు లుమియుం
గేలిఁ బడి రిపులు చూడఁగ
నాలుక వెఱికికొనుఁ జావునకుఁ దన్నికొనున్." (4.303)

ఇట్లు కడు భయంకరముగాఁ దన్నుకొని చివరకు దుర్మరణము చెంది నాఁడు డిభకుఁడు. వీరుఁడైన హంసునితమ్ముఁ డింత బేలవలె నేడ్చుట యొక వింత! అందువలననే సోముఁ డొక్కమాటలో 'డిభకమూఢుఁ'డని యతని స్వభావమంతయు వ్యంగ్యము చేసినాఁడు.

డిభకుని చావు ధర్మదృష్టితో నెంత సంభావ్యమైనను సోముఁ డాతని భాతృవియోగ దుఃఖాతిశయము నిట్లు వర్ణించుటవలన పఠిత మనస్సున నొక దారుణమైన సన్నివేశమును జిత్రించెను కథ నంతటితో ముగించినచో పఠిత మనస్సు ఆ తాపమునుండి శాంతి చెందదు. అందువలన వెంటనే వత్సలభావార్ద్రమైన - నంద యశోదలు శ్రీకృష్ణునిఁ జూడవచ్చిన ఘట్టమును సంఘటించి పఠిత మనస్సును శాంతమొనర్చినాఁడు. వంశాభ్యుదయ కావ్యకథా నిర్వహణమున నిట్టి సంఘటనము మంగళాంతసూచకమని సోముఁడు భావించెనేమో! ఆపై పుష్కరతీర్థవాసులగు యతీంద్రుల యానందాతిశయమును జిత్రించినాఁడు. పూర్ణఫలప్రాప్తి యచ్చట సిద్ధించినది. కావ్యరసపోషణలోని సూక్ష్మతరాంశముల నెఱిఁగిన మహాకవికాని యిట్టి సంవిధాన శిల్పమును సాధింపలేఁడు!

సున్నితమైన హాస్యమును సన్నివేశ సంవిధానముననేకాక, చతురోక్తి విలాసముచేతను సాధించు నసాధారణశక్తి నాచన సోమునకు వెన్నతోఁ బెట్టిన విద్య. గాంభీర్యము సడలకుండ, ఔచిత్యము వీడకుండ ఉత్తమ హాస్యము నందించి కావ్యరసాస్వాదన పాటవమును రచనకు సంతరించు శిల్పమీ యుపాఖ్యానమున నడుగడుగునఁ గానవచ్చును. హంస డిభకుల వేటవర్ణనమున నట్టిది సన్నివేశగత వ్యంగ్యమై భాసించెనని చెప్పఁబడినది. దుర్వాసుని సన్న్యాసివేషము వర్ణించుపట్ల నట్టిది కొంత కలదు. తద్వర్ణనము హంసు చిత్తవృత్తి వ్యంజకముగా సంధించుట యందలి యౌచిత్యము. హంసుఁడు జనార్దనుని యసమర్థత నవహేళనము చేసిన పట్టునను నిట్టి హాస్యము కొంత కలదు. అది కొంత యతని యుక్తిని సన్నివేశమును ఆశ్రయించియుండుట గమనార్హము. శ్రీకృష్ణుఁడు యాదవసభలో హంసడిభకుల యవివేకసాహసము నధిక్షేపించుటయందు

నిర్భరహాస్యము హృదయాహ్లాదకరముగా నిబంధింపఁబడినది. అది ప్రధానముగా సూక్తివిశేషముల నాశ్రయించినదే. లోకోక్తిప్రయోగ మిట్టి హాస్యమున కాటపట్టగునట్లు రచించుట సోమన ప్రత్యేకత! "దువ్వఁ జూచి నక్క యొడలు గాల్చికొన్నవడువున," "పిడుగు వ్రేసిన తలదొప్పి యాఁగునే" మొదలగు లోకోక్తులు శ్రీకృష్ణుని నోట హంసు నధిక్షేపించినట్లు కలవు. సోముఁడు లోకోక్తులను బలికింపని పాత్రయే లేదు. హంసుఁడు లోకోక్తులకు పుట్ట. కాని, సోముఁ డౌచిత్యము వీడి వానిని ప్రయోగింపఁడు. ఇందుల కొక్క యుదాహరణము చాలును. నాయకునిచేత ప్రతినాయకు నధిక్షేపింపఁజేయుపట్ల నట్టి లోకోక్తులు విరివిగా వ్రాసియు, హంసాదులచేత నాయకు నధిక్షేపింపఁజేయుపట్ల వానిని సోముఁడు వాడడు. హంసుఁడు దుర్వాసుని నిందించుటలో, మిత్రుఁడగు జనార్దనుని దూషించుటలో నట్టి లోకోక్తులు కానవచ్చును. కాని, కమలాక్షునిపైనా విసురులు విసరలేదు. సోమన విసరనీయలేదు. దుర్వాసుఁడు శ్రీకృష్ణునికి తమ దీనస్థితిని పేర్కొన్నప్పుడును లోకోక్తులు కలవు. భక్తియుక్తుఁడైన మునిశ్రేష్ఠుఁడు జగన్నాథుని రణోత్సాహప్రేరణమునకై ప్రయోగించిన సరసవాఙ్మయాస్త్రములుగా నవి యౌచిత్యముకు సాధించుకొనినవి. యోగ్యవస్తువులను అయోగ్యపాత్రములచే హాస్యము చేయింపని చతురవచనావిదగ్ధుఁడు నాచన సోమన! ఇట్టిది తెలుఁగు కవులలో నేకొద్ది మందికో సిద్ధించిన రచనాశిల్పము!

ఇంకను ఛందశ్శిల్పము, పాత్రోచిత సంభాషణము, భావోచిత శయ్యావిన్యాసము, రసోచితరీతీ సంవిధానము, అలంకారప్రయోగము - ఇట్లెన్నింటినో రచనాంశములుగాఁ బరిశీలించి సోముని సంవిధాన చక్రవర్తిత్వమును దర్శింపవచ్చును. అది మఱియొకసారి.*

(1972)

---

* డాక్టర్ పాటిబండ మాధవశర్మ షష్టిపూర్తి సంచిక - 'అక్షరార్చన' లో ప్రచురితం. (1972)

# శ్రీనాథయుగం – మరొక్క చూపు

ఆంధ్రసాహిత్య చరిత్రలో ఏ యుగాన్ని గమనించినా దానిదైన ప్రత్యేకత వికాసదశగా మనకు గోచరిస్తూనే ఉంటుంది. ఉదాహరణకు శ్రీనాథ యుగాన్ని తీసుకుందాం. శృంగార నైషధం నుండి శృంగార శాకుంతలం దాకా ఉన్న కాలాన్ని స్థూలంగా శ్రీనాథయుగమని పిలవటం పరిపాటి. దీన్నే కావ్య యుగమనీ పూర్వప్రబంధయుగమనీ వ్యవహరించటంకూడా ఉంది. ఆ యుగంలో వెలువడిన ప్రధాన ప్రక్రియలనుబట్టి ఈ కాలాన్నే - మార్గరస కావ్యయుగమనీ (క్రీ.శ. 15వ శతాబ్ది ప్రథమ పాదం-శ్రీనాథుని శృంగారనైషధ రచనాకాలం), జాతివార్తా చమత్కార కావ్యయుగమనీ (క్రీ.శ. 15వ శతాబ్ది ద్వితీయపాదం శ్రీనాథుని చాటు కవిత, వల్లభరాయని క్రీడాభిరామం, జక్కన విక్రమార్క చరిత్రం. అనంతామాత్యుని భోజరాజీయం, కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక మొదలైన కావ్యాలు వెలసిన కాలం), పురాణయుగమనీ (క్రీ.శ. 15వ శతాబ్ది తృతీయ పాదం - పోతన భాగవతం, నంది మల్లయ ఘంట సింగయల వరాహ పురాణం, మడికి సింగన పద్మ పురాణోత్తర ఖండం మొదలైన పురాణాలు వెలసిన కాలం), సంకీర్తన యుగమనీ (క్రీ.శ. 15వ శతాబ్ది చరమపాదం - తాళ్ళపాక అన్నమాచార్యుల సంకీర్తనల కాలం) అని నాలుగు యుగాలుగా విభజించవచ్చునని నేను సూచించాను.[1] వైవిధ్యంతో కూడుకున్న శక్తిమంతమైన ప్రక్రియలు వెలువడిన ఈ కాలం ఎంత మహత్తర మైనదైనా ఎందుకో చాలమంది హృదయాల్లో ఇది కవిత్రయ యుగ చైతన్యానికీ ప్రబంధయుగ చైతన్యానికీ నడుమ ఒక సంధియుగంగానే ప్రత్యక్షమౌతూ ఉంటుంది. అది కాదనలేని సత్యం. అయినా, దాని కారణాలను గురించి ఇంకా లోతుగా ఆలోచించవలసిన వాస్తవం కూడా !

ఒక యుగంలో ఎన్నిరకాలైన రచనలూ, ప్రక్రియలూ వెలువడ్డాయో వివరాలు చెప్పి వ్యాఖ్యానించటం ఈనాడు ఉపరితల పరిశ్రమగా పరిగణింప బడుతోంది; ఆ ప్రక్రియలో ప్రతిఫలించిన సామాజిక, సాంస్కృతిక, కళా విశేషాలను విశ్లేషించటం సమీక్షగా సంలక్షింపబడుతోంది; ఆ యుగంలో అట్టు

వంటి సాహిత్యం వెలువడటానికి కారణమైన చారిత్రక భౌతికాంశాలను వివేచించటం సాహిత్యోత్పత్తి ప్రేరకశక్తిని పరిశీలించటంగా లెక్కింపబడుతోంది ఆ యుగంలో వెలువడిన సాహిత్య ప్రక్రియలు ఆయా స్వరూప స్వభావాలతో వెలువడటానికి మూలకారణమైన కవుల సాహిత్య దర్శనాల శక్తి యుక్తులను గురించి ఒక చారిత్రక తర్క పరిణామ దృష్టితో నిరూపించేది సాహిత్య వికాస దృష్టిగా సంభావింపబడుతోంది ఇంతవరకు వెలువడిన విమర్శలు శ్రీనాథ యుగాన్ని మొదటి రెండు రకాలుగా విపులంగా పరిశీలించాయి చివరి రెండు రకాలు తమ సమన్వయాలను అందిస్తున్నాయి వీటిలో సాహిత్య వికాసదృష్టి శ్రీనాథయుగ సాహితీ చైతన్యానికి మూలమైన సాహితీ దర్శన ప్రేరకశక్తిని సమర్థనీయంగా సందర్శింపగలుగుతుంది

ప్రాచీనాంధ్ర సాహిత్య ప్రయోగాల వెనుకనున్న సాహిత్యదర్శన సిద్ధాంతాల నన్వేషించాలంటే భారతీయ సాహిత్యశాస్త్ర పరిణామ వికాస దశలను మొదట వివేచించాలి వాటిని మన కవులు మన సాహిత్య వికాస దశలకు పోషకాలుగా ఎలా మలచుకొని వినియోగించుకున్నారో విమర్శించాలి లేదా వాటిని కాదని దేశీయతకు సంబంధించిన సాహిత్య మర్యాదలను సిద్ధాంతాలను కవులు గ్రహించి సాహిత్యంలోని ప్రయోగాలకు ప్రాణం పోశారా అని కూడా విచారించాలి శ్రీనాథయుగంలో హరివిల్లులా కనపడుతున్న వైవిధ్యం వెనుకనున్న సాహితీ దర్శన వివేచనాన్ని ఒక చారిత్రక పరిణామ దృక్పథంతో పరిశీలించవలసి ఉంది

శ్రీనాద యుగంలో వెలువడిన వివిధ కావ్యాలలోనూ పురాణాదులలోనూ అంతకు ముందు యుగాల కంటె ఒక విశిష్టమైన రసవృష్టి ఉన్నట్లుగా ఎందరో విమర్శకులు గుర్తించారు విశేషించి శ్రీనాథుడు శృంగారి అని అతనికి శృంగార రసమంటే ప్రాణమనీ అందువలననే తన ప్రౌఢ కావ్యానికి శృంగార నైషధమని పేరు పెట్టాడని పలువురు పేర్కొనటం తెలుగులో ప్రసిద్ధి పిల్లలమర్రి పినవీరభద్రుడు కూడా శ్రీనాథుణ్ణి అనుసరించి శృంగార శాకుంతల మని తన కావ్యానికి పేరు పెట్టాడనీ శ్రీనాథయుగ శృంగార రస ప్రాధాన్యతకు ఈ రెండు కావ్యాలూ రెండు కీర్తికేతనాల్లాగా ఉన్నాయనీ భావించటం పరిపాటి అంతే కాదు పోతనాదుల కవితల్లో భక్తి శృంగారాల మేళవింపును గురించీ కథా కావ్యాలలో అద్భుత శృంగారాల పోషణ గురించీ సంకీర్తన సాహిత్యంలో

మదురభక్తిలో శృంగారాన్ని గురించీ విమర్శకులు శ్రీనాథయుగ సాహిత్యాన్ని గురించి సమీక్షించేటప్పుడు తప్పకుండా సమాలోచిస్తారు. అంటే, శ్రీనాథయుగ సాహిత్యానికీ రసదర్శనానికీ ఏదో అంతఃప్రేరక సంబంధం ఉన్నదన్నమాట! దీన్ని పరిశీలించటానికి ప్రాతిపదికగా ఆచార్య నగేంద్ర భారతీయ సాహిత్యాలలో రస సిద్ధాంత పరిణామ వికాసాలను గురించి ప్రతిపాదించిన వివేచనను గ్రహిస్తున్నాను.[2]

సంస్కృత కావ్యశాస్త్ర చరిత్రను ముఖ్యంగా మూడు యుగాలుగా డాక్టర్ నగేంద్ర విభజించారు. 1. ధ్వని పూర్వయుగం (మొదటి నుండి రుద్రటుని వరకు. అంటే క్రీ.శ. 1 లేదా 2 వ శతాబ్దినుండి 8 వ శతాబ్ది దాకా). 2. ధ్వని యుగం (ఆనందవర్ధనుని నుండి భోజుని వరకు అంటే— 9 వ శతాబ్ది నుండి 11వ శతాబ్ది మధ్యభాగం వరకు). 3. ధ్వని పరివర్తన యుగం— (మమ్మటాదులనుండి పండితరాయల వరకు - అంటే- 11వ శతాబ్ది ఉత్తరార్ధం నుండి 17 వ శతాబ్ది చివరి వరకు). భారతీయ సాహిత్య ప్రస్థానాల్లో ధ్వని మార్గానికున్న అద్వితీయమైన స్థానాన్ని పరిగణనలోకి తీసికొని ఈ యుగ విభాగం చేశారు డాక్టర్ నగేంద్ర.

ధ్వనిపూర్వయుగంలో రససంప్రదాయవాదధార ఒకటీ, రసప్రతికూలవాదధార మరొకటీ ఉన్నాయనీ, మొదటి వర్గంలో భరతాదులు, లోల్లట శంకుకాదులు, రుద్రభట్టూ పేర్కొనదగినవారనీ; రెండవ వర్గానికి భామహ, దండి, వామన, ఉద్భట, రుద్రటాదులు చెందుతారనీ వివేచించారు.

ధ్వనియుగంలో ప్రత్యక్ష రసవాదులనీ, పరోక్ష రసవాదులనీ, సమన్వయవాదులనీ, స్వతంత్రులనీ- నాలురకాల లాక్షణికులున్నారని విశ్లేషించారు డాక్టరు నగేంద్ర. "ఈ యుగంలో ఆనందవర్ధనుడు, భట్టనాయకుడు, భట్టతోతుడు, అభినవగుప్తుడు, ధనంజయుడు, మహిమభట్టు, క్షేమేంద్రుడు, భోజుడు మొదలైన ఆచార్యులు ఉన్నారు. ఈ కాలంలో సంస్కృత కావ్యశాస్త్రానికి ఆధారభూతాలయిన సిద్ధాంతాలు - గంభీరమయిన వివేచనా తర్కవితర్కాలు చేసిన తరువాత స్థాపింపబడి, స్థిరపరచబడ్డాయి. ధ్వని సిద్ధాంతావిష్కరణ ఈ యుగంలోని గొప్ప అపూర్వ విషయం. ఇది ఆధారంగా కావ్య శాస్త్రంలోని ఇతర సిద్ధాంతాల స్థాన నిరూపణం చేయటం కూడా జరిగింది. ఇంతకుముందు స్థాపించబడిన సిద్ధాంతాలలో ఒకానొక విశిష్ట దృక్పథం మాత్రమే గోచరిస్తూ ఉండేది.

కాని, ఈ యుగంలో విశ్వజనీనమయిన ఒక సిద్ధాంతం ఆవిష్కరింపబడింది. మూలంలో రసానికి భిన్నంగా ధ్వనిసిద్ధాంతం ప్రతిష్ఠింపబడింది. కాని, వ్యావహారికంగా ధ్వనీ, రసమూ - రెండూ వేరు కాదు. ధ్వని సిద్ధాంతవాదులే రస సిద్ధాంతానికి పరమోత్కర్షను చేకూర్చారు. నిజానికి ఈ యుగం రస సిద్ధాంత స్వర్ణయుగం. ఒకవైపున భట్టనాయకుడు, భట్టతోతుడు, అభినవ గుప్తుడు, రాజశేఖరుడు, ధనంజయుడు, మహిమభట్టు ప్రత్యక్షంగా రససిద్ధాంతాన్ని సమర్థింపగా, ఆనందవర్ధనుడు రసధ్వనిరూపంగానూ, క్షేమేంద్రుడు రసాశ్రిత ఔచిత్యం ద్వారాను పరోక్షంగా రసగౌరవ ప్రతిష్ఠ చేశారు. భోజుడి దృష్టి సమన్వయ పూర్వకమయినది. ఆయన కావ్యంలో ధ్వని ప్రాధాన్యాన్ని అంగీకరించాడు. అలంకారం, రీతిపట్ల గౌరవం చూపించాడు. కాని, రసంపట్ల అతని మనోనివేశం అసందిగ్ధం. కుంతకుడు మాత్రం 'వక్రోక్తి' రూపంలో రసానికి భిన్నమయిన సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. కాని, కుంతకుడికి ధ్వని పట్ల గల ప్రబల వ్యతిరేకభావం రసంపట్ల లేదు. శబ్దార్థవక్రతను కావ్య జీవితంగా పరిగణించినా, రసంపట్ల అతనికి గౌరవభావం ఉందని చెప్పవచ్చు."[3]

ధ్వని పరివర్తన యుగంలోని లాక్షణికులను నాలుగు మార్గాలకు చెందిన వారుగా వర్గీకరించవచ్చునని డాక్టర్ నగేంద్ర పేర్కొన్నారు. ఆ అంశాన్ని వివరిస్తూ ఇలా అన్నారు- "ధ్వనియుగం తరువాత కూడా ధ్వని సిద్ధాంతానికి ప్రాముఖ్యం ఉండేది. మహిమభట్టాదుల ధ్వని సిద్ధాంత వ్యతిరేక తర్కాలను మమ్మటుడు సయుక్తికంగా ఖండించి, ధ్వని సిద్ధాంతానికి అన్నివిధాల బలవత్తరమైన ప్రతిపత్తి కల్పించాడు. ఒకరకంగా ధ్వని సిద్ధాంతమే, సంస్కృత కావ్యశాస్త్రంలో, అందరికీ అంగీకార యోగ్యమయింది. అందుచేత ధ్వని తరువాతి కాలంలో కూడా కావ్యశాస్త్ర ప్రముఖ సిద్ధాంతం ధ్వని సిద్ధాంతం - లేదా - రసధ్వని వాదమే. ఈ సిద్ధాంతాన్ని సమర్థించే వారిలో మమ్మటుడు, హేమచంద్రుడు, విద్యాధరుడు, పండితరాయలు ముఖ్యులు. అలంకారవాదులు-లేదా-అలంకార ప్రియులు అయిన రుయ్యకుడు, జయదేవుడు, అప్పయ దీక్షితులు మొదలయిన వారు కూడా ధ్వని సిద్ధాంతాన్ని విస్తృతంగా వివరించి, దాన్ని అంగీకరించారు. ధ్వని నుండి వేరుగా శుద్ధరస సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన ఆచార్యులలో అగ్నిపురాణ రచయిత లేదా సంపాదకుడు, రామచంద్ర - గుణచంద్రులు, విశ్వనాథుడు, శారదాతనయుడు, సింగభూపాలుడు, భానుదత్తుడు, రూపగోస్వామి మొదలయిన వారు పేర్కొనదగిన వారు. పూర్వం కంటే

ఈ యుగంలో 'కవిశిక్ష' అనే ప్రవృత్తి పెచ్చుమీరింది. కావ్యానికి మూలభూత మయిన సిద్ధాంతాలను విమర్శించి, విశ్లేషించడం కంటె, కావ్య రచనకు సహాయ కారులయిన శాస్త్రీయ సామగ్రిని సేకరించడం మీద వీరి దృష్టి కేంద్రీకృత మయినది. నిజానికి సర్వసమ్మత మయిన సిద్ధాంతం లేక సంప్రదాయంపట్ల వీరికి ప్రత్యేకమయిన శ్రద్ధ లేదు. అమరచంద్రుడి కావ్యకల్పలత, దేవేశ్వరుడి కవి కల్పలత ఈ వర్గానికి చెందిన గ్రంథాలలో సుప్రసిద్ధాలు."[4]

ఇక్కడ ఒక చారిత్రకమైన వాస్తవాన్ని మనం గమనించాలి. ధ్వని యుగం ముగుస్తూ, ధ్వని పరివర్తన యుగం ఆరంభమౌతున్న సంధి కాలంలో ఆంధ్ర మహాభారత రచనను నన్నయ భట్టారకుడు తెలుగులో ఆరంభించాడు. ధ్వని యుగంలో వెలువడిన చర్చల సారాంశం నన్నయకు అందుబాటులో ఉండి ఉంటుంది. నారాయణభట్టుతో కలిసి ఆయన సాహిత్య సిద్ధాంతాలను గూర్చి చర్చించి, ఒక దృక్పథాన్ని ఏర్పరచుకొని ఉంటాడు. అయితే, కాలాన్ని బట్టి నన్నయ మీద భోజుని ప్రభావం ఉండటం కష్టం. ఇకపోగా ధ్వనివాదాన్ని గాని, వక్రోక్తివాదాన్ని గాని నన్నయ ఎన్నుకోవలసివచ్చి ఉండాలి. అందులో నన్నయ ధ్వని దర్శనాన్ని గ్రహించి, ఆ యుగంలోని అత్యుత్తమ సాహిత్య సిద్ధాంత స్పృహతో కలం పట్టి ఉంటాడు. ధ్వని యుగంలో ప్రత్యక్ష రస వాదుల వర్గ మొకటి, పరోక్ష రసవాదులవర్గ మొకటీ ఉన్నట్లు స్పష్టమౌతున్నది. ఆ రెండు వర్గాలలో నన్నయ అనుసరించింది ప్రధానంగా ఆనందవర్ధన, క్షేమేంద్రాదుల మార్గం - అంటే, పరోక్ష రసవాదులైన ధ్వని దార్శనికుల సాహిత్య ప్రస్థాన మన్నమాట. తెలుగు సాహిత్యపు తీరుతెన్నులను, కవితాశైలులను, ప్రక్రియా స్వరూప స్వభావాలను నిర్ణయించే మూల ప్రేరక శక్తి కవి సాహిత్య దర్శనమే. భారతీయ సాహిత్య ప్రస్థానాలలో అత్యుత్తమమైన ధ్వని దర్శనం నన్నయ భారత రచనకు నాంది పలికింది. ఆనందవర్ధనుడు ప్రతిపాదించిన మూడు రకాలైన ధ్వనులలో నన్నయ జీవ లక్షణానికి చేరువగా నిలచింది వస్తు ధ్వని. అంటే, రసాలంకార ధ్వనులు అతని రచనలో ఉండవని కాదు. ఆ రెండూ వస్తుధ్వనికి పోషకంగా నిలుస్తాయని భావం. నన్నయగారి ప్రసన్న కథాకలితార్థ యుక్తి వస్తుధ్వనిలోని శిల్పాభివ్యక్తియే. అక్షర రమ్యత రసవ్యంజకత్వం కల్పించే రచనాశిల్పం. ఈ రెండింటికీ కుదురైన నానారుచిరార్థసూక్తికి నన్నయ నిధి. ధ్వని పరివర్తన యుగంలో ధ్వని మార్గ సమర్థనం చేసే వర్గానికి శ్రీకారం చుట్టినవాడు కూడా నన్నయే.

నన్నయ కన్నుమూసే నాటికి ధ్వని ప్రవర్తనయుగం భారతీయ సాహిత్య శాస్త్ర చైతన్యంలో ప్రారంభమైనదని చెప్పాలి. అంటే, నన్నయ యుగం నాటి నుండి దక్షిణాంధ్రయుగం దాకా ఆ చైతన్యం సాగుతూనే ఉన్నదన్న మాట! దాని ప్రభావం తెలుగు కవుల సాహిత్య దృక్పథాలపై తప్పకుండా ఉండి ఉండాలి. నిశితంగా పరిశీలిస్తే ఉన్నట్లు స్పష్టమౌతుంది కూడా.

ధ్వని పరివర్తన యుగంలో నాలుగు వర్గాల కవులు నాలుగు మార్గాలను ముందుకు సాగించారు. వారిలో మొదటివర్గం వారు ధ్వని మార్గ సమర్థకులు. తెలుగులో కవిత్రయం ఈ మార్గాన్ని ఘంటాపథం చేసింది. రెండవవర్గంవారు అలంకార వాదులు. తెలుగులో ఈ మార్గానికి మార్గదర్శి నన్నెచోడుడు. మూడవ వర్గం వారు - శుద్ధరసవాదులు. ఈ మార్గానికి తెలుగులో పోషకులుగా నిలిచే వారు - పాల్కురికి సోమనాథుడు, శ్రీనాథుడు, పోతన, అన్నమాచార్యులు, మరికొందరు శ్రీనాథయుగకవులు. కవి శిక్షా మార్గంలో నడిచిన కవులు నాల్గవ వర్గం వారు - భాస్కర రామాయణాది కావ్యకవులు. తెలుగు సాహిత్యంలో నాచన సోముడు చమత్కార ప్రస్థానాన్ని, ప్రబంధకవులు వక్రోక్తి ప్రస్థానాన్ని, శ్లేషకావ్యకవులు, ద్వ్యర్థి త్ర్యర్థి కవులు అలంకార ప్రస్థానాన్ని, దక్షిణాంధ్ర సాహిత్యంలోని పదకర్తలు, యక్షగాన కర్తలు, శృంగార కావ్యకర్తలు శుద్ధ రస వాదాలలోని వివిధ శాఖలనూ సమర్థించి పోషించిన వారుగా గోచరిస్తు న్నారు. డాక్టర్ నగేంద్ర విశ్వేశ్వరుని చమత్కార ప్రస్థానాన్ని గ్రహించలేదు. దానికి ఉత్తరాదిలో ప్రచారం లేకపోవటమే అందుకు కారణం. అయినా, తెలుగులో నాచన సోముడు ఆ ప్రస్థానానికి ప్రయోగాన్ని నిర్వహించి ప్రాణం పోశాడు. ఒక విధంగా తెలుగు సాహిత్యచరిత్రలో 11వ శతాబ్దం నుండి 18వ శతాబ్దంవరకు వెలువడిన సాహిత్య చైతన్యం వెనుక ధ్వని, ధ్వన్యంతర యుగ సాహిత్య సిద్ధాంతాల ప్రభావం తీవ్రంగా పని చేసిందని విహంగ వీక్షణంతోనే స్పష్టమౌతున్నది. అందులో శ్రీనాథయుగ స్వభావాన్ని గురించి సమీక్షించటం ప్రకృత వ్యాస లక్ష్యం.

భారతీయ సాహిత్య శాస్త్ర వికాసానికి సంస్కృతకవులు, లాక్షణికులు ఎంత కృషి చేశారో, ఆ ప్రేరణతో దేశ భాషా సాహిత్యాలలో సాహిత్య దృక్ప థాలను రూపొందించుకొన్న దేశ భాషా కవులు కూడా తద్వికాసానికి ఆయా కాలాల్లో అంత దోహదం చేశారు. ఉదాహరణకు భక్తియుగం కవులు హిందీ

సాహిత్యంలో రస సంబంధమైన నవీన దృక్పథాలను సంస్కృత సాహిత్య ప్రస్థానాలకు అందించినట్లు పరిశీలకులు భావిస్తున్నారు. ఆచార్య నగేంద్రగారి అంచనా దానిని ప్రస్ఫుటీకరిస్తుంది. "దేశ భాషా కవులు ప్రకారాంతరంగా కావ్యశాస్త్ర వికాసానికి సహకరించారనటంలో ఎటువంటి సందేహం లేదు. మధ్యయుగంలో మాధుర్యభావంతో తొణికిసలాడుతున్న భక్తికావ్యం తన రసధారలతో భారతీయ భాషలను ముంచివేసింది. దాని ఫలితంగా భారతీయ కావ్యశాస్త్రంలో ధ్వనికి బదులు రస సిద్ధాంతానికి పట్టం కట్టడం జరిగింది. నిజానికి రసానికి ప్రాధాన్యం లభించినా సంస్కృత కావ్యశాస్త్రానికి ప్రాతినిధ్యం వహించే సిద్ధాంతం ధ్వని సిద్ధాంతమే. భారతీయ వాఙ్మయంలో రసధ్వని ఆవరణను తొలగించి, శుద్ధ రస సిద్ధాంతాన్ని సుప్రతిష్ఠం చేసిన గౌరవం ఈ భక్త కవులదే. 14.15 శతాబ్దాల నుండి 17-18 శతాబ్దాల వరకు ఉత్తర - దక్షిణాలు, తూర్పు - పడమరలు దేశం నలుమూలలా మదురభక్తి ఉద్దామవేగంతో ప్రవహించింది. దానిమూలంగా హృదయ రసానికి, కావ్యానికి మధ్య ఉన్న వ్యంజన అనే పల్చటి తెర పూర్తిగా ఛిన్నాభిన్నమై పోయింది. అందుచేత సంస్కృతం కంటే దేశ భాషా వాఙ్మయంలో రససిద్ధాంతం పూర్తిగా ప్రతిష్ఠింపబడిందని అనడం న్యాయసంగతం. అదీగాక ఈ కవులు రసక్షేత్రాన్ని ఇంకా పరివ్యాప్తం చేశారు. వారు భక్తి - వాత్సల్యాల రసత్వ స్వీకృతి తప్పనిసరి చేశారు. సంస్కృత ఆచార్యులు శృంగారం రసరాజమని సిద్ధాంత పక్షాన్ని ప్రతిపాదించారు. దానిని కుడా ఈ కవులు భక్తి సమన్విత మయిన శృంగార పరికల్పన మూలంగా సత్యమని నిరూపించారు. హిందీ రీతియుగంలో చాలామంది కవులు సిద్ధాంత రూపంగానూ, వ్యావహారికంగాను రసవాదాన్ని ప్రబలంగా సమర్థించారు, వారి కృషిమూలంగా భారతీయ కావ్యశాస్త్రంలో శృంగార వాదం ఒక క్రొత్త రూపంలో సుప్రతిష్ఠిత మయింది. ఈ విధంగా ఆధునిక భారతీయ భాషల చరిత్రలో మధ్యయుగం రససిద్ధాంత దృష్ట్యా అతిసంపన్నమయిన యుగం. దేశభాషా కవులలో చాలా మంది తమ సరస కావ్యరచనల ద్వారానూ, హిందీకవులు కావ్యసృష్టి - వివేచనా ఈ రెంటి ద్వారానూ రస ప్రచార - ప్రసారాలు చేశారు."[5]

డాక్టర్ నగేంద్రగారు హిందీ సాహిత్యాన్ని ప్రధానంగానూ, దేశభాషా సాహిత్యాలను సాధారణంగానూ పరిగణనంలోకి తీసికొని పరిశీలించారు. వారు భక్తి, రీతి యుగాలకు సంబంధించి వెలువరించిన కొన్ని ప్రధానాంశాలు తెలుగు

సాహిత్య చరిత్రలోని శ్రీనాథ యుగానికి వర్తిస్తాయి. ఎలాగంటే - 15 వ శతాబ్దిలో క్రమంగా—

1. శ్రీనాథుడు తెలుగులో శృంగార రసకావ్య నిర్వహణంలో తన ప్రయోగాలను ప్రారంభించి, శృంగారాన్ని భక్తికీ, వాత్సల్యానికీ అంగంగా, పోషకంగా నిలిపే విశేష ప్రయోగాలను చేసి, శృంగార రసవాదానికే కొన్ని నవీన దృక్పథాలను అందించాడు. శ్రీనాథుని కావ్య ప్రయోగాలను కాలక్రమంగా గమనిస్తే అతని శృంగార రసవాదంలోని పరిణామాన్ని గమనించవచ్చు.

2. కవి శృంగారి కావటం అంటే కావ్యతత్వం దృష్ట్యా ఏమిటి? శ్రీనాథుని చాటువుల్లో, వీధి మొదలైన కావ్య ప్రయోగాల్లో శృంగార భావనం చేయటంలోని రసికత్వం, అహంకార రసంగా శృంగారాన్ని సంభావించే లక్షణం ఎలా ఉంటుంది? మొదలైన ప్రశ్నలకు శ్రీనాథ సాహిత్యంలో సరైన సమాధానాలు దొరుకుతాయి.

3. భక్తి - రసం కాదని సమకాలీన సంస్కృతలాక్షణికులు ఘోషిస్తున్నా, రసంగా దానికి కావ్యక్షేత్రంలో పట్టాభిషేకం చేయదగినట్లు భక్తి కవితను తెలుగులో ఆవిష్కరించి, అద్వైతపరమైన భక్తిరస సిద్ధాంత చింతనకు అపూర్వ ప్రస్థానాన్ని రచన ద్వారా ప్రదర్శించి చూపించిన బమ్మెర పోతన ఆంధ్రమహా భాగవతం తెలుగుకవి భక్తిరస సిద్ధాంతానికి అర్పించిన అభినవ దర్శనం.

4. తాళ్ళపాక అన్నమాచార్యులు రచించిన సంకీర్తన సాహిత్యం మధురభక్తి మార్గానికి వైష్ణవపరంగా కల్పించిన ప్రథమ సోపానం. భక్తిలో శృంగారానికుండే స్థానాన్ని నిరూపించే విశిష్ట ప్రయోగం.

5. కథాకావ్యాలలో వీరాద్భుతాలలో విశిష్ట ప్రయోగాలు. శృంగారం అద్భుత రస సాహచర్యంలో ప్రవర్తించే తీరుతెన్నులను తీర్చిదిద్దటాలు కనపడతాయి.

6. ప్రబోధ చంద్రోదయం వంటి కావ్యాలలో శాంతరస ప్రాశస్త్యాన్ని ప్రదర్శించే ప్రయత్నం ఈ యుగంలో విశేషించి జరిగింది.

7 విభావాది సామగ్రితో పాటు సహృదయ రసాస్వాదయోగ్యమైన చిత్త వృత్తికి సమాన ప్రాధాన్యమిచ్చి రస స్వరూప స్వభావ వివేచనంలో కొత్త పుంతలు త్రొక్కిన వైఖరి శ్రీనాథయుగ సాహిత్యం స్పష్టంగా ప్రదర్శించింది

8 శృంగారం రసరాజమనే సిద్ధాంత పక్షాన్ని శ్రీనాథయుగ కవులు తమతమ కావ్యరస ప్రయోగాలతో కమనీయంగా వ్యాఖ్యానించి చూపించారు

9 భక్తి సమన్వితమైన శృంగార పరికల్పనకు తెలుగు సాహిత్యంలో శ్రీనాథయుగమే శ్రీకారం చుట్టింది శిఖరాలను దర్శింపజేసింది

10 అయితే తెలుగులో ఈ అభినవదృష్టితో కావ్యసృష్టి జరిగినంతగా కావ్య వివేచనగానీ లక్షణగ్రంథ రచనంగాని సాగలేదు

పదిహేనవ శతాబ్దినంతా ఆవరించుకొన్న సాహిత్యయుగమూర్తి శ్రీనాథుడు భారత రామాయణ హరివంశాల ప్రభావం నుండి తప్పించి తెలుగు కావ్యాన్ని ముందుకు నడిపించి దానికి ప్రౌఢకావ్య గౌరవాన్ని కల్పించిన కవితామూర్తి శ్రీనాథుడు అతడు శృంగార నైషధ రచన చేపట్టేంతవరకూ తెలుగు సాహిత్యంలో వీరశాంతరసాల వెనుక మెలిముసుగులో మెల్లమెల్లగా మినుకుమినుకుమని మెరుస్తూ వస్తూ ఉండేది శృంగారం శ్రీనాథుడు శృంగార రసాన్ని మూడో వరుసలో నుండి మొదటి వరుసలోకి తెచ్చి రాజసంతో నిలువబెట్టాడు శాంతాన్ని వెనుక్కు నెట్టి భక్తిని ముందుకు తెచ్చాడు శ్రీనాథ సాహిత్య వీధిలో శృంగారం భక్తిపిరాలను ఇరువైపులా నిలుపుకొని పట్టమహిషిలా పయనించింది

తెలుగులో ఒక నాయకుడు ఒక నాయిక ఒక రసం అనే అనుభూతి నందించగలిగే ఉత్తమ శృంగార రసకావ్యం శృంగార నైషధం సంస్కృత లాక్షణికులు భరత సంప్రదాయాన్ని అనుసరించి అష్టవిధ నవవిధ రసాలలో శృంగార రస స్థితికి సముగ్రోదాహరణం శ్రీనాథుడు చిత్రించిన నలదమయంతుల చరిత్రం పరంపరగా వస్తున్న రసపోషణ విధానానికి ప్రౌఢ ప్రయోగాన్ని నిర్వహించిన తరువాత శ్రీనాథుడు రచించిన కావ్యాలన్నీ నవీన ప్రయోగాలే మనకు లభిస్తున్న రచనలలో హరవిలాసం భీమఖండం కాశీఖండం శివరాత్రి మాహాత్మ్యం అనే రచనలు ప్రధానాన్ని బట్టి భక్తి రచనలు కాని వాటిలో

శ్రీనాథుడు శృంగార రసపోషణ విధానాన్ని వైవిధ్యంతో ప్రదర్శించాడు. అవన్నీ కావ్యశాస్త్ర పరిజ్ఞానానికి ఆ మహా కవి చేసిన పరివ్యాప్తికి ప్రతీకలుగా నిలిచే ప్రయోగాలు.

హరవిలాసంలో అయిదు కథ లున్నాయి. చిరుతొండనంబి కథ భక్తి రస ప్రధానమైంది. గౌరీకల్యాణ కథ ఉదాత్త శృంగార రస ప్రధానమైంది. దారుకావన విహారం వీరశైవంలోని మధురభక్తిచ్ఛాయల పరిపోషణకు ముఖ్యమైంది. సముద్ర మథనం అద్భుత రస ప్రధానమైంది. కిరాతార్జునీయం వీరరస ప్రధానమైంది. తెలుగులో 'విలాసకావ్యం' అనే పేరుతో కథాకావ్య ప్రక్రియకు ఒక వినూత్న ప్రయోగాన్ని శ్రీనాథుడు అందించాడు. అతడు ఒక్కొక్క కథలో పోషించిన ఒక్కొక్క రసానికి ఆ తరువాత ఒక్కొక్క విలాసకావ్యం వెలువడింది. ఆ బాటలో కూడా మొదటి పెద్ద బావుటా శ్రీనాథునిదే.

శృంగారాన్ని భక్తి, వత్సల రసాలతో పరిణయం చేయించిన ప్రౌఢ కవి శ్రీనాథుడు. అతని భీమఖండం ఆ పరిణయానికి హేమ మండపం. వ్యాసుని కథలో కాశీవిశ్వనాథుని కంటే భీమేశ్వరస్వామి కరుణామూర్తి; వాత్సల్య కరుణా సముద్రుడు. అన్నపూర్ణాదేవి అపర వాత్సల్యదేవత. భీమేశ్వరుడు ఎంతటి మహాదేవుడో అంతటి శృంగార మూర్తి. ఆయన 'గజచర్మ మెన్నడో కాని నిచ్చలు గట్టు పసిడి కమ్ముల పట్టు పచ్చడమ్ము.' "ఎన్నడో పిశాచులను గాని యిందుముఖుల నెల్లకాలంబుఁ దలఁచు భీమేశ్వరుండు."6 శ్రీనాథుని రసదర్శనమే భీమేశ్వరుని మూర్తిమత్వం. భీమేశ్వర మహిమను ఆస్వాదించగలిగిన రసికత్వం శ్రీనాథుడు ప్రతిపాదించిన సహృదయాధికారం. సంస్కృత లాక్షణికులకు భక్తివత్సలాలు రసాలు కాకపోవచ్చు; కాని, శ్రీనాథుని కవిత్వంలో అవి రసత్వాన్ని సంతరించుకున్నాయి. శృంగార నైషధ కాలం నాటి శృంగార రస దర్శనం శ్రీనాథునితో క్రమంగా మార్పు చెందింది. భరతుని కంటే; ఆనందవర్ధన, అభినవ గుప్తుల కంటే ఆధునికుడైన భోజుని 'శృంగార ప్రకాశ' దృక్పథానికి దగ్గరైనట్లుగా కనబడుతుంది.

భోజుని అభిమతంలో శృంగారమే రసం. భోజుడు నవవిధ రసాలతో పాటు వత్సలాన్ని గూడా మన్నించాడు. భోజుని శృంగార రస భావనం విశిష్టమైంది. ఈ క్రింది వాక్యాలు గమనిస్తే అది స్పష్టమౌతుంది:

1 శృంగార వీర కరుణాద్భుత రౌద్రహాస్య
బీభత్స వత్సల భయానక శాంత నామ్న
అమ్నాసిషు ర్దశరసాన్ సుధియో వయం తు
శృంగార మేవ రసనా ద్రస మామనామః 7

2 రసోఽభిమానోఽహంకారః శృంగార ఇతి గీయతే
యోఽర్థ తస్యాన్వయాత్ కావ్యం కమనీయిత్వ మశ్నుతే
విశిష్టాదృష్ట జన్మాయం జన్మినా మంతరాత్మసు
ఆత్మ సమ్య గ్గుణోద్భూతేః ఏకో హేతుః ప్రకాశతే
శృంగారీ చేత్ కవిః కావ్యేజాతం రసమయం జగత్
స ఏవ చె దశృంగారీ నీరసం సర్వమేవ తత్ 8

3 యద్యపి శృంగార ఏవ ఏకోరసః తథాపి తత్ప్రభవా యే రత్యాదయః తేఽప్యుద్దీపన విభావై రుద్దీప్యమానాః తదనుప్రవేశా దేవ సంచారిణాం అనుభావానాం చ నిమిత్తభావ ముపయన్త రసవ్యపదేశం లభ్యన్తే తథా వ్యభిమానః రత్యాదీనాం నిమిత్తం చేతసా రస్యమానో రసః తథా రత్యాదయోఽపి హర్షధృతిచింతౌత్సుక్యాదీనాం మనోవాక్కాయ శరీరారం భాణాం చ నిమిత్తం అభిమానానుప్రవేశా న్నైవ చేతసా రస్యమానాః రసా ఇత్యుచ్యతే 9

శృంగారమే ఏకైకరసం అది అభిమాన రసమనీ అహంకార రసమనీ పిలువబడుతుంది దానివల్లనే కావ్యానికి కమనీయత్వం ఏర్పడుతుంది రసానికి సిద్ధి రసికునియందు కలుగుతుంది పూర్వజన్మ పుణ్యార్జిత సంస్కార విశేష చిత్త సంస్కారులకు మాత్రమె రససిద్ధి ఏర్పడుతుంది రసికునిలోని ఆత్మ సమ్యగ్గుణోద్భూతమైన అహంకారమే సుఖదుఃఖాత్మకాలైన రసాలను సుఖాత్మకంగా రస్యమానాలుగా చేస్తుంది రసికునిలోని అభిమాన ప్రవృత్తి అనేక జన్మానుభవ జనిత సంస్కారాలయొక్క ఉత్కృష్టదశ అట్టి ప్రవృత్తి కలవాడే రసికుడైన కవి రసికుడైన సహృదయుడు రసికుడైన నటుడు రసం కలవాడే రసికుడు రసః అస్య అస్తీతి రసికః రసికుణ్ణి శృంగారి అంటారు. శృంగారి కాని కవిచేత సృష్టమైన కావ్యం నీరసం శృంగారి అయిన కవి రచించిన కావ్యం రసమయం రసికుడు కావ్యరసాస్వాదన దక్షుడు - అని ప్రతిపా

దించాడు భోజుడు అతని దృష్టిలో అహంకార రసమే రసం రత్యాదిస్థాయి భావాత్మకాలైన రసాలు అతని దృష్టిలో ఔపచారికాలే పట్టి భావప్రకర్ష రూపాలే అహంకారం అగ్ని సదృశమైన మూల ప్రవృత్తి భావాదులా అగ్నికి శిఖల వంటివి అవి దాని తేజస్సును హెచ్చించునట్టివే మూల ప్రకృతి అయిన అహంకారాగ్నియే లేకపోతే శిఖలు లేవు రసదీప్తి లేదు శృంగారః సోఽభిమానః స రసః తత ఏతే రత్యాదయో జాయన్తే తైశ్చాయం ప్రకర్ష ప్రాప్తైః సప్తార్చి రర్చిశ్చయై రివ ప్రకాశమానః శృంగారిణా మేవ స్వదతే 10 భోజుని సాహిత్య దృక్పథంతో పరిశీలిస్తే శ్రీనాథ సాహిత్య తత్త్వం కొంత ప్రసన్నమౌతుంది

భోజుని రసికత్వాన్ని ఘుమ్మూర్తులా తనలోనూ తన సాహిత్యంలోనూ కావ్యాస్వాదనంలోనూ స్థాపించిన కవిసార్వభౌముడు శ్రీనాథుడు అయితే అతని కంటె ఆధునికుడు కావటంచేత భోజు డంగీకరించిన దశరసాలనే కాక భక్తిని కూడా రసంగా సంభావించాడు శృంగార నైషధ రచన తరువాత శ్రీనాథుని కవితకు భక్తి రక్తితోపాటు ఒక శ్వాసకోశంగా పని చేసింది శ్రీనాథుడు శృంగారియా? అని తెలుగు విమర్శకులు విపుల చర్చ చేశారు భోజుని లక్షణం ప్రకారం శ్రీనాథుడు శృంగారియే అందువల్లనే అతని సాహితి రసమయమైన జగత్తుగా రసికులచేత ఆస్వాదింపబడుతోంది అతని ఆశువు చాటువు కావ్య కవిత - అన్నీ - శృంగార ప్రకాశకాలే అతని సర్వకవితాభివ్యక్తికి మూల ప్రకృతి శృంగారం అందులో నుండి దశరసాలతోపాటు భక్తి కూడా జనించి స్ఫురిస్తుంది శ్రీనాథునిది అహంకార భక్తి అనీ సాభిమాన భక్తి అనీ విమర్శకులు సమర్థించారు ఆ అభిమానం ఆ అహంకారం భోజ ప్రతిపాదితమైన రసాస్వాదన శక్తియొక్క మూల ప్రకృతి శ్రీనాథ సాహిత్యం తెలుగు సాహిత్యానికి ముమ్మొనల సాహిత్యగౌరవాన్ని కలిగించింది 1 శృంగారమే రసం అనే ఆలంకారిక దృక్పథం 2 భక్తి వాత్సల్యాలు కూడా రసస్థితిని పొందగలిగిన భావాలనే ప్రతిపాదనం 3 శృంగారి అయిన కవి తాను అనుభవించిన రసస్థితిని అందుకొని అనుభవించగలిగిన రసికునికి అందించటానికి అనువైన ఒక రసికవాగ్వ్యాఖ్య కూడా ఉండాలనే స్పృహ - ఈ మూడూ శ్రీనాథుడు తెలుగు కావ్యానికి అలంకరించిన వెలుగు తారహారాలు

శృంగారం రసరాజమనీ రసాల కన్నింటికీ మూలరసమనీ భావించే సాహిత్య దర్శనాన్ని శ్రీనాథుడు తెలుగు సాహిత్యంలో ప్రకాశింపజేస్తే ఆ

యుగంలోనే నివసించిన బమ్మెర పోతన భక్తి మూలరసమనే తత్వాన్ని భాగవత రచనంద్వారా ప్రదీపింపచేశాడు పోతన కాలంనాటికి భక్తిని రసంగా నిరూపించే లక్షణగ్రంథం వెలువడలేదు అయినా తెలుగులో భాగవతాన్ని లక్ష్యగ్రంథంగా రూపొందించాడు అందులోనూ పోతన భక్తిరస దర్శనం అద్వైత సిద్ధాంత మూలమైంది స్మార్త సంప్రదాయానికి సంబంధించింది ఈ యుగంలోనే చివరి పాదంలో సంకీర్తన సాహిత్య సముద్రాన్ని సృష్టించిన అన్నమాచార్యులు భక్తిని విశిష్టాద్వైత సిద్ధాంతపరంగా దర్శించి మధుర భక్తికి వైష్ణవమార్గాన్ని ఆవిష్కరించాడు తెలుగులో భక్తిరసభావనకు పోతన, అన్నమాచార్యులు రెండు కళ్ళవంటివారు

దాదాపు 16 వ శతాబ్దపు పూర్వభాగంలో రూపగోస్వామి (క్రీ. శ 1470-1554) భక్తిరస సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు 17 వ శతాబ్దిలో మధుసూదన సరస్వతి ప్రతిష్ఠాపించాడు నవవిధభక్తి సంప్రదాయం భాగవతంలోనూ పంచవిధభక్తి ప్రస్థానం ఆళ్వారుల రచనల్లోనూ గోచరిస్తుంది ఈ రెండు మార్గాలకూ రసస్థితిని కలిగించిన రచనలు తెలుగులో పద్య పద కవితా రూపాల్లో వెలయించి చూపటమే కాకుండా సర్వరసాలకంటె భక్తిరసం పరిపూర్ణమైనదన్న అనుభూతిని కలిగించారు శ్రీనాథయుగ భక్తి కవులు రూపగోస్వామి భక్తిని ముఖ్యరసంగానూ హాస్యాదిరసాలను గౌణరసాలుగానూ అన్వయించి మధుర భక్తిని ఉజ్జ్వలరసంగా ప్రతిపాదించాడు [11] మధుసూదన సరస్వతి భక్తిని పరిపూర్ణ రసంగా దర్శించి శృంగారాదులను క్షుద్రరసాలుగా భావించాడు [12] తెలుగు సాహిత్యంలో పోతన భాగవతం మధుసూదన సరస్వతి భక్తి రసాయనానికి సన్నిహితంగా ఉంటుంది అన్నమాచార్యుల సంకీర్తనలు రూపగోస్వామి భక్తి రసామృత సింధువుకు ఉజ్జ్వల నీలమణికి దగ్గరగా ఉంటాయి 15 వ శతాబ్దిలో భక్తిరసవాదాలకు ప్రాణం పోయగల రచనలనందించిన చైతన్యం తెలుగు సాహిత్యంలో వెలుగొందటం గమనించవలసిన ముఖ్యాంశం

రసచర్చలో మనకు రెండు మార్గాలు ప్రసిద్ధాలు విభావాదుల వలన కలిగే అలౌకిక రసాలను నిరూపించి వాటి అనుభవస్థితులు ఆనందంలో పర్యవసిస్తాయి - అని చెప్పే మార్గం ఒకటి రెండవమార్గం - సహృదయుడు రసానుభవం పొందటానికి భూమిక అయిన చిత్తస్థితిని రసమని పిలిచేది ఈ మార్గంలో

రత్యాదులు వికారాలనీ వివర్తాలనీ సంభావింపబడతాయి ఇటువంటి మార్గానికి చెందిన వాటిని రససమీకరణవాదా లని అంటారు ఒక విధంగా మొదటిమార్గం కావ్యరస వివేకం రెండవ మార్గం సహృదయచిత్త రసవివేకం

సాహిత్య క్షేత్రంలో నాలుగు రకాలైన రస సమీకరణ వాదాలు ప్రసిద్ధంగా ఉన్నాయి 1 శాంతరస సమీకరణవాదం 2 శృంగార రస సమీకరణవాదం 3 కరుణరస సమీకరణవాదం 4 అద్భుతరస సమీకరణవాదం అన్ని రసాలకు మూలమైన సహృదయుని చిత్తస్థితి ఒకటి ఉంటుందనీ దానినే రసమని పిలవాలనీ ఈ వాదాలవారి అభిప్రాయం వీటిని దృష్టిలో ఉంచుకొని కావ్య ప్రయోగాలు చేసేవారు శాంత శృంగార కరుణ అద్భుత రసాలనుండే అన్ని రసాలు పుట్టి అందులోనే లయిస్తున్నట్లు చిత్రించే ఒక ప్రత్యేక రసవన్మార్గాన్ని అనుసరిస్తారు శ్రీనాథయుగ కవులుకూడా శృంగార భక్తి అద్భుత శాంత రసాలకు సంబంధించి తమ తమ రచనలలో ఇటువంటి రసదృష్టిని ప్రయోగించినట్లు స్పష్టమౌతుంది

శ్రీనాథుడు శృంగారమే మూలరసమనే శాఖకు చెందుతాడు పోతన అన్నమాచార్యులు భక్తియే మూలరసమని ప్రపంచించే శాఖకు చెందుతారు కథా కావ్యకర్తలు లేదా - జాతివార్తా చమత్కార కావ్యకర్తలు అద్భుత రస వాదులు నంది మల్లయ ఘంట సింగయలు శాంతరస ప్రధాన వాదులు ఈ యుగంలో కరుణరసానికి బదులు భక్తిరసం ప్రధానరసంగా భావింపబడింది.

శాంతాది రసాల అనుభవస్థితికి మూలాలైన సహృదయ చిత్త స్థితులను గురించి లాక్షణికులు వివేచించారు నిర్వికారశమస్థితి శాంతరసస్థితి అహంకార రూప వికాసస్థితి శృంగార రసస్థితి భగవద్రూప తన్మయత్వరూప ద్రవస్థితి భక్తిరసస్థితి చమత్కార రూపమైన విస్తరస్థితి అద్భుత రసస్థితి శ్రీనాథయుగ కవులు తమ కావ్యాలలో శృంగార భక్తి శాంతాద్భుత రసస్థితులను కలిగించే రచనలను వస్తువులను భావపోషణలను వర్ణనలను కల్పించటం ధ్యేయంగా ఎన్నుకొన్నారు

అందువల్లనే శ్రీనాథయుగంలో కవులు తామెన్నుకొన్న రసాన్ని రస రాజంగా మూలరసంగా వారనుభవించి రసికులచేత అనుభవింపచేసే ఒక నవ్యమార్గాన్ని ప్రస్థానంగా సాగించి తమ ప్రత్యేకతను నిలుపుకున్నారు!

(1993)

**పాదసూచికలు :**

1. సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు - జి వి సుబ్రహ్మణ్య (తెలుగు అకాడమీ ప్రచురణ 199 ) (వ్యా సాహిత్య వికాస చరిత్ర - ఒక ప్రణాళిక - పు 219 )
2. ఆచార్య నగేంద్ర హిందీలో రస సిద్ధాంత్' అనే గ్రంథం వ్రాశారు. తెలుగు అకాడమి దాని తెలుగు అనువాదాన్ని ప్రకటించింది. (1985) అనువాదకుడు డాక్టర్ భీమసేన్ నిర్మల్. పంష్కర్తః డా పుల్లెల శ్రీరామచంద్రుడు ఈ వ్యాసంలో ఉద్ధరింపబడే వాక్యాలు తెలుగు అను వాదమైన రస సిద్ధాంతం నుండి గ్రహింపబడ్డాయి.
3 రససిద్ధాంతం - పుట - 35
4 రససిద్ధాంతం - పుట - 57
5 రససిద్ధాంతం - పుట 78-79
6 భీమేశ్వర పురాణం - 1 116
7. భోజుని శృంగార ప్రకాశిక - ప్ర సం Bho a s Srıngara Prakasa- Ed Prof V Raghavan పుట - 510.
8. భోజుని సరస్వతీ కంఠాభరణ - 5 1 3
9 భోజుని శృంగార ప్రకాశిక - మొదటి అధ్యాయం B.S P. Ed వి రాఘవన్ పు - 45
10 భోజుని శృంగార ప్రకాశిక - 2 వ సంపు పు. 356 B.S P పు 457
11. ముఖ్యస్తు పంచధా శాన్తః ప్రీతిః ప్రేయాంశ్చ వత్సలః
మధుర శ్చేత్యమీ జ్ఞేయా యథాపూర్వ మనుత్తమాః
హాస్యోఽద్భుత స్తథా వీరః కరుణో రౌద్ర ఇత్యపి
భయానకః స బీభత్స ఇతి గౌణశ్చ సప్తధా -భక్తి రసామృత సింధువు
12. పరిపూర్ణరసా క్షుద్రరసేభ్యో భగవద్రతిః
ఖద్యోతేభ్య ఇవాదిత్య ప్రభేవ బలవత్తరా - భగవద్భక్తి రసాయనం. 2-78

---

ఈ వ్యాసం సాహితీ సంపద (ఆచార్య కోవెల సంపత్కుమారాచార్య షష్టిపూర్తి అభినందన గ్రంథం - 1993) లో ప్రచురితం

# కథాకావ్యాలూ : జాతివార్తా చమత్కారాలూ

క్రీ శ 11 వ శతాబ్ది నుండి 14 వ శతాబ్దందాకా తెలుగు సాహిత్యం సమకాలీన సామాజిక జీవితానికి ఉదాత్త మానవ జీవితంలోని విలువలను నివేదించి చెప్పటానికి యత్నించింది ఈ కాలంలో వెలసిన రచనల్లో తలమానికం కవిత్రయం వారి ఆంధ్రమహాభారతం కవిత్రయం వారు చిత్రించిన పాత్రలలో తెలుగువారి స్వభావాలు గోచరించవచ్చు మహాభారత యుద్ధంలో తెలుగువారి యుద్ధవ్యూహాలూ నాటి రణమర్యాదలూ నైపుణ్యాలూ ప్రతిఫలించి యుండవచ్చు వేంగీదేశ ప్రసక్తి భారతంలో కనపడవచ్చు తిక్కనమహామంత్రి ప్రజ్ఞ రాయబారాలలో రాణించి యుండవచ్చు ఉత్తరాభిమన్యుల వివాహ ఘట్టంలో తెలుగువారి ఆచారవ్యవహారాలు తొంగి చూడవచ్చు విదుర నీతిలో తిక్కన నీతి వెలుగుచూడవచ్చు ఎఱ్ఱనగారి కథలలో తెలుగుదేశపు వాతావరణం పిల్లగాలిగా వీస్తుండవచ్చు అయినా సమకాలీన సమాజంలోని జీవిత వాస్తవికతను ప్రత్యక్షంగా కావ్యదర్పణంలో ప్రతిఫలింపచేసే ప్రయత్నాలు కావవి భారతంలోని ఆదర్శ ధార్మిక జీవితంలోని విలువలను కథాముఖంగా ప్రదర్శించే సాహిత్య స్పృహను సమాజానికందించే సఫల ప్రయత్నమే అది శివకవి సాహిత్యం మతధర్మాన్ని చిత్రించింది బసవని మహిమలూ భక్తుల మహిమలూ భక్తి వలన మానవుడు సాధింపగలిగే అతిలోక శక్తులకు నిదర్శనాలు బసవని మహిమలను ఆధ్యాత్మికపరంగా వాస్తవజీవిత ఘటనలని విశ్వసిస్తే శ్రీకృష్ణుని మహిమలను అనుమానించటానికే వీలులేదు ధార్మిక జీవితంవల్లా భక్తిమహిమ వల్లా మానవుడు సాధింపగలిగిన లక్ష్యాలను చెప్పేది పురాణసాహిత్యం జీవితంలోని ఉత్తమ విలువలను అనుసరించటం వలన తిరస్కరించటం వలన కలిగే లాభనష్టాలను సాహిత్య మర్యాద నాశ్రయించి చెప్పేది కావ్యేతిహాసం ప్రజలు ఆ కాలంలో జీవించే బ్రతుకు వైఖరులకంటె ప్రజలు ఏ కాలంలోనైనా జీవించవలసిన చింతనను రేకెత్తించటానికే కవిత్రయయుగ సాహిత్యం కృషి చేసింది

శ్రీనాథయుగంలో సాహిత్య రీతిలో మార్పువచ్చింది. సమకాలీన సమాజంలోని వాస్తవిక జీవితాన్ని అనుభవిస్తూ సాహిత్య జీవితంలోకూడా దానిని ప్రతిఫలింప చెయాలన్న తపన ప్రయత్నం ఈ యుగ రచనల్లో కనపడుతుంది. ఈ విధమైన ప్రవృత్తికి శ్రీకారం చుట్టిన మహాకవి శ్రీనాథుడు. ఆయన నోట వెలువడిన చాటుకవిత్వం ఆనాటి సమాజంలోని కొన్ని జీవితాల రంగుల ఛాయా చిత్రాల సంపుటి. ఆ ఛాయా చిత్రాలన్నీ శ్రీనాథుని సాహిత్యపు కెమేరాలో షూట్ చేసినవే. వాటికి రంగుతోపాటు రుచి వాసనకూడా ఉన్నాయి. సమాజాన్ని అభిరుచి దృక్పథంతో చూచి సహజదృశ్యాలను అత్యంత సహజంగానే కవితా జీవితంలో నిలపటం శ్రీనాథునిలో ఒక అలవాటుగా హాబీగా మొదటినుండి చివరిదాకా కనపడుతుంది. దానినుండి పుట్టిందే చాటుకవితాధార. సమాజంలోని ఏ దృశ్యమైనా అతనిని స్పందింపజేస్తే ఆ చైతన్యం ఒక చాటుకవితగా జాలువారేది. అంటే భౌతికానుభవం సాహిత్యాభివ్యక్తిగా సాక్షాత్కరించేదన్న మాట. సమాజంలోని వాస్తవం సాహిత్య స్పృహతో వెలువడేదన్నమాట! సహజ వాస్తవికతను సాహిత్యాభివ్యక్తిగా వినిర్మించె కవిచైతన్యాన్ని సామాజిక సాహిత్యస్పృహ అని పేర్కొనవచ్చు. ఇట్టి స్పృహను కావ్యరంగంలో ప్రవేశ పెట్టే మార్గాన్ని రుచి చూపించింది శ్రీనాథుడు.

అయితే శ్రీనాథుని ప్రౌఢరస కావ్యమైన శృంగార నైషధంలో కంటె భీమేశ్వర పురాణంలో ఈ స్పృహ ఎక్కువగా కనపడుతుంది. అయినా చాటుకవితలో ఈ స్పృహను శ్రీనాథుడు సమగ్రంగా పోషించాడు. చూస్తున్న సమాజాన్ని చూస్తున్నట్లు చెప్పే ఈ కవితాభివ్యక్తి ఆ యుగంలో అంతటితో ఆగలేదు. నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష అని వినుకొండ వల్లభరాయుడు క్రీడాభిరామాన్ని వీధి నాటకంగా రచిస్తూ శ్రీనాథునికి చూపించి ఉంటాడు. సామాజిక సాహిత్య స్పృహ చాటుకవిత్వంనుంచి సాహితీప్రక్రియల కెగబాకటం గమనించి సంతోషించి అతని ప్రయత్నానికి చెయూతనిచ్చి ఉంటాడు శ్రీనాథుడు. అంతేకాదు పల్నాటి పర్యటనంతా వీథిలో ఏకపాత్రాభినయం లాగా శ్రీనాథుడు మార్చివేశాడు. సామాజిక సాహిత్య స్పృహకు చాటుకవిత జన్మభూమి. వీధి విహారభూమిగా పరిఢవిల్లాయి.

సమాజంలో కవి చూచిన వాస్తవాన్ని వాస్తవంగా వాఙ్మయంలో రికార్డు చేయటం పదిహేనవ శతాబ్ది సాహిత్య చైతన్యంలోని శక్తిమంతమైన ధోరణి. దీనిని తరువాతి కాలంలో 'జాతి' అని పిలిచినట్లు తెలుస్తున్నది. ఉదాహరణకు-

"చిన్నిచిన్ని రాళ్ళు చిల్లర దేవుళ్ళు
నాగులేటి నీళ్ళు నాపరాళ్ళు
సజ్జ జొన్నకూళ్ళు సర్పంబులును తేళ్ళు
పల్లనాటిసీమ పల్లెటూళ్ళు"

అనే పద్యం వాస్తవ కథనం. పలనాడులోని అప్పటి పల్లెటూళ్ళ స్వభావాన్ని చెప్పే పద్యం ఇది. అంటే- వర్ణింపబడే వస్తువుయొక్క జాతి లక్షణం లేదా స్వరూప స్వభావాలు తేటపడేటట్లు, సహజ సుందరంగా సాహిత్య స్ఫూర్తి కలిగేటట్లు చెప్పటం జాతి. ఇది కవిత్వానికి ఉండవలసిన మంచి గుణంగా శ్రీనాథ యుగంలోని కొందరు కవులు భావించి, తమ ప్రయోగాల్లో పాటించారు. వర్ణ్య వస్తువు సమకాలీన సమాజంలోని జీవితవాస్తవం అయి ఉండాలి. అప్పుడే సామాజిక సాహిత్య స్పృహగా లెక్కింపబడుతుంది.

సామాజిక సాహిత్య స్పృహతో రచించే కవిత్వంలో ఉండవలసిన మరొక లక్షణం 'వార్త', వార్త అంటే సమకాలీన సమాజంలోని జనజీవన విధానానికి సంబంధించిన వివరణ. ఉదాహరణకు - క్రీడాభిరామంలో వర్ణింపబడిన సాంఘిక జీవిత విశేషాలన్నీ వార్త లనదగినవే:

"కప్పురభోగి వంటకము కమ్మని గోధుమపిండివంటయున్
గుప్పెడు పంచదారయును గ్రొత్తగఁ గాఁచిన యాలనేపెస
ర్పప్పును గొమ్ము నల్లనఁటిపండ్లును నాలుగునైదు నంజులున్
లప్పలతోడఁ గ్రొంబెరుగు లక్ష్మణవజ్ఝలయింట రూకకున్." (166)

ఆనాడు రూకకు దొరికే పూటకూటింటి భోజనాన్ని గురించిన ఈ పద్యం వాస్తవమైనా, 'జాతి' కాదు 'వార్త.' జాతివార్తలు క్రమంగా - సమకాలీన జనజీవన చిత్రీకరణలో ఛాయాచిత్ర గ్రహణం, చలనచిత్ర గ్రహణం లాంటివి. స్థిర చిత్రాలను ఒకటి పరిచయం చేస్తే చలత్‌చిత్రాలను మరొకటి ప్రదర్శించవచ్చు. జాతి ఒక అవస్థను వ్యక్తం చేసినట్లే, వార్త ఒక వ్యవస్థను వివరిస్తుంది. ఈ రెండూ కవిత్వంలో ఎంత ముఖ్యమో వాటిని చమత్కారంగా వ్యక్తీకరించటం కూడా అంతకంటే ప్రాముఖ్యం.

"రసికుఁడు పోవఁడు పల్నా
డెసగంగా రంభయైన నేకులె వడకున్
వసుదేశుఁ డైన దున్నును
గుసుమాస్త్రుం డైన జొన్నకూడే కుడుచున్."

ఈ కందపద్యంలో జాతివార్తలు చమత్కారంగా కవితామయం చేయబడ్డాయి. ఈ చమత్కారం శబ్దాలంకారం వలనగాని, అర్థాలంకారాల వలనగాని, శ్లేష వలనగాని, వక్రోక్తివలనగాని కవితలో వ్యక్తం కావచ్చు. ఇటువంటి కవిత్వావిష్కారం జరిగినప్పుడే సామాజికమైన వాస్తవం సాహిత్యస్పృహతో సాక్షాత్కరిస్తుందనే భావాన్ని శ్రీనాథుడు బీజప్రాయంగా పదిహేనవ శతాబ్ది సాహితీ క్షేత్రంలో నాటాడు. వినుకొండ వల్లభరాయుడు పాదుచేసి నీరుపోశాడు. క్రీడాభిరామం అనే క్రీడారామంగా దాన్ని పెంచాడు.

స్వభావోక్తికి జాత్యలంకారం అనే పేరున్నది. 16 వ శతాబ్దిలోని కావ్యాలంకార సంగ్రహ (నరసభూపాలీయ) కర్త స్వభావోక్తి అంటానికి బదులు 'జాతి' అనే అన్నాడు.

"సహృదయ హృదయంగమమై
మహి నున్నది నున్నయట్లు మాటలతేటల్
బహుళంబులుగాఁ జెప్పిన
మహితోక్తియె జాతి యయ్యె మహి నెట్లన్నన్." (5. 112)

భూమిపై ఉన్నదానిని ఉన్నట్లు చెప్పినా, మాటలతేటలు బహుళంగా ఉండేటట్లు చెప్పినా, అది మహితోక్తి కావాలి, సహృదయ హృదయంగమమై ఉండాలి. ప్రబంధయుగ కవులు అలంకారంగా గ్రహించిన 'జాతి'ని సమాజంలో చూచిన దానిని చూచినట్లు చమత్కారంగా అర్థగౌరవంతో, సహృదయరంజకంగా చెప్పే సామాజిక కవితాస్పృహగా గ్రహించారు శ్రీనాథయుగ కవులు. 17 వ శతాబ్దంలో చేమకూర వేంకటకవి ప్రశస్తికి కారణాలైనవి నాలుగు కవితాంశాలు:

"తా రసపుష్టియై ప్రతిపదంబున జాతియు వార్తయున్ చమ
త్కారము నర్థగౌరవము గల్గు ననేక కృతుల్ ప్రసన్నగం
భీరగతిన్ రచించి మహి మించినచో నికశక్తు లెవ్వర
య్యా! రఘునాథభూపరసికాగ్రణికిన్ జెవిసోకఁ జెప్పఁగాన్."
(విజయవిలాసము-అవ. 31)

అవి జాతి వార్త చమత్కారం అర్థగౌరవం ఈ నాల్గింటివలన రసపుష్టి ప్రసన్న గాంభీర్యం అనే స్వభావవిశేషాలు కావ్యానికి కలుగుతాయి వీటిల్లో జాతి అంటే స్వభావం అని వేదం వేంకటరాయశాస్త్రిగారు స్వభావోక్తి అని బులుసు వెంకటరమణయ్యగారూ వివరిస్తే ఆరుద్రగారు జాతి అంటే జోక్ అని వార్త అంటే సామెత అని పేర్కొన్నారు (చూడండి సమగ్రాంధ్ర సాహిత్యం 10 వ సంపు పు 99-192) ఆరుద్రగారు అర్థాన్ని కూడా జోక్ గానే మనం తీసుకోవాలేమో

జాతి వార్తా చమత్కారాలను కథాకావ్య ప్రక్రియలో పాటించె పద్ధతిని సాగించినవారు విక్రమార్క చరిత్ర కర్త జక్కన భోజరాజీయ కర్త అనంతా మాత్యుడు సింహాసన ద్వాత్రింశిక కర్త కొఱవి గోపరాజు పంచతంత్రకర్త దూబగుంట నారాయణ కవి శుక సప్తతి కర్త పాలవేకరి కదిరీపతి హంస వింశతి కర్త అయ్యలరాజు నారాయణకవి మొదలైనవారు శుకసప్తతి హంస వింశతి కర్తలు శ్రీనాథయుగంలోనివారు కాకపోయినా ఈ బాటను నడిచినవారు

స్థూలంగా వివేచిస్తే జక్కనకవి చమత్కారాన్ని ఆదరించిన కవి అనంతామాత్యుడు జాతి ని గౌరవించిన కవి కొఱవి గోపరాజు వార్త ను పాటించిన కవి ఈ వివేచనం ప్రాధాన్య వివక్షతో చేస్తున్నదే కృతిపతి జక్కనను ప్రశంసిస్తూ స్వాభావికత్వం నవకవితా ప్రాభవం కలవాడని పేర్కొన్నాడు. జక్కనయే ప్రతి పద్యము చోద్యముగాఁ గృతి చెప్పిన నొప్పుగాక (1 17) అని స్పష్టంగా చెప్పాడు ప్రతిపద్య చమత్కారం జక్కన కవితా లక్ష్యం ఆయన చెప్పిన విక్రమార్క కథ లెంత అద్భుత విక్రమాలను ప్రకటిస్తాయో ఆయన రచించిన పద్యాలు కూడా రచనా శిల్పంలో శ్రీనాథాదులతో అంత పోటీ పడతాయి చిత్రమేమంటే - జక్కనలో చమత్కార ప్రస్థానాన్ని అనుసరించిన నాచన సోముని కవితాచ్ఛాయలూ రసాశ్రితమైన రీతి ప్రస్థానాన్ని సారించిన శ్రీనాథ కవితా పుఱుతులూ గోచరిస్తాయి కావ్యయుగంలో పద్యశిల్ప దృష్టితో గమనిస్తే జక్కనకు విశిష్ట స్థానాన్ని కల్పించారు విమర్శకులు

శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ గారు మొదటి కవిత్రయంతోపాటు రెండవ మూడవ కవిత్రయాలను పేర్కొన్నారు జక్కన శ్రీనాథుడు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు - రెండవ కవిత్రయం పెద్దన తెనాలిరామకృష్ణుడు రామరాజ భూషణుడు - మూడవ కవిత్రయం రెండవ కవిత్రయము వారు వచ్చిన

దగ్గరనుండియే తెలుగున కవిత్వము రక్తి కట్టినది వారినే తరువాతి కవు లనుస రించి ప్రబంధయుగము నావిష్కరించిరి. . రెండవ కవిత్రయము వారి కొక సమాన లక్షణము కలదు తెలుగున సంస్కృతమున వారి నుడికారము సమాన రచనా ధోరణి ఉత్పల చంపకమాలికలను పత్తేభమును సీసమును నడిపించు రీతి రెండవ కవిత్రయము వారిలో ముగ్గురియందు సమాన లక్షణ లక్షితములై కనుపించును (సాహిత్య కౌముది 19 8 పు 42)

జక్కన కథా కావ్య ప్రక్రియా నిర్మాణ పద్ధతిలో అనంతామాత్యుడు' కొరవి గోపరాజు మొదలైనవారి వరుసలో మొదట నిలబడదగినవాడు రచనా చమత్కారంలో నాచనసోమ శ్రీనాథాదుల సరసన నిలువగలవాడు పద్య శిల్ప మర్యాదలనన్నీ అలా ఉంచి జాతి వార్తా చమత్కారాలలో చమత్కారం పాలు ఎలా పోషిస్తాడో తెలియటానికి ఒక చిన్న కంద పద్యం వర్ణ్య వస్తువు స్త్రీరోదన—

పుటపుటనగు చనుఁగవపై
బొటబొటఁ గన్నీరు దొరఁగఁ బురపురఁ బొక్కం
దటతట గుండియ లదరఁగఁ
గటగట యిది కోమువలము గాకె మనుచున్ (విక్ర 7 153)

ఈ పద్యంలో స్త్రీ రోదనచేస్తూ ప్రకటించిన చేష్టలు అత్యంత సహజాలు కావటం చేత జాతి వాటి వర్ణనంలో వార్త గోచరించవచ్చుకాక. అయినా శబ్దానుకరణ రూపాలతో పద్యంలో కలిగించిన చమత్కారం ఈ రచనలో ముఖ్యం కథా కావ్యం కావటంచేత విక్రమార్కచరిత్రలో మొదటినుండి చివరిదాకా వ్యాపించి యున్న ఒకే ఒక కథ ఉండదు చిన్న కథలలో మహా కావ్య శిల్పం ప్రదర్శించటం కష్టం అందువలన ప్రతిపద్య చమత్కార పద్ధతి నాశ్రయిం చాడు జక్కన మిగిలిన వారికి మార్గదర్శకు డైనాడు

అనంతామాత్యుని కవితకు జాతి నీతి ముఖ్య లక్షణాలు చెప్పినవి చిన్నకథలు అందులో జక్కనలాగా ఉత్ప్రేక్షలకు పోకుండా స్వభావ వర్ణన లతో కావ్యాన్ని రక్తి కట్టించాడు ఎదనెడ నీతితో సూక్తిమౌక్తికాలను తోరంగా కూర్చాడు భోజరాజీయంలో గోవ్యాఘ్ర సంవాదం ప్రసిద్ధం అందులో ఆవును దూడను వర్ణించినతీరు సహజత్వానికి జాతికి చక్కని ఉదాహరణం గోమాత తన బిడ్డకు చెప్పిన నీతులు నేటికీ తెలుగువారి నోట సూక్తులుగా వినిపిస్తూ ఉంటాయి అందులో ఒకటి—

"చులకన జలరుహ తంతువు
చులకన తృణకణము, దూది చుల్కన సుమ్మీ
యిల నెగయు ధూళి చుల్కన
చులుకన మఱి తల్లిలేని సుతుఁడు కుమారా" (భోజ. 6.37)

కొఱవి గోపరాజు కవిత్వం కథాకథనాని కనువైన మధుర రచన. ఆయన కథ చెప్పటంతోపాటు సందర్భం వచ్చినప్పు డెల్లా తన కాలంలో ఉన్న వివిధ విశేషాలను కావ్యంలో పొదివి, దానిని విజ్ఞాన సర్వస్వంలా చేసే పద్ధతిని విరివిగా ప్రకటిస్తాడు. కథల్లో సందర్భాన్నిబట్టి చిత్రకవితారీతులు, యతి ప్రాసలూ, శకునాలూ, జానపదులు కొలిచే దేవతలు, వస్త్రాలలోని భేదాలూ, పక్షివేట విశేషాలూ మొదలైనవి ఎన్నింటినో పొందుపరుస్తాడు. ఇవి కావ్యరస భావాలకు తోడుపడవు కాని, నాటి సాంఘిక స్థితిగతులను తెలుసుకొనటానికి తోడ్పడతాయి. గోపరాజు కథా కావ్య ప్రవృత్తిలో వార్తను పోషించే పద్ధతికి ఒరవడి పెట్టాడు.

విక్రమార్కుని కథలూ, భోజరాజు కథలూ, శుకసప్తతి కథలూ చెప్పిన కథాకావ్యాలు అద్భుత కథాప్రపంచంపట్ల ఆనాటి ప్రజానీకానికున్న ఆసక్తిని ప్రకటిస్తున్నాయి. పరస్పర విభేదాలతో రాజులు యుద్ధాలు చేసుకుంటూనే ఉత్తరాదినుండి పెద్దదాడులు వస్తే ఎదుర్కొనే యత్నంలో ఉండే కృష్ణా గోదావరీ తీరప్రాంత ప్రజలు నీతికీ, సాహసానికీ, పరాక్రమానికీ, సమకాలీన సామాజిక జీవన విధానాన్ని సాహిత్యంలో సంరక్షించుకొనే భద్రతకీ తగినంత ప్రాధాన్యాన్ని ఇచ్చారు. వారు జీవించటం ఎంత ఘనమో, వారి జీవితాంశాలను సాహిత్యంలో ప్రతిఫలింప చేసుకోవటం అంత ఘనం. పదిహేనవ శతాబ్దిలోని కథాకావ్య ప్రక్రియా ప్రయోగాలు సమాజంలోని సామాజిక జీవన స్పృహను సాహిత్య స్పృహతో సంపుటీకరించి భద్రపరిచాయి. శ్రీనాథయుగ కథాకావ్యాలు నాటి సామాజిక సాహిత్య స్పృహకు సజీవ శిల్పాలు! జాతి వార్తా చమత్కారాలకు దోహద ప్రక్రియలు!!

(1988)

# ప్రబంధప్రస్థానంలో వక్రోక్తిజీవితం

తెలుగులో ప్రబంధం ఒక ప్రత్యేక ప్రక్రియ. సంస్కృత లాక్షణిక సంప్రదాయంలో ప్రబంధమంటే కావ్యమే కాని క్రీ.శ. 16 వ శతాబ్దంలో తెలుగు కవులు రచించిన కొన్ని కావ్యాలు ఆంధ్ర సాహిత్య వికాసంలో ఒక ప్రత్యేక ప్రయోగశీలాన్ని ప్రదర్శిస్తూ ఉండటం చేత 20 వ శతాబ్దపు తెలుగు విమర్శకులు ఆ యుగంలో వెలువడిన కావ్యాలను ప్రబంధాలని ప్రత్యేకంగా పిలుస్తున్నారు వాటి స్వరూప స్వభావాలను గురించి లక్షణాలను గురించి దాదాపు దశాబ్దికి పైగా చర్చలు చేస్తున్నారు ఇప్పటికీ సాగిస్తున్నారు. దాదాపు 15 సంవత్సరాల క్రితం వరకు కావ్యానికి ప్రబంధానికి భేదం లేదనే పండితుల వాదం కూడా వినపడుతూ ఉండేది. కాని ఇప్పుడు ప్రబంధం ప్రత్యేకాంధ్ర కావ్యప్రక్రియగా సాహిత్యరంగంలో రూఢికెక్కింది

ఆంధ్ర ప్రబంధ లక్షణాలు సంస్కృత లక్షణ గ్రంథాలలో అన్వేషించేవి కావు ఆంధ్ర విమర్శకులు రూపొందించినవే అవి ఇప్పటికి దాదాపు పదిదాకా కనపడుతున్నాయి ఆ దశలక్షణవివేచనం గురించి గమనిస్తే ఆంధ్ర విమర్శకులు ప్రబంధ తత్వాన్ని ఎలా క్రమంగా లోతుగా దర్శించగలిగారో కూడా తెలుసుకోవచ్చు ఆ లక్షణాలు స్థూలంగా ఇవి ·

1. అష్టాదశ వర్ణనలకు ప్రాధాన్యం

ప్రబంధాలలో అష్టాదశ వర్ణనలకు ప్రత్యేకస్థానం ఉంటుంది కావ్యంలో కూడా పదునెనిమిది వర్ణనలు ఉంటాయి అయినా అవి కథకు ఒదిగి తత్పోషకంగానే సంబంధింపబడతాయి కాని ప్రబంధాలలో కథకులాగా వర్ణనలకు కూడ ప్రాధాన్యం ఉంటుంది. కవి తన వ్యుత్పత్తిని లోకజ్ఞతను భావుకత్వాన్నీ· రచనాప్రౌఢిని ప్రదర్శించుకోవటానికి వర్ణనలు శక్తిమంతమైన వాహికలుగా వాడుకున్నట్లు ప్రబంధాలలో గోచరిస్తాయి వర్ణనలు పద్దెనిమిదా ఇరవైరెండా ఇరవైనాలుగా? - ఇలా సంఖ్యలపై వివాదాలూ ఉన్నాయి ప్రబంధాలలో వర్ణనలు నిర్వహించే నిర్మాణాత్మకమైన పాత్ర మీద భిన్నమైన అభిప్రాయా

లున్నాయి వాదాలెన్ని వెలువడినా ప్రబంధంలో వర్ణనలకు ప్రాముఖ్యం ఎందుకు వచ్చింది? అనే ప్రబంధ రచనా కళాంశానికి సాహిత్య సిద్ధాంతపరమైన ఒక సమన్వయ సూత్రం అవసరమని అందరూ భావిస్తూనే ఉన్నారు

2 కథలో వస్త్వైక్యంగాని ఏకవాక్యతగాని పాటింపబడాలి

వస్తువును చెప్పి నిర్వహించటంలో ప్రబంధకవులు వైవిధ్యంతో కూడిన ప్రయోగాలు చేశారు మూడు తరాల కథాసూత్రంతో వస్తువును ముడిపెట్టే కథావిధాన మొకటి రమణీయ సన్నివేశాలను కల్పించి కథను రక్తి కట్టించే విధానం మరొకటి వీటిలో మొదటి పద్ధతి అల్లసాని పెద్దనతో మొదలై పింగళి సూరనతో పరిణతిచెందింది రెండవ పద్ధతి నంది తిమ్మనతో ప్రారంభమై రామ రాజభూషణునితో పరిపూర్ణత చెందింది మూడవ పద్ధతి రాయల రచనలో రవ ళించి తెనాలి రామకృష్ణుడు ధూర్జటి కృతులలో బాగ మెరసింది రెండు కథలను ఒకే కావ్యంలో జోడించి చెప్పే ద్వ్యర్థికావ్య పద్ధతిని పింగళి సూరన వెలయించాడు రామరాజభూషణుడు రాణింపచేశాడు అంతేకాక పింగళి సూరన కల్పితకథా ప్రబంధానికీ రామరాజభూషణుడు శ్లేషప్రౌఢ ప్రబంధానికీ ప్రాణం పోశారు మొదటి మూడవ తెగలకు చెందిన ప్రబంధాలలో వస్త్వైక్యం ఉండటం అసాధ్యం కాని ఏకవాక్యత తప్పకుండా ఉంటుంది అందువలన ప్రబంధాలలో వస్త్వైక్యం ఉంటుందనటంకంటె ఏకవాక్యత గల వస్తువుంటుందనటం సత్యా నికి సన్నిహితం ప్రబంధ వస్తు నిర్మాణంమీద చర్చలెన్నో జరిగాయి కాని ప్రబంధ కవులు ఆ కాలంలో అటువంటి వైవిధ్యంగల వస్తువులను చేపట్టటం వెనుక ఏదైనా సాహిత్య సిద్ధాంత భూమిక ఉన్నదా? అనే ప్రశ్న సమాధానం కోసం వేచిఉంది

3 ప్రబంధ వస్తువు ఏకనాయకాశ్రితమై ఉండాలి లేదా అపూర్వ పాత్రలను పోషించేదిగా రాణించాలి

ఆంధ్ర ప్రబంధాలన్నీ ఒక నాయకుడు ఒక కథ ఒక రసం - అనే సూత్రానికి కట్టుబడి ఉన్నాయని చెప్పలేము పారిజాతాపహరణము ప్రభావతీ ప్రద్యుమ్నము వసుచరిత్ర వంటి ప్రబంధాలు ఆ మార్గంలో నడిచినా మను చరిత్ర ఆముక్తమాల్యద పాండురంగ మాహాత్మ్యము శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యము మొదలైనవి ఆ సూత్రానికి కట్టుబడిలేవు కాని ప్రతి ప్రబంధం లోనూ ఒకటిగానీ కొన్నిగాని ప్రధాన పాత్రలుంటాయి అవి ఆదర్శ (Ideal)

పాత్రలే కావలసిన పనిలేదు అవి చాలవరకు అపూర్వ (Rare) పాత్రలై ఉంటాయి ఒక్కొక్కసారి రెండు రకాల పాత్రలూ ఒక్కొక్క ప్రబంధంలో ఉంటాయి. ఉదాహరణకు మనుచరిత్రలోని మూడు తరాల కథలో ముగ్గురు ప్రధాన పాత్రలు (నాయకులు) ఉన్నారు వారిలో ప్రధానుడు ప్రవరుడు. ప్రధాన కథాగతిలో ప్రత్యక్షసంబంధం లేకపోయినా ప్రవరుడు స్వారోచిషమను సంభవంలో ప్రధానపాత్ర నిర్వహిస్తాడు ప్రవరుడు ఆదర్శపాత్ర వరూధిని అపూర్వపాత్ర వరూధిని వంటివారే స్వరోచి మొదలైన పాత్రలు అవన్నీ ప్రతీకాత్మక పాత్రలు కూడా

ఆంధ్ర ప్రబంధాలు అపూర్వ పాత్రలను చిత్రించటంలో పేరుపొందాయి ప్రబంధకవులు జీవితరంగం నుండి విశిష్టచిత్తవృత్తులను గ్రహించి తమ లోక జ్ఞతతో వాటికి చికిలిపెట్టి శిల్పసుందరంగా దిద్ది తీర్చారు అల్లసాని పెద్దనగారి వరూధినీ ప్రవరులు నంది తిమ్మయగారి సత్యభామా శ్రీకృష్ణులు రాయలవారి గోదా విష్ణుచిత్తులు పింగళి సూరనగారి సుగాత్రిశాలీనులు రామరాజభూషణుని శుక్తిమతీ కోలాహలులు తెనాలి రామకృష్ణుని నిగమశర్మ అక్క సుశీలలు, ధూర్జటి తిన్నడు మొదలైనవారు ఇందుకు సజీవోదాహరణాలు ఒక్కయుగంలో ఇన్ని పాత్రలు ప్రజాదరణాన్ని పొందటం విశేషం

ప్రబంధ పాత్రలను గురించి ఎందరో విమర్శకులు విలువైన విశ్లేషణలు చేశారు కాని ఆ యుగంలో ప్రబంధ వస్తువులలో అటువంటి పాత్రలను భావించి కల్పించి పోషించిన ఆ కవుల ప్రతిభలలో ప్రతిఫలించిన సాహిత్య దర్శన పరమార్థమేమిటో ఇదమిత్థంగా నిరూపించలేకపోయారు.

## 4. శృంగార రసప్రాధాన్యం

ప్రబంధాలలో శృంగార రసం బహుభంగుల పోషింపబడింది. శృంగారాన్ని సంభోగ వియోగ విప్రలంభ భేదాలలో రసాభాసాది భేదాలలో, కామ శాస్త్రంలో పేర్కొనబడిన పలురకాలలో ప్రబంధాలు ప్రయోగాత్మకంగా పోషించాయి లక్షణగ్రంథాలలో ఎన్నిరకాల శృంగార నాయకులు నాయికలు అవస్థలు అభినయ విశేషాలు చెప్పబడి ఉన్నాయో వాటినన్నింటిని ప్రబంధ కవులు తమరచనలలో చిత్రించి పోషించారు

ఉదాహరణకు - వరూధినీ ప్రవరుల సన్నివేశం శృంగార రసాభాసానికి ఉత్తమోదాహరణం . మూహాయామపంలో ఒకరికి మాత్రమే అనురాగముండట్లు

వర్ణిస్తే శృంగార రసాభాసం. తిక్కన - విరాటపర్వంలోని కీచక వృత్తాంతంలో రసాభాసాన్ని అపూర్వంగా పోషించి చూపించగా, పెద్దన - మనుచరిత్ర ద్వితీయాశ్వాసంలో మరల అపూర్వంగా పోషించి ప్రదర్శించాడు. అక్కడ కీచకుడు మాత్రమే రాగరసపూర్ణుడు; ఇక్కడ వరూధిని మాత్రమే వలపుల వెల్లువ. మాయాగంధర్వుని వృత్తంలో, స్వరోచి జీవితంలో శృంగారం చిత్రవిచిత్రంగా పోషింపబడింది. ప్రబంధాలు శుద్ధ శృంగార రసప్రవృత్తుల పోషణం కంటె అపూర్వ శృంగార రసపోషణకే ప్రాధాన్యమిచ్చి ప్రాచుర్యాన్ని చెందాయి. శాంతరస భక్తిరస ఘట్టాలు సైతం శృంగార రసమిశ్రితాలు కావటం ప్రబంధాలలో విశేషం. ఇటువంటి రసపోషణ వైచిత్రికి వెనుకనున్న సాహిత్యదర్శన స్ఫూర్తిని గురించి సమాలోచించవలసిన అవసరం ఇంకా ఉంది.

## 5. ప్రబంధాలు అనువాదాలు కారాదు :

ఒక మూలాన్ని ఆలంబనంగా చేసికొని శబ్దానువాదమో, భావానువాదమో, కథానువాదమో చేసినదిగా ప్రబంధం ఉండరాదు. పురాణంలోగానీ, ఇతిహాసంలో గానీ, సంగ్రహంగా ఉన్న కథను ఎన్నుకొని, దాని వర్ణనాదులతో పెంచి ప్రబంధంగా నిర్మించటం ముఖ్యం. మూలకథ ఏ ప్రక్రియకు సంబంధించినదైనా దానికి ప్రబంధ ప్రక్రియకు సముచితమైన రూపగుణక్రియా వైభవాన్ని సంతరించటం ప్రబంధకవి ధర్మం. అందువలన ప్రబంధాలు అనువాద రచనలు కావు. స్వతంత్ర రచనలు.

## 6. ప్రబంధాలలో దృశ్యకావ్య మర్యాదలు పాటింపబడాలి :

దృశ్యకావ్య మర్యాదలను యథాశక్తి పాటించటం ప్రబంధ లక్షణాలలో మరొకటి. సన్నివేశ పరికల్పనం, పాత్రోచిత సంభాషణా శిల్పం, చతుర్విధాభినయ విన్యాసం, నాట్యశాస్త్ర మర్యాదల సమాదరణం, సంగీతాది లలితకళల వైలక్షణ్యాలను కవితలో ప్రదర్శించటం మొదలైనవి 'నాటకీయత' అని పేర్కొనబడే ఈ లక్షణంలోని ముఖ్యాంశాలు. ప్రబంధాలు సమాహార కళలుగా ప్రసిద్ధి పొందాయి. బహుశాస్త్ర పాండిత్యంతో పాటు సంగీత నాట్య సాహిత్య శాస్త్ర రహస్య కోవిదులు కాకపోతే ప్రబంధ కవితాశిల్ప మర్మాలను తెలిసి ఆనందించటం కష్టం.

## 7. జాతి వార్తా చమత్కారాలు :

జాతి వార్తా చమత్కారాల స్పృహ ప్రబంధ కవులు తమకు ముందున్న కావ్యయుగం నుండి తెచ్చుకొన్న నవీన గుణం. ప్రబంధంలోని వస్తువు ఏ కాలం నాటిదైనా ప్రబంధకవులు తాము జీవిస్తున్నకాలంనాటి వాస్తవికతఅందులో ప్రతిఫలించటానికి ఈ లక్షణం బలంగా తోడ్పడింది. ప్రబంధంలోని వర్ణ్యవస్తువును కవి తన సమకాలీన సమాజంలో చూచిన వాస్తవానికి వాస్తవ ప్రతిబింబంగా ఉండేటట్లు చిత్రిస్తే అది 'జాతి' అనబడుతుంది. దానినే సామాజిక సాహిత్య స్పృహగా పేర్కొనవచ్చు. 'వార్త' అంటే సమకాలీన సమాజంలోని జనజీవన విధానానికి సంబంధించిన వివరణ. జాతి వార్తలు క్రమంగా సమకాలీన జనజీవన చిత్రీకరణలో ఛాయాచిత్ర గ్రహణం, చలనచిత్ర గ్రహణం లాంటివి. స్థిర చిత్రాలను ఒకటి పరిచయం చేస్తే, స్థిర చిత్రాలతోపాటు చలత్ చిత్రాలను కూడా మరొకటి ప్రదర్శించవచ్చు. 'జాతి' ఒక అవస్థను వ్యక్తం చేసినట్లే 'వార్త' ఒక వ్యవస్థను వివరిస్తుంది. ఈ రెండూ కవిత్వంలో ఎంత ముఖ్యమో వాటిని చమత్కారంగా వ్యక్తీకరించటం కూడా అంతకంటే ముఖ్యం. ప్రబంధాలు ఈ మూడింటికి ప్రాముఖ్యాన్నిచ్చాయి.

## 8. ప్రబంధ వస్తువులో ప్రతీకాత్మకత పోషింపబడాలి :

ప్రబంధకవి తా నెన్నుకొన్న వస్తువులో మూలంలోనే ప్రతీకాత్మక ప్రవృత్తి సహజసిద్ధంగా ఉంటే దానిని యథాతథంగా రక్షించి విస్తరించి రచించవచ్చు. లేదా, తాను ఆ కథకు - వినూత్న ప్రతీకాత్మక ప్రవృత్తిని కల్పించి పోషించవచ్చు. ఏమైనా, ఆంధ్రప్రబంధానికి ప్రతీకాత్మక స్వభావం ఉండటం ప్రధాన లక్షణం.

ప్రసిద్ధ విమర్శకులు ప్రసిద్ధప్రబంధాల ప్రతీకాత్మక స్వభావాన్ని గురించి వివేచించారు. మనుచరిత్ర, కళాపూర్ణోదయం, ప్రభావతీ ప్రద్యుమ్నం, వసుచరిత్ర, అముక్తమాల్యద, పాండురంగమాహాత్మ్యం, విజయవిలాసం మొదలైన ప్రబంధాలలోని ప్రతీకాత్మక ప్రవృత్తులను వివరించి చెప్పారు. ఇంకా ఆ దిశగా ఆలోచన చేస్తున్నవా రున్నారు. ప్రతీకలుగా పాత్రలను దిద్దితీర్చే ప్రతిభాప్రాభవాలను ప్రకటించలేకపోతే ఆ కవి ప్రబంధ కవి కాదు; అతని రచన ప్రబంధ మనిపించుకోదు - అన్నది నేటి అవగాహన.

## 9 ఆలంకారికమైన శైలి

ప్రబంధాలలో శైలికి ఒక ప్రత్యేకస్థానం ఉంది పద్యరచనను ప్రత్యేక కళగా భావించి ఒక్కొక్క పద్యాన్ని శిల్పమందిరంగా చికిలిపెట్టే పద్ధతి బాగా ప్రచారంలోకి వచ్చింది. కవితలో రమణీయమైన భావాన్ని చెపుతూ దాన్ని అలంకారాలతో అలంకరించిదానికంటె రమణీయమైన భావాన్ని అలంకారంగానే అభివ్యక్తీకరించే పద్ధతి ప్రబంధాలలో రూపుకట్టింది దీనినే స్థూలంగా ఆలంకారికమైన శైలి అని పిలుస్తారు ఆలంకారిక శైలికి ఆలంకారిక ప్రస్థానం ప్రాతిపదిక

సాహిత్య ప్రస్థానాలలో ప్రబంధకవులకు అలంకార ప్రస్థానమే శరణ్యమైపోయింది కవిత్రయంవారు ధ్వని ప్రస్థానాన్ని దండిగా ప్రసరించారు గుణాలను కవితలో గౌరవించారు నాచన సోముడు చమత్కార మార్గంలో కవితను సాగించాడు శ్రీనాథుడు రీతి మార్గాన్ని శృంగార రస సమీకరణ సిద్ధాంతాన్ని సమన్వయించి ఒక సమ్మోహనమైన కవితా శైలిని సారించాడు పోతన పరిపూర్ణ భక్తిని సాహిత్య దర్శనంలో కవితామయంగా అవతరింపజేశాడు ఇక మిగిలింది విస్తారమైన అలంకార ప్రస్థానం అది ప్రబంధ కవులకు విహారరంగమై నిలిచింది. కాలపురుషుడు వారి కందించిన కల్పకం అలంకార ప్రస్థానం

సర్వాలంకారాలకు బీజభూతమైన అలంకారమేది? - అనే అంశం మీద అలంకారికులలో అభిప్రాయభేదాలున్నాయి అయా సిద్ధాంతాలనుబట్టి నాలుగైదు మార్గాలు ప్రసిద్ధిలోకి వచ్చాయి వాటిని ఇలా భావించవచ్చు

1 వక్రోక్తియే సర్వాలంకార బీజభూతమనే భామహాదుల మతం.
2 ఉపమాలంకారమే సర్వాలంకార బీజభూతమనే వామనాదుల మతం
3. అతిశయోక్తియే సర్వాలంకార బీజభూతమనే మమ్మటాదుల మతం
4 స్వభావోక్తియే సర్వాలంకార బీజభూతమనే దండ్యాదుల మతం
5 శ్లేషయే సర్వాలంకార బీజభూతమనే ఆలంకారిక మతం.

దండ్యాదులు అర్థాలంకారాలను స్వభావోక్తులనీ వక్రోక్తులనీ రెండు కక్ష్యలుగా విభజించారు భామహుడు స్వభావోక్తి నంగీకరించలేదు రుద్రటుడు వాస్తవ ఔపమ్య అతిశయ శ్లేషలను అలంకారమూలాలుగా గ్రహించాడు రుయ్యకుడు ఔపమ్య విరోధ శృంఖలా న్యాయ గూఢార్థ ప్రతీతి సంసృష్టి

సంకరాలనే విభాగ షట్కాన్ని పాటించాడు. విద్యానాథుడు ఔపమ్య, సాధర్మ్య; అధ్యవసాయ, విశేషణ, వైచిత్ర్యములనే విభాగాలు చేశాడు. ఇవన్నీ ఒక యెత్తు; పైన పేర్కొన్న అయిదు మతాలూ మరొక యెత్తు. ఆంధ్ర ప్రబంధ కవు లాయా సిద్ధాంతాలను అనుసరిస్తూ తదనుగుణాలైన ఉక్తి వైభవాలను వెలార్చారని స్పష్టమౌతున్నది. ఈ ప్రతిపాదన గమనించండి:

| కవి పేరు | అలంకార సిద్ధాంతం | ఉక్తిలక్షణం |
|---|---|---|
| 1. అల్లసాని పెద్దన | అలంకారాలు ఉపమామూలాలు | చతురోక్తి |
| 2. నంది తిమ్మయ | అలంకారాలు ఉపమూలాలు | సరసోక్తి |
| 3. శ్రీకృష్ణదేవరాయలు | అలంకారాలు స్వభావోక్తి/ అతిశయోక్తి మూలాలు | ప్రౌఢోక్తి |
| 4. పింగళి సూరన | అలంకారాలు వక్రోక్తి/ శ్లేషోక్తి మూలాలు | సమాసోక్తి |
| 5. రామరాజభూషణుడు | అలంకారాలు శ్లేషోక్తి మూలాలు | శ్లేషోక్తి |
| 6. తెనాలి రామకృష్ణుడు | అలంకారాలు వక్రోక్తి మూలాలు | వక్రోక్తి |
| 7. చేమకూర వేంకటకవి | అలంకారాలు శ్లేషోక్తి మూలాలు | శ్లేషోక్తి |

ఈ కవులలో ఔపమ్యమూలవాదుల కవిత ఉత్తమంగా ఉంటుంది. పెద్దన తిమ్మనలు ఆ కోవలో నిలుస్తారు. పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి వీరికి దగ్గరివాడు. తిమ్మనకంటె పెద్దన పదిరెట్లు పెద్దకవి. ఆయనది 'చతుర వచన రచన' అనీ, అతని ఉక్తులు 'శిరీష కుసుమపేశల సుధామయోక్తు'లనీ రాయలు ప్రశంసించాడు.

ప్రబంధకవులలో రసస్వరూపం బాగా తెలిసిన కవి అల్లసాని పెద్దన. అలంకార ప్రస్థానానికి ఆదర్శప్రాయమైన కవితారుచిని అందించినవాడు కూడా ఆయనయే. అందుకే ఆయనను ఆంధ్రకవితా పితామహునిగా రాయలు కీర్తించాడు. శబ్దార్థాలంకారమండితమైన సుకుమార మధురపాకమైన పదరచనతో రీతితో పోషింపబడే రసవృత్తిని స్ఫురింపజేసే చాతుర్యం ఆయన సొత్తు. పెద్దన రచనలో శబ్దార్థగుణ రూపమైన శ్లేష సమృద్ధంగా నిండి ఉంటుంది. పెద్దన సాధించిన గుణశ్లేషను మాని శబ్దార్థ శ్లేషాలంకృతులను సూరనాదులు తమ కవితలలో పండించుకొని క్రొత్త పోకడలు పోయారు. ఎవరెన్ని ప్రయోగాలు

చేసినా రసవృత్తి వ్యంజకమై గుణరీతి నిరూపకమైన అలంకృతోక్తి ప్రధానంగా గల పెద్దన వచోవృత్తి నన్నయ శ్రీనాథుల వాక్పాకాలను అంటు త్రొక్కి క్రొత్తపంట పండించినట్లయింది ఇది పెద్దన కవితకు పేరు తెచ్చిన రుచివైభవం పెద్దనది రసోన్ముఖమైన అలంకార ప్రస్థానం అతనిది చతురోక్తి ప్రబంధఫణితి

ముక్కు తిమ్మనార్యు ముద్దు పలుకు అని ప్రసిద్ధి తిమ్మనది సరసమైన వాక్కు కాని రసవృత్తిని వ్యంజింపజేసె గాంభీర్యం పెద్దనకంటె తిమ్మనకు కొరతపడింది రసపోషణ విధానంలో తిమ్మన తన వాక్కును చమత్కారం వైపు తరచు పరుగెత్తించటం చేత అతని కవితకు ఆనందమిచ్చే శక్తి కంటె ఆహ్లాదమిచ్చే శక్తి ఎక్కువైపోయింది అలంకృతోక్తిని మాధుర్యగుణోదంచితమైన రచనలో రాణింపజేసే ప్రజ్ఞ తిమ్మన కున్నది ఆయన కవితలో ఆంధ్రుల నాల్కలమీద నిలిచె కొన్ని పద్యాలలో రుచిగా నిలిచేది ఆ ప్రజ్ఞయే

రాయల కవిత పెద్దన కవితలాగా రసంవైపు పరుగెత్తలేదు అనంతమైన ఊహలనూ ఉత్ప్రేక్షలనూ లోకానుభవాలనూ నాలుగు చరణాల పద్యాలలో కుదించి కూర్పులోనూ నేర్పులోనూ పొదుపరితనం కొసం ప్రాకులాడే ప్రవృత్తి ఎక్కువ రాయలకవితకు రాజసంతోపాటు ఓజస్సు గుణం గాఢబంధత్వం అర్థప్రౌఢత్వం దాని శ్వాసకోశాలు ఆయనకు రీతికంటె పాకం మీద ప్రణయ మెక్కువ అందువల్ల రసవృత్తుల జాడలు ఆయన కవితలో తక్కువ రాయలు గొప్ప భావుకుడు ఆయన భావన అలంకారోక్తులలో మూసలుగా జాలువారింది పట్టపుగజాన్ని ఒంటినిండా అలంకరించి ఊరేగ దీసినట్లుంటుంది ఆయన కవిత రాయల కవితలో రచనకంటె అలంకారమే ఆసక్తిదాయకం ఆయన పలుకుబడులలో నినదించే వింత సమాసాల పోహళింపుల్లాగానే స్వభావోక్తినీ అతిశయోక్తిని మన్నించె ఆయన దృక్పథం విరోధాభాసంగా స్ఫురించే విచిత్ర దర్శనం

సరసోక్తి చతురోక్తి ప్రౌఢోక్తి ప్రధానంగా సాగిన అలంకార ప్రస్థానాన్ని వక్రోక్తి శ్లేషోక్తి మార్గాల వైపు మళ్ళించిన గౌరవం పింగళి సూరన్నకు దక్కింది అతని వక్రోక్తి వైభవం కళాపూర్ణోదయంలోని కథార్థాలలోనూ ప్రభావతీ ప్రద్యుమ్నంలోని కవితతోనూ ఫలించింది అతని శ్లిష్టోక్తి ద్వ్యర్థి కావ్య ప్రపంచంలో పడి [illegible] రసలోకం

చేరుకోలేకపోయింది అయినా శబ్దంలోని నానార్థ ప్రతీయమానశక్తిని రచనలో శ్లిష్టసుందరంగా సాధించవచ్చునన్న వినూత్న ప్రయోగాన్ని తెలుగులో చేసి చూపాడు సూరన. అతని వక్రోక్తి మార్గాన్ని ప్రౌఢతరం చేసి తెనాలి రామకృష్ణుడు తన కవితలో పద సంఘర్షంగా సానలు తీర్చాడు శ్లిష్ట కవితామార్గాన్ని రామరాజభూషణుడు చేపట్టి బంగారుపంట పండించాడు శ్లేషకవిత్వానికి గురుకులం అతని వసుచరిత్రలోని కవిత్వం ఆ గురుకులంలో పెరిగి మరొక గురుపీఠాన్ని నిలుపుకున్నవాడు చెమకూర వేంకటకవి

ప్రబంధ కవులలో పెద్దన శబ్దార్థ గుణశ్లేషకు తన కవితలో పట్టం కట్టితే రామరాజభూషణుడు శబ్దార్థాలంకార శ్లేషకు తన కవితలో స్వర్ణాభిషేకం చేశాడు ఇద్దరికీ అలంకార ప్రస్థానాన్ని రసోన్ముఖంగా సాగించటం తెలుసు ప్రబంధకవులలో వీరిద్దరూ ప్రముఖ ప్రస్థానాచార్యులు

## 10 ప్రబంధ ప్రస్థానం వక్రోక్తి జీవితం

ప్రబంధయుగ ప్రయోగాల వెనుక అలంకారిక దార్శనిక భిత్తికను సమకూర్చింది కుంతకుని వక్రోక్తి ప్రస్థానం రసమార్గంలో రసధ్వని సిద్ధాంతం ఎంత గొప్పదో అలంకార మార్గంలో వక్రోక్తి సిద్ధాంతం అంత గొప్పది ఈ రెండూ కావ్యంలోని సర్వాంగాలలోనూ ధ్వని వక్రత్వాదులు వ్యాపించియున్నట్లు వ్యాఖ్యానించాయి రసోక్తి అనుభూతిలక్ష్యంగా ప్రవర్తిస్తుంది ధ్వని రసవ్యంజకంగా శబ్దార్థ శక్తిని ప్రదర్శిస్తుంది వక్రత అభివ్యక్తిగా ఆవిష్కృతమౌతుంది

> శబ్దార్థౌ సహితౌ వక్ర కవి వ్యాపార శాలిని
> బంధే వ్యవస్థితౌ కావ్యం తద్విదాహ్లాదకారిణి
> ఉభావేతా వలంకార్యౌ తయో పునరలంకృతిః
> వక్రోక్తిరేవ వైదగ్ధ్య భంగీ భణితి రుచ్యతే

(వక్రోక్తి జీవితమ్ 1 7-10)

వక్రోక్తి సిద్ధాంతంలో శబ్దార్థాలకు సహితత్వం చెప్పబడింది కవి యొక్క వ్యక్తీకరణ పద్ధతిలోగల వక్రతకు ప్రాధాన్యం ఇవ్వబడింది సహృదయ హృదయాహ్లాదకారియైన కావ్యబంధంలో వక్రతా విశిష్టాలైన శబ్దార్థాలు వ్యవస్థితాలై ఉంటాయి శబ్దార్థాలు రెండూ అలంకరింపదగినవే అయితే ఆ రెండింటినీ

అలంకరించేది వక్రోక్తి మాత్రమే వక్రోక్తి అంటే - వైదగ్ధ్యభంగీ భణితి అంటే - కవికర్మ కౌశలంవలన ఏర్పడే విచ్ఛిత్తితో కూడిన వాగ్విన్యాసం అన్న మాట వక్రతను గురించి కుంతకుడు వివరిస్తూ అది ప్రసిద్ధాభిధాన వ్యతిరేకిణి యైన విచిత్రాభిధ అని ప్రసిద్ధ ప్రస్థాన వ్యతిరేకియైన వైచిత్ర్య మనీ నిర్దేశిం చాడు అంటే - ప్రసిద్ధంగా లోకంలో వినవచ్చే శబ్దార్థాల వ్యవహార పక్కీలోని అభివ్యక్తి కంటె విలక్షణంగానూ విశిష్టంగానూ విచిత్రంగానూ ఉండి కవి ప్రతిభచేత లోకోత్తర చమత్కార చాపల్యాన్ని వెలార్చే ఉక్తి విశేషం వక్రోక్తి అని కుంతకుని అభిప్రాయం అతడు ధ్వనిని రసాన్ని బహుముఖంగా కావ్యంలో సర్వత్రా భాసించే వక్రోక్తిలోని భాగస్వాములుగానే భావించాడు వక్రోక్తిని వర్ణవిన్యాసంలోనూ పదపూర్వార్ధంలోనూ పదపరార్ధంలోనూ వాక్యంలోనూ ప్రకరణంలోనూ ప్రబంధ నిబంధనంలోనూ దర్శించి ఆరు విధాలుగా విశ్లేషించాడు అయితే ఆ ఆరు విభాగాలలో అలంకార వస్తు సంబంధు లైన విశేషాల నన్నింటినీ అంతర్భవింపజేశాడు ఎలాగంటే - వర్ణ విన్యాస వక్రతలో శబ్దాలంకార విచారమంతా సంగుప్తమై ఉన్నది పద పూర్వార్ధ పరార్ధ వక్రతలలో ప్రకృతి ప్రత్యయ ప్రయోగంలోని కవి ప్రతిభాజన్యమైన వక్రతా వ్యాపారానుశీలనం ముఖ్యం ధ్వని వాదులలాగానే పదపదాంశాలలో వక్రతను దర్శించాడు కుంతకుడు వాక్యవక్రతలో అతడు ఇతరమైన అర్థాలంకారాలను అందు లోని భేదాలుగా ప్రతిపాదించాడు

> వాక్యస్య వక్రభావోఽన్యో భిద్యతే యః సహస్రధా
> యత్రాలంకార వర్గోఽసౌ సర్వోఽప్యం తద్భవిష్యతి

అని తన అలంకార ప్రస్థాన సమన్వయాన్ని ప్రకటించాడు

కుంతకుడు చేసిన పై నాల్గురకాలైన వక్రతల ప్రతిపాదన ఒక యెత్తు మిగిలిన ప్రకరణ ప్రబంధ వక్రతలు రెండూ మరొక యెత్తు సమగ్ర ప్రబంధంలో ఒక భాగంగా ఉన్న వాక్యసముదాయాన్ని ప్రకరణం అనీ దాన్ని సహృదయ హృదయంగమంగా వక్రతావిశిష్టంగా దిద్దితీర్చటమే ప్రకరణ వక్రత అనీ అది తొమ్మిది విధాలుగా నిర్వహింపబడుతుందనీ కుంతకుడు వివేచించి సోదాహరణంగా వివరించాడు సమగ్రకావ్యంలో గాని ప్రబంధంలో గాని నాటకంలోగాని ఇతివృత్తం తప్పక ఉంటుంది రసాదులను ఉపలక్షించి కాని రసాంతరాన్ని లక్షించికాని ఇతివృత్త సంవిధానంలో కవిప్రతిభాజన్య

మైన కల్పనా వైచిత్రిని ప్రబంధ వక్రత ~ కుంతకుడు నిర్దేశించాడు ప్రబంధ వక్రతను ఏడు విధాలుగా వింగడించాడు ఈ వక్రతా వివేచనమంతా ప్రబంధ ప్రపంచంలో ప్రతిఫలించింది

ఉదాహరణకు కొన్ని ప్రబంధ వక్రతలను గురించి ప్రస్తావిస్తాను ప్రతి కావ్యానికి సముచితమైన నామకరణం చేయాలనీ కావ్యనామం కావ్య సౌందర్య స్ఫోరకంగాగాని కావ్య తత్వ వ్యంజకంగాగాని ఉండాలని కుంతకుడు పేర్కొన్నాడు అది ప్రబంధ వక్రతలో పంచమ భేదం ఆంధ్ర ప్రబంధనామాలు సార్థకంగాను సాభిప్రాయంగానూ ఉండటం గమనింపదగిన మొదటి విశేషం. స్వారోచిష మనుసంభవము కళాపూర్ణోదయము వసుచరిత్రము ఆముక్త మాల్యద పారిజాతాపహరణము - మొదలైన ప్రబంధనామాలు కథాతత్వ వ్యంజకాలుగా ఉన్న విధానాన్ని విమర్శకులు వివేచించి చూపించారు ఈ విధంగా వక్రతగల పేర్లు పెట్టటం పదహారో శతాబ్దపు కావ్యాలకే చెల్లింది

ప్రధాన కథకు అవాంతర కథ తోడై కావ్య సమగ్రసౌందర్యం ఇనుమడించేటట్లు చిత్రించటం ప్రబంధ వక్రతలో నాలుగో భేదం ప్రబంధాలలో ఒక కథకంటే అధికంగా ఉండటానికీ అవి అపూర్వంగా సంవిధానం చేయబడటానికీ కారణం ప్రబంధ వక్రతలోని ఈ భేదమే మూడు తరాల కథలుగాని, మూడు జన్మల కథలుగాని ఉపాఖ్యాన బహుళమైన కథలుగాని బహుకథా ప్రవృత్తిగల ప్రబంధ రచనకు దోహదకారులయ్యాయి ఆంధ్ర ప్రబంధాలలో ఆఖ్యానోపాఖ్యాన శిల్పతత్వాన్ని ప్రదర్శించటానికి ప్రబంధ వక్రతలోని ఈ భేదమే ప్రధాన హేతువు

ప్రధాన కథావస్తువుకు సంబంధించిన అధికార ఫలప్రాప్తికి విరుద్ధమైన కార్యాంతరాన్ని కల్పించి చివరకు ఆ కార్యాంతరం ద్వారానే ప్రధాన ఫలసిద్ధి కలిగేటట్లు చిత్రించటం ప్రబంధవక్రతలో తృతీయ భేదం ఈ ప్రబంధ వక్రతతోటే అల్లసాని పెద్దన స్వారోచిషమనుసంభవకథలోని అల్లిక జిగిబిగిని సంతరించాడు. మాయాప్రవర వృత్తాంతం స్వారోచికథలోని పక్షుల మృగాల సన్నివేశాలు ఈ వక్రతను చిత్రించే కథాఘట్టాలే పెద్దనతరువాత ఈ ప్రబంధ వక్రతను ప్రౌఢంగానిర్వహించినవాడు కళాపూర్ణోదయ కర్తయైన పింగళి సూరన సుగాత్రీశాలీనుల కథ ప్రబంధంలో తిరిగినన్ని వొంపులన్నీ ఈ ప్రబంధ వక్రత పండించిన పంటయే క్షేత్ర మాహాత్మ్యాలలో ఈ వక్రతాశిల్పాన్ని దూర్జటి

రామకృష్ణులు గడుసరిగా వాడుకున్నారు ఆముక్తమాల్యదలోని ఏకవాక్యత కూడా ఈ ప్రబంధ వక్రత ప్రభావమే

ప్రబంధ కవులు శృంగారకథలను ఎన్నుకున్నా వాటిని వైవిధ్యంతో వ్యక్తిత్వంతో పోషించటం ప్రబంధ వక్రతలోని ఆరవభేదంగా గ్రహించవచ్చు కాంతాసమ్మితమైన ఉపదేశాన్ని ప్రతిపాదించటం కూడా ప్రబంధ వక్రతయే ఆంధ్రప్రబంధాలన్నీ ఆ పనిని పరమప్రౌఢంగా నిర్వహించాయనటంలో అనుమానం అవంతకూడా లేదు ఈ విధంగా ప్రబంధ వస్తువిన్యాసాల వెనుక వక్రోక్తి ప్రస్థానం ప్రేరకశక్తిగా పని చేసిందనటంలో విప్రతిపత్తి లేదు

ఆంధ్ర ప్రబంధ నిర్మాణ శిల్పాలను మరింత లోతుగా పరిశీలిస్తే వక్రోక్తి జీవితకర్తయైన కుంతకుడు పేర్కొన్న ప్రకరణ వక్రత భేదాలన్నీ ఆయా కల్పనలకు ఆయువుపట్టులైనట్లు స్పష్టమౌతున్నాయి కావ్యంలో ఎన్నో సన్నివేశాలను కవి రూపొందించవచ్చు కాని వాటిలో ఒకదానిని ప్రాణభూతంగా చిత్రించి ఆ కావ్య జీవితానికే తిలకాయమానంగా ఉండేటట్లు చెయటం ప్రకరణ వక్రతలో రెండవ భేదం ఇది ఆంధ్రప్రబంధ కవులను విశేషంగా ఆకర్షించినట్లుగా ఉంది ఒక్కొక్క ప్రబంధంలో ఒక్కొక్క సన్నివేశం ఆ ప్రబంధ ప్రాణ చైతన్య కేంద్రంగా మలచటం శిల్పధర్మమైపోయింది మనుచరిత్రలో వరూథినీ ప్రవరుల ఘట్టం ఆముక్తమాల్యదలో మాలదాసరి వృత్తాంతం పారిజాతాపహరణంలో సత్యభామ పాదతాడన ఘట్టం కళాపూర్ణోదయంలో తబ్బిబ్బుల ప్రహసనం ప్రభావతీ ప్రద్యుమ్నంలో హంసరాయబారం వసుచరిత్రలో గిరికా వసురాజుల సన్నివేశం శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యంలో తిన్నని ముగ్ధభక్తి ఘట్టం పాండురంగ మాహాత్మ్యంలో నిగమశర్మ అక్క ఉదంతం - ఇలా తెలుగువారు ఆ ఘట్టాలే ఆ ప్రబంధాలన్నంత అభిమానంతో చదువుతారు ఈ విధంగా రమణీయ సన్నివేశ చిత్రణం ప్రకరణ వక్రతగా ప్రసిద్ధం

ఆంధ్రప్రబంధాలలో దృశ్యకావ్య మర్యాదలను పాటించటం ఒక రచనా శిల్పంగా ప్రఖ్యాతి పొందింది నాటకంలో అంతర్నాటకాన్నికాని గర్భాంకాన్నికాని నిబంధించటం ప్రకరణ వక్రతగా పరిగణింపబడుతుంది పింగళి సూరన రామరాజభూషణుడు వంటి వారి ప్రబంధాలలో కథలలోనే సహజంగా అంతర్నాటక శిల్పాన్ని సంఘటించి వారి రచనలకు నాటక గౌరవంతో పాటు ప్రకరణ వక్రతను పాటించిన ప్రౌఢిని కూడా సంతరించారు

యథావకాశంగా అష్టాదశ వర్ణనలను నిర్వహించి కథార్థ పోషకంగా వాటిని కూర్చటం కూడ ప్రకరణ వక్రతలోని ఒక భాగమని కుంతకుడు పేర్కొన్నాడు. కాబట్టి, ప్రబంధ రచనలో వర్ణనలకు ప్రాధాన్యం ఏర్పడటం ప్రకరణ వక్రతను పాటించడం వల్లనే.

మొత్తం మీద ఇంతవరకు ఆంధ్ర ప్రబంధ ప్రయోగాల మీద జరిగిన సమాలోచనం వలన తేలిన నిశ్చితార్థా లివి:

1. ప్రబంధం తెలుగులో ప్రత్యేక కావ్య ప్రక్రియ. దానిని పది లక్షణాలతో గుర్తించవచ్చు.
2. ప్రబంధాలలోని వస్తువులను గాని, సన్నివేశాలను గాని, అలంకారిక రచనలను గాని, పాత్రచిత్రణాన్ని గాని, రసపోషణాన్నిగాని పరిశీలిస్తే అవన్నీ అలంకార ప్రస్థానాన్ని - అందులోనూ వక్రోక్తి-జీవితాన్ని అనుసరించినట్లుగా స్పష్టమౌతుంది.
3. ప్రబంధ, ప్రకరణ, వాక్యాది వక్రతలలో ఒక్కొక్కదానికి ఒక్కొక్కరు ప్రాధాన్యాన్ని కల్పించి ప్రయోగాలు నిర్వహించారు.
4. ప్రబంధ కవులలో అల్లసాని పెద్దన, నంది తిమ్మన, శ్రీకృష్ణదేవరాయలు తొలుత ప్రబంధ రచనలో మూడు మార్గాలను ఆవిష్కరించారు. వారి బాటలలో నడిచినా విశిష్ట వ్యక్తిత్వాలను సంతరించుకొన్న ప్రయోగాలను ఆ యుగకవులు కొందరు చేశారు.
5. పింగళి సూరన తనకు ముందున్న ప్రయోగాలను మించాలనే యత్నంలో కళాపూర్ణోదయాన్ని. తన సమకాలీన ప్రయోగాలలోని మేలిమినంతా ప్రోదిచేసుకొన్న ప్రబంధాన్ని ఉదాత్తంగా నిర్మించుకోవాలని ప్రభావతీ ప్రద్యుమ్నాన్నీ, ద్వ్యర్థి కావ్య ప్రక్రియతో భవిష్యత్తును నిర్మించుకోవాలని రాఘవ పాండవీయాన్నీ రచించి, యుగ ప్రవృత్తికి ఒక క్రొత్త మలుపును కల్పించాడు.
6. ఈ సత్యాన్ని గుర్తిస్తే. పెద్దన్నకు ముందున్న పిల్లలమర్రి పినవీరభద్రుని ప్రయోగాలలో కానవచ్చే వక్రోక్తి ప్రస్థాన స్వభావాన్ని గమనిస్తే, అతని నుండి సూరన దాకా సాగిన ప్రయోగాల కాలాన్ని ప్రబంధ యుగమని నిర్దేశించవచ్చు.

7. సూరన తరువాత-ద్వ్యర్థి కావ్యరచనతో ముందుకుసాగి శ్లేషోక్తి ప్రధానమైన వసుచరిత్రను నిర్మించి మరొక విశిష్టమైన మార్గాన్ని ఆవిష్కరించిన రామరాజభూషణుని నుండి చేమకూర వేంకట కవి దాకా శ్లేష ప్రబంధయుగమని సంభావించటం సమంజసం

8 శ్లేష ప్రబంధయుగం కూడా అలంకార ప్రస్థానంలో భాగమే అయినా వక్రోక్తి ప్రస్థానం కంటె విశిష్టంగా సాగింది శ్లేష ప్రబంధయుగంలో వక్రోక్తికి అచ్చమైన ప్రతినిధిగా నిలిచి తన ప్రత్యేకత నిలుపుకున్నవాడు తెనాలి రామకృష్ణుడు

9 ప్రబంధకవుల పద్యరచనా వైఖరులను కవితారుచులను వివేచించటానికి వాస్తవ ఔపమ్య అతిశయోక్తి వక్రోక్తి శ్లేష మూలకాలు అలంకారాలని తలచి ప్రయోగాలు చేసిన ఆయా ప్రబంధ కవుల అలంకార వర్గ దృక్పథాలే అనుశీలన ప్రమాణాలౌతాయని స్పష్టంగా పేర్కొనవచ్చు

10 వక్రోక్తి జీవితం ప్రబంధ ప్రయోగాల ప్రస్థానాలను మలచిన మూల సూత్రం వర్గీకృత అలంకార వివేచనం ప్రబంధ శైలి వైవిధ్యాన్ని దిద్దితీర్చిన రచనా సూత్రం వక్రోక్తి ప్రబంధ నిర్మాణంలోనూ అలంకార ప్రబంధశైలీ విన్యాసంలోనూ ప్రయోగాలకు ప్రాణంపోశాయి

(1995)

---

తెలుగు అకాడమివారి తెలుగు పత్రిక 1995 మే నెల సంచికలో ప్రచురితం

# వరూథిని

మనుచరిత్రమున ప్రవరుఁడు మేఘుఁడు; వరూథిని సస్యక్షేత్రము; గంధర్వుఁడు కర్షకుఁడు; స్వరోచి ఫలము. మేఘుఁడు వర్షించిన జలము భూమియందింకి కర్షకుఁడు చల్లిన బీజములలోని జీవాణువులను బోషించి సస్యాంకురములను మొలకెత్తింపఁజేయును. స్వరోచి జన్మమునకు ప్రవరుఁడు హేతుభూతుడు; వరూథిని మూలాధారము; గంధర్వుఁడు నిమిత్తమాత్రుఁడు. కావున వరూథిని పాత్రమునకు మనుచరిత్రమున కీలకమైన స్థానము గలదు.

సంస్కృత మార్కండేయ పురాణకర్త వరూథినిని "వరాప్సరా మహాభాగా మౌలేయా రూపశాలినీ" అని వర్ణించెను. విప్రుని[1] బ్రాహ్మణకులప్రవరునిగాఁ బేర్కొనెను. వరూథిని యచ్చరకులమున శ్రేష్ఠురాలు. అతఁడు నిర్మలవర్తనుఁడు; ఆమె నిర్మలహృదయ. అతఁ డశ్వినులకంటె నందగాఁడు;ఆమెయు రూపశాలినియే. ఇరువురును అభిజాత్యము గలవారే. పురాణకర్త వరూథినిపాత్ర పోషణమున 'మహాభాగా' యను లక్షణమున కధిక ప్రాధాన్య మిచ్చెను. ఆమె యపూర్వసుందర విగ్రహుఁడైన ప్రవరునిఁ గాంచినప్పు డచ్చముగా నాతనిఁ బ్రేమించినది. ఆమె యనన్యకాంతగా నిలిచిపోయినది. ఆమె ప్రవరు ననన్యచింతతోఁ బ్రేమించుటయందే యామె హృదయనైర్మల్యమును మూలకర్త ప్రస్ఫుటీకరించెను. మారనకును, పెద్దనకును అతని పాత్రచిత్రణ మొజ్జబంతి యైనది.

మారన వరూథిని మహాభాగ యని వాచ్యము చేయలేదు. కాని కథానిర్వహణమున దానిని వ్యంగ్యముచేసి పాత్రపైఁ బఠిత కధికసానుభూతి కలుగునట్లు చేసెను. పైపెచ్చు మారన వరూథినియొక్క రూపశాలినీత్వమును వివరించెను. తెలుఁగు పురాణమున నామె యప్సరోంగన, లలితాంగకాంతిజితకాంచన, విభ్రమచంచదబ్జలోచన, కలహంసయాన. సుకుమారమూర్తియు, తేజస్వియునైన ప్రవ

---

1. సంస్కృతమార్కండేయపురాణమున విప్రునకు ప్రవరాఖ్య లేదు. మారన తన యనువాదమున నా విప్రునకు ప్రవరాఖ్య నుంచెను. పెద్దన దానిని గ్రహించెను.

రుని మూర్తి కనుగుణముగా నామెను లలితాంగిగను జితకాంచన వర్ణగను మారన సృష్టించెను ప్రవరుని తేజోమూర్తిని కన్నులారఁ గని మనమున ముద్రించుకొనుట కుపకరించిన దామె విశాలనేత్రములను వానియందు పొంగి పొరలెడి భావతరంగ పంక్తినిఁ దెలియఁజెప్పు తరళచాంచల్యమును హిమగిరి సానువులపై విరహిణియై విహరించు నామెనెడకన్నె యొయ్యారమును మారన కీర్తింపక యూరకుండఁజాలకపోయెను మారన కల్పించిన రూపగుణవిశేషముల నన్నింటిని పెద్దన గ్రహించి సార్థకముగాఁ దన కావ్యమునఁ బ్రయోగించు కొనెను

పెద్దన వరూథినీనిర్మలచిత్తమును అమూలకములైన సంభాషణలయందు చిత్రముగా వ్యంజింప జేసెను తన పనితనము తేటపడ సూర్యాస్తమయవర్ణనావసరమున తరుణి ననన్యకాంత అని సూచించి యాసత్యము నాలంకారికముగా వ్యంగ్యము చేసెను పెద్దన వర్ణించిన శతపత్రేక్షణములు మారన చూపించినవే మారన చూపించిన బంగారుమేనిచాయను మెఱుఁగుపెట్టి మెఱుపుతీగఁగా మలచి నాఁడు పెద్దన మారన వాడిన ఇందువదన యనుసంబోధనము పెద్దన కృతిలోఁ జంద్రాస్యయు చంచరీకచికురయు నైనది మూలములోని వరాప్సరా యను విశేషణము పెద్దనలో మరున్నారీశిరోరత్న మైనది పెద్దన స్వయముగా నామెను చక్రస్తని యనియు నతనాభి యనియు వర్ణించి నాఁడు అతని కథాకథనమున నట్టి యంగాంగవర్ణన మవసర మైనది అతఁడు వరూథినీపరిష్వంగఘట్టమున నామె పాలిండ్లు పొంగారి పైయంచుల్ మోవగఁ గౌఁగిలించె ననియు నీవీబంధ మూడి నతనాభి పొదగట్టె ననియు వర్ణించు నెడ నీవిశేషణప్రయోగసార్థక్యమును సాధించుకొనినాఁడు ఇట్లు వరూథినీవర్ణనము చేయునెడ సంస్కృతాంధ్రమార్కండేయపురాణములు పెద్దనగారి కల్పన కెంతయో తోడ్పడిన వని తాత్పర్యము

పెద్దనగారిప్రబంధమున వరూథిని మనకు మూడు సన్నివేశములలోఁ గానఁబడును 1 ప్రవరునిఁ గనుఁగొని వలచి యతనితో సంభాషించి తమకముతోఁ గౌఁగిలించి యతనిచే నిరాకృత యైన సన్నివేశ మొకటి 2 ప్రవరునిపై మనసు తగిలి విరహవేదనావశమున దుఃఖించుచు హిమవన్నగసాను ప్రదేశమున విహరించునది రెండవది 3 మాయాప్రవరునిఁ గదిసి యతని యనురాగమునకుఁ బాత్రురాలై యిష్టభోగము లనుభవించి గర్భవతియై స్వరో

చికి జన్మనిచ్చు కథాఘట్టము మూఁడవది. ఈ మూఁడు ఘట్టములు పైమూఁడు కృతులందును సమానములే కాని వాని యందు కవులు వరూథినిఁ దీర్చిదిద్దిన విధమునందు భేదము గానవచ్చుచున్నది

వరూథిని యప్సరోంగన యగుటచేఁ దజ్జాతిలక్షణమైన భోగలాలసత్వ మామెజీవలక్షణమై భాసించినది కాని మరున్నారీశిరోరత్న మగు వరూథిని యందు భోగము బహుపురుషగతము గాక యేకపురుషగతమై ప్రసరించినది. అందుచే నామె మనూత్పత్తికి మూలస్థానమై రాణించినది ఆమె సమగ్ర పురుష సౌందర్యమును భావింపఁగలిగిన రసహృదయ దేవయక్షగంధర్వనరలోకములం దున్న సుందరాకారుల నెల్లరఁ జూచినది కాని యామె భావించిన సౌందర్యము వారియందు కానరాలేదు చివరకు ప్రవరునియం దామె యాసౌందర్యమును దర్శించినది పురుషుఁ డానందస్వరూపుఁడు తేజోమయుఁడు సుందరుఁడు నరు డింద్రియనియతిచే సస్వరూపసంధాన మొనర్చుకొని యాత్మసౌందర్యమును దర్శించి యానందానుభూతి నొందును. సౌందర్యము మానవునకు నియమముచే నేర్పడును. ప్రవరునకు భౌతికమైన సౌందర్యము కలదు దానినిఁ తేజోమయము చేయు నింద్రియనియతి కలదు దానివలన నతఁడు తేజస్సుందరుఁడైనాడు అది సంపూర్ణపురుష సౌందర్యస్వరూపము దానిని వరూథినీహృదయమునఁ బ్రతిష్ఠింపఁ జేయుటయే ప్రవరుని పాత్రవలన వరూథినిపాత్రకుఁ గలుగు పరమప్రయోజనము అట్టి యుదాత్త సౌందర్యజిజ్ఞాసువు కనుకనే వరూథిని తనను గోరి వచ్చిన గంధర్వకుమారునిఁ గాదని త్రోచివైచినది. భోగైకజీవియై నియతిలేని గంధర్వునియందు పురుషసౌందర్యము పరిపూర్ణత నందలేదు జాతిలక్షణమైన భోగవృత్తిని మాని నియతయై జీవితము గడుపుచున్న వరూథిని ప్రవరుని తేజస్సౌందర్య సందర్శనయోగ్యతను సాధించినది వరూథినియందలి యట్టి నియతిని దెల్పుటకై పెద్దన పురాణకథలందు లేని గారుడోత్కీర్ణవైభవమును సృష్టించి యామెను హిమనగముపై స్థిరనివాస మొంచినాఁడు.

వరూథిని భావించిన సౌందర్యము రూపుకట్టినయట్లు ప్రవరుఁ డామె కన్నులకుఁ దోచినంతనే సంవత్సరములతరబడి లోనబిగింపఁబడియున్నయిచ్ఛ కట్టలు త్రెంచుకొని పైకుబికినది ఆమె కాసౌందర్యమును భావించి దానికొఱకు బ్రతుకు నెంకించుకొనుటయం దున్న నియతి తద్భోగవాంఛయందు లేదు సౌందర్య

పరిపూర్ణతను సాధించి దర్శించుట కళాతపస్విలక్షణము. దర్శించిన పరిపూర్ణతను భోగింప నెంచుట భోగిలక్షణము. పరిపూర్ణత తనకంటె భిన్నమైనది కాదని తెలియుట యోగిలక్షణము. జాతిసహజమైన భోగలక్షణము కళాతపఃఫలమును భోగింప యత్నించినది. యోగిలక్షణవిశిష్టుఁడైన ప్రవరుఁ డందులకు వశము కాలేదు. వరూథినీ ప్రవరుల శీల సంఘర్షణమునందలి పరమతాత్పర్య మిది.

భోగమున కహంకారము ప్రధానలక్షణము. కర్తృభావము లేనిదే భోగించుట కుదరదు. మదమోహాదులు దానివలన నేర్పడును. యోగికి వైరాగ్యము ముఖ్యము. అది నిరహంకారైకసాధ్యము. నిర్మోహాదు లతనికిఁ గరతలామలకములు. వరూథినీప్రవరులపాత్రచిత్రణమున నిట్టివ్యత్యాసము పెద్దన ప్రబంధమున గాననగును. భోగలక్షణసంయుత యగు వరూథినియందు జాత్యహంకారము ప్రస్ఫుటముగాఁ గానవచ్చును. నియమవ్రతనిష్ఠుఁడైన బ్రాహ్మణుని యందు నిరహంకారము సర్వత్ర భాసించును. అహంకారము ప్రతాపప్రధానమై యుద్యోగరూపమునఁ బరిణమించును. నిరహంకారము శాంతప్రధానమై స్థిర ధైర్యవృత్తిగాఁ బరిణమించును. అందువలననే వరూథిని ప్రవరునివైరాగ్యదీక్షను బహుముఖములఁ బ్రత్యాఖ్యానించి, యతనిపొందును సాధింప బహువిధముల యత్నించినది. ప్రవరుఁ డడుగడుగునకుఁ గరుడుకట్టి స్థిరదృఢచిత్తుఁడై భాసించెను. పెద్దన యీ పాత్రల నిట్లు చిత్రించుటకు బాటలు వైచినవాఁడు మారన. మూలమునందు మహాభాగగా నున్న వరూథిని నభిమానవతిగాఁ దీర్చి దిద్దినాఁడు మారన. ఆమెను జాత్యహంకారయైన మానినిగా మలచి రూపొందించి నాఁడు పెద్దన. సంస్కృతమున వరూథిని వాక్కులు నిసర్గమధురములు; మారన పురాణమున చతుర రమణీయములు; పెద్దన ప్రబంధమున ప్రౌఢాలంకార బంధురములు.

మొదటి సన్నివేశమున వరూథిని ప్రవరునిపై మరు లొలుకపోసెను. అతనిచే నవమానముల పాల్పడెను. ఇట్టి విరుద్ధావస్థలమధ్య వరూథిని యభిమానమును తెలుఁగుపురాణము పోషింప, జాత్యహంకారమును ప్రబంధము ప్రకటించెను. దానిని నిరూపించు కొన్నివాక్యము లిం దుదాహరింపఁబడుచున్నవి:

1. మూలమున విప్రుఁడు వరూథినిని బ్రశ్నించినమాట లిట్లున్నవి :

శ్లో. "కా త్వం కమలగర్భాభే? కస్య [1]కిం వాసుతిష్ఠసి?
బ్రాహ్మణోఽ హ మిహాయాతో నగరా దరుణాస్పదాత్" — 58.44.

---

1. కింవాత్రతిష్ఠసి? (పాఠాంతరము)

మారన యీవాక్యముల ననువదించుచు 'నీ నెవ్వతెవు? ఇచ్చట నేకతంబ యేల యున్నదానవు?' అని ప్రవరునిచే నడిగించినాఁడు. ఏకతముగా నుంటి వేల యనిపించుట మారన చతురవాక్యము. ఇందు గూఢమైన మర్మము అమాయక వాక్యము లందుఁ బొదుగఁబడినది. పెద్దన మారన చూపించిన చతురవాక్య రచనమును విస్తృత మొనర్చి పద్యమునిండ గుప్పించి విడిచినాఁడు. ప్రబంధ ప్రవరుఁడు "ఎవ్వతె వీవు" అని యూరుకొనక "భీతహరిణేక్షణ!" యను సంబుద్ధి విసరినాఁడు. ఒంటరిగా భయము లేక యివ్వన భూమియం దేల సంచరించు చుంటి వని లోగుట్టును గ్రుచ్చి యడిగినట్లుగను అమాయకత్వముట్టిపడునట్లుగను ప్రశ్నించినాఁడు. 'త్రోవ తప్పి'తి ననియు, 'క్రొవ్విన' నిన్నగాగ్రమునకు రాకకుఁ గారణము నెఱిఁగించినాఁడు. ఊరుఁ జేర వచ్చితి ననియుఁజెప్పి, తన రాకకుఁ గారణము నెఱిఁగించినాఁడు. ఊరుఁ జేర నిం కెవ్విధి గాంతు? ననియు పలికి స్థిరనివాససూచనము గూఢముగా స్ఫురింపఁ జేసినాఁడు. తెరు వెద్ది సూచింపు మనియు, శుభంబు నీ కగు ననియు పలికి యొకవైపు భావిలోఁ దన బ్రతుకుబాటను దీర్చిదిద్దుభార మామెపై నుంచినట్లును, అది యామె కభీష్టదాయకము కాఁగల దనినట్లును, మఱియొకవైపు గృహో న్ముఖతఁ బ్రకటించునట్లును వ్యంజింపఁజేసినాఁడు. ఇట్లు చమత్కారగర్భితము లగు ప్రౌఢోక్తులు విటశేఖరునివలె ప్రవరునిచేఁ బల్కించుట పెద్దన కల్పనా విశేషము. ప్రవరునినాగరకసంస్కారము వ్యంగ్యస్ఫూర్తియందును, భాషాపర శేషభోగిత్వము శక్తిమచ్ఛబ్దసమాహారమునందును పెద్దన నిబంధించుట యిందలిరచనాశిల్పము!

ఇచ్చట గమనించవలసిన విషయ మొక్కటి కలదు: ప్రవరుఁడు కావల యునని నర్మగర్భముగా మాట్లాడె నన్నచో నాపాత్రశీలము దెబ్బతినును. అతఁడు అమాయకుఁడే. పురాణమునందు తన యూరుపేరులు చెప్పకొనిన యా యమాయకుఁడు ప్రబంధమున నూరుపేరు చెప్పకయే దానికి త్రోవ చెప్పు మని వరూథిని నడిగెను. అతని యూరుపేరు మనకు తెలియును కావున మన కేమియు ననిపించదు. కాని, వరూథిని కాతఁడు క్రొత్త. క్రొత్తవాఁ డట్లు ప్రశ్నించినచో నామె యేమనుకొనును? అమాయకుఁ డనుకొనును, లేక చతురుఁ డనుకొనును. అతని యాకారవిశేషములలో నలేఖ్యవిలాసములు గలవు. అతని మొదటి పలుకరింపులోనే సరసార్థము కలదు. ఇఁక మాటలలో రమణీయార్థ ముండ దని యామె తలంచునా? నిజముగా నట్లు తలంచినచో నామె నర్మ

గర్భముగా బ్రత్యుత్తర మిచ్చుట కెందులకు యోచించును? ఏమైనను పురాణ ప్రవరుని వలె ప్రబంధప్రవరుఁడు గూడ నమాయకుఁడే. కాని, పెద్దన చతుర వచోనిధి. అతఁడే ప్రవరునివలె మాట్లాడినాఁడు. ఆ రహస్యము వరూథినిమాత్రము గ్రహింపవలెనని యతని యభిప్రాయము. మనమును అట్లే చెప్పుకొనినచో కవికిని, ప్రవరునికిని గౌరవము.

ఎదుటివాఁడు చమత్కారముగా మాటలాడినచోఁ దానును అట్లే మాట లాడవలె నని యభిమాని భావించును. అతనికంటె మించి మాటాడవలె నని గూఢాహంకారి యత్నించును. మారన పురాణమున మొదటి మార్గము ననుస రించియు, పెద్దన ప్రబంధమున రెండవ మార్గము ననుసరించియు వరూథిని సమాధానము చెప్పెను. పురాణమునందు "అనుపమ బహురత్ననితాంత కాంతి సంపద నొనరిన యిగ్గిరి నెప్పుడును సంచరించుచుందు"నని సమాధానము చెప్పి, నాఁ డొంటరిగాఁ దిరుగుచుండుట క్రొత్తగా దనియు, నది సుందర నగర రత్న కాంతి దర్శనార్థమే యనియు సాభిమానముగా సూచించెను. మనుచరిత్రమున వరూథిని - సూటిగా సమాధానము చెప్పక నర్మగర్భములైన వాక్కులతో దీర్ఘోపన్యాసము ప్రారంభించినది. 'ఇంతలు కన్నులుండ తెరు వెవ్వరి వేఁడెదు?' అని యెదురు ప్రశ్నతో నారంభించి, ప్రవరుని ప్రశ్నల కీయవలసిన ప్రత్యుత్తర క్రమమును మార్చినది. ప్రవరుని ప్రశ్నలోని చివరి పదమునకు వరూథిని మొదట ప్రత్యుత్తర మీయ మొదలిడినది "తెలుపు" శబ్దము నెందుల కాతఁడు వాడియుండెనని యామె యూహించినదో దానిని నర్మగర్భముగా వ్యాఖ్యానించి నది. వ్యంగ్య గౌరవమున నతని వాక్కుల దలఁదన్నినది.

దానితో నామె జాత్యహంకార మూపిరి పీల్చుకొనినది. విపులతరమైన జాతి వృత్తము నెత్తి నిజవృత్తముఁ జెప్ప మొదలిడినది.

సీ. చిన్ని వెన్నెలకందు వెన్నుఁదన్ని సుధాబ్ధిఁ
బొడమినచెలువ తోఁబుట్టు మాకు;
రహిఁ బుట్టజంత్రగాత్రముల రాల్ గరగించు
విపులగాంధర్వంబు విద్య మాకు;
నసవిల్తుశాస్త్రంపు మినుకు లావర్తించు
పని వెన్నతోఁడఁ బెట్టినది మాకు;
హయమేధరాజసూయము లనఁ బేర్వడ్డ
సవనతంత్రంబు లుంకువలు మాకుఁ;

తే. గనకనగసీమఁ గల్పవృక్షముల నీడఁ
బచ్చరాచట్టుగమి రచ్చపట్టు మాకు
బద్మసంభవ వైకుంఠభర్గసభలు
సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర! —2-43.

అని తమతోఁబుట్టువును, గానవిద్యాప్రావీణ్యమును, శాస్త్రవిద్యా పాండిత్యమును, అన్య దుర్లభత్వమును, త్రిమూర్తుల సభలయందున్న గౌరవము, పేరు పేరునఁ బేర్కొని చెప్పినది వరూథిని. ఆ చెప్పునప్పుడు తా నెవరో ముందు తెలుపక 'మాకు, మాకు' అని మాటిమాటికిఁ బలుకుటచే జాత్యర్థమే కాక, దానికన్న మిన్నయైన స్వీయగౌరవాతిశయము కూడ వ్యంజింపఁబడుచున్నది. అది యహంకార చిహ్నము. ఆమె ప్రాణసఖులను జెప్పుటలో నది మఱికొంత స్పష్టమైనది. 'ఇవి మత్కాంతార సంతానముల్' అని హిమనగవనసంపదను తనదిగా నధికారముద్ర వైచిన ప్రాగల్భ్యముచే నది మఱింత దృఢమైనది.

2. వరూథిని ప్రవరుని కతిథిమర్యాదలు సేయ తనయింటికిఁ బిలిచినట్లు చిత్రించుట పెద్దనగారి మఱియొక చమత్కారము. అభ్యాగతసేవా పరతంత్ర హృదయుఁ డగు ప్రవరుని స్వభావమున కది ప్రతి. పురాణములం దామె కిల్లు వాకిలి లేదు కావున నట్లు పిలువలేదు. ప్రబంధమునం దాపిలుచుటలో నేదతేఱు మని పల్కుచు, 'సముదంచితన్మణిభవనాసీనత నేదదేరు' మని తనగృహసంపదను పొగడుకొనుట మాత్రము మరచిపోలేదు. 'అస్మద్గృహంబు పావనము సేసి' యను వినయోక్తికి దిగుసరికి నాల్గుపద్యపాదములు గడచిపోవలసి వచ్చినది.

ఆమె వైఖరిని గమనించిన ప్రవరుఁడు లోలోన నవ్వుకొనియుండును. కాని బయట పడలే దాగంభీరుఁడు. ఏమాత్రము తొణకక తనకు సహజమైన చతుర వచో విలాసము నొకయింత చిలుకరించి గడుసుఁదనము ప్రకటించి ప్రకృతమున కుపక్రమించినాఁడు. 'అండజయానా!' యని సంబోధించి, 'నీ భక్తిచేతనే నీ సపర్యలు మాకు ముట్టినవి. నే నింటికి వచ్చియు రాకయు నొకటియే. అదియును గాక నే నిచ్చట నుండుటకు వీలుపడదు. సత్క్రియాకాండము నిర్వహించుటకు వేగముగా నూరికేఁగవలయును' - అని పేర్కొనుచు, చివరకు 'నాపయి దయయుంచు' మని వేడుకొనినాఁడు. 'ఓ యంచనడకదానా! లేక

మందగమనా! నీ యింటికి నడిచి నా కాతిథ్య మిచ్చుసరికి ప్రొద్దు కొండలో పడును కావున నీ భక్తియే పదివేలు. నన్ను బలవంతము సేయక వదలి దయచూడు మని యంజలి చమత్కారము. ప్రవరుఁ డిచ్చట చూపిన గడుసుఁదనము ఔషధ సిద్ధుని వాక్యములు విని యీషదంకురిహాసన ప్రగసిష్ణుగండయుగళుం డయి యతనినిఁ జతురోక్తుల పాల్చేయు నేర్పును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది.

ప్రవరుఁ డౌషధసిద్ధుని వలన నొక గుణపాఠము నేర్చుకొనినాఁడు. అందుచే 'డాంబికముగా మాటలాడు నహంకారులను జూచిన సాధువులకు నవ్వు వచ్చును గాని వారి మహిమలు సర్వత్ర ప్రగల్భములు కావు కావున నేపట్టులో నేపా ముందునో గమనించి వర్తించుట మే' లని ప్రవరుఁడు భావించినాఁడు. తీర్థయాత్రలు చేయించు మని సిద్ధుని వేడినట్లుగనే వరూథిని నిల్లు చేర్పుమని ప్రార్థించినాఁడు.

ఉ. "ఏ నిఁకనిల్లు సేరుటకు నెద్ది యుపాయము? మీ మహత్త్వము
ల్మానిని! దివ్యముల్; మదిఁ దలంచిన నెందును మీ కసాధ్యము
ల్గానము; గాన తల్లి! ప్రజలన్ ననుఁ గూర్పు!"

మని బ్రతిమిలాడుకొనినాఁడు. అతని వైఖరి యామెకు నవ్వు తెప్పించినది. ఏలనన అంతలో నతఁడు చతురోక్తు లాడును: అంతలో నతఁడు బేలయై పలవరించును. అతని వైఖరిలో నవ్వు తెప్పించెడి విధ మది.

వరూథిని ప్రవరుని వాక్యములలోని ప్రాణమును బట్టెను. 'ప్రజలన్ నను గూర్పు' మన్నది యతనివాక్యములలోని యాయువుపట్టు. ఆతఁడు తనవారికి దూరమై విలపించుచుండెను. వారిసంగతి నభిలషించుచుండెను. కావున వాని యాత్మీయులను మరపించి తా నాస్థానము నాక్రమింపవలెను. అందులకై వరూథిని మొదట నాతని నివాసపరిసరములపై నలసభావము కల్పింపఁ జొచ్చినది; ఆపైఁ దనహృదయము నెఱుకపఱచినది. ఆమె ప్రాణము లతని యరచేతఁ బెట్టినట్లు మాట్లాడినది. వ్యంగ్యముగ నీవే ప్రాణనాథుఁడ వన్నంతవఱకు వెళ్ళినది. ఇంతకంటె మఱి యెవ్వరతనిహృదయమును సమీపింపఁ గల రని యామె తలంచినది. (అగ్ని, దర్భలు నిత్యకర్మనిరతి-అంతకుమించి యతని నాకర్షించి యున్నవని యప్పటి కామె యెఱుఁగదు).

మారన యిప్పట్టున వేఱువిధమైన గడుసుపోకడ పోయెను. ప్రవరుఁడు పాదలేపము కరఁగి కొండనెత్తములపై దిగఁబడిపోయె నని చెప్పుకొనఁగా

వరూథిని యతనివిలసనములు గాంచి హృదయము కరఁగి భావజుపుష్పబాణ సముద్రమున మునిఁగిపోయె నని ప్రతికల్పనము చేసి రక్షింప నాతని ప్రార్థించి నది. ప్రవరుని యిక్కట్టునకు విధి కారణము. వరూథినిబాధకు ప్రవరుఁడు కారకుఁడు. కావున నామెను రక్షించుభార మాతనిపై నున్నదని హెచ్చరించినది. ఆ బాధ్యత నెక్కడ గుర్తించినట్లగునో యని ప్రవరుఁ డాయూసున కెట్టి ప్రత్యుత్తర మీయక గృహ గమనావశ్యకతను, నిత్యక్రియాహానిభీతిని బ్రకటించి యుపాయ మర్థించెను. పెద్దన మారన ప్రణాళికలోని ప్రవరవాక్యముల ననుస రించినంతగా వరూథినిసంభాషణ ననుసరింపలేదు. దానికిఁ గారణ మూహించుట సులభము. వరూథినివలెఁ బెద్దనయు గూఢాహంకారి యగుటయే!

3. వరూథిని యెత్తుగడ ప్రవరుఁడు పసికట్టినాఁడు. 'ప్రజ'లను మాట వాడుట యందు తా నెంచినభావము నామెకు విశదీకరింప నెంచినాఁడు. 'తల్లీ' యని తాను బిలువ నామె తనతో గలుపు 'వరుస' నెత్తిపొడిచినట్లు 'వనజేక్షణ! యిట్లు పలుక వరుసయె?' అని వ్రాకుచ్చినాఁడు. 'మది విచారమువలదే?'యని యామె చేసిన విచారము నంతయుఁ గాదని త్రోసిపుచ్చినాఁడు. 'వ్రతులైన విప్రులను గామింపఁ బాడి కా' దని నీతి గరపినాఁడు. ఆనాఁ డిలు సేరచిచో 'వేలిమియున్, సురార్చనయు, విప్రసపర్యయుఁ దప్పు ననియు, 'వృద్ధు లగు జననీజనకు లాకట సోలుదు' రనియుఁః బేర్కొనినాఁడు. 'నే నాహితాగ్ని' నని స్వాభిమానముగా వరూథిని కెఱుకపఱచినాఁడు, ఇన్ని చెప్పియు నతఁడు తన భార్య సంగతి యెత్తఁడు. 'అనుకూలవతి నాదుమనసులో వర్తించు కులకాంత మది నెంత కుందు నొక్కొ!' అని యంతగా వాపోయినవాఁ డాయూసునే యెత్తకుండె ననఁగా నది నిజముగాఁ గావలయు నని పన్నిన పన్నాగమే యని యెదుటివారి కనిపించును. అట్లని యతఁ డసలు చెప్పలే దని త్రోసివేయుటకును వీలులేదు. 'తూలు సమస్త ధర్మములు తొయ్యలి! నే డిలు సేరకుండినన్' అను చివరివాక్యములోని యాసమస్తధర్మములలో భార్యాభర్తల ధర్మముకూడ తప్పక యిమిడియుండును. దానిని వాచ్యము చేయకుండుటయే యతని గడుసుఁదనము. వరూథిని కావాక్యముల తాత్పర్యము విన్నఁబాటు కలిగించినది. ఎందువలన? ప్రవరుఁడు తన ధర్మములే తనయాత్మీయులని పేర్కొనెను కావున, ఆమె యతనికి దివ్యభోగముల నీయఁగలదు కాని, ధర్మఫలము నీయఁజాలదు. కావున నామె కోటమి తప్పదయ్యెను. ఆమె యహంకారము దెబ్బతినెను. అందుల

కామె చిన్నబోయెను. మారన రచనలో వరూథిని విన్నబాటు కానరాదు, ఆమె ప్రబంధనాయికవలెఁ బెద్దగా మో మెత్తి విఱ్ఱవీగలేదు. అందువలన దింపుట కవసరము రాలేదు.

4. ప్రవరుఁడు ప్రత్యుత్తర మిచ్చుటలోని కౌశల్యము వరూథిని గుర్తించినది. దానిని గేలిచేసిన కాని యామెకుఁ దృప్తి కలుగదు. అనఁగా నతని యజ్ఞయాగాదికర్మలను, ధర్మపరత్వమును, వైరాగ్యమును తేలికపఱచి మాటలాడవలయును. కాని, అట్లు మాట్లాడుటవలన నెదుటివాని మనస్సు పుటుక్కున విరుగరాదు. దానికిఁ గొంత మార్దవ మవసరము. ఇట్టి సున్నితమైన యవస్థయందు మఱల వరూథినికి తన జాత్యహంకారమే శరణ్యమైనది. అప్సరసయైన యామెకును భూసురుఁడైన ప్రవరునకుఁ గల యంతరము తెలియవచ్చునట్లు మృదువుగనే మాట లారంభించినది. ‘ఓ భావజరూప! యిట్టి యెలప్రాయము వైదికకర్మనిష్ఠలంబోవగ నింక భోగములఁ బొందుట యెన్నఁ’డని పలికి యతని సమయోచితముకాని యవివేక విచారము నెత్తి చూపినది: ‘యజ్ఞ కోటులం బావను లౌటకున్ ఫలము మా కవుఁగిళ్ళ సుఖించుటే కదా!’ యని యతని కర్మపరత్వమును గేలి చేసినది. అసంఖ్యాకములైన యజ్ఞ కర్మలకు ఫలముగా మాత్రమే తన కౌఁగిలి లభ్యమగునని స్వీయ ప్రశంసయును, పరలాఘవమును ప్రకటించినది. ప్రవరుని కర్మపరత్వము నధఃకరించుటతో నాగక, వరూథిని తన భోగపరత్వమును గొప్పచేసి, చిత్తము చిగురింప సీసపద్యమునఁ జెప్పినది. పచ్చికస్తూరి. చొక్కపుజవాజి, పచ్చకప్పురపుసిరము, స్వచ్ఛ తుహినజలము, వివిధ కుసుమకదంబము, దివ్యతరుజమృదులవసనఫలాసవామేయ రత్న భూషణములు గల తన భోగ్యవస్తు సంభారమును జూపించి, ‘భోగపరుఁడవయి రమింపుము ననుగూడి యనుదినంబు’ నని కోరినది. తన కౌఁగిలి సుఖమును విలువఁగట్టి చెప్పినది. తన కున్న కలిమిజాలముల నెన్ని చూపించినది. అతఁడు వానిఁ గన్నెత్తియైనఁ జూడలేదు. ఆమె కౌఁగిలిని మనసార వాంఛింపలేదు. సశరీర స్వర్గ మెదుటనున్నను దాని నాశింపక నిగ్రహము చూపినాఁడు ప్రవరుఁడు. ఈ మూఁడును వరూథినికిఁ జిరాకెత్తించినవి. ఆమె మాటలలోఁ గొంత కరకుఁదనము కనుపించినది.

క. “అందునకుఁ గొఱయె వెన్నెల?
గంధర్వాంగనపొందు గా దని సంసా
రాందువునఁ గూలె దకట! ది
2.56

అనునది యామె మొదటి విసురు. ధర్మమును తృణాచ్ఛన్నమైన బావితో రూపించుట లోకప్రసిద్ధము. కాని, దాని నవహేళనార్థమున వరూథిని వాడినది. ప్రతివస్తూపమ యందు నందునితోడను, ఉపమయందు దివాంధముతోడను ప్రవరునిఁ బోల్చి యతనిభోగాంధ్యమును గర్హించినది.

"ఎన్ని భవంబులం గలుగు...." (2. 57) అను పద్యమునందలి 'యలివేణు' లెవ్వరో కారు; ఎందరో కారు. 'విన్నదనంబు'ను. 'వెన్నవలెం గఱంగు' స్వభావమును గల వరూథినియే. తత్కాలమందలి స్త్రీయావస్థను జాతి సామాన్యము చేసి మాటలాడెడి నేర్పు మాటలలోఁ గలదు 'ఎన్ని భవంబులం గలుగు.... గౌఁగిట జేర్చుభాగ్యముల్' అని యవహేళనము చేయునప్పుడు స్త్రీయాహంకారము వరూథిని పలుకులందు తాండవమాడినది.

క. "కుశలత యే వ్రతముల నగు
నశనాయాసమున నింద్రియవిరోధమునం
గృశుఁడ వయి యాత్మ నలఁచుట
సశరీరస్వర్గసుఖము సమకొనియుండెన్." —మ. చ. 2. 58

ఉపవాసవ్రతములచేః గృశాంగుఁడయి చేయు సర్వకర్మనిష్ఠలకును ఫలము స్వర్గ సుఖము. అందు కలుగునది దేవకాంతాదివ్యభోగము. అది సశరీరముగా లభించుచున్న దనియు, దానినిఁ ద్రోసిరా జనుట కౌశలము కా దనియు వరూథిని వాదము. 'సశరీరస్వర్గసుఖము సమకొనియుండె' నను వాక్యము నందలి వ్యంగ్యార్థమున వరూథినీజాత్యహంకారము దీపించుచున్నది.

పెద్దన వర్ణించిన దివ్యభోగములప్రసక్తి మారనరచనలోఁ గలదు. అచ్చటఁ గూడ సీసపద్యమే రచింపఁబడియుండుట గమనింపఁదగిన ఛందస్సామ్యము. అందలి మారనరచనాచమత్కారము 'మనోహరకేళిగతి యెలమిఁ గ్రీడింపు'మని యడుగుటలోఁ గానవచ్చుచున్నది. దానిని పెద్దన వ్యంగ్యముగాఁ బెక్కువాక్యములపైఁ బఱచి రచించెను.

౮. పైమాటలతో వరూథిని ప్రవరాఖ్యుని బ్రాహ్మణధర్మమునే గేలిచేసినది. యజ్ఞాదికర్మలవలన నరుఁడు సాధించెడు స్వర్గసుఖములను బేర్కొని యవి తమ యధీనమున నున్న వని గర్వించినది. బ్రాహ్మణుఁ డామెగర్వోక్తులకుఁ బ్రత్యుక్తి చెప్పినాఁడు. ఫలకాంక్షతోఁ జేయు సవనకర్మలకు ఫలము

స్వర్గసుఖము. ఫలాభిసంధిరహితమైన కర్మాచరణమునకు ఫలము మోక్షసుఖము. స్వర్గభోగములవలన మానవుఁడు క్షీణపుణ్యుఁడై మరల మర్త్యలోకమునఁ బుట్టును. నిష్కామకర్మ యొనర్చువాఁడు పునర్జన్మరహితమైన శాశ్వతమోక్షమును బొందును. బ్రాహ్మణుఁ డింద్రియనియతిచే సాధించునది స్వర్గము కాదు- మోక్ష మని ప్రవరుఁడు నిరూపించినాఁడు. అతఁడు తన కున్న బ్రహ్మానందాధిరాజ్యపదవీవ్యామోహమును వ్యక్తము చేసినాఁడు. కామైకప్రధానులగు భోగజీవులు దేవహీనులు. వారికి నిష్కామయోగము తలకెక్కదు. కావున ప్రవరుఁడు ధృతిదీప్తులతో బ్రాహ్మణ తత్త్వమునుగూర్చి చెప్పెడిసరికి వరూథిని చెదరిపోయినది. కాని, భయముతో నొదిగి మిన్నకుండలేదు. మదనబాణబాధ ఆమెకు భరింపఁజాలని దయ్యెను. అందువలన భయపడినను రతియత్నము మానుటకు వీలులేదు. ఇట్టి సంధిసమయమున నామెకుఁ బ్రవరున కెదురు మాటాడుధైర్యము కలిగించినది యామె 'మదము'. మనుచరిత్ర ద్వితీయాశ్వాసమందలి 61వ వచనమునఁ బెద్దన యామెయొక్క మదభంగిమల నిట్లు విభజించి చెప్పెను :

1. పరిణత వివిధ విబుధతరుజనిత మధురమదురసం బాను మదము.

2. అదటునన్ జిదిమిన నెఱుంగక మదనహరు నైనఁ జదురునం గదియ గమకించు తిమురునం గొమిరెప్రాయంపు మదము.

3. అనన్యకన్యా సామాన్యలావణ్య రేఖామదము.

4. ఒంటిపాటునఁ గంటికిఁ బ్రియుఁడై తంగేటిజుంటిచందమున గొంటుతన మెఱుఁగక కుఱుఁగట సున్న యమ్మహీసురవరకుమారు తారుణ్యమౌగ్ధ్యములం జేసి తనవైదగ్ధ్యము మెఱయఁ గలిగె నని పల్లవించు నుల్లమున నుల్లాసంబునం గదురు మదము. మధుయౌవనలావణ్యవైదగ్ధ్యహేతుజమైన మదమామెయందు విజృంభించినది. భయముచేఁ గదురుదెందము నామదముతో నోసడించినది. చెలికత్తెలను గనుసన్నలతో వారించి వరూథిని ప్రవరుని మఱియు సమీపించి, అతనతో నిట్లనెను.

శా. "ఎందే డెందము గందళింప రహిచే నేకాంతతన్ నిర్వృతిం
జెందుం గుంభగత ప్రదీపకళికాశ్రీ దోఁప నెందెంచుఁ బో
కెందే నింద్రియముల్ సుఖించఁ గను నాయింపే పరబ్రహ్మ! 'మా
నందో బ్రహ్మ!' యటన్న ప్రాఁజదువు నాంతంబర్థ మూహింపుమా!"

—2.62.

ఇందు మహాయోగిజనగమ్యమాన మగు బ్రహ్మానందస్థితినిఁ గామశాస్త్ర పరముగా నన్వయించి వరూథిని ప్రవరుని బ్రాహ్మణతత్త్వప్రతిపాదనము నవహేళనము చేసినది. మదనాతురయు, మదవతియు, జాత్యహంకారయు నైన వరూథిని యిట్లు ప్రవరు నొదఁబఱచుటకు తత్తరము చూపుచుండ నతనికి సిగ్గును, వెగటును గలిగినవి.

పెద్దన వరూథినియందుఁ గల్పించిన తత్తరము మారన చిత్రించినదే. కాని, యతఁడు మాటలయందు కంటెఁ జేతలయం దధికముగా వర్ణించెను. పెద్దన మాటకును, చేతకును, వానిమధ్య నుండు కాలవ్యవధానాది వివిధాంశములకును, వీనినన్నింటిని మించిన యాంతరమైన యొక క్రమపరిణామమునకును, హేతువాద కల్పనమునకును చక్కని సంయోజమును గల్పించి రూపొందించి యుండుటచే పురాణకల్పనముకంటె ప్రబంధకల్పనము సంశ్లిష్టమును, సారవంతమునై రాణింపఁగలిగినది.

6. ప్రవరుఁడు తన కరణులు, దర్భలు, నగ్నులు ప్రియము లగును గాని యన్యములు కా వని తేల్చి చెప్పి, 'చెప్పకు మిట్టితుచ్ఛసుఖముల్ మీసాలపైఁ దేనియల్' అని భోగవాంఛను దృణీకరించెను.

ఆ మాటలతో వరూథిని యభిమానము మూఁడవసారి దెబ్బతినినది. క్షణక్షణము గడచిన కొలఁది ప్రవరుఁడు గట్టితేలుచుండెను. అతని వాక్కులలోఁ జాతుర్యము సడలి తైక్ష్ణ్యము హెచ్చినది. 'చెప్పకు' మనుటచే వ్యంగ్యముగా నామెను మరు మాటాడవల దనియు, నీవు మాటాడినను నేను వినను, మాటాడ ననియు ఖండితముగా సూచించినాఁడు. ఆ మాటతో నామె నోరు పడిపోయినది, గుండె చల్లఁబడినది. మోము వెల్లఁబారినది, కనుల నీరు గ్రమ్మినది, గొంతుక జీరపోయినది. అతనిని బుల్కుపుల్కునం జూచినది. తలయూచినది. 'వనిత తనంతఁ దా వలచివచ్చినఁ జుల్కన గాదె యేరికిన్' అని తన దైన్యావస్థను మొదటిసారి వాక్రుచ్చినది. కాని, యట్టిమానిని దైన్యావస్థలో నెక్కువకాల ముండలేదు. పడగ చితికిన పాము తోకతో కొట్టినట్లు మార్గాంతర మాలోచించినది. ఆమె వలచినట్లు బైట పడినది కాని యతఁడు బైటపడలేదు. మాటలతో లొంగని బాపఁడు చేతలతో లొంగునని వరూథిని యూహించినది. అనునయాలాపవీనాస్య యై రతిసంరంభము మీర నాతనిఁ బైపాటునఁ గౌఁగిలించినది. అణఁగారిన గర్వస్థానము నతిశయించిన కామ మాక్రమించినది. కామ మింద్రియ

తృప్తిని గోరును గాని యాత్మగౌరవము నభిలషింపదు. కాము మవమానింపఁ బడుచోఁగలిగెడు లజ్జాశోకములు అమర్షాహంకారములను రేకెత్తించి విజృంభింపఁ జేయును. ప్రవరుఁ డామెను త్రోసివేయుటతో వరూథిని కట్టిస్థితి యేర్పడెను. 'పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక!' యని యతని నిర్దయత్వము నెత్తి చూపుచున్నదో యనునట్లు నఖక్షతములను జూపించి వేదన నెపంబిడి కలస్వన ముతో నేడ్చినది. అతఁ డులుక లేదు; పలుక లేదు. అతని నిర్దయ కామె యొడలు మండినది. భూతదయావిహిత మైన యతని చదువులు, జన్నములు, పున్నెములు నిరర్థకము లని వేడిగా మాటలాడినది. పరాశరాదుల బండారము బైటపెట్టినది.

తే. "వారికంటెను నీ మహత్వంబు ఘనమె?
పవనపర్ణాంబుభక్షు లై నవసి యునుప
కచ్చడాల్ గట్టుకొను మునిముచ్చు లెల్లఁ
దామరసనేత్ర లిండ్ల బందాలు గారె?" —2.73.

ఏకదేశముగాఁ బ్రారంభ మైన వరూథినీవాక్శరపరంపర మునిలోకమునంతయు ముంచెత్తినది. అభిమానగర్వము కార్యసాధనసమర్థము కానప్పుడు కారుకూత లరచుచుండుట లోకస్వభావము. 'మునిముచ్చు' లను నిష్ఠురదూషణము పరాశ రాదుల నుపలక్షించి పల్కినప్పటికిని అది తనపరిష్వంగమును భగ్నపఱిచిన ప్రవరునిమీఁద పరోక్షముగ పరవళ్ళు తొక్కుచున్న వరూథిని యమర్షాహంకార ముల వాగ్విలాస మని స్పష్టమగుచునే యున్నది. ఇంతయార్భాటము సృష్టించిన పెద్దన కోలాహలములమధ్య అమృతస్ఫూర్తి వలె 'వారికంటెను నీమహత్వంబు ఘనమె' యను సత్యస్ఫూర్తిని కాకువునందు నిలిపి తన చమత్కారవాక్కును సార్థకపఱచుకొనినాఁడు. వాక్శిల్ప మనఁగా నట్టిది!

మారన రచనమున వరూథిని ప్రవరపరిత్యక్త యైనచోఁ బ్రాణత్యాగము చేసెద నని తననిశ్చయము తెలిపి యతనిని లొంగదీయ యత్నించినది. దానికిఁ బ్రతిగా ప్రవరుఁడు పరవనితారతి కీఁడని గురువులు చెప్పెద రని బోధించి తనయం దామెను నిరతము విరతిని భజింపు మని గరపి సౌమ్యముగా నగ్నిని భజింప నేగెను. పురాణమునందు వరూథిని యడిగిన చివరిప్రశ్నకుఁ గూడ ప్రవరునినుండి సమాధానము లభించినది. ప్రబంధమునందు పరిష్వంగభంగ

మయిన తరువాత వరూధినిరోదన మరణ్యరోదన మైనది ఈ ఘట్టమున మారనకంటె పెద్దన కడు గడుసుపోకడ పోయినాఁడు

రెండవఘట్టమున వరూధిని విరహార్తమూర్తి అంగభవకోదండోగ్ర మౌర్వీ రవక్షోభాకంపితధైర్య ఆమె ప్రవరుని మొదట కామించినది ఆ కామము విరహవేదనచేఁ దప్తమై హార్దికమైన యనురాగముగఁ బరిణమించి నది అందువలన వరూధిని ప్రవరునిఁ బొందని బ్రతుకు నిష్ఫల మని భావించి నది విషమసాయకుని తూపులవేడికి విసిగి వేసారి చివర కవ్వనజాక్షి తనువు దొఱగంగఁ దలపెట్టినది ఇట్టి దయనీయావస్థలో నున్న వరూధినికి జాత్యహం కారము స్మృతికిఁ దెచ్చుటకుఁ బెద్దన నెచ్చెలులను సృష్టించెను వా రామెకు నూరిపోయు నీతివాక్యము లిట్టివి

ఉ పూతపసిండివంటి వలపుం బచరించుకులంబు నీతికిన్
లేఁత గదమ్మ యిత్తెఱఁగు లేమ సురాంగన లెల్ల నిట్టి నీ
చేతకు మెత్తురమ్మ? దయసేయక తిన్ననిమేను వెన్నెలన్
వేతురటమ్మ? యింత కనువేదుఱు సెల్లునటమ్మ యింతికిన్? -3 33

ఉ ఇందునిభాస్య వాఁ డసఁగ నింద్రుఁడొ చంద్రుఁడొ యాయుపేంద్రుఁడో
యిందులకై వగం బొగుల నేటికి? నేటికి నందుఁ బోద మా
సంచనభూమి భూమిసురనందనుఁ డుండకపోడు రమ్మ నీ
చందము నందముం గనిన జవ్వని యెవ్వని వెట్టిఁ జేయదే?
—3 63

ఇందు మొదటిపద్యమునందలి భావము వరూధినివిశిష్టచిత్తవృత్తికి విరుద్ధము గావున నది యామెపైఁ బనిచేయలేదు రెండవపద్యభావము తత్సౌందర్యాహం కారపోషకము కావున నది యామెచిత్తమున సత్ఫలితముల నిచ్చినది ఇట్లు సఖీవాక్య జ్ఞాపిత మైన స్వాభిమానము మాయాప్రవరసందర్శనసమయమున సుసంపన్నమై యామెవాక్యములందు ప్రతిబింబించి యాపాత్రయందుఁ బోషింపఁబడవలసిన ప్రధానగుణసాతత్యము నిర్వహింపఁజేసినది

కపటభూసురకుమారుని దరిఁజేరి పలుకరింపఁబోవు వరూధినిని మాని యని పెద్దన సూచించుటలో సిరహస్యము కొంత కలదు అమెమాటలో నఖండాభిమాన ముట్టిపడ రచించుటలో నది వ్యక్తమైనది

శా రా వైరాగ్యముఁ బూని నీవు కడునిర్దాక్షిణ్యచిత్తంబునన్
రావై తేఁ జవిగాని యిందులకు హోరాహోరిఁగాఁ బోర యే
లా వాలాయము సేయఁగా? బ్రతుకు నీ వాచారవంతుండ వై
చావో యెక్కడొ నీయెడం బొదమువాంఛన్ భూసురగ్రామణీ!

క కట్టడితనమున నిట్లాడి
గట్టి మనసు రాయి సేసి కరఁగవు మఱి నీ
పట్టినది విడువ విఁక ని
ట్టిట్టన నేల? మాయదృష్టం బుండన్ —3 94 95

కరినుఁద్రైన ప్రియునిఁ గరగింపఁదలచిన యువతి యతనికాళ్ళ వ్రేళఁ బడి దైన్యము ప్రకటించుట లోకసహజము కాని యిచ్చట వరూథిని లోకసామాన్యమైన వాక్యము లాడుటలేదు ఆక్షేపవ్యాజనిందాలంకారగర్భితము లైన వాక్యముల నెన్నుకొనినది మొదటిఘట్టమునఁ ద్రోపుడువడి యవమానముపా లయిన యామానిని మఱల కాళ్ళ బేరమునకు దిగలేదు అతని నిర్దాక్షిణ్యచిత్తమును చక్రాటితోఁబోల్చి యుపాలంభించినది అతఁడు మొండిపట్టు విడువనందులకు విసుగుకొనినది బలవంతముగ నతని నొప్పించు యత్నము చేయలేదు కాని పూర్వకృత నిరాకరణమును జ్ఞప్తికిఁ దెచ్చి మఱల తా నాతని వేడఁబోనని సూచించినది బ్రతుకు నీ వాచారవంతుండవై యని యతని నిష్ఠామయ జీవితము నిరర్థకమని హెచ్చరించినది ఇఁక ని న్నిట్టిట్టన నేల యని తననిష్ఠు రోక్తు లతనియందు నిష్ఫలము లయ్యెనని నిరాశ ప్రకటించినది మాయదృష్ట మిట్లున్న దని నట్లు వరూథిని సంభాషణము ముగించుట పెద్దనగారి సంభాషణ చాతుర్యమునకుఁ జక్కని నిదర్శనము మా యనుటలో నామె జాత్య హంకారము కలదు అదృష్ట శబ్దమునం దామె కాతనివలన జరిగిన యన్యాయ మంతయు నిమిడియున్నది ఇది యిట్లుండ నిన్నిట్టిట్టన నేల మా యదృష్టం బుండన్ అనువాక్యమునందలి తాత్పర్య ముచ్చారణ వైలక్షణ్యముచే మా యదృష్టమే మాకు చాలును. అదియే మాయందు నీ కానుకూల్యము గలిగించును

ఇఁక వేఱుగా నేనేమియు నిన్నడుగవలసిన పనిలే దను నర్థాంతర స్ఫూర్తియుఁ గలుగుటకు వీలున్నది దానిని భావికథార్థ సూచనగాఁ బెద్దన నిబంధించి యుండవచ్చును

పెద్దన వరూథినిని జాత్యహంకారగర్వితయైన మానినిగా రూపొందించెనని పైనిచ్చిన యుదాహరణములవలన స్పష్టమగుచున్నది ద్రౌపదీ సత్యభామాదుల నిట్టివై లక్షణ్యముతోఁ దెలుఁగుకవులు దీర్చిదిద్దుటవలననే వారు లోకాదర పాత్ర లగుట. ఆంధ్ర ప్రబంధరంగములందు ముగ్ధలైన శృంగారనాయికలకన్న మానినులైన మగువల పాత్రలకే మన్ననయు మనుగడయు నధికము!

(1968)

# కలభాషిణీ కథామూలము

"విద్యానగర రాజవీథులన్ కవితకు
పెండ్లిపందిళ్ళు కప్పించునాడు"—

అని శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు రాయలవారి యుగమును గీర్తించియున్నారు. ప్రబంధకవితాకన్యను బెండ్లికూతుగా నూహించినారు వారు. నన్నయ్యగారిచే నుగ్గు వెట్టించుకొని, తిక్కన్నయొద్ద తెలుఁగు పలుకుబడుల తియ్యఁదనము నలవరించుకొని, ప్రబంధపరమేశ్వరుని యొద్ద వినయసంపదను గడించి, శ్రీనాథుని యొద్ద ప్రౌఢవచోవిలాసమును, పోతన్నయొద్ద భక్తిప్రపత్తులను నేర్చుకొని, సాహితీసమరాంగణ సార్వభౌముని సౌజన్యముచే వర్ధిల్లిన యాంధ్రసాహిత్యభారతి పెండ్లియీడుకు వచ్చిన నవోఢ యని భావించుట యెంతయు సమంజసము. ప్రబంధకవులా పెండ్లిపడుచునకు పెంజెడ సవరించి యలంకరించినారు. అల్లసాని పెద్దన యల్లిక నేర్పు చూపించినాఁడు; నంది తిమ్మయ్య పారిజాత పుష్పగుచ్ఛము నిలిపినాఁడు; పింగళి సూరన్న ముప్పేట జడకుచ్చులను ముచ్చటగా ముడివైచినాఁడు; రామరాజభూషణుఁడు వసురత్న నిర్మితమగు చేమంచిబిళ్ళ నలంకారముగా ననుసంధించినాఁడు; ధూర్జటి రామకృష్ణాదులు తత్శృంగార మాహాత్మ్యములను గీర్తించినారు. భారతీవేణి సౌభాగ్యమునకు ప్రబంధకవుల శృంగారములన్నియు నొక యెత్తు! పింగళి సూరన ముడివైచిన ముప్పేటజడకుచ్చుల సౌందర్యము మఱియొక యెత్తు!!

పింగళి సూరన రచించిన కళాపూర్ణోదయము తెలుఁగున 'నపూర్వకథా సంవిధాన మహనీయ'మగు ప్రబంధము. నాయికయొక్క మూఁడుజన్మల కథను కార్యకారణక్రమమున నపూర్వ కల్పనాసామర్థ్యముతో సంవిధానము చేయుట యా ప్రబంధ కథానిర్మాణమునందలి ప్రత్యేకత! సరస్వతీ చతుర్ముఖుల పెంపుడుచిలుక కలభాషిణిగా, మధురలాలసగా జన్మమునెత్తి నిర్వహించిన జీవితవిశేషము లీకావ్యవస్తువునందు విపులముగా వర్ణింపఁబడినవి. చిలుక పుడమిపై పురంధ్రియై పుట్టుటకు సరస్వతీచతుర్ముఖుల ప్రణయకేళి బీజము; వాణి శాపమును, వాణీశుని వరప్రదానమును అంకురారోపణము!

పింగళి సూరన కావ్యకల్పనాకళాపరిపాకమునకు సరసోదాహరణము సరస్వతీచతుర్ముఖుల ప్రణయఘట్టము. అందుండి రెండుకథలు పుట్టినవి. అవి: ఒకటి: కళాపూర్ణునికథ లేక మధురలాలసావృత్తాంతము; రెండు ; కలభాషిణీ వృత్తాంతము. సామాన్యముగా నొక రమణీయకథాసన్నివేశమును గల్పించిన కవిప్రతిభయే లోకమున ప్రశంసపాత్ర మగుచుండును. అట్టుండ కథాద్వయ కల్పనా సూత్రగర్భిత మైన కల్పిత కథాఘట్టము సృష్టించిన సూరన ప్రతిభ నేమని కీర్తింపఁగలము!

కళాప్రపూర్ణవృత్తాంతమునకు సరస్వతీచతుర్ముఖుల కేళీఘట్టము మూల మైన విధమును పింగళిసూరన బ్రహ్మముఖమున వివరించుచున్నాఁడు. రహస్య కేళీ సమయమున తాను వచించిన కళాపూర్ణునిగాథ భూమిపై వెలయునట్లు కరుణించి వివరించి వాణితో నిట్లనెను—

సీ. "కాంత! మున్వివ్న యాకథ యీకథయ నాఁగ
నందు వాచ్యత తోఁచినట్టి నామ
జాతిక్రియాదిక సకల పదార్థ వా
క్యార్థాంతరము లెవ్వి యవియ యిందు
గలయవి; యిందుఁ దత్కథ కంటె భేదంబు
పరికింప నొనరించెఁ బడసె నిలిపె
ననునివి మొదలైనయట్టి భూతార్థంబు
క్రియలపట్టున నొనరించుఁ బడయు

తే. నిలుపు ననునివి యాదిగాఁ గల భవిష్య
దర్థవచనంబు లైన క్రియాపదంబు
లునుచుకొనుటయె వాసి యెందును దలంప
నోసుధాంశువిలాసప్రహాసివదన!

వ. మఱియు శ్రోతృజనాపేక్షానుసారంబునఁ దత్తన్నిమిత్తోపాఖ్యానంబులచేత నిదియ కొంత విస్తారంబు నొందఁ గల; దది చెప్పఁబని యేమి? ప్రధాన కథాభాగం బింతియె."
—5 ఆ. 60-61.

దీనినిబట్టి సరస్వతీచతుర్ముఖుల రహస్యకేళిలోఁ జెప్పఁబడిన కళాపూర్ణ వృత్తాంతమునందలి నామజాతిక్రియాది సకలపదార్థవాక్యార్థాంతరము లన్నియు

తరువాత భువిపై ప్రవర్తిల్లిన కళాపూర్ణుని చరిత్రమునందు పాటింపఁబడిన వని స్పష్టమగుచున్నది. మఱియుఁ దత్కృత శ్రోతృజనా పేక్షానుసారంబు తన్నిమిత్తో పాఖ్యానములచేత విస్తృతిగాంచిన దని తెలియుచున్నది. మణిస్తంభసుముఖా సత్తుల వృత్తాంతము, స్వభావసిద్ధుని యుపాఖ్యానము, అలఘువ్రతునకు మదుర లాలస తెల్పిన మణికంధర వృత్తాంతము, శల్యాసుర చరిత్రము, అభినవ కౌముదీవృత్తాంతము, ప్రథమాగమాది పురోహితవృత్తాంతము, సత్వదాత్మ రూపానుభూతుల వృత్తాంతములు మొదలగునవి కళాపూర్ణ వృత్తాంతమునఁ గానవచ్చు నుపాఖ్యానములు. ఉపాఖ్యానముల నటుంచినచోఁ గళాపూర్ణ కథా కల్పనకు వలసిన మూలకథాసూత్రమంతయు వాణీచతుర్ముఖుల ప్రణయకేళి యందు వాచ్యముగాఁ దోచుచుండుట నిస్సంశయము.

ఇఁక మిగిలినది కలభాషిణీవృత్తాంతము. అష్టాశ్వాస పరివ్యాప్తమైన కళా పూర్ణోదయప్రబంధమున కలభాషిణీవృత్తాంతము నాలుగాశ్వాసముల వఱకు వ్యాపించియున్నది. అనఁగా కలభాషిణి కథకు కావ్యమున సగపాలును, శుక మధురలాలసా వృత్తాంతములకు మిగిలిన సగపాలును కవి పంచిపెట్టినాఁడన్న మాట! దీనినిబట్టి సూరనకు కలభాషిణీ చరిత్రముపై నున్న మక్కువ చెప్పక తెలియుచున్నది!

పింగళిసూరన కలభాషిణీ జన్మహేతువును గడు చమత్కారముగాఁ గల్పించినాఁడు. సరస్వతీచతుర్ముఖుల రహస్యకేళి వృత్తాంతమును రంభ వినఁగోరి చిలుకను మఱిమఱి యడుగ నాపలుకులపక్కి కులుకుపలుకులతో నామె కావృత్తాంతమును, సరస్వతీమణిత స్వర విశేషమును వినిపించుటఁ గాంచి, వాణి శోణితాక్షయై—

"తలఁకక యోసి యేమిటి కతల్ తలపెట్టిన దాన విచ్చటన్?
తెలియము గాని నీవు పెనుద్రిమ్మరికాఁతలదానవే కదే!
బళిబళి యీ వికారములు ప్రాఁతె? యవిఘ్నతఁ జాగి లంజవై
యిలపయిఁ బుట్టుమంచు శపియించె మనంబున నల్క హెచ్చఁగన్."
—5. 56.

ఇచ్చట "అవిఘ్నతఁ జాగి లంజవై యిలపయిఁ బుట్టు" మనుటలోఁ గల పద క్రమమును బరిశీలించినచోఁ జిలుక మొదట స్వర్గభ్రష్ట కావలెననియు, తదుపరి వేశ్యారూపమున భువిపైఁ బుట్టవలె ననియు సరస్వతి నిర్దేశించినట్లు స్పష్టమగు

చున్నది. వాణి తన శాపమున కవిష్నుత శాసించుటచే బ్రహ్మదేవుఁడు కూడ యీమెమాట కెదురాడకుండఁ జేసినది!

ఈ శాపమును విన్న నలువ "యిది యేమి యెఱుఁగు? ని ట్లదయవృత్తిఁ దిట్టుదురె?" యని చిలుకపై నెంతయో దయ నొలుకఁబోసి, "మీయమ్మశాపంబు నకు నొఁగా దన నెవ్వరికి నెట్లువచ్చు" నని యాశ్వాసించి, అసలే భువిపై నొక జన్మ నెత్తవలసి వచ్చెనే యని విలపించు నాచిలుకకు మఱియొకజన్మ నంట గట్టి, ఆజన్మలో దానికి అనన్యసాధారణం బైన యైశ్వర్యభోగములను, సహజమైన పరమపాతివ్రత్యమును బ్రసాదించి కృతార్థవౌదువని దీవించినాఁడు. పాప మాచిలు కకు బ్రహ్మదేవుని కరుణయు నొకశాపమై తారసిల్లినది. అమ్మగారు అంప శయ్యపై విసరివేయఁగా, అయ్యగారు ఒడలు దులిపి హంసతూలికాతల్పమునఁ బడవైచినట్లైనది!

పలుకులచిలుక వికారమునకు లోనై తల్లిగుట్టును బట్టబయలు చేసినందు లకు కలభాషిణియైన వేశ్యగా జన్మింపు మని సరస్వతి శపించుటలో సార్థక్యము స్పష్టమగుచున్నను, కలభాషిణీకథాకల్పనకు మూలమైన రహస్యము మాత్ర మీ ఘట్టమునఁ దెలియవచ్చుటలేదు! కవి దానిని దేవరహస్యముగా దాచియుంచి నాఁడు! లేనిచో సరస్వతి చిలుకను బుడమిపైఁ బుట్టు మని శపించినట్లు చేసి, బ్రహ్మ యీ పుట్టుకలోనే మధురలాలస యగునట్లు కరుణించినట్లు కల్పించినచో నొక్కజన్మము తోడనే చిలుకకు పునర్బ్రహ్మలోకసిద్ధి కలిగి యుండెడిది! కాని కవిబ్రహ్మ కలభాషిణీ వృత్తాంతమున కిచ్చట నవకాశము కల్పించుకొని నాలుఁ గాశ్వాసముల కథ నడపఁదలచుకొనినాఁడు!

ఇచట నొకవిషయము గమనింపవలసియున్నది. కళాపూర్ణోదయ కావ్య విమర్శనము గావించిన విమర్శకులు కలభాషిణీవృత్తాంతము సూరన యపూర్వ కథాకల్పనకుఁ దార్కాణగాఁ గీర్తించియుండిరి. కాని, తత్కల్పనకు బీజభూతము లైన సూత్రములు వాణీచతుర్ముఖుల రహస్యకేళీవృత్తాంతమునఁ గలవని గుర్తించినట్లు కానరాదు! అందులకు గారణ మొండు గలదు! వాణీశాపవృత్తాం తము బ్రహ్మ నిబంధించిన ప్రధానకథాభాగమున కావల నడచిన గాథ యగు టచేఁ గలభాషిణి కథ ప్రధానకథకు సమాంతరముగా వెలసి, మధురలాలసా వృత్తాంతమునకుఁ బూర్వరంగ మైనట్లు వారు భావించిరి. అంతియ. కావున

నీవ్యాసమునందుఁ గలభాషిణీ వృత్తాంతకల్పనకు మూలములైన బీజములు వాణీ ముఖ ప్రతిబింబ వర్ణన కథార్థములందుఁ గలవని నిరూపించుయత్నము కొంత చేయఁబడు చున్నది.

కళాపూర్ణోదయ కావ్యవృక్షమునకు సరస్వతీచతుర్ముఖుల విలాసకేళి స్కంధము. వాఙ్ముఖప్రతిబింబ వర్ణమునందు 'వాచ్యత దోచినట్టి నామజాతి క్రియాది సకల పదార్థ వాక్యార్థాంతములలోఁ దోచిన కళాపూర్ణుని వృత్తాంత మాతరువున కొకశాఖ. ఈ శాఖాద్వయమునకు స్కంధమే యాధారము. కాని కళాపూర్ణుని కథా కల్పనము వాచ్యముగా సూచింపబడినట్లు, రహస్యకేళీ ఘట్ట మునఁ గలభాషిణి వృత్తాంతము సూచింపఁబడలేదు. అదియొక కథాకల్పన శిల్పమర్మము! పింగళి సూరన మణిస్తంభబింబిత వాణీముఖబింబప్రతిబింబా దుల సంచలనమునందును, వాణీచతురాననుల ముఖబింబవీక్షణాదిచేష్టా విశేష ముల యందును గలభాషిణీకథా కల్పనరహస్యములను బొదిగి పెట్టినాఁడు. వాని నీక్రిందఁ బరామర్శించుట జరుగుచున్నది.

కలభాషిణీ కథాకల్పన మంతయు నొకవిధముగా బింబప్రతిబింబ రూప కల్పనముపై నాధారపడియున్నది. కలభాషిణి తొలుత మణికంధరుని వలచినది. కాని, మునిశాపభీతిచే నిజహృదయమును బయలుపఱచక దాచికొనినది. అపైన మణికంధర రూపసామ్యము కొంత నలకూబరునియందుఁ గనవచ్చుటచే నాతని పొందుఁ గోరినది. మణిస్తంభుని సాయమున నామె నలకూబరునిఁ జేర యత్నిం చినది. కాని, నలకూబరాకృతియం దున్న మణికంధరుని నామె పొందఁగలిగి నది. మణికంధరుఁడు రంభాహృదయముఁ జూరఁగొనఁగోరి నలకూబరాకృతిఁ గాంచి రంభాకారమున నున్న కలభాషిణిఁ బొందుటయే కాక, నిజరంభాసాంగ త్యమును గూడ పొందఁ గలిగెను. నిజరంభానలకూబరులు నిజరూపములను నిర్ధారణము చేసికొనిన తరువాత మాయారంభా నలకూబరుల వృత్తాంతము బయటపడినది. ఇట్టి తబ్బిబ్బుల ప్రహసనమునకు సాక్షిగా మణిస్తంభుఁడు లేనిచో నీయాట సాగదు.

సరస్వతీ చతుర్ముఖుల విలాసకేళిలో సరోవర గర్భమందలి మణిస్తంభమే మణిస్తంభునిగాఁ జెప్పబడినది. అట్టి మణిస్తంభుఁడే కీలకమైన వ్యక్తిగా సూరన కలభాషిణీ కథాకల్పనము గావించినాఁడు. ఇఁక వాణీచతుర్ముఖబింబ ప్రతిబింబ

ముల తీరును సూరన కలభాషిణీ కథాపాత్రలకు ప్రతీకలుగా భావించిన విధమును గమనింపవలసి యున్నది.

వాణీచతురాననులు సరోవరతటమునఁ దలిరుపాన్పుపైఁ బవళించి యుండిరి. వాణీసుందర ముఖారవిందమును గాంచి మదనపరవశుఁడై బ్రహ్మ తననలుమోముల నాసతియధరమును జుంబింప నుద్యుక్తుఁ డయ్యెను; ఆ లీలకు సరస్వతి నవ్వి 'మేలు మే లెంతయు నీవింత లన్యాయ మింతగలదె? మీమొగంబు లానాల్గు నీమాడ్కి నువ్విళులూరిన నేకాస్య నొక్కతె నేను జాలుదునె? యివి చాలించెదరొ? మఱి యేమైన గలదొ?' యనుచు నామృగాక్షి మెద బిగించుచు నించు కెదగ వక్త్రము నిల్పి, యధరంబునకుఁ బాణి నడ్డ మిడుచు—

తే. "మొలక నగవును, గోపంబుఁ జెలువుఁ జిలుకు
తళుకుఁ జూపులఁ జూపులోఁ దర్జనముల
వక్రిత భ్రూలతా తాండవంబు సిరుల
మిగులఁ గెరలించెఁ బ్రియుమది మెఱయుమరుని."

అప్పు డా యజుఁడు బల్మిని వాణీముఖమును వంచి, మోవిపై నున్నచేయినిఁ దొలఁగించి, ఒక్కించుక నాటునట్లుగా పలునేర్చెను. ఆయ్యమ కట్టియెడ కళాభిదుర మై యింపొనరింపఁగా మోహనమధురాంచిత శబ్దమొండు కంఠసీమయం దుదయించెను.

ఇందు యౌవనశోభావిలసిత మగు వాణీముఖము కొంగ్రొత్తవయసున నున్న కలభాషిణీముఖమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. బ్రహ్మయొక్క నాలుగు మొగములు కలభాషిణీముఖచుంబనాకాంక్షులగు బలువురు విటులను బురుడించుచున్నవి. ప్రథమాశ్వాసమునందలి—

"తనదు మెఱుంగుఁజెక్కులు దాఁకఁగ నీక మొగంబు నాఁపుచుం
జనుబొగడల్ నఖాకలనఁ జక్కిలిగింతలు వోవ లోఁగుచున్
మనసిజు మించు భీతియును నానయుఁ బూనుచు నీమృగాక్షి యిం
పొనరుచు చెన్నదొక్కొ? యని యువ్విళులూరుదు రత్తఱిన్ విటుల్."
—1. 28.

అను పద్యముతోఁ బోల్చి చూచిన భావసామ్యము తేటపడఁగలదు. అట్లు క్రీడాసక్తులైన విటులను కలభాషిణి కాదని త్రోసిపుచ్చి, శ్రీకృష్ణమందిరమున

దండకస్తోత్రమును బఠించిన మణికంధరుని విద్వత్సౌందర్యములకు మెచ్చి యాతని వరించినది. ఆ మక్కువలోఁ దద్రచితస్తోత్రము నేకసంధాగ్రాహియై మఱల పఠించినది. ఆమెయం దప్పుడు మణికంధరునకు మరులు జనించినవి. ఇట్లు మొదటిసారిగా నాముద్దరాలి చిత్రమును దోచుకొనిన వలపుఁకాడు మణికంధరుఁడు. అతని విద్యాప్రదర్శనావసరమున నవ్యక్తముగాఁ గలభాషిణినోట సరస్వతి లాస్యమాడినది. ఈకథా కల్పనకు బ్రహ్మ యేకముఖమున వాణి యధరమునఁ బలు నాటించుటయు, సరస్వతికి కళాభిదురమై ప్రీతి జనించుటయు, తత్కారణముగా నామె కంఠమున మణిత మను కలస్వన ముదయించుటయు నను చేష్టావిశేషములు బీజభూతము లగుచున్నవి. అవ్యక్తమధురాంచిత శబ్దమును బల్కిన సరస్వతీముఖబింబము 'కలభాషిణీ' కల్పనకు ప్రేరకమనుటలో సందేహముండదు.

"అంత నావాగ్దేవి యీవిధమున నాదవిన కళామర్మభేదన సామ్రాజ్య సంపదనుభవానష్ట మానలాఘవ శంకఁ" గప్పిపుచ్చుటకై 'తద్విరోధకారిణియైన విభుని యభిమతకేళికి విఘాతంబుగ నధరపీడనాసహత్వ వాటితకంబున నలుకఁ గల్పించుకొని యవ్వలిమొగంబుగాఁ బొరలె'ను. ఈ ఘట్టములోని 'లాఘవశంకయే' కలభాషిణికిఁ దోచిన మునిశాప శంకను గల్పించుటకు దోహదకారియై యుండును.

కలభాషిణి మునిశాపశంక నిట్లు వివరించి చెప్పినది :

> "ఆవిధి నుండు నంతట నొకప్పుడు నిన్నునుఁ జూచుచో మణి
> గ్రీవుని పేరు దోఁచె మదికిన్ మణికంధర! యేకదేశసా
> మ్యావగుణంబుచే నతని నాతనియన్నను మద్దిచెట్లుగా
> దైవతమౌని తిట్టిన విధంబు తలంపునఁ బాఱె సంతటన్." 4-19.

"దానన గుండె గుబ్బురనఁ దా నెరియన్ విడిచెం ద్వదంగ సంగానుభవేచ్ఛ" అని యొట్టు పెట్టుకొని చెప్పిన దాంలన. కలభాషిణి మునిశాపశంక కారణముగా మణికంధరుని చరిత్రము మణిగ్రీవుని గాథ వలె విషాదభరిత మగు నేమో యని భయపడి హృదయము నాతనినుండి దూరముఁ జేసికొనినది. అచ్చట సరస్వతి తనకుఁ గల్గిన లాఘవశంకను గప్పి పుచ్చుకొనుటకై విభుని యభిమతకేళికి విఘాతుక మైన చర్యకు నొకానొక కారణమును వెదకికొని

నలుకఁ గల్పించుకొని విముఖత భజించినది. అఁట మణికంధరుఁడును "దద్విరహదశావికలిత ధైర్యుండయ్యు, నుల్లంబునం గల్లగుట్టు నెట్టుకొలిపి, యిట్టట్టు తెల్పుటకుం జొరకుండి" యుండెను. ఇట్లు కలభాషిణీ మణికంధరుల చిత్తవృత్తులకల్పనలకు వాణీచతుర్ముఖుల తత్కాలచిత్తావస్థల విధము ప్రేరకమయ్యె ననుట కవకాశ మేర్పడుచున్నది.

అవ్వలిమొగంబైన సరస్వతిముఖము కాసారగర్భమున నున్న మణిస్తంభగర్భమునఁ బ్రతిబింబించె నని సూరన కల్పనము. తద్వాణీముఖబింబమును గాంచి చతుర్ముఖుఁడు వర్ణన మారంభించె నని కవి చెప్పియున్నాఁడు. ఇచ్చట నొకవిషయము మనము స్పష్టముగాఁ దెలియవలసి యున్నది. దర్పణమునందుగాని, మణిముకురమునందుగాని యొకసతి ముఖబింబము ప్రతిబింబింపఁగా దాని నామెప్రక్కనే యున్న యామెపతి కాంచుచుండెనని భావించినచో సతీముఖప్రతిబింబమును దర్శించుచున్న పతిముఖప్రతిబింబమును సైతము సతి కాంచఁ గలిగియుండును. ఇది లోకమున సర్వజనవిదితమైన భౌతిక సత్యము. పింగళి సూరనకు కళాపూర్ణోదయ కథాకల్పనావసరమునఁ జతుర్ముఖముఖ ప్రతిబింబప్రసక్తి యవసరము లేకపోయినది. అందువలన తత్ప్రతిబింబస్థితి నతఁడు వాచ్యము చేయలేదు. అతఁడు చెప్పకపోయినను, మణిస్తంభమున వాణీముఖప్రతిబింబ స్థాపనము చేసిన క్షణమునందే, చతుర్ముఖ ప్రతిబింబస్థితి భౌతికశాస్త్రధర్మము ననుసరించి స్థాపించినాఁ డనుట నిర్వివాదాంశము. కలభాషిణీ కథాకల్పన కాదంపతుల ముఖబింబ ప్రతిబింబ హేలయే మూలాధారమైనది!

పింగళి సూరనకు వాణీచతుర్ముఖముఖబింబ ప్రతిబింబములు కలభాషిణీ కథలోని యేయేపాత్రల కల్పనకు కారకములైనవో పాఠక సౌకర్యార్థ మిచ్చట నీయఁబడుచున్నవి:

1. వాణీముఖము - లేక వాణీముఖబింబము=కలభాషిణి.

2. బ్రహ్మముఖము - లేక బ్రహ్మముఖబింబము=మణికంధరుఁడు.

3. మణిస్తంభ బింబితమైన వాణీముఖప్రతిబింబము=రంభ.

4. మణిస్తంభబింబితమైన బ్రహ్మముఖ ప్రతిబింబము=నలకూబరుఁడు.

వీని నీవ్యాసమునందు మున్ముందు వివరించుట జరుగును.

సరస్వతి క్రమముగా నా లాఘవశంకనుండి తేఱుకొనినది. ముఖము కళా ప్రాభవమయ్యెను. కళాపూర్ణమైన యాతన్వి ముఖప్రతిబింబమును నీటియందుఁ గల మణిస్తంభముసఁ బొడగాంచి బ్రహ్మ కళాపూర్ణుని కథ ప్రారంభించెను. వాణి ముఖవిలాసమును నలువ తత్ప్రతిబింబమున మనసుగొని చూచుచు, ధైర్యము వహించియుండఁగా సరస్వతి నిజభ్రూవిలాసమున నాతని ధైర్యమును భగ్నము చేసెను. భగ్నధైర్యుఁడయ్యు బ్రహ్మ యామె ముఖప్రతిబింబమునందు హృదయ వీక్షణములఁ దనివి తీరక నిల్పియుండెను.

ఈ చేష్టా విశేషములందు గమనింపఁదగిన యంశములు రెండు కలవు. చతురాననుఁడు సరస్వతీముఖ ప్రతిబింబమును గాంచుచుండెను. సరస్వతి బ్రహ్మ ముఖప్రతిబింబమును గాంచుచుండెను. వెనుక నిశ్చయించినట్లు సరస్వతీముఖ బింబము కలభాషిణికిని, బ్రహ్మముఖము మణికంధరునకును ప్రాతినిధ్యము వహించునన్నచో బ్రహ్మ కళాపూర్ణమయిన సరస్వతి ముఖ ప్రతిబింబమును గాంచి, హృదయ వీక్షణము లాకృష్టము లైనను ధైర్యమున మసలుచుండఁగా నాతని ధైర్యమును నిజభ్రూవిలాసమున వాణి వికల మొనర్చిన దనుటలో రంభ యింద్రుని వరప్రసాదమున నభినవరూపలావణ్యములఁ బొంది, కళాపూర్ణయై, తపమున నున్న మణికంధరునిఁ జేరి విలాసములఁ బ్రదర్శింప నాతఁడు తొలుత కొంత ధృతి వహించినను మనసు చలించుటచే తపోనిష్ఠను గోల్పోయె నను కథా ఘట్టమును దలపింపఁజేయుచున్నది. మణికంధరుఁడు రంభను గవయుట కాయింతి యాసమయమునఁ దాల్చిన యభినవరూప విశేషమే కారణమని సూరన స్పష్టముచేసినాఁడు. మణికంధరుఁడు గంధర్వకుమారుఁడు. నారదునితోఁ గలసి స్వర్గగమనాదుల కలవాటుపడినవాఁడు. రంభాదుల నాతఁడు చిన్ననాఁటినుండియే నెఱుఁగును. కాని, యతనికి భూలోకవనిత యైన కలభాషిణి చిత్తమున కెక్కి నంత నాకవనిత లెక్కలేదు. కలభాషిణి సౌందర్యము నాకవనితల తలదన్ను నది. నారదుఁడే యొకసారి—

"............ఓయంబుజాక్షి!
రంభ మొదలైన యేయచ్చరలకు నైన
దక్కవే? నీదు రూపసౌందర్య మహిమ
లెక్కడే కాక! మిగుల నూహించిచూడ"

అని యోగ్యతాపత్ర మొసంగియుండెను రంభయు దేవేంద్రునితో "అతని (మణికంధరుని) నిఁటమున్ను పరికించుచుండుదు మస్మదాదుల విలాసంబు లెవ్వియు నెన్నండును సరకుఁగొని చూచినవాఁడు గాడు" అని తెల్పియున్నది. దేవేంద్రదత్తమైన యధికరూపలావణ్య విలాసముల వహించి రంభ మణికంధ రుని గాంచియుండుటచే నాతఁడు - కలభాషిణియం దిదివరలోఁ గాంచిన విలాసా దుల నామెయందుఁ గాంచి - యామెకు వశుఁడయ్యె నని తెల్ల మగుచున్నది.

సరస్వతి భర్తయందు మక్కువగల్గియుండియు, స్వయంకల్పితకోపకార ణముగా బ్రహ్మకు విముఖయై యుండి పతిముఖప్రతిబింబమును గాంచుచుండు టను బట్టిచూడ - కలభాషిణి ప్రథమప్రియుఁడైన మణికంధరునియందు ముని శాప భయముచే నైన వైముఖ్యమును గల్పించుకొని తద్రూపసామ్యము - ప్రతి బింబ భావము - గల్గిన నలకూబరునియందు మరులుగొనిన కథాకల్పనమునకు మూల మగుననుట కాస్కార మేర్పడుచున్నది. కలభాషిణి పలికిన యీ క్రింది మాట లామె నలకూబరుని వలచుటకుఁ గల కారణమును స్పష్ట మొనర్చుచున్నవి.

'...............నాదుచిత్తమో
మానితశీల! యంతట సమంచిత తావకరూపరేఖ చొ
ప్పేనొక కొంత గల్గఁ గని యిచ్చఁ గుబేరతనూజుఁ గోరితిన్."
"శాపభయంబున నెఱయఁగఁ
నీపై కోరిక మరల్చి నిధిపతిసుతు నే
పాపపు వేళను జూచితి
నో! పరుసొబ గేను మఱి కనుంగొన గుఱిగాన్."
"శ్రీయుత మైన దివ్యమణి చేతికి నబ్బఁగఁ బారవైచి, త
చ్ఛాయ యొకింత యున్కిఁ గని చాలఁ గ్రహించితి గాజుపూసకై
నాయవివేక మే మనుకొనం? దుదఁ దన్మణి యబ్బె నన్న న
త్యాయత తత్సమాగమ సుఖాప్తికి నోఁచమి నెంచి కుందెదన్."

పై సమన్వయము ననుసరించి సరస్వతీ ముఖప్రతిబింబము రంభాపాత్రకల్పన మునకును, చతుర్ముఖ ప్రతిబింబము నలకూబరపాత్రకల్పనమునకు కారణము లైనట్లు స్పష్టమగుచున్నది!

కళాపూర్ణుఁడు దీరభావునిఁ గడుమూరముగాఁ దరిమి, తనను శరణు జొచ్చిన మదాశయుని సకుటుంబముగా దాసు నొనరించి యూడిగములు సేయించుకొనుచుండె నని నలువ కథ చెప్పెను. అప్పలుకుల నాలకించి శారద చిలుకవైపు మోముఁ ద్రిప్పి, "ఆ కళాపూర్ణుఁడు మఱియేమి యయ్యె? నతనికిఁ దల్లిదండ్రు లెవ్వ?' రని బ్రహ్మ నడుగు మని గఱపెను. ఆ చిలుకయు బ్రహ్మదేవుని నట్లు ప్రశ్నించెను. ఆ జగద్గురుఁడు మఱల కథ ప్రారంభించి "అవ్వరవిలాసుఁడు అభినవకౌముది యను కాంతచే వరింపఁబడె ననియు, అతనికి సుముఖాసత్తి యనునది తండ్రి యనియు, మణిస్తంభుఁ డనువాఁడు తల్లియనియు నుడివెను. కళాపూర్ణుని తల్లిదండ్రులను బేర్కొనుటలో నైన లింగవ్యత్యయమును విని వాణి నవ్వి గ్రక్కునఁ గ్రమ్మఱి పతిని గౌఁగిలించి "ఔరా! యింతలో నెన్ని తబ్బిబ్బులు! దద్దరిల్లకుఁ" డని వీపు తట్టి మీదికథను గూర్చి ప్రశ్నించెను. ఈ ఘట్టములో బ్రహ్మ కళాపూర్ణుని తల్లిదండ్రులను గల్పించి చెప్పునపుడు శోభనముఖ సామీప్యంబు కారణముగా తత్కాసారమధ్య మణిస్తంభ గర్భమున నుదయించియున్న సరస్వతీ ముఖప్రతిబింబమును గాంచుచు శోభనముఖ సామీప్యమును సుముఖాసత్తిగను, మణిస్తంభమును మణిస్తంభునిగను భావించి చెప్పెను.

పింగళి సూరన కీకథాఘట్టము మాయారంభాకథాకల్పన కనువైన కొన్ని సూత్రముల నందించెను. పై ఘట్టమునందలి సరస్వతీచతుర్ముఖుల ముఖబింబప్రతిబింబముల కదలికలను గమనించినచో నది స్పష్టము కాఁగలదు. ఆ కదలికలను ప్రధానముగా నీ క్రింది విధమునఁ బేర్కొనవచ్చును.

1. సరస్వతీముఖప్రతిబింబము చతుర్ముఖుని ముఖబింబమును గాంచుట- ఇది రంభ మణికంధరుని గూడుటను వ్యంజింపఁజేయుచున్నది.

2. సరస్వతీ ముఖబింబము చతుర్ముఖుని ముఖప్రతిబింబమును గాంచుట- ఇది కలభాషిణి మణిస్తంభుని సాయమున నలకూబరునిఁ గవయ యత్నించుటను వ్యంజింపఁజేయును.

3. సరస్వతి చిలుకవైపు మరలుట- అప్పుడు సరస్వతీ ముఖబింబ ప్రతిబింబములు వైముఖ్యమును భజించుచుండును గావున-రంభ నలకూబరాసక్తమైన చిత్తముతో నతని నామోచ్చారణ మొనర్చి మణికంధరుని కప్రీతి కల్గించు కథార్థమును సూచించును.

4. సరస్వతి చిలుకతో మాటలాడి మణిస్తంభమువైపు మరలియుండుట- బ్రహ్మ శోభనముఖ సామీప్యమును గమనించుట - శోభనముఖ సామీప్యము మణికంధరునకైన కలభాషిణి సాన్నిహిత్యమును సూచించుచున్నది. ముఖ సామీప్యమును గమనించియు బ్రహ్మ సరస్వతీముఖ ప్రతిబింబమునందే రతి గల్గియుండుటచేఁ గలభాషిణిని రంభాకృతిలో మణికంధరుఁడు పొందఁగలిగిన కథార్థము వ్యంగ్యము.

5. చిలుకమాట లాలించునెడ బ్రహ్మయొక్క ముఖబింబ ప్రతిబింబములు సరస్వతీ వీక్షణములకు వైముఖ్యమును భజించినవి-దానివలన కలభాషిణికి విముఖుఁడైన నలకూబరుని (లేక నలకూబరవేషుని), రంభకు విముఖుఁడైన మణికంధరుని (నలకూబర సదృశుని) బొందెడి కథాకల్పనలు ధ్వనింపఁబడుచున్నవి.

6. చతుర్ముఖుఁడు మఱల వాణీముఖప్రతిబింబమును గాంచుచు కథను కొనసాగించుట - దీనివలన రంభకు మణికంధరునియానుకూల్యము సిద్ధించు కల్పనము సూచింపఁబడుచున్నది.

7. సరస్వతి చతుర్ముఖునివైపు మఱలుట - దీనివలన మణిస్తంభబింబిత వాణీప్రతిబింబము చతుర్ముఖుని ముఖమును గాంచుట తొలఁగినది. అది రంభ మణికంధరునిఁ బ్యజించి నిజనలకూబరునిఁ గూడెడు కథాకల్పనకు సూచకమగుచున్నది. వాణీముఖము చతుర్ముఖుని కున్ముఖ మగుట - కలభాషిణీ మణికంధరులు నిజాకృతులతో మృగేంద్రవాహన దేవాలయమునఁ గలిసిన సన్నివేశమునకు వ్యంజక మగుచున్నది. ఇట్లు స్థూలముగా మాయారంభావృత్తాంత కథాకల్పనలకు బీజములు వాణీచతుర్ముఖుల బింబప్రతిబింబముల తత్కాలసంచలనముల యందు పింగళి సూరన నిక్షేపించియుండుట స్పష్టమగుచున్నది.

తనకు మొగమైన భారతికంఠమును శతానందుఁ డధికసంభ్రాతా నందుఁడై కౌఁగిలించెను. ఏతత్పరిష్వంగము మృగేంద్రవాహనాలయమున గలిసిన కలభాషిణీ మణికంధరులు పూర్వస్మృతిచర్వణ మొనర్చుకొనుటకు సంజ్ఞ.

నలువ భార్యాధరపానమహోత్సవమునఁ దేలుచు నొక్క మొగమున నామె నొక్కించుక పీడనము గావించెను. అందుల కాసతి పతి నదలించి "మదిం గొలఁది యెఱుంగ రెందు" నని కోపము సూపుచుఁ గౌఁగిలి విడిపించుకొని నాథుని మోముల నిరుకేలఁ బాయఁగఁబట్టెను. ఈ పరిష్వంగ విశ్లేషము మణికంధర కలభాషిణుల కాజన్మ కింక సంయోగము లేదనుటను సూచించుచున్నది.

ఆపై నలువ దృక్కులు వాణీకుచకుంభములనుండి మధ్యప్రదేశమున కురికినవి. ఇయ్యది మణికంధరుని భృంగనిపాతమును సూచించుచున్నది. అటు తరువాత దృష్టిసహితముగా నా దేవుని యాత్మ తిఁగి సఖీముఖమునకు వచ్చుటయుఁ, దానఁ జుంబనేచ్ఛ మగుడఁ బరితుష్టినొందుటయు నది ముఖపానము చేత సఫలమగుటయుఁ బరికింప నుత్తరజన్మమున కళాపూర్ణుఁడుగా జన్మించిన మణికంధరుఁడు మధురలాలసగా జన్మించిన కలభాషిణియందు బద్ధానురాగుఁడయి, వివాహమాడి సుఖంబుండె నను కథాకల్పనకు మూలమగుచున్నది.

ఇట్లు కలభాషిణీ వృత్తాంతమునందలి ప్రధానపాత్రలగు కలభాషిణీమణికంధరులు, రంభానలకూబరులు, మణిస్తంభుఁడు మొదలగు వారిని గల్పించి కథా సన్నివేశములను గూర్చుటకు - మూలకథయైన వాణీచతుర్ముఖుల కేళీ విలాసఘట్టమే యాధార మగుట యాశ్చర్యకరమైన విశేషము.

సరస్వతి స్వయముగాఁ గల్పించుకొనిన పతివైముఖ్యమునకుఁ బ్రాతినిధ్య మిచ్చెడి తలంపుతో సూరన కలభాషిణి కథలో నారదపాత్ర కల్పనముఁ జేసినట్లున్నాఁడు! ప్రధానకథలో సరస్వతి కోపోద్రిక్తయై 'రంభ యనునది యిప్పు డెందు బోయె? దానికిఁ బగిన బుద్ధి చెప్పవలయు' (5 ఆ. 70 వ) నన్న వాక్కు దబ్బర గాకుండ నారదునిమూలమున కలభాషిణీజన్మకాలమున రంభకుఁ దగిన బుద్ధి చెప్పుట జరిగినది. అందువలననే రంభ కలభాషిణీకథకుమాత్రమే పరిమితమైన పాత్ర. నలకూబరుఁడు రంభ ననుసరించువాఁడు కావున నతఁడును అంతియే.

ఇఁక కలభాషిణీ జన్మవృత్తాంతమున శ్రోతృజనాపేక్షానుసారముగాఁ బెరిగిన యుపాఖ్యానములు గలవు. అవి : నారదతుంబుర కలహోదంతము, నాకవాసి యగు శుకమునుగూర్చిన కథ, సుగాత్రీశాలీనుల యుపాఖ్యానము, మణికంధర తీర్థయాత్రాదివర్ణనము మొదలైనవి.

కళాపూర్ణోదయకావ్యము కమనీయ కథాకల్పనకు కల్పలతిక. మూఁడు జన్మలగాథను ముడివైచి, పూర్వాపర వైరుద్ధ్యము లేకుండ కథ నల్లిన సూరన ప్రతిభ యనన్యసామాన్యము. అందలి సరస్వతీచతుర్ముఖుల కేళీకథాకల్పనమే యొక యపూర్వశిల్పము. అందు వాచ్యముగాఁ దోచెడి కథ కళాపూర్ణుని వృత్తము కాఁగా, వ్యంగ్యముగా స్ఫురించెడిది కలభాషిణీవృత్తాంత మగుచున్నది. వాణీచతుర్ముఖ బింబప్రతిబింబ సంచలన వీక్షణచేష్టా విశేషములను సైతము వృధా కాకుండ కథాకల్పనలో నంగము లగునట్లు సార్థక్యమును సాధించుట సూరన ప్రతిభకే చెల్లినది.

తెలుఁగున నపూర్వకథాకల్పనా శిల్పమునందు కళాపూర్ణుఁడు పింగళి సూరన!

(1960)

# ప్రభావతీ ప్రద్యుమ్నము – ప్రతీకాత్మక ప్రవృత్తి

ఆంధ్ర సాహిత్యంలో ప్రబంధ ప్రక్రియకు ప్రత్యేక గౌరవం ఉంది. ప్రబంధ లక్షణ విచారం తెలుగు విమర్శకులు నూరు సంవత్సరాలుగా సాగిస్తూనే ఉన్నారు. అష్టాదశ వర్ణనలకు ప్రాముఖ్యం, శృంగారరస పోషణం, వస్త్వైక్యం, ఆలంకారిక శైలి, రూపకలక్షణ సంవాదం మొదలైనవి ప్రబంధాలకు సాధారణ లక్షణాలుగా భావింపబడుతూ ఉన్నాయి. కాని, ప్రబంధ వస్తువులో ప్రతీకాత్మక ప్రవృత్తి తప్పకుండా పోషింపబడాలనీ, కవితా శైలిలో అలంకారప్రస్థానానికి సంబంధించిన ఒక ప్రత్యేకత కవి ప్రయోగంలో విశిష్టంగా గోచరించాలనీ, ఈ రెండు లక్షణాలూ ప్రకృష్టంగా పరిపోషింపబడిన కావ్యమే ప్రబంధమని పిలువదగిందనీ, ప్రబంధ సాధారణ లక్షణాలు ఉన్నంతమాత్రాన అది ప్రబంధం కాజాలదనీ, కావ్య ప్రయోగమే అవుతుందనీ నే నిదివరలో ప్రతిపాదించి వివరించటం జరిగింది. (చూడు. వ్యా. విజయవిలాస వస్తుతత్వం - వివేచన. డిసెంబరు, 1976) ప్రబంధ విమర్శలో ఈ వివేచన సూత్రం ప్రామాణికంగా గ్రహించినప్పుడే ప్రబంధ ప్రక్రియానుశీలనానికి ఒక ప్రత్యేక ప్రతిపత్తి ఉంటుంది. ఈ దృక్పథంలో పింగళి సూరన రచించిన ప్రభావతీ ప్రద్యుమ్నం లోని ప్రతీకాత్మక ప్రవృత్తిని గురించి సమాలోచించి, దాని ప్రబంధప్రయోగ శీలాన్ని ధ్రువపరచటం ఈ వ్యాస తాత్పర్యం.

ప్రయోగశీలురైన ప్రబంధ కవులలో పింగళి సూరనకు ప్రత్యేక స్థానం ఉన్నదని విమర్శకులందరూ గుర్తించిన అంశమే. దానికి కారణం, అతడు చేపట్టిన ప్రతి రచనలో ఒక ప్రత్యేక ప్రయోగదృష్టి కొట్టవచ్చినట్లు కనపడటం. అతని రచనలలో దాదాపు చివరిది ప్రభావతీ ప్రద్యుమ్నం. కొందరి దృష్టిలో ఇది కళాపూర్ణోదయం కంటే గొప్ప ప్రబంధం. ఈ ప్రబంధ రచనలో సూరన పరిపక్వత గోచరిస్తుందని కొందరి తీర్పు. నాటకీయ లక్షణాలు ఇందులో ఆద్యంతం రమణీయంగా పాటింపబడి వున్నాయని మరికొందరి ప్రశంస.

పాత్ర చిత్రణం, పోషణం పరాకాష్ఠ నందుకొన్నాయనీ, అందులోనూ శుచి ముఖి పాత్ర అపూర్వమనీ, అందులో కవి యొక్క ఆత్మీయత ప్రతిఫలిస్తుం దనీ దాదాపు విమర్శకు లందరూ వేనోళ్ళ కీర్తించారు. అయితే, పింగళి సూరన సాహితీ దృక్పథాన్నీ, వ్యక్తిత్వాన్నీ మనం ఈ ప్రబంధం ద్వారా వివేచించా లంటే, ఆ ప్రబంధంలోని ప్రతీకాత్మక ప్రవృత్తిని పరిశీలించవలసి వస్తుంది.

పింగళి సూరన సమకాలీన సాహితీ జగత్తులో ఒక విధంగా వివాదాస్పద మైన వ్యక్తిగా కనపడతాడు. కళాపూర్ణోదయంలో కల్పిత వస్తువును చేపట్టి, రామరాజభూషణాదుల కన్నెర్రకు గురి యైనాడు. 'కేవల కల్పనాకథలు కృత్రిమ రత్నము'లనే భావం ప్రబంధయుగంలో ఉన్న కవులందరికీ ఉన్నట్లు వారి వారి రచనల వలన స్పష్టమౌతూనే ఉంది. అందువలన కళాపూర్ణోదయం ప్రబంధయుగకవుల గౌరవాన్ని అంతగా పొందలేక పోయింది. అయితే, సూరన రచించిన ద్వ్యర్థికావ్యప్రక్రియ తరువాతి కవులకు శిరోధార్యమై నిలిచింది. కల్పితకావ్యప్రక్రియపై వచ్చిన సమకాలీన ప్రతిఘటనకు ప్రత్యా మ్నాయంగా ప్రభావతీ ప్రద్యుమ్నాన్ని రచించాడనీ, ప్రబంధ యుగ వాతావర ణాని కనువుగా మిశ్రేతివృత్తాన్ని నిర్వహించాడనీ, యుగ ప్రవృత్తితో అతడు సంధి కుదుర్చుకొన్నాడనీ పలువురు భావించటం జరిగింది. ఇందులో సత్యం లేకపోలేదు. అయితే, అది అతని బలహీనతగా మనం భావించలేము. ప్రయోగ శీలయైన కవి దృక్పథంలో పరిణామం గోచరించటం ఉత్తమ లక్షణమే కాని, పతన చిహ్నం కాదు.

పింగళి సూరన రచనలను కాలక్రమంగా పరిశీలిస్తే ఒక సత్యం గోచరిస్తుంది. అతడు మొదట కవిత్వానికి పాండిత్యం ప్రమాణంగా భావించినవాడు. ఆ దృక్పథంతో పాండిత్యైక ప్రధానమైన ద్వ్యర్థికావ్య ప్రక్రియను చేపట్టి రాఘవపాండవీయాన్ని రచించాడు. "ఓహో యనం జేయదే పాండిత్యంబున అందునుం-దెలుఁగుకబ్బం బద్భుతం బంద్రు-దక్షుం దెవ్వాఁడిల రామభారత కథల్ జోడింప భాషాకృతిన్" అని అతడు చేసిన శపథం అతని పాండితీ ప్రదర్శన దృష్టిని స్పష్టం చేస్తున్నది. ఆ తరువాత అతని దృష్టి కల్పన వైపు మరలింది. కళాపూర్ణోదయం వెలసింది. ఈ రెండు ప్రయోగాలూ ప్రయోగ బలాన్ని నిరూపించటానికి అతడు పనికట్టుకొని చేశాడు. సహృదయ లోకం ఆయా ప్రయోగాలను సమాదరించిన తీరును సమీక్షించుకొన్నాడు. ప్రయోగం సాహిత్య పరమార్థాన్ని అనుశీలించటానికి అతనికి తోడ్పడింది. సూరన

దర్శించిన సాహితీ పరమార్థాన్ని వ్యంగ్యంగా లోకానికి చాటిచెప్పటానికే ప్రభావతీప్రద్యుమ్న ప్రబంధాన్ని చేపట్టాడు. ఆ ప్రబంధాన్ని కథకోసం చదివితే ఆహ్లాదకరంగా ఉంటుంది; సంశ్లిష్టత లేని కథలోని అల్లిక సహృదయులకు సమ్మోదాన్ని కలిగిస్తుంది; కథా నిర్వహణంలో అతడు పోషించిన ఉత్కంఠను గమనిస్తే అబ్బురపాటు కలుగుతుంది; పాత్రలు చేసే సంభాషణలు కథాగతికి పోషకంగా అమరటమే కాకుండా, శీలచిత్రణలో బంగారానికి తావి అబ్బినట్లుగా అనిపిస్తుంది. ఇన్ని హంగులు కలిగిన ప్రబంధం శిల్పదృష్టితో అపూర్వంగా కనబడుతున్నా, ఆ కథ వెనుక కవి లోకానికి చెప్పదలచుకొన్న ఏదో సందేశం, అతడు అభివ్యక్తం చేయదలచుకొన్న ఏదో సాహితీ దర్శనం ఉన్నదనీ, దాన్ని సహృదయులు అన్వేషించాలనీ అతని ప్రతిభ మనలను ప్రేరేపిస్తూ ఉంటుంది. అదే ప్రబంధకథలో అతడు నిక్షిప్తం చేసిన ప్రతీకాత్మక ప్రవృత్తి.

## 2

పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్న ప్రబంధ కథ నాశ్రయించి ప్రతీకాత్మకంగా కావ్యానందాన్ని గురించిన తన సాహితీ దృక్పథాన్ని ప్రతిపాదింప దలచినట్లుగా పరిశీలకులకు స్పష్టమౌతుంది. కావ్యానందాన్ని అనుభవించేవాడు. అంటే రసభోక్త, సహృదయుడు. ఆనందం కర్కశ పాండిత్యం గల బుద్ధికి సాధ్యం కాదు. వ్యుత్పత్తి ఉన్నంత మాత్రాన సహృదయుడు కావ్యానందాన్ని పొందలేడు. అష్టవిధ రసాలకు సంబంధించిన స్థాయిభావాలు సంస్కార రూపంగా సహృదయునిలో ఉంటాయి. అవి కళాయోగంద్వారా సాత్త్విక ప్రవృత్తిని భజించి ఆత్మానంద సంవలితాలై అనుభవస్థితికి వస్తాయి. రసానంద స్థితియే సహృదయునిలోని ఆత్మచిత్కళా స్వరూపాభివ్యక్తి. అదియే 'రసోవై సః' అన్న ఉపనిషద్రహస్యం. రసభావాలు సాక్షాత్ రసోపస్కారాలు కావటానికి తోడ్పడేవి వృత్తులు. వృత్తులు అభినయ స్ఫూర్తితో నాట్యకళ నాశ్రయించి పాత్రల మనోవాక్కాయ కర్మలద్వారా వ్యక్తమౌతూ ఉంటాయి. రచనలోని రసాన్ని సహృదయుడు భావనాశక్తి ద్వారా, ఆస్వాదన శక్తిద్వారా ఒకవిధంగా ఆ రెండు శక్తుల కలయికద్వారా సాధింపగలుగుతాడు. ఆ కలయికను రచనలో విచిత్రంగా సంవిధానచాతుర్యంద్వారా నిర్వహించేది ప్రతిభాశక్తి. దానికి తోడ్పడేవి రచనలో ప్రీతిని పోషించే భావశబలత, మాటలపొందిక. శ్రవ్య కావ్యాలలో ఆస్వాదనశక్తికి అందగా నిలిచేవి రచనలోని శయ్యారీతులు, వాటి

వలన సహృదయలోకానికి కలిగే చమత్కారగుణవిస్ఫూర్తి. కావ్యానందం తాత్పర్యతః భావన, ఆస్వాదన శక్తుల సంయోగ ఫలం; అది చతుర్విధపురుషార్థఫలాన్ని కూడా అందిస్తుంది. కావ్యానందానుభవాన్ని గురించి పింగళిసూరన ప్రభావతీ ప్రద్యుమ్నంలో వ్యక్తం చేయదలచుకొన్న సాహిత్యదృక్పథాన్ని స్థూలంగా ఇలా వివేచించవచ్చు. ఈ దృక్పథాన్ని వ్యక్తీకరించటానికి అనువుగా ఈ ప్రబంధంలోని పాత్రలను, కథను ఆయన ఎన్నుకొన్నట్లు నిర్వహించినట్లు, స్పష్టమౌతుంది. ఆ వివరాలను గురించి విచారించే ముందు ఆ ప్రబంధంలోని పాత్రలు ఏయే ప్రతీకాత్మక ప్రవృత్తులకు ప్రతినిధులుగా నిబంధింపబడినవో గమనించటం ముఖ్యం.

1. వజ్రనాభుడు - శుష్క పాండిత్యంగల పండిత ప్రవృత్తి.
2. సునాభుడు - వ్యుత్పత్తి.
3. స్వర్గం - కళాసామ్రాజ్యం లేదా కావ్యజగత్తు.
4. ఇంద్రుడు - సహృదయుడు.
5. కశ్యప ప్రజాపతి - కాలము.
6. బృహస్పతి -యోగము.
7. కృష్ణుడు - రసరాట్, దైవీశక్తి, ఆత్మశక్తి, 'రసోవైసః'.
8. అష్టమహిమలు - అష్టవిధరసములు.
9. భద్రుడు - నాట్యకళ - లేదా . వృత్తులు.
10. శుచిముఖి - ప్రతిభ లేదా వివేకము.
11. చిలుక - మాటల పొందిక.
12. ప్రభావతి - భావనాశక్తి.
13. రాగవల్లరి - ప్రీతి.
14. ప్రద్యుమ్నుడు - ఆస్వాదనశక్తి.
15. గదుడు - శయ్య.
16. సాంబుడు - రీతి.
17. చంద్రవతి - అహ్లాదము.
18. గుణవతి - గుణములవలనకలిగే చమత్కారము.
19. ప్రద్యుమ్నాదుల పుత్రులు - కళానందము - చతుర్విద పురుషార్థ ఫలం. (ప్రభావంతుడు, చంద్రప్రభుడు, గుణవంతుడు, కీర్తిమంతుడు.)

## 3

ప్రభావతీప్రద్యుమ్నంలో ప్రధానకార్యం వజ్రనాభునిబారినుండి స్వర్గాన్ని కాపాడి ఇంద్రుడు నిరపాయంగా దానిని భోగించేటట్లు చేయటం. అది ప్రభావతీ ప్రద్యుమ్నులకు కలిగే పుత్రుడు వజ్రనాభ నగరానికి రాజు కావటం వలన సాధ్యం. ఆ పని జరగాలంటే ప్రభావతీ ప్రద్యుమ్నులకు వివాహం కావాలి. అది ప్రధాన కార్యానికి తోడ్పడే పతాక కార్యం. కాబట్టి పతాక - కార్య నిర్వహణంలో ప్రధాన్యం వహిస్తుంది. ఈ పతాక కార్యనిర్వహణభారం శుచిముఖి వహిస్తుంది. అంటే కార్యనిర్వహణానికి తోడ్పడే సంవిధాన చాతుర్యమంతా శుచిముఖి ప్రతిభా సామర్థ్యంమీద ఆధారపడి ఉన్నదన్నమాట. శుచిముఖి యత్నానికి శ్రీకృష్ణుడు దర్శకుడు, ప్రద్యుమ్నాదులు ప్రయోక్తలు, ప్రభావ త్యాదులు అనుప్రయోక్తలు. వజ్రనాభాదులవధ పతాకకార్యఫలం; స్వర్గరాజ్య సంరక్షణం పరమఫలం. ప్రభావతీ ప్రద్యుమ్న ప్రబంధ కథా స్వభావం ఇది.

ఈ కథాస్వభావం పింగళి సూరన వ్యక్తీకరింపదలచుకొన్న సహృదయ రసానుభవ వివేచనానికి అనుకూలంగా ఉండటం విశేషం. మూలకథకంటే సూరన చేసిన నూత్నకల్పనలన్నీ అతని సాహితీ దృక్పథాన్ని పోషించేవే. ప్రభావతీ ప్రద్యుమ్న వృత్తాంతాన్ని సూరన హరివంశాదులనుండి గ్రహించి నట్లు, 12వ శతాబ్దిలో నున్న తిరువనంతపుర పాలకుడు రవివర్మ భూపాలుడు రచించిన 'ప్రద్యుమ్నాభ్యుదయ' నాటకం కూడా సూరనకు కొంత ప్రేరణ నిచ్చినట్లు విమర్శకులు భావించటం జరిగింది. హరివంశంలో కాని, మరే పురా ణంలో కాని వర్ణింపబడిన కథల్లో ప్రతీకాత్మక ప్రవృత్తి ఉండటం సహజం. ప్రబంధకవి అటువంటి కథలను ప్రబంధ వస్తువుగా గ్రహించినప్పుడు పురాణ ప్రతీకాత్మక ప్రవృత్తిని పరిరక్షించి ప్రపంచించటమో లేదా దానిని స్వీయ సాహిత్య దర్శనానికి అనుగుణంగా మలిచి పునర్నిర్మించటమో చేస్తాడు. అంటే ప్రబంధకవి పురాణకవివలెనే ప్రతీకాత్మక కథా నిర్మాణదక్షుడై ఉండాలన్న మాట. అల్లసాని పెద్దన స్వారోచిషమను సంభవ ప్రబంధంలో పురాణకథా ప్రవృత్తినే విస్తరించి ప్రబంధకథలో ప్రపంచించాడు. అయితే, సూరన పురాణ కథలోనున్న ప్రతీకాత్మకప్రవృత్తిని తన కనుగుణంగా మార్చి వినిర్మించాడు. సూరన ఈ ప్రక్రియలో కూడా ప్రతిభావంతు డనిపించుకొన్నాడు.

మూలకథ ననుసరించి ఈ కథలో పాత్రల ప్రతీకాత్మక ప్రవృత్తులను ఈ క్రింది విధంగా భావించవచ్చు:

శ్రీకృష్ణుడు - పరతత్త్వం

అష్టమహిషులు - అష్టసిద్ధులు

వజ్రనాభుడు - అహంకారం

సునాభుడు - దర్పం

ఇంద్రుడు - కృష్ణాశ్రితుడైన భక్తుడు, అయినా భోగి

కశ్యప ప్రజాపతి - కర్మనిరతి

ప్రద్యుమ్నుడు-ధర్మం, గదుడు-అర్థం, సాంబుడు-కామం - దైవాయత్తమైన గార్హస్థ్యధర్మంలోని పురుషార్థప్రవృత్తులు.

శుచిముఖి - జ్ఞానమార్గం లేదా వివేకం

ప్రభావతి - అనుభవజ్ఞానం

చంద్రావతి-భక్తి, గుణపతి-శ్రద్ధ - నారద సేవలో ఇవి సాఫల్యాన్ని చెందుతాయి.

భద్రుడు - మాయ

జయంతుడు - త్యాగానికి సిద్ధమైన భోగం. నలుగురు పుత్రులు - చతుర్విధ పురుషార్థ జ్ఞానం. అవతారపురుషుడైన శ్రీకృష్ణపరమాత్మ గార్హస్థ్య ధర్మసాధనంలో నిర్వహింపబడే కర్మలద్వారా దంపతులు అహంకారాన్ని జయించి తత్ఫలాన్ని దైవార్పణబుద్ధితో సమర్పించి స్వర్గభోగస్థితిని పొందే మార్గాన్ని ప్రద్యుమ్నాదులద్వారా సాధింపజేసి నిరూపించటం హరివంశకథా తాత్పర్యం. పురాణ కథలో ధార్మికమైన ప్రబోధం ప్రతీకాత్మకంగా ప్రపంచింపబడింది. ప్రబంధ కథలో కావ్యానందానికి సంబంధించిన కళాసూత్రం నిబంధింపబడింది. ఈ మార్పు ప్రభావతీ ప్రద్యుమ్నానికి ప్రబంధ గౌరవాన్ని కల్పించింది.

ప్రబంధకథలో వజ్రనాభుడు శాస్త్రపాండిత్యాన్ని గౌరవించే ప్రవృత్తి కలవాడు. ప్రభావతి శుచిముఖిని తండ్రి వద్దకు పంపుతూ "నీదు విద్యావిలసనంబు విన్నవించిన నయ్య వినవలయునని వేడుకపడుచున్నవాఁడు. శాస్త్రప్రసంగంబు సేయుము" - (4.59) అని ప్రత్యేకంగా చెప్పటం గమనింపదగింది. శుచిముఖి వజ్రనాభుని యెదుట మాట్లాడేటప్పుడు సుస్వరఫణితిని, పునః పద ప్రయోగంలేని సూత్రఫణితిని అనుసరించి శాస్త్ర మర్యాదను పాటించింది.

శుచిముఖి ఇంద్రుని యెదుట మాట్లాడిన తీరు వేరు. వజ్రనాభుని యెదుట పలికిన విధం వేరు. ఇంద్రు డామె మాటలు విని "ఓవరటామణీ! విహంగ యోషవె? భాషా ప్రావీణ్యము చూడఁగ వాగ్దేవతవో! కాక యాకె దిద్దిన కవివో?" అని ప్రశంసించాడు. అందే అతని యెదుట ఆమె ఒక కవయిత్రిగా ప్రశంస అందు కొనేటట్లు మాట్లాడింది. నిజానికి ఆమె ప్రవృత్తి కవిప్రవృత్తియే. కాని, వజ్ర నాభుడు కవితా కళారసికుడు కాడు; పాండిత్య గౌరవాన్ని ప్రశంసించే శాస్త్ర వేత్త. అతడు 'ఓహో' అనేటట్లు శుచిముఖి శాస్త్రవిద్యను ప్రదర్శించింది.

శా. "కాణాదంబును. గౌతమీయమును, సాంఖ్యంబున్ భుజంగాగ్రణీ
వాణీ మార్గము జైమినీయ మతమున్ ,వ్యాసోక్త శాస్త్రంబుఁవ
క్కాణించెన్ - గడు పూర్వపక్షములు జోకన్ బెంచుచున్, బెంచి య
క్షీణప్రౌఢిఁ దిరస్కరింపుచుఁ - దుదిన్ సిద్ధాంతముల్ నిల్పుచున్."

మ. "స్వమతి ప్రౌఢి దృఢానుమానముల సంస్థాపించు - నే వేళ నె
ద్ది మతం బప్పుడు వాని వానికి నుపాధిగ్రస్తతావ్యాప్తిఖం
గ ముఖానేక సుమాషణంబుల వెసం గల్పించుఁ దా నన్య శా
స్త్ర మతస్థాపనవేళ నవ్విహగి దైత్యశ్రేష్ఠుఁ డోహో యనన్." (4.61, 62)

ఆ మీదట శుచిముఖి కావ్యనాటకాలంకార గాన మదనశాస్త్ర పరిచయమహిమను కూడా ప్రదర్శించింది. దానవపతి మెచ్చి 'పురే' అనేటట్లు చేసింది. వజ్ర నాభుడు శుచిముఖి శాస్త్రవాద కౌశల్యాన్నీ, సిద్ధాంత ప్రతిపాదననూ, లక్షణ జ్ఞాన విశేషాన్నీ మెచ్చుకుంటే, ఇంద్రుడు ఆమె రచనా కౌశల్యాన్నీ, కవితా ప్రతిభనూ ప్రశంసించాడు. ప్రసిద్ధమైన ఈ క్రింది సీసపద్యం సాహితీ జగత్తుకు సుపరిచితం.

సీ. "శబ్ద సంస్కార మెచ్చటను జాఱఁగ నీక
పదమైత్రి యర్థసంపదలఁ బొదలఁ
దలపెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ,
బునరుక్తి దోషంబు పొంతఁ బోక,
యాకాంక్షిత స్ఫూర్తి యాచరించుచును- శా
ఖా చంక్రమ క్రియఁ గడవఁ జనక
ప్రకృతార్థ భావంబు పాదుకో నడుకుచు
నుపపత్తి యెందు నత్యూర్జితముగ

గీ నొకటఁ బూర్వోత్తర విరోధ మొదవకుండఁ
దత్త దవయవ వాక్య తాత్పర్యం జేవ
ములు మహావాక్య తాత్పర్యములకు నొకరఁ
బలుక నేర్చుట బహుతపః ఫలముగాదె (2 3)

ఈ వివేచనం వల్ల ఒక్క విషయం స్పష్టమౌతుంది పండితకవి శాస్త్ర పాండిత్యాన్ని కావ్య కళాప్రతిభనూ కలిగి ఉంటాడు అయితే శాస్త్ర ప్రవృత్తి సృజనాత్మకమైన కావ్యకళగా కాలువాలినప్పుడే కవి అనిపించు కొంటాడు ఉదాహరణకు శ్రీనాధ మహాకవిని తీసుకొందాం ఆయన శాస్త్ర పాండిత్యంలో దిట్ట గౌడడిండిమ భట్టారకుని తర్కంలో ఓడించి విజయాన్ని సాధించినవాడు పైపెచ్చు కొండవీటి రెడ్ల ఆస్థానంలో విద్యాధికారి అయినా అతడు తన కావ్యకళాసృష్టి వలననే కవిసార్వభౌము డనిపించుకొన్నారు సూరన కాలంలో బహుశః అంతకు పూర్వపు యుగాల్లో కూడవచ్చుల్లుగానే శాస్త్ర పాండిత్యాన్ని మాత్రమే మెచ్చుకొని కవితా ప్రతిభకు తగినంత గౌరవమివ్వని రాజులూ పండితులూ ఉండె ఉంటారు అందరూ శ్రీకృష్ణదేవరాయల వంటి కవితా శ్రీలోలులు కాకపోవచ్చును శాస్త్రదృష్టులకు రస దృష్టి తక్కువ శాస్త్ర వ్యుత్పత్తి కంటె కవితా సౌందర్యమే సహృదయ హృదయైకవేద్యం రసదృష్టిలేని శాస్త్ర ప్రవృత్తికీ కావ్యానంద కళాదృష్టికీ సహజంగా సాహితీ లోకంలో ఉండే సంఘర్షణను ప్రధాన సమస్యగా తీసికొని సూరన ఒకవైపు వజ్రనాభుణ్ణి మరొకవైపు ఇంద్రుణ్ణి ప్రబంధంలొ ప్రతీకలుగా నిలిపాడు వీరిరు వురికీ నడుమనున్న స్పర్ధను ఆలంబనంగా చేసికొని కథా నిర్మాణాన్ని భావిం చాడు దేవతలూ రాక్షసులూ ఇద్దరూ ఒక తండ్రి బిడ్డలే అయితే ఒక్కొక కాలంలో ఒక్కొకరు బలవంతులౌతారు వజ్రనాభుడు స్వర్గంమీద దాడిచేసి ఇంద్ర సింహాసనాన్ని ఆక్రమించాడు అంటే సాహితీరంగంలో సహృదయ కళానందం కంటె శాస్త్ర పాండిత్యం రాజ్యం చెయటానికి పూనుకొన్న దన్న మాట అది కావ్య జగత్తులో ఏర్పడిన ఒక విపత్తుగా సూరన చిత్రించాడు బృహస్పతి కలుగజేసికొంటాడు ఇరువురి మధ్య సౌమనస్యం కుదర్చటానికి యత్నించాడు తీర్పు కాలస్వరూపుడైన కశ్యప ప్రజాపతికి వదలివేశాడు ఆయన మొదట వారిరువురూసీ వారివారి స్థానాల్లో కొంతకాలం ఉండండని శాసిం చాడు సృజన శక్తి బలహీనమై శాస్త్రపాండితి కళాసామ్రాజ్యంపై దాడి

చేస్తున్నప్పుడు సంఘర్షణ పడటంకంటే రసజ్ఞులు ఏది ఉత్తమమో నిర్ణయించే వరకు వేచియుండటం సముచితమని సూరన తీర్పు సహృదయులకు కళానందం కావాలి కాని కళానందాన్ని కలిగించే రచనా సామర్థ్యం కవిలోకంలో పునరుజ్జీవింపచేసేవరకూ సాహిత్య రంగంలో అస్తవ్యస్తమైన పరిస్థితులు తప్పవు. ఆ సంఘర్షణలోనుండి ఆ వేదనలోనుండి కాలమే ఒక మహాకవిని సృష్టిస్తుంది. ఆతడు ఉభయ రంగాల్లో ఉద్దండుడై కళాశక్తికి కావ్యరక్తికి పట్టం కట్టే కృషి సాగిస్తాడు కవియే సహృదయులకు అనుభవప్రదాత ఇంద్రుడు శుచిముఖి నాశ్రయించటంలో గల రహస్యం అదే యుగ సంఘర్షణలోనుండి పుట్టిన పండితకవి వంటిది శుచిముఖి ఆమె ప్రతిభకు ప్రతీక ప్రతిభ భావనాశక్తిని బలపరుస్తుంది ఆస్వాదనశక్తిని ఉద్దీప్తం చెస్తుంది ఆ రెండింటిని సంవదిస్తుంది సమాజం కావ్యానందం పొందేటట్లు సంఘటిస్తుంది ప్రభావతీ ప్రద్యుమ్నుల ప్రణయం ఫలించటానికి శుచిముఖి కారణం శాస్త్రపాండితికంటె రసానుభవం వేయి రెట్లు గొప్పదని నిరూపించటమే ప్రతిభ వివేకంతో సాధించె కళారంగ విజయం

వజ్రనాభ మరణం దైవనిర్ణయ మని ఇంద్రునిముందు ప్రకటించింది శుచిముఖి అదే కాలనిర్ణయం కూడా ఒకవిధంగా ఒక మహాకవి చేసిన భవిష్యద్దర్శన మది శుచిముఖిలో సూరన ఉన్నాడు ఆ దర్శనం ఆయనదే కళానంద పునరుజ్జీవనం సూరన సమకాలీన సాహిత్యోద్యమం అది ఆయనలో ప్రభావతీ ప్రద్యుమ్న ప్రబంధ కాలానికి పరిపక్వ దశకు వచ్చిందని చెప్పాలి అలంకార ప్రస్థానంలో అభినవ ప్రయోగాలను కవులు చేస్తున్న ప్రబంధ యుగంలో రస వాదానికి సూరన వేయదలచుకొన్న పెద్దపీట ఈ ప్రబంధ సందేశం

## 4

ఈ తాత్పర్యాన్ని దృష్టిలో ఉంచుకొంటే ప్రబంధ కథార్థాలను దాని కనుగుణంగా సమన్వయించటం సులభమౌతుంది ప్రతిభావ్యుత్పత్త్యోః ప్రతిభా శ్రేయసీ అన్న ఆనందవర్ధన మతాన్ని రాజశేఖరుడు పేర్కొన్నాడు శుచిముఖిలో ప్రతిభా వ్యుత్పత్తులు రెండూ ఉన్నా వాటిలో ప్రతిభయే గరీయసిగా భాసిస్తుంది కావ్యంతు జాయతే జాతు కస్యచి త్ప్రతిభామతః అన్న భామహుని వివేచనం వలన ప్రతిభావంతునివల్లనే ఎప్పుడో ఒకప్పుడు ఒక మహా

కావ్యం వెలువడుతుంది ప్రతిభను భామహుడు ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభామతా అని అభినవగుప్తుడు ప్రజ్ఞా అపూర్వ వస్తునిర్మాణక్షమా అని నిర్వచించారు నవనవోన్మేషశాలియైన ప్రజ్ఞ రచనలో భావనాశక్తిని పరిమళింప చేస్తుంది అపూర్వ వస్తునిర్మాణక్షమమైన ప్రజ్ఞ కథా సంవిధాన శిల్ప సౌంద ర్యాన్ని వినిర్మిస్తుంది శుచిముఖి ప్రతిభాస్థానంలో ఉండటంచేత కవితలోని భావనాశక్తిని కథలోని సంవిధాన శిల్పాన్ని కమనీయంగా మేళవింప గలుగు తుంది ఈ మేళవింపులో సృష్టింపబడేది అపూర్వ సౌందర్యం ఆ సౌందర్యానికి ప్రమాణం ఆస్వాదన స్వాదుత్వం ఒకవిధంగా ఆస్వాదన స్వాదుత్వ అభి వ్యక్తియే సౌందర్యం సౌందర్యం దృశ్యమానం కావచ్చు భావనా రమణీయం కావచ్చు రూప సౌందర్యం సాక్షాద్రసోపస్కారకం భావ సౌందర్యం రామ ణీయక భావనా మధురం కవి ప్రతిభ సహృదయ కళానందాన్ని లక్ష్యంగా పెట్టుకొని కావ్య నిర్మాణానికి పూనుకొంటుంది - ఇంద్రుని హితవుకోసం శుచిముఖి కార్యభారాన్ని చేపట్టినట్లు ప్రతిభ నైసర్గికమనీ దైవప్రసాదజనిత మని రెండు విధాలుగా లాక్షణికులు నిర్దేశించారు అయితే అందులో నైసర్గిక ప్రతిభ దైవప్రసాద బలాన్ని సాధించినట్లయితే కలకాలం నిలువగల గొప్ప రచనను కవి చేయగలడని భారతీయుల విశ్వాసం భావసిద్ధికి నైసర్గిక ప్రతిభ రససిద్ధికి దైవప్రసాదజనితమైన ప్రతిభాశక్తి హేతువులు కాగలవు రససిద్ధిలో ఆత్మానంద సంవలితమైన చిత్కళయే దైవశక్తి అని గ్రహించాలి దానిని సాధించే కవి ప్రతిభాప్రవృత్తిని సూరన శుచిముఖి శ్రీకృష్ణుని దర్శించి ఆయన దర్శకత్వాన్ని గ్రహించటంలో నిక్షేపించాడు శ్రీకృష్ణుడు లేదా విష్ణువు శృంగార రసాధిదేవత - అష్టమహిషులు ఆ రసాన్ని పోషించే అంగరసాలు. ప్రబంధంలో శృంగార రససిద్ధిని సాధించే కవి ప్రతిభ శుచిముఖి

ప్రభావతి పాత్ర విచిత్రమైనది ఆమె తల్లి పార్వతి భక్తురాలు తల్లి గుణం కూతురుకు కూడ వచ్చింది ఆమెకు స్వప్నంలో గౌరీదేవి ప్రత్యక్షమై ప్రద్యుమ్న కుమారుని చిత్రపటం చూపి అతడామెకు తగిన భర్తగా నిర్దేశించి ఆ పటాన్ని ప్రత్యక్షంగా ఇలలో నిలిచేటట్లు ప్రసాదిస్తుంది ఈ చిత్రపట వృత్తాంతం సూరన చేసిన అమూల్య కల్పనలలో ఒకటి ఆ చిత్రం చిత్రకళా ప్రయోజనం సాధించటంలో పరాకాష్ఠ

కలకల నవ్వినట్లు తెలిగన్నుల నిక్కము చూచినట్లు, తోఁ
బలుకఁ గడంగినట్లు కడు భావగభీరత లబ్బినట్లు, పెం
పొలయఁ దనర్చి జీవకళ యుట్టిపడన్ శివ వ్రాసినట్టి యా
చెలువున కాభిముఖ్యము భజింప తలంకెను దాను బోటియున్. (1-138)

ప్రభావతికి తండ్రి పోలిక వచ్చినట్లయితే శాస్త్ర విదుషీమణి అయ్యేది. ఆమెకు తల్లి మీది భక్తితో పాటు భావనాశక్తి కూడా దైవబలంవలన అలవడింది. వర్ణ చిత్రాన్ని చూచి సజీవమూర్తిగా భావించి ప్రత్యక్షీకరించుకొనే మానసిక శక్తియే భావనాశక్తి - కవిత విన్నప్పుడు తద్భావాన్ని గాని వర్ణ్యవస్తువును గాని లోనారసి కన్నులకు ప్రత్యక్షమైనట్లుగా చేసికోగలశక్తి సహృదయరసానంద సిద్ధికి మూలశక్తి దానిని నాయికయైన ప్రభావతిలో స్థాపించటం సూరన ప్రతిభ. భావనా శక్తికి ప్రీతి పోషకం ప్రీతియే శబ్దశక్తినుండి రూపసిద్ధిని ప్రసాదింప చేస్తుంది ఈ గుణాన్ని రాగవల్లపైలో పూయించాడు సూరన.

ఒకవిధంగా భావనాశక్తి స్త్రైణమైన గుణం. ఆస్వాదనశక్తి పౌరుషమైన గుణం నాయికా సౌందర్యాస్వాదనం నాయక నిష్ఠం ప్రద్యుమ్నుడు ఆలోచనా మృతాన్ని ఆస్వాదింపగల ప్రజ్ఞావంతుడు అశ్వక్రీడ చేయగల అతని సామర్థ్యం కావ్యగత సర్వార్థ చర్వణ పాటవాన్ని వ్యక్తం చేస్తుంది శుచిముఖి వర్ణించిన ప్రభావతీ రూప సౌందర్యాన్ని భావించి తద్రూప వైభవాన్ని ఊహించి లోకోత్తర సౌందర్య దర్శనం చేసి దానిని అనుభవైక వేద్యమైన ఆనందంగా మలచుకోగలిగే సహృదయ ఆస్వాదన శక్తి కతడు ప్రతీక. అతని ప్రేమ లేఖ అనుభవాభివ్యక్తికి అక్షరోదాహరణం భావనాశక్తి గౌరీ మహిమ వలన కలిగిందని ఆస్వాదన శక్తి శ్రీకృష్ణ మహిమ వలన కలిగిందని నాయికా నాయకులలో నిరూపించటం వలన ఆ రెండు శక్తులూ దైవ యోగం వలన సిద్ధించేవనీ సహృదయ సాత్త్విక ప్రవృత్తులనీ ఆ రెంటి సంయోగం వలన ప్రతిభా సామర్థ్యంతో సాధింపబడే కావ్యకళ రసానంద సిద్ధిని పొందుతుందనీ సూరన ప్రబంధ కథార్థాల వలన వ్యక్తీకరించాడు

భద్రుడు రూపక విద్యకు ప్రతీక అతనికి వటువుల శాపం తగులు తుంది ఆటవాండ్రని నమ్మి యనుమతింపగ నెట్టి పురమైన నశ్రమంబునను జొచ్చి పగలెల్ల నాటల భ్రమయించుచును సందు గొందులెల్ల నెఱింగికొనుచు, రేయి కన్నగాండ్రగుచు నగళ్ళు ప్రవేశించి యందు నెంతటివార లడ్డమైన,

జక్కడఁచుచుఁ, బేనుగ్రుక్కిన పాటిగా నిష్టమైన యర్థ మెల్లఁబడసి బ్రతుకుచునికి మీ స్వభావ మింతయును దప్పదు యథార్థ"మని వటువుల శాపం. ఈ శాపం భద్రాదుల కెలా వర్తించిందో కథలో ప్రసక్తం కాదు కాని, భద్రనటరూపులైన ప్రద్యుమ్నాదులకు మాత్రం అక్షరాలా వర్తిస్తుంది. నటులకు శాపం ఉందని లోక ప్రసిద్ధి కాని, ఆ శాపం ఈ శాపం కాదు. ఇది సూరన ప్రబంధకథార్థాల కనుగుణంగా కల్పించుకొన్న శాపం. ప్రబంధంలో రూపక లక్షణాలు ప్రవర్తిల్లటం వలన అనుభవ శక్తికి కలిగే గుణాల నిందులో ప్రచ్ఛన్నంగా సూరన పేర్కొన్నాడు. శాస్త్ర హృదయాన్ని సైతం రంజింపచేసేది రూపకం. 'నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనం' అని కాళిదాసోక్తి. వజ్రనాభుణ్ణి వంచించటానికీ, ప్రభావతీ ప్రణయాన్ని పొందటానికీ, కవి హృదయమనే సొరంగంద్వారా ప్రవేశించి భావనాశక్తితోకూడి అనుభవ రసికతను సాధించ టానికి తోడ్పడేది కావ్యంలోని రూపక మర్యాద. అనుభవ శక్తిని రచనలో పెంచేవి శయ్యారీతులవలన కలిగే చమత్కారగుణ సంయోజన శిల్పాలు. గద సాంబులు చంద్రవతీ గుణవతులను సొరంగంలోగుండా వెళ్ళి కలుసుకోగలగ టంలో గల రహస్యం ఇదే. అనుభవం వ్యక్తినిష్ఠ మని ఈ మూడు జంటలూ తమ ప్రవృత్తులవలన వ్యక్తం చేస్తున్నాయి. రీతులూ గుణాలూ పలుకుల పొందికవలన ఏర్పడేవి. అందువల్లనే గద సాంబులకు చిలుక రాయబారం కావలసి వచ్చింది. ఆస్వాదనశక్తికి ప్రతిభ అండగా నిలిచింది. ప్రద్యుమ్నునికి శుచిముఖి రాయబారం కామితార్థ సిద్ధిని కల్పించింది. ప్రబంధ ప్రక్రియలో నాటక మర్యాదకున్న స్థానాన్ని, దానివలన కలిగే రసానంద స్థితిని భద్రరూప ధారులైన నాయకానునాయకుల వృత్తాంతం ద్వారా సూరన ప్రతిభావంతంగా వ్యక్తం చేశాడు.

శృంగార రసంలో సంభోగం కంటె విప్రలంభం విశేషంగా రాణిస్తుంది. విప్రలంభం లేనిదే శృంగారానికి పుష్టి లేదు. ఈ తాత్పర్యాన్ని సూరన కావ్యంలో చమత్కారంగా నిరూపించాడు. నాయికా నాయకుల నడుమ పూర్వ రాగాన్ని విశేషంగా వర్ణించటం, సంభోగాన్ని తగినంతగా నిర్వహించటం, అందులోనూ ప్రణయ కలహ ఘట్టాన్ని సృష్టించి, సంభోగ రతిని పుష్టిమంతం చేయటం సూరన సాధించిన రసపోషణ కనువైన సంవిధాన శిల్పం. సరస్వతీ చతుర్ముఖుల ప్రణయ కలహ ఘట్టాన్ని కల్పించి, సరస్వతి ననునయించటానికి

శుచిముఖిని నర్మసచివగా నిబంధించి మదన శాపాన్ని కలిగించిన మన్మథునికి మరుజన్మలో ప్రియవిరాళి కలగాలని బ్రహ్మచేత శపింప చెయటం సూరన కల్పించిన మరొక అద్భుత కల్పన ప్రద్యుమ్నుని అనుభవ రసికత రతి భావాన్ని భావించటంలో విరాళి చెందటంలో దీప్తిమంత మౌతుందని సూరన నిష్కర్ష శృంగారరస నిర్వహణంలో కవికున్న అభిప్రాయాల కివి ప్రతీకాత్మక కల్పనలు విప్రలంభం శృంగార రసపోషణమనే సిద్ధాంతం ప్రాచీనమే అయినా సూరన కళారంగంలో ప్రయోగించే విధానంగా దాన్ని ఎలా గ్రహించాడో ఈ ప్రబంధార్థాల వలన స్పష్టమౌతుంది

ప్రబంధంలోని చివరి ఘట్టం కడురమణీయం కన్యాంత:పురాలను వజ్ర నాభుడు సైన్యాలతో చుట్టుముట్టాడు ప్రద్యుమ్నుడు పరాక్రమింపక తప్పలేదు ఆత్మరక్షణం చేసికోవాలి ముందు అవసరమైతే యుద్ధం చేయాలి అందులోనూ తప్పకపోతే వజ్రనాభ వధ చేయాలి కాని వజ్రనాభుడు తనభార్యకు కన్న తండ్రి ఆమె బాధ పడుతుందేమోనని కుతకుత పడ్డాడు. ప్రియురాలికి తన వేదనను నివేదించాడు ఆమెకు కూడా తమను తాము రక్షించుకోవటానికి వేరే మార్గం తోచలేదు

తాన చని మూల నున్నయ
నూన తదీయాసిఁ దెచ్చి యొసఁగి గెలువుమీ
దానవపతిఁ దక్కిన యను
మానము మాను మని పలికె మానవతి పతిన్ (5-198)

శాస్త్ర పాండిత్య దౌర్జన్యాన్ని ఎదుర్కొంచటానికి కత్తినిచ్చింది భావనా శక్తి దానిని చేపట్టి ఉద్యమించింది ఆస్వాదన శక్తి రణరంగమనే సాహిత్యరంగంలో శాస్త్రవాదాలకు రసాస్వాదన ప్రవృత్తులకూ పోరు ఘోరమైంది సహృదయ స్థానీయుడైన ఇంద్రుడు మాతలి సారథికంబైన తన దివ్య రథంబును ప్రద్యుమ్ననకు ననిపి గద సాంబులకు ననన్య దుర్జయంబులైన దివ్యస్యంద నంబులఁ బనిచె నట ఆస్వాదన శక్తికి కావ్యరచనాకళాశక్తులకు సహృదయ మనోరథంలో స్థానం దొరికింది విజయం లభించింది ఇంద్రునికి కళా సామ్రాజ్యం సుస్థిరమైంది శ్రీకృష్ణుడు వజ్రనాభ రాజ్యాన్ని మనుమలు నలుగు రికీ చతుర్విధ పురుషార్థ ఫలాల్లాగా పంచిపెట్టాడు కావ్య ప్రయోజనాన్ని వ్యంజింప చేశాడు

ప్రణయసిద్ధికి ప్రయత్నం చేసింది ప్రతిభాస్థానీయురాలైన శుచిముఖి యుద్ధంలో ఆమె ప్రసక్తి లేదు ఫలసిద్ధిలో ఆమెకు ప్రమేయం లేదు కావ్య రచనయే ప్రతిభావంతుడైన కవిచేసే పని తత్ఫలం సహృదయంలోకానిది అదే సూరన నిర్వహణంలో సూచించిన తాత్పర్యం

## 5

అలనాడు ప్రబంధ కథలో సూరన నిబంధించిన ప్రతీకాత్మక ప్రవృత్తి సాహితీ జగత్తుకు సంబంధించిన కళానంద స్వరూప నిరూపణాత్మకం కావటం చేత సార్వకాలీన స్వభావాన్ని సంతరించుకొన్నది ఈనాడు సామాజిక సిద్ధాంత పరిజ్ఞానమే సాహిత్య జగత్తును పాలించాలని భావించే పండితులకూ వివిధ శాస్త్ర పాండిత్యమే కళలకంటె గొప్పదని భావించె విద్వాంసులకూ ప్రభావతీ ప్రద్యుమ్నం ఒక కనువిప్పు అనుభూతి కోసం అన్వేషించే ఆధునిక కవులకు ప్రతీకాత్మకంగా తమ అభిమతాన్ని కళాపంగంలో ప్రయోగించే శిల్పాన్ని వ్యంగ్య సుందరంగా ప్రబోధించే ప్రబంధం ప్రభావతీ ప్రద్యుమ్నం నేటికీ దాని విలువ నిబ్బరంగా ఉండటానికి సూరన ప్రబంధ ప్రక్రియలో పొందు పరిచిన ప్రతీకాత్మక ప్రవృత్తియే ప్రధాన కారణం *

(1984)

* ఈ వ్యాసం ఆచార్య విస్సా అప్పారావు గారి శత జయంతి సంచిక - అర్చన లో ప్రచురితం (1984) ఆచార్య విస్సా అప్పారావు శతజయంత్యుత్సవ కమిటీ హైదరాబాదు )

# విజయవిలాస వస్తుతత్త్వం

## ప్రబంధం - ప్రతీకాత్మక ప్రవృత్తి :

ఆధునికాంధ్ర సాహిత్య విమర్శలో ప్రబంధ శబ్దం ప్రత్యేకార్థంలో రూఢికెక్కింది ప్రబంధం ఒక ప్రక్రియగా ప్రసిద్ధిగాంచింది కావ్యం కంటె కొన్ని విశిష్ట లక్షణాలు ప్రబంధ ప్రక్రియలో దర్శించారు మన విమర్శకులు. అష్టాదశవర్ణనలనుండి అలంకారిక రచనదాకా లక్షణాలను కొన్నింటిని ఎన్నిక చేసి చూపించారు [1] అవి ప్రధానంగా వస్తువుకూ వర్ణనలకూ నాయికానాయకాదులకూ రసానికి రచనకూ సంబంధించినవి. వీటిని సంస్కృత మహాకావ్య లక్షణాలతో పోల్చి సమీక్షిస్తే మన కంతగా మహత్తు కనపడకపోవచ్చునుగాని తెలుగు సాహిత్యంలో వెలువడిన ఇతిహాస కావ్యానువాద ప్రక్రియల తరువాత రూపొందిన ప్రబంధాన్ని దేశీయంగా భావించి పర్యాలోచిస్తే దాని విశిష్ట వ్యక్తిత్వం విమర్శకులకు స్పష్టం కాకపోదు

నేడు విమర్శకులు చెప్పే ప్రబంధ సామాన్య లక్షణాలన్నీ ప్రబంధాలన్నిటికీ తూచా తప్పకుండా సమన్వయించేవి కావు చాలవర కాలక్షణాలు వసు చరిత్రను లక్ష్యంగా పెట్టుకొని రూపొందించినవే నిజానికి పెద్దనాదు లొక్కొక్కరూ తమతమ ప్రబంధాలలో ఒక్కొక్క నూతన ప్రయోగాన్ని (Experiment) చేశారు ప్రధానంగా వస్తువులో రసంలో రచనలో, ఆ వైవిధ్యాన్ని విమర్శకులు విడివిడిగా ఆయా ప్రబంధాలను గూర్చి వివేచించినప్పుడు విశ్లేషించి చూపిస్తున్నారు. సమష్టిగా సాధించటం సర్వత్రా సులభ మనిపించటంలేదు.

ప్రబంధ వస్తు గ్రహణంలో అల్లసాని పెద్దన చూపిన బాట విలక్షణమైనది. ఆయన పురాణ కథను ప్రబంధ వస్తువుగా గ్రహించాడు. అందులో విశేషం లేదు పురాణ కథకు సహజంగా ఉండే ప్రతీకాత్మక ప్రవృత్తిని పరిరక్షించి తన ప్రబంధంలో దాన్ని ప్రపంచించినాడు ఆదీ విశేషం ప్రబంధ కథ ప్రతీకాత్మక

---

1. ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము - శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము- ప్రబంధయుగము

ప్రవృత్తిని కలిగివుండా లన్నది పెద్దనగారి నిష్కర్ష కాని దాన్ని ప్రబంధ సామాన్యలక్షణాల జాబితాలో చేర్చలేము గాని విమర్శకులు ప్రత్యేక పరిశోధ నాంశంగా పరిగ్రహిస్తున్నారు

మనుచరిత్రలోని ప్రతీకాత్మక ప్రవృత్తి నిలా భావించవచ్చు ఆ ప్రబంధవస్తువును సహజంగా మూడుభాగాలక్రింద వింగడించవచ్చు మొదటిది- స్వరోచి పుట్టుటకు హేతువైన కథాఘట్టం రెండవది- స్వరోచి వర్తనం వర్ణింప బడిన ఘట్టం మూడవది-స్వారోచిష మనుసంభవ వృత్తాంతం మొదటి భాగానికి ఫలం స్వరోచిసృష్టి అతని వర్తనం అతని జీవసంస్కార చైతన్యరూపం అట్టి సంస్కారంతో మాతాపితరుల యొక్క తత్సృష్టికాలంలోని జ్ఞానేచ్ఛాక్రియా శక్తి చైతన్యంతో కూడుకొన్న అంతఃకరణం ప్రతిబింబించిం దనటం పూర్వ కథలోని ధ్వని సృష్టి ఇచ్ఛాధీనం అట్టి ఇచ్ఛ గంధర్వునిలో లేదు వరూధినిలో గూఢంగా ఉన్నదని కవి ధ్వనింపజేశాడు గంధర్వుడు వరూథినీ హృదయాన్ని ఆకర్షింపలేక మాయారూపంతో ఆమెను జేరి భోగించాడు ఆమెకు గంధర్వుని నిజరూపం తెలియదు మాయావియైన అతడు సత్యస్వరూప సాధనమైన ఆమె దృష్టి నవరోధించాడు మోహాంధయైన వరూథిని అట్టి అంధ్యాని కొడబడింది. వారిరువురిలో బలీయమైన భోగేచ్ఛ మాయామోహితమై తదనుగుణ క్రియా శీలాన్ని భజించిందని బోధపడగలదు అది అలా ఉండగా వరూథినియందు భోగేచ్ఛవెనుక గూఢమైన సృజనేచ్ఛ ఉంది శమదమాన్వితమైన ప్రవర తేజో మూర్తిని స్మరించే వరూథినిలో జీవప్రేరితమైన జ్ఞానశక్తి గూఢంగా భాసించింది అంటే - స్వరోచిసృష్టికి కారకులైన వరూథినీ గంధర్వులయందు ఇచ్ఛాక్రియా శక్తులు మాయామోహ సమన్వితాలై ఉండటంచేత జ్ఞానశక్తి సంగుప్తమై పోయిందని తాత్పర్యం అట్టి సంస్కార విశేషమే స్వరోచి చిత్తవృత్తియందు ప్రతిబింబించినట్లు చిత్రింపబడింది స్వరోచి భోగైకలాలసుడై మనోరమా విభావరీకళావతులతో క్రీడిస్తున్నప్పుడు రథాంగవనితా హరిణేంద్రుడూ హరిణీ రూపయైన వనదేవతా అతని జ్ఞానప్రవృత్తిని జ్ఞాపకం చేసినా అది జాగృతం కాకపోవటం తత్ఫలితమే

గంధర్వ (మాయా) విముక్తయైన వరూథిని (ఇచ్ఛ) నిజ ప్రవర రూపాన్ని (జ్ఞానాన్ని) ఉపాసిస్తూ స్వరోచికి (తేజస్సుకు) జన్మమిచ్చింది మాయాకల్పిత మైన మృగీరూపాన్ని వదలివేసి దేవతారూపం తాల్చి దైవప్రేరితయై మనుసృజి

చ్ఛాపరాధీనయైన వనదేవత స్వరోచియొక్క భోగదృష్టిని హరించినది అతడు మోహవిముక్తుడై (పరమ) హంస ప్రబోధంవల్ల స్వీయజ్ఞానశక్తిని తేజోమయం చేసికొన్నాడు స్వరోచిలోని ప్రవరతేజోదత్తమైన జ్ఞానవృత్తి మాయావిరహితమై సత్యజ్ఞానేచ్ఛాప్రధానయైన వనదేవత కల్పించిన పాంచభౌతిక శరీరంలో వసించి మనుశ్రేష్ఠునిగా స్వారోచిషుని సృజించింది [2]

ప్రవరప్రేరితమై వరూథినియందు సంకల్పమాత్రంగా భాసించి స్వరోచియందు సాధనావస్థలో ఉండి స్వారోచిషునియందు మనుతేజం పరిపక్వం పొందింది పరిపూర్ణత సాధించింది జ్ఞానదాత్వర్థం గల మను శబ్దవాచ్యుడయిన స్వారోచిషుడు సంపూర్ణ జ్ఞానరూపుడై జన్మించటం ఈ వృత్తాంత ఫలం పరిపక్వజ్ఞాన ప్రభాకరోదయ సన్నాహ సంభారమే ఈ మూడు పురుషాంతరాల పురాణకథ పరమతాత్పర్యం [3] అందులోని పాత్రలను ప్రతీకలుగా భావించినపుడు మాత్రమే ఈ తత్త్వం స్ఫురిస్తుంది ప్రబంధ పాత్రలు ఎంతటి సజీవ రసక్షేత్రాలో అంతటి ప్రతీకజ్ఞానపాత్రాలు పురాణకథలోని ఇటువంటి ప్రతీకాత్మక ప్రవృత్తిని మనుచరిత్రలో కూడా కవి ప్రపంచించాడు అది పెద్దన చూపిన మార్గం

పెద్దన మార్గాన్ని అనుసరించి వస్తువులో ప్రతీకాత్మక ప్రవృత్తిని ప్రతిష్ఠించిన ప్రబంధమే ప్రబంధ మనబడుతుంది లేకపోతే కావ్యమని పిలిస్తే చాలు ఆంధ్ర ప్రబంధాలలో ఇటువంటి ప్రవృత్తిని పరిశోధించి ప్రకటించినవా రింకా కొందరున్నారు డా జి వి కృష్ణారావుగారు కళాపూర్ణోదయం - విశిష్టాద్వైత సిద్ధాంతాన్ననుసరించి సమగ్ర కళావిర్భావతత్త్వాన్ని ప్రతీకాత్మంగా ప్రపంచిస్తున్నదని సిద్ధాంతీకరించారు [4] డా కె సుప్రసన్నాచార్యులుగారు వసుచరిత్రలో వసురాజు వృత్తాంతంతోపాటు ఇంద్రవృత్రాసుర వృత్తాంతంకూడా

---

2 ప్రథమాంధ్ర మహాపురాణము - ప్రబంధ కథామూలము—
డా జి వి సుబ్రహ్మణ్యం పుట-487

3 వివరాలకు చూడండి 1 అల్లసానివాని అల్లిక జిగిబిగి - శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు 2 అల్లసాని పెద్దన - వ్యాసము — శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు — తెలుగు విజ్ఞాన సర్వస్వము — సంస్కృతి సంపుటము - పుట 931

4 Studies in Kalapurnodayam —Dr G V Krishna Rao

అంతర్వాహినిగా ప్రసరిస్తోందని ప్రతిపాదించారు.[5] ఇలాగే ప్రబంధ కథాతత్త్వా లను పరిశీలించే మార్గం ముందుకు సాగాలి. ఆ బాటలో నడిచి, విజయవిలాస కథలోని ప్రతీకాత్మక ప్రవృత్తిని ప్రకటించటంతోపాటు దాని ప్రబంధత్వాన్ని ప్రతిష్ఠితంచేసే యత్నమే ఈ చిన్న వ్యాసం.

## 2

### తెలుగులో విలాస కావ్యాలు :

దక్షిణాంధ్ర సాహిత్య యుగంలో వెలసిన ఆంధ్ర ప్రబంధాలలో 'విజయ విలాసం' మేలుబంతి. దాని పేరులోనే శృంగార రసప్రబంధ మన్న ధ్వని ఉంది. తెలుగులో విలాస శబ్దంతో కూడుకొన్న కావ్యాలు ఎన్నో కనపడు తున్నాయి. కాని, అవి అన్నీ శృంగార ప్రబంధాలు కావు. వాటిల్లో ప్రక్రియను బట్టి కావ్యాలూ, నాటకాలూ, యక్షగానాలూ ప్రచురంగా వచ్చాయి. వర్ణనలూ, శతకాలూ, శాస్త్ర గ్రంథాలుకూడా చెదురుమదురుగా తలలెత్తాయి.

విలాస సంజ్ఞలతో వెలసిన కావ్యాలలో గణింపదగినవి - శ్రీనాథుని హర విలాసం (14 శ) గోపమంత్రి సింధుమతీ విలాసం (14 శ), సారంగు తమ్మయ్య వైజయంతీ విలాసం (16 శ), సిద్ధరాజు తిమ్మరాజూ, తాళ్ళపాక తిరువేంగళనాథుడూ రచించిన పరమయోగి విలాసకావ్యాలు (16 శ). రాయసం వేంకటకవి లక్ష్మీవిలాసం (16 శ.), యాదవామాత్యుని చంద్రహాస విలాసం (16 శ.), గణపవరపు వేంకటకవి జాంబవతీ విలాసం (17 శ.), పసుపులేటి రంగాజమ్మ మన్నారుదాస విలాసం (17శ.), పైడిపాటి నృసింహకవీ కృష్ణమాచా ర్యాదులూ రచించిన నృసింహ విలాసం కావ్యాలు (17 శ), రోసనూరి వేంకటపతి విష్ణుమాయా విలాసం (17 శ.), అజ్జరపు పేరయలింగ కవి ఒడయనంబి విలాసం (17 శ.), వెన్నెలకంటి వెంకటాచల కవి, విశ్వేశ్వర కవి రచించిన కృష్ణవిలాస కావ్యాలు (17 శ.), కంఠీరవరాజు కలవాణీ విలాసం (18 శ.), కూచిమంచి తిమ్మకవి శివలీలావిలాసం, రాజశేఖర విలాసం (18 శ.), కాణాదం పెద్దన సోమయాజి, ధర్మవరం రామకవిగారల ముకుందవిలాసాలూ (18 శ.), చింతలపల్లి గోపాలమంత్రి, వీరరాఘవ కవుల మధురవాణీ విలాసాలూ, ఏనుగు లక్ష్మణకవి రామవిలాసం (18 శ.), రావూరి సంజీవరాయకవి త్రివిక్రమ

5. వసుచరిత్రము - పీఠిక. ప్రచురణ - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ.

విలాసం (18 శ) అల్లమరాజు రామకృష్ణకవి శంతనువిలాసం సత్యభామా విలాసం (18/19 శ) కాకకూరి గౌరీశంకరకవి ధర్మనందన విలాసం (18/19 శ) రాపాక లక్ష్మీపతి (18 శ) కవికినేని రామయ్య చల్లపల్లి వెంకనా ర్యాదుల శ్రీకృష్ణవిలాస కావ్యాలు మోతుర్ల వద్దికవి బాలగోపాల విలాసం తుర్లపాటి లింగన మదనమోహినీ విలాసం చెళ్ళపిళ్ళ నరసకవి యామినీపూర్ణ తిలకావిలాసం (19 శ) పరశురామపంతుల లింగమూర్తి రతీమన్మథవిలాసం కృష్ణదాసకవి రాధాకృష్ణవిలాసం పందరి రామానుజరావు వేమనారాధ్యుల సంగమేశ్వరారాధ్యుల అహల్యా సంక్రందన విలాసాలూ (19 శ, అక్కినపల్లి నృసింహకవి ఆదిలక్ష్మీ విలాసం (9 శ) బసవరాజు నాగేంద్రకవి ఆనంద సుందరీ చాతుర్య విలాసం (19 శ) పానుగోటి జగన్నాథరావు కుముదవల్లీ విలాసం ముదుంబి వేంకటాచార్యుల దేవహూతి విలాసం మొదలైనవి

నన్నయభట్టు చాముండికావిలాసాన్నీ నన్నెచోడుడు కళావిలాసాన్నీ నాచన సోముడు వసంతవిలాసాన్నీ హరి (హర?) విలాసాన్నీ తెనాలి రామ కృష్ణుడు కందర్పకేళివిలాసాన్నీ హరిలీలావిలాసాన్నీ రచించినట్లు ప్రతీతి ఉన్నా ప్రసిద్ధి లేదు

యక్షగాన నాటక ప్రక్రియల్లో వెలసిన విలాస కావ్యాలలో గణింపదగి నవి- పెదకెంపరాయని గౌరీవిలాసం (16 శ) విజయరాఘవనాయకుని కృష్ణ విలాసం రాజగోపాలవిలాసం మోహినీవిలాసం రతీమన్మథవిలాసం (17 శ) పసుపులేటి రంగాజమ్మ మన్నారుదాసు విలాసం (17 శ) అక్కనామాత్యుని బాలకృష్ణ విలాసం (17 శ) కామరుసు వేంకటపతి విజయరాఘవ చంద్రికా విలాసం (17 శ) గోగులపాటి కూర్మనాథకవి మృత్యుంజయవిలాసం (18 శ) శహాజీ మహారాజు రచించిన కిరాత విలాసం కృష్ణలీలా విలాసం సతీపతి దాన విలాసం (18 శ) కంఠీరవరాజు అష్టదిక్పాలక విలాసం (18శ) తక్కెళ్ళపాటి లింగన విద్యుత్ప్రభా విలాసం (19 శ) మరుకుపల్లి నృసింహకవి శ్రీకృష్ణ జలక్రీడావిలాసం (19 శ) మరింగంటి వెంకట నృసింహాచార్యుల అనిరుద్ధ విలాసం (19 శ) ఎల్లయకవి చంద్రతారావిలాసం (19 శ) మెరత్తూరు వెంకట రాయశాస్త్రి జగన్మోహన విలాస నాటకం (19 శ) మొదలయినవి

వర్ణనాప్రధానాలైన విలాసకృతులలో - కంఠీరవరాజు (1 శ నాట్య విద్యావిలాసం (నాట్యకత్తెల సామర్థ్య వర్ణనం) లక్ష్మీవిలాసం (లక్ష్మీ రాజు

కిచ్చిన ఆశీర్వాద వర్ణనం), మతుకుపల్లి నృసింహ కవి చెన్నపురీ విలాసం (పుర వర్ణనం, 19 వ శ.), బొడ్డపాటి పేరయ కవి మంగళగిరి విలాసం (16 శ.), కంఠీరవరాజు వసంతోత్సవ వర్ణనం (వసంతర్తు వర్ణన) గణింపదగినవి.

ద్విపద శతక ప్రక్రియలో తరిగొండ వెంకమాంబ శివ విలాసం విశిష్టమైనది. మనుమంచి భట్టు (15 శ.) అశ్వలక్షణసారానికి హయలక్షణ విలాసమని పేరుంచటం విశేషం.

విలాసాఖ్య విశిష్ట కృతులు తెలుగు సాహిత్యంలో శతాధికంగా వెలసీయుండటం గమనింపదగిన అంశం. వానిలో "విజయ విలాసం" చుక్కల్లో చంద్రుడులా ప్రకాశిస్తోంది.

విలాసం వనితల శృంగార చేష్టలలో ఒకటిగా లక్షణ శాస్త్రంలో ప్రసిద్ధి.

"యానస్థానాసనాదీనాం ముఖనేత్రాది కర్మణాం
విశేషస్తు విలాసస్స్యా దిష్టసందర్శనాదినా,"

అని సాహిత్య దర్పణం. ప్రియుని చూడగానే నాయిక నడకలో, ఉనికిలో, కూర్చొటంలో, మాటలాడటంలో, ముఖనేత్రాదికర్మలలో కనబడే వికారవిశేషం విలాసం. ఈ లక్షణం నాయిక హావాదులకు సంబంధించింది కాబట్టి దీని నధికరించి, కావ్యనామం ఉంచబడిం దనటం ఉచితం కాదు. కాబట్టి ఆ శబ్ద వ్యుత్పత్తిని గమనించాలి. "విశేషేన లసనం విలాసః - లస శ్లేషణ క్రీడనయోః" అని గురుబాల ప్రబోధిక. లస ధాతువునకు శ్లేషణమనీ, క్రీడనమనీ అర్థాలున్నాయి. అంటే ఆలింగనాదులను, రతిక్రీడాదులను విశేషంగా వర్ణించినదాన్ని విలాస మనవచ్చు నన్నమాట! విలాస శబ్దం సామాన్యంగా స్త్రీల పట్ల వాడబడుతున్నా, పైన కావ్యంలో నాయికా నాయకుల కిరువురికీ వర్తించేదిగా గ్రహించాలి. పైన పేర్కొన్న విలాస కావ్య నామాలను గమనిస్తే - నాయికా విలాసకావ్యాలున్నాయి. నాయక విలాసకావ్యా లున్నాయి, ఉభయ విలాస కావ్యాలూ కనబడుతున్నాయి. అయితే, తెలుగుకవులు విలాస శబ్దాన్ని శ్లేషణ క్రీడనార్థాలలో మాత్రమే వాడినట్లు లేరు లీలామహాత్మ్యలనే అర్థాలలో కూడా వాడారు. అంటే, విలాస శబ్దం శృంగార రససంబంధిగానే కాక వీరాద్భుత భక్తి శాంతాదిరసవ్యంజకంగా కూడా కవు లుద్దేశించినట్లు భావింప వీలుపడుతున్నది. ఉదాహరణకు—

1. శ్రీనాథ మహాకవి రచించిన 'హరవిలాసం' ఉంది. హరుని లీల లందులో వస్తువు. ఆ మహాదేవుని లీలలన్నీ శృంగార ప్రధానాలు కావు. కరుణారసం కురిపించే ఘట్టా లెన్నో ఉన్నాయి. పరమేశ్వరుని లీలామాహాత్మ్యాలే అందులో ప్రతిపాద్య విషయాలు. అలాగే ఇత రులు వ్రాసిన కృష్ణవిలాసాలూ, త్రివిక్రమ విలాసం, బాలగోపాల విలాసం, శివలీలావిలాసం లాంటివి ఈ కోవకు వచ్చేవే.

2. రామవిలాసంలో కథ రామాయణం, కిరాతవిలాసంలో వస్తువు కిరా తార్జునీయం, చంద్రహాస విలాసంలో వస్తువు అతని ఉదాత్త వీర చరిత్రం. ఈ కథల్లో శృంగారానికి తావు తక్కువ. వీరానికే వీనిలో అగ్రతాంబూలం.

3. ఒజ్జరపు పోరయలింగం రచించిన ఒడయనంబి విలాసం భక్తిరస భరితమైన శివభక్త కథ. తాళ్ళపాక తిరువేంగళనాథుడు పరమయోగి విలాసాన్ని ద్విపదలో వ్రాస్తే, సిద్ధరాజు తిమ్మరాజు పద్యకావ్యంగా తీర్చిదిద్దాడు. ఈ రెండు కావ్యాల్లో వస్తువు పన్నిద్దరాళ్వార్ల చరిత్ర. ఇవి భక్తి శాంతరస ప్రధానాలు.

తెలుగులో వీరాద్భుతభక్తి శాంతరస ప్రధానాలైన విలాసకావ్యాలకంటే శృంగార ప్రధానాలైన విలాసకావ్యాలే సంఖ్యలో అత్యధికం.

విలాస కావ్యాలలో దివ్యనాయకుల మహిమలూ, దివ్యాదివ్యుల లీలలూ, భక్తశేఖరుల భక్తిచర్యలూ, ధీరోదాత్తుల వీరగాథలూ, ధీరలలితుల శృంగార కథలూ వర్ణింపబడటంచేత వైవిధ్యంతో అవి వెలుగొందుతున్నాయి. అయితే విలాసశబ్దం శృంగారపరంగా ధీరలలితులకు అన్వయించినంతగా ఇతరులకు వీలుకాదు. లసధాత్వర్థాలను విజయవిలాసంలోని నాయకునికి అనువర్తింపచేస్తే విజయుడైన అర్జునుడు నాయికాలింగన రతిసౌఖ్యాలను పొందే కథ విజయవిలాస మౌతుంది. ఈ అర్థం కావ్యనామానికి చక్కగా అమరుతుంది. విజయవిలాసం సార్థకమైన పేరుతో వెలసిన కావ్యమే కాదు, అటువంటి కావ్యాలలో అది అనర్ఘరత్నం!

## 3

### ముగ్గురు నాయికల ముచ్చటైన విలాసం :

విజయవిలాసంలో విజయుడు ముగ్గురు కన్యల్ని వివాహం చేసికొని. పుత్రలాభం పొందిన ఘట్టాలు వర్ణింపబడినాయి. అందే నాయకు డొకడు, నాయికలు వరుసగా ముగ్గురు. వారు - ఉలూచి, చిత్రాంగద, సుభద్ర. వీరి ముగ్గురి కథల్లో వైవిధ్యం ఉంది. ఆ వైవిధ్యం వారి స్వభావాలనుబట్టి ఏర్పడింది. ముగ్గురూ కన్యలే. లజ్జా యౌవనాలు వారి సహజ లక్షణాలు. అయితే వారిలో ఉలూచి ప్రగల్భ, సాహిత్య దర్పణంలో—

"స్మరాంధా గాఢ తారుణ్యా సమస్త రతి కోవిదా
భావోన్నతా దరవ్రీడా ప్రగల్భాక్రాంతనాయకా."

అని లక్షణం చెప్పబడి ఉంది. ఆమెనే ప్రౌఢ అని కూడా అంటారు. అర్జునుణ్ణి చూచి, స్మరాంధురాలై, సంపూర్ణయౌవనంతో లతని నాకర్షించి, మాయా బలంతో తన యింటికి గొంపోయి కొంత అల్పలజ్జనే ప్రకటించి, నాయకుణ్ణి తన వాగ్విలాస వైభవంతో వశీకరించుకొని ప్రాగల్భ్యాన్ని ప్రకటించిన ఉలూచి ప్రౌఢ. చిత్రాంగద అచ్చమైన ముగ్ధ, తండ్రిచాటు బిడ్డ. ఆమె అందాన్ని చూచి అర్జునుడు మోహించి పెండ్లికి తాపత్రయపడ్డాడే కాని ఆమె లజ్జకే లజ్జ అయిన లజ్జావతి. సమధిక లజ్జావతి కావటం ముగ్ధకు ప్రధాన లక్షణం. ముగ్ధ లజ్జచే రతివిముఖ. అయినా ఆమె పొందు నాయకునకత్యంత సౌఖ్యప్రద మని లాక్షణి కులు చెప్పారు. చేమకూర కవి అలాగే వర్ణించి చూపించాడు.

"ఇగ్గెడు వెన్క-కుం బయికి నీడ్చినఁ, బైటఁ దొలంగఁ జేయఁ గే
లొగ్గెడు, రెమ్మిపోకముడి యూడ్చినఁ గ్రుంగిలి రెండుకొంగులుం
బిగ్గ నడంచుచున్ విడిచిపెట్టదు; బాల ననం బనేమి? యా
సిగ్గుకు సిగ్గులే; దిటులఁ జేసిన పిమ్మట నుండవచ్చునే?" (2-30)

డాసిన నింగితం బెఱిఁగి డాయఁగ నేరక, తత్తరంబునం
జేసిన సేఁతకున్ బదులు సేయ నెఱుంగక, మేను మేనితో
రాసినయంతనే కళలు రంజిలి కౌఁగిట బాల యుండెఁ బో
యా సుఖమింతయంత యననైనది గాదు గదయ్య క్రీడికిన్. (2-34)

విజయ విలాసంలో మాటాపలుకూ లేని సిగ్గుల బొమ్మ క్రీడియెద కెక్కిన కొమ్మ చిత్రాంగద.

ఇక సుభద్ర మధ్యానాయిక. సాహిత్యదర్పణంలో - 'మధ్యా విచిత్ర సురతా ప్రరూఢస్మరయౌవనా, ఈషత్ప్రగల్భవచనా మధ్యమ వ్రీడితామతా' అని మధ్యాలక్షణం ఉంది. విచిత్రమైన మార్గంతో నాథునిపొందు నందుకొన్నదీ, నిండు జవ్వనంతో నాయకుని చిత్తాన్ని హత్తుకొన్నదీ, రహస్య వివాహంలోనే కాక రథసారథ్యంలో కూడా తన ఈషత్ప్రగల్భాన్ని చేతల్లో మాటల్లో ప్రక టించిందీ అయిన సుభద్ర మధ్యానాయికా లక్షణాలతో మనోజ్ఞంగా రాణించింది. విజయుని చేపట్టిన తర్వాత నవోఢగా నున్న ఆమె ప్రౌఢగా మారిందని కవి చమత్కరించాడు.

'నొక్కి పలుమొనఁ బలుమొన నొక్క నేర్పె
నంటి గోరులచేఁ గళ లంట నేర్పెఁ
జొక్కి బిగికౌఁగిలింతలఁ జొక్క నేర్పెఁ
జెలువుఁడు నవోఢఁ బ్రౌఢఁగాఁ జేసె నపుడు.' (3-225)

ముగ్ధ ప్రౌఢ కావటానికి కొంతకాలం పడుతుంది. మధ్య క్షణాలమీద ప్రౌఢగా పరిణమిస్తుంది. ప్రౌఢా శృంగారంతో ప్రారంభమైన కావ్యం మధ్యా శృంగారంతో ముగియటం, ఈ రెంటికి వారధిగా ముగ్ధాశృంగారం నిబంధింప బడటం ఇందులోని సంవిధాన శిల్పం.

విజయవిలాసంలో కథ తక్కువ, వర్ణన లెక్కువ. ప్రబంధ వర్ణనల్లో ఊహావైభవం గాని, భావనా గాంభీర్యం గాని, రచనా సౌందర్యం గాని కవులు ప్రదర్శించటానికి వీలుంది, ఊహావైభవానికి రాయలు, భావనా గాంభీ ర్యానికి పెద్దనాదులు, రచనా సౌందర్యానికి రామరాజభూషణాదులూ ప్రబంధ యుగంలో పేరు గడించారు. చేమకూర వెంకట కవి రచనాసౌందర్యాన్ని ఆరాధించిన కవి. శబ్దాలంకారాలను సార్థకంగా వాడటం, లసధాతువులో ఉన్న శ్లేషను తెలుగు పలుకుబడులలో క్రొత్త సొంపులతో సంతరించటం ఆయన కవిత్వంలో సాధించిన ప్రత్యేక గుణాలు. మాటల వాడుపుల్లో, మాటల విరుపుల్లో, మాటల కదుపుల్లో చూపించే చమత్కారాలు ప్రతి పద్య ప్రత్యక్షాలు. అందు వల్లనే చేమకూరవాని దొక ప్రత్యేక మార్గం అయింది.

చేమకూర వెంకటకవి కవితాదృక్పథం కథ నెన్నుకొనటంలోనే కనపడు తున్నది. కవి రచనలో శబ్దార్థాల ప్రాధాన్యాన్ని భావించటాన్ని బట్టి అతని కవితా దృక్పథం రూపొందుతుంది. శబ్దం స్త్రీ వంటిది. అర్థం పురుషుని వంటిది.

నాయికావృత్తం ప్రధానంగా కథ నెన్నుకుంటే, కవికి శబ్దంమీద మక్కువ ఎక్కువ అనుకోవచ్చు. అలాగే, నాయక వృత్త ప్రాధాన్యం అర్థ ప్రాధాన్యాన్ని సూచిస్తుంది. ఉభయ ప్రాధాన్యం శబ్దార్థోభయ ప్రాధాన్యాన్ని సూచిస్తుంది. ఈ మూడింటిలో ఏ మార్గాన్నైనా కవి ఎన్నుకోవచ్చు. అయితే, చేమకూరవాని మార్గం ఏమిటి? దాన్ని కథాగతినిబట్టే మనం భావించటానికి వీలున్నది.

విజయుడు మొదట సుభద్ర సౌందర్యాభివర్ణాన్ని విని వలపుగొంటాడు. కవికి మొదట శబ్ద సౌందర్యంమీద మక్కువ కలుగుతుంది. ధర్మ నియతిని అనుసరించి విజయుడు తీర్థయాత్రలకు పోతాడు. కవి స్వీయ ధర్మనిరతిని అనుసరించి కావ్య రచనకు పూనుకుంటాడు. విజయుని తీర్థ సందర్శనాభిలాష వలెనే కవికి రసదర్శనాభిలాష ఉంటుంది. అట్టిది వస్తువు లేని వర్ణనం వల్ల సిద్ధించదు. ఉలూచి కథలో ఈ కృతియందు కథ రూపు కడుతుంది. కవి కథ నాశ్రయిస్తాడు. కాని, అతని మక్కువ శబ్దంమీదనే ఎక్కువ. ఉలూచి అర్జునుణ్ణి వలచి, తన యింటికి తీసికొనిపోతుంది. ఉలూచి ప్రణయం విజయునికి రతిసిద్ధిని కలిగిస్తుంది. ఉలూచి కథలో ఆమెదే ప్రముఖ పాత్ర. ఆమె స్వీయప్రయత్నంతో ఉపాయాంతరంతో విజయుణ్ణి పొందగలుగుతుంది. శబ్దప్రధానమైన రచన చేసే కవి దృక్పథం కూడా అలాంటిదే. శబ్దానికి అర్థాన్ని గౌణం చేస్తాడు. ఉలూచికి పుత్రోదయమైనట్లే కవి యత్నం కూడా సఫలమౌతుంది. అప్పటి కదే గొప్పగా ఉంటుంది. కాని, ఆ తరువాత ముగ్ధయైన చిత్రాంగదను చూచి అర్జునుడు ముగ్ధుడౌతాడు. ఉలూచిని కీర్తించిన అతడే చిత్రాంగదను నుతిస్తాడు. ఇక్కడ యత్నమంతా క్రీడిదే. అతని కౌగిలిలో ఒదిగిపోయిన ఉవిద మనకు సాక్షాత్కరిస్తుంది. ఈ కథా ఘట్టంలో విజయునిదే పైచేయి. అర్థసమర్పకమైన శబ్దాన్ని దర్శించిన కవి రచనలో చిత్రాంగదావృత్తం చిత్రంగా కనపడుతుంది. కవికి రసావగాహనశక్తి అప్పుడు ఏర్పడుతుంది. సౌభద్రతీర్థంలో క్రుంకు లిడే విజయుని వృత్తం రసజగత్తును పాలించే కవిరాజు చిత్తం వంటిది. అర్థబాధకాలైన రసానుభవభంజకాలైన శబ్దాలను మొసళ్ళలాగా ఏరిపారేసే శక్తి కవి విజయునికి కూడా వస్తుంది. ఒక్కొక్కసారి అతని చేతుల్లో మకరాలవంటి పరుషపదాలు గూడా రమణీయరూపాన్ని దాల్చి రచనకు వన్నె తీసికొనిరావచ్చునని నందాదుల శాపవిమోచనఘట్టం ధ్వనింపచేస్తుంది.

సౌభద్రతీర్థంనుండి సుభద్రా కరగ్రహణానికి బయలుదేరిన విజయుని స్థితి వేరు. ఆయన శ్రీకృష్ణ సహాయంతో కాని కార్యం సాధించుకోలేడు. శ్రీకృష్ణుడు ద్వంద్వ ప్రవృత్తి. హలాయుధుని కొంకరూపుగా, ధనంజయుని కొంకరూపుగా వర్తించేవాడు. అర్థశ్లేషవంటివాడు ఆ మహాత్ముడు. అర్జునుణ్ణి యతిరూపం వేసికోమంటాడు. సుభద్రా సేవలు అందుకో మంటాడు. కృష్ణుణ్ణి ఆశ్రయించిన కిరీటికి కూడా ద్వంద్వ వర్తనం అలవడింది. యతివేషం ఎంత అప్రకృతమో అంత ప్రకృతం. ఆయ నెంతగా సుభద్రపై మరులు గొన్నాడో సుభద్రకూడా అంతగా ఆయనమీద విరాళి పొంది ఉన్నది. శబ్దాన్ని భజించే అర్థం, అర్థ సిద్ధి కోసం ఆరాటపడే శబ్దం, ఈ రెంటింటినీ సంధానంచేసే శ్లేషమహిమ - ఈ మూడు ప్రభావాలుగల రచనలాగా ఉంటుంది సుభద్రార్జునీయం. నరనారాయణులీ కావ్యంలో శబ్దార్థ శ్లేషరూపులు. వీరిరువురూ కలిసి శబ్దరూపయైన సుభద్రకు ఫలసిద్ధిని కలిగిస్తారు. సుభద్రార్జునుల వివాహం శబ్దానికీ శ్లేషకూ ఏర్పడిన సంబంధం. హస్తినకు వధూవరులు బయలుదేరినప్పుడు శబ్దశ్లేషరూపుడైన అర్జునుడు రథస్థుడు, సుశబ్దరూపిణియైన సుభద్ర రథసారథి. విజయుని విజయం శ్లేషకు కలిగిన విజయం. వారిరువురికి జరిగిన వివాహం శబ్దార్థాల కేర్పడిన సమప్రాధాన్యం. హలాయుధుడు వ్యవసాయి, సాధకుడు. అతడు చివర కంగీకరిస్తా డీవివాహాన్ని. సుభద్రార్జున వివాహం శ్రీకృష్ణ మాహాత్మ్యాన్ని ప్రకటిస్తుంది. అంటే - చేమకూర వేంకటకవియుగం శ్లేషమాహాత్మ్యాన్ని ఆరాధించిందన్నమాట!

చేమకూరవానిది శబ్దప్రధానమైన చిత్రరచనం కాదు; అర్థప్రధానమైన రసవద్రచనం కాదు; శ్లేషచమత్కారప్రవదమైన శబ్దార్థోభయప్రధాన రచనం. అది యుగ ధర్మం. అదే అతని కవితా మర్మం!

'ప్రతి పద్యమునందుఁ జమ
త్కృతి గలుగం జెప్పనేర్తు; వెల్లెదఁ బెళుకౌ
కృతి వింటి మపారముగా
క్షితిలో నీ మార్గ మెవరికిన్ రాదుసుమీ!" (1-50)

బెళుకు శబ్ద లక్షణం; చమత్కృతి శ్లేష లక్షణం; ఈ రెండూ కలిసి అతని కవితా లక్షణం!

# 4

## విజయ విలాస వస్తువు - ప్రతీకాత్మక ప్రవృత్తి

విజయుని శృంగార విలాసం ఇందులో ప్రతిపాద్యాంశం అది ముగ్గురు నాయికలనూ మూడు కథలనూ ఆశ్రయించి ధ్వనింపబడుతోంది రసధ్వని కావ్యాత్మ అది వ్యంజనావృత్తి వలన ప్రతీయమాన మౌతుంది

ధ్వని ప్రధానంగా రెండు విధాలు 1 అభిధామూలమైన వివక్షితాన్యపర వాచ్యధ్వని 2 లక్షణామూలమైన అవివక్షిత వాచ్యధ్వని ఇందులో మొదటి దానిలో వాచ్యం తన స్వరూపాన్ని తెలుపుకుంటూనే వ్యంగ్యార్థాన్ని బోధిస్తుంది రెండవవానిలో వాచ్యం అనుపపత్తి వలన బాధింపబడుతుంది అనుపపత్తి తొలగించుకోవటానికి చెప్పకొనే లక్ష్యార్థం మూలంగా ధ్వని గమ్యమానమౌతుంది కాబట్టి వాచ్యార్థాని కిందులో ప్రాధాన్యం ఉండదు.

ఇందులో - వివక్షితాన్యపరవాచ్యధ్వని లక్ష్యక్రమ వ్యంగ్యమనీ అసంలక్ష్యక్రమవ్యంగ్య మనీ మరలా రెండు విధాలు వాచ్య వ్యంగ్య స్ఫురణలో క్రమం లక్షింపబడేది సంలక్ష్యక్రమవ్యంగ్యం అలా లక్షింపబడనిది అసంలక్ష్య క్రమ వ్యంగ్యం అసంలక్ష్య క్రమవ్యంగ్యం రసాదిధ్వనిరూపం. లక్ష్య క్రమ వ్యంగ్యం శబ్దశక్తిమూలమనీ అర్థశక్తి మూలమనీ ఉభయశక్తి మూలమనీ మూడు విధాలు

చేమకూర వేంకటకవి విజయ విలాసంలో ఈ మూడు భేదాలకూ ప్రతీకాత్మక పాత్రసృష్టి చేసి ధ్వని సిద్ధాంతాన్నే ధ్వనింపజేయాలని ప్రయత్నించాడు విజయు డయ్యాడు దాన్ని స్థూలంగా పరిశీలిద్దాం

వ్యంజనావృత్తి శబ్దశక్తిమూలమనీ అర్థశక్తిమూలమనీ ఉభయశక్తి మూల మనీ చెప్పుకున్నాం కదా! ఈ భాగాన్ని శబ్దార్థతుల్యులైన నాయికా నాయకులకు అన్వయిస్తే ప్రతీకాత్మక ప్రవృత్తి ప్రత్యక్షమౌతుంది శబ్దవృత్తి వంటిదే నాయికా మనఃప్రవృత్తి అర్థవృత్తివంటిదే నాయక చిత్తవృత్తి శబ్ద శక్తి మూలవ్యంజన శబ్దపరివృత్తిని సహించదు అర్థశక్తి మూలవ్యంజన శబ్ద పరివృత్తిని సహిస్తుంది ఈ కావ్యంలో నాయికలు ముగ్వురూ వివాహమాడింది విజయుణ్ణే వారి మనోవృత్తిలో వ్యంగ్యమైంది రతిభావం వారికి సంబంధించినంతవరకు రతి ఏకనాయక నిష్ఠం అందువల్ల శబ్దశక్తి మూలవ్యంజనావృత్తిని

ప్రతీకాత్మకంగా గ్రహిస్తే నాయికల మనోవృత్తులకు అన్వయిస్తుంది. నాయకుడో, మొదట సుభద్రపై వలపు చూపాడు. ఆమెను చూచేలోగా ఇద్దరు కన్యలను వివాహమాడాడు. అందువల్ల నాయక చిత్తవృత్తి ప్రతీకాత్మకంగా అర్థ శక్తి మూలవ్యంజనాశక్తికి అన్వయిస్తుంది. ఆ అర్థశక్తికి శబ్దంకాదు ప్రధానం - తన స్వార్థం.

నాయికా నాయకుల చిత్తవృత్తుల్ని ప్రతీకాత్మకంగా ఇలా అన్వయించుకోవటంవల్ల మరొకసార్థక్యం ఉంది. ఉలూచి తనంతట తాను విజయుణ్ణి వలచి వశం చేసికొన్నది. ఆ ఇతివృత్తం శబ్ద (స్త్రీ) శక్తిమూల వ్యంజనకు చక్కని ఉదాహరణం. చిత్రాంగద తనంతటతాను విజయుణ్ణి కోరలేదు. అర్జునుడే తన పని తాను సాధించుకొన్నాడు. అక్కడ అర్థ (పురుష) శక్తియేగాని శబ్ద (స్త్రీ) శక్తి లేదు. అందువల్ల రెండోకథ అర్థశక్తి మూలవ్యంజనకు సమర్థమైన ఉదాహరణం. ఇక సుభద్రార్జునుల ప్రణయం ఉభయప్రాధాన్యం కలది. అందువల్ల శబ్దార్థోభయ మూలవ్యంజన కది చక్కని ఉదాహరణం.

ఈ కావ్యంలో అసంలక్ష్యక్రమ వ్యంగ్యంవల్ల కావ్యరసాదులు ధ్వనింపబడితే - సంలక్ష్యక్రమ వ్యంగ్యమార్గంలో ప్రతీకాత్మక పరమార్థం దర్శితమౌతున్నది. ఈ రెండూ అభిధాశక్తి మూలంగా స్ఫురించేవి కాబట్టి వివక్షితాన్యపరవాచ్య ధ్వని భేదంగా గ్రహించటం సార్థకం. అంటే వాచ్యంగా నడిచేది కథ. దానిలో ప్రతీకాత్మకంగా స్ఫురించేది విజయవిలాస వస్తుతత్త్వం; వ్యంగ్యంగా స్ఫురించేది రసం.

చేమకూర వేంకటకవి వివక్షితాన్యపర వాచ్యధ్వనికిమాత్రమే ప్రతీకాత్మక కల్పనం చేసి, అవివక్షితవాచ్యధ్వనిని అవివక్షితంగా వదలిపెట్టలేదు. దానికి నందాదుల శాపవిమోచనవృత్తాంతం ప్రతీక. సౌభద్రతీర్థ సందర్శన సందర్భంగా ఈ కథ ప్రవర్తిల్లుతుంది. నంద కుబేరుని ప్రేయసి. ఆమెకు నలుగురు సకియలు. లలిత, పద్మ, సౌరభేయి, సమీచి- వారి పేర్లు. వారొక ముని చేత శపింపబడి పంచతీర్థాలలో భయంకర నక్రాలుగా బ్రతుకుతుంటారు. వానిని విసరి యొడ్డున వేసిననాడు వాళ్ళకు శాపవిముక్తి. విజయు డా పని చేశాడు. అంటే, అప్సరసల ఆకృతులకు అనుపపత్తి ఏర్పడితే, ఆ అనుపపత్తిని తొలగించి అసలు రూపాలను ప్రసాదించాడన్నమాట! వాచ్యార్థానికి అనుపపత్తి ఏర్పడినప్పుడే లక్షణావృత్తి ప్రవర్తిల్లుతుంది. లక్షణాశక్తి ఆ అనుపపత్తిని

తొలగిస్తుంది. లక్షణ శబ్దశక్తి అని చెప్పబడినా మౌలికంగా అర్థశక్తి. తన్మూలక మైనది అవివక్షిత వాచ్యధ్వని. దీన్ని ప్రతీకాత్మకంగా కథ కన్వయించుకుంటే తేలే తాత్పర్య మిది - అప్సరసలు - శబ్దశక్తి లేదా అభిదాశక్తి వలన ఏర్పడే వాచ్యార్థాలు - అనుపపత్తికి గురియైతే అర్థశక్తి రూపుడైన అర్జునుడు తదనుపపత్తిని తొలగించాడు. దానివల్ల అర్జునుని ఔదార్య పరాక్రమాదులు వ్యంగ్యం. మొసళ్ళరూపం వాచ్యార్థమైతే - అప్సరసలు నిజరూపాలు దాల్చిన తరువాత శప్తరూపాలు స్మరింపబడటంలేదు. అవివక్షితవాచ్యత్వం అక్కడ కుదురుగా అమరింది. లక్ష్యార్థబోధకు ప్రయోజనం గానీ, రూఢి గానీ సహాయకాలవుతాయి. అలాగే అర్జునుని తీర్థావగాహన ప్రయోజనం పరాక్రమరూఢి ఇందుకు సహాయకాలుగా నిలిచా యని చెప్పవచ్చు.

ఇక శ్లేషనుగురించి గమనిద్దాం. శ్లేషలో ప్రకృతార్థం ఒకటి. అప్రకృతార్థం ఒకటి స్ఫురిస్తాయి. ఐతే ఎక్కడ ప్రకరణాదులచె ఒకే అర్థం ప్రకృతంగానూ, మరొక అర్థం అప్రకృతంగానూ స్ఫురిస్తే అక్కడ శబ్దశక్తి మూలవ్యంగ్యం ఉందంటారు. ఎక్కడ అర్థద్వయం ప్రకృత మౌతుందో అక్కడ శ్లేష అని అంటారు. ఈ ద్వంద్వ ప్రవృత్తులకు ప్రతీకలుగా శ్రీకృష్ణుణ్ణి, అర్జునుణ్ణి ఈ కథలో కుహనాయతి ఘట్టంలో గ్రహించటానికి వీలుంది. వీరిద్దరి లక్ష్యం సుభద్రా వివాహమే. వీరిరువురిమాటల్లో ప్రకరణాన్నిబట్టి శ్లేష చమత్కారం కనిపిస్తుంది. ఉదాహరణకు - శ్రీకృష్ణుడు సుభద్రతో అన్నమాటలు—

'కామాది స్ఫురణమ్ము లెల్ల నడఁగంగాఁజేసి ధన్యాత్ములౌ
స్వాముల్ వీరలు; వీరి కింపొదవు సేవన్ సేవ గావింపు; మెం
తో మోదంబున నానతిచ్చి బలభద్రుండే నియోగించినాఁ;
డేమో చెప్పితి నంచు నుండెదవు సుమ్మీ నీ మదిన్ సోదరీ!' (2-122)

ఇందులో శ్లేషచమత్కారం 'కామాది స్ఫురణమ్ము లెల్ల నడఁగంగాఁజేసి' అనటంలో ఉంది.[6] కామక్రోధాదుల నణచిన వాడని యోగిపరంగా అర్థమైతే కామునియొక్క మొదటిరూపాన్నే జయించినవాడనీ, కామాదులైన కంతజయంత వసంతాదులను అందంలో మించినవాడనీ అర్జునునిపరంగా అర్థాలు వచ్చే అవకాశం ఉంది. నిజానికి సుభద్రకు యోగిపరమైన అర్థమే స్ఫురిస్తుంది. పతితకు

6. విజయవిలాసము - హృదయోల్లాసవ్యాఖ్య -
శ్రీ. తాపీ ధర్మారావుగారు - పుట. 452.

రెండో అర్థం కూడా స్ఫురిస్తుంది. 'ఏమా చెప్పెతి నంచు నుండెదవు సుమ్మీ' అన్న హెచ్చరికలో సుభద్ర గూడా రెండవ అర్థాన్ని గ్రహించాలి. కాని, అలా జరగటానికి ఆ పాత్ర అప్పటిస్థితి ఒప్పదు. ప్రక[illegible]నే మొదటిది ప్రకృతం, రెండవది అప్రకృతం, రమణీయం. ఈ రెండ[illegible] సుభద్రకు వర్తించేవే. మొదట శబ్దశక్తి మూల వ్యంజనగా స్ఫురించ[illegible]ర్థాలు ప్రకృత కావ్యార్థాలకు పోషకాలు కావటం చేత శ్లేషగా పరిణమిస్త[illegible] నిజానికి ఈ ఘట్టంలో ప్రకృతం అసత్యం, అప్రకృతం సత్యం. చమత్కార[illegible] మక్కడే ఉంది.

'తెమ్ము బంగారు కుంద జలమ్ము' లనుచుఁ
'దెమ్ము లతకూన మంచిసుమమ్ము' లనుచుఁ
'దెమ్ము బాగైన కొమ్మ ఫలమ్ము' లనుచుఁ
మించుఁబోఁడిని నేరుపు మించఁ బలుకు' (2-142)

కుహనాయతివేషంతో ఉన్న కురువీరుని వాక్యంలో యతిపరమైన అర్థం కంటె రతిపరమైన అర్థానికే ఆస్వాదనీయత్వం అధికం. శ్రీకృష్ణుని మాటల్లో, కుహనాయతి వేషభాషల్లో ప్రకరణవశమైన ప్రకృతార్థం ఆపద్ధర్మం,అప్రకృతమైన పదార్థం పరమార్థం. శబ్దశక్తిమూల వ్యంజనకూ, శ్లేషకూ ఉన్న ఈ స్వభావవిశేషాలను ఎంతో స్వభావసిద్ధంగా కథార్థాలతో ప్రతీకాత్మక కల్పనంతో నిపుణంగా సాధించి కృతార్థుఁడైనాడు చేమకూర వేంకటకవి.

ముగ్గురు నాయికలను ప్రతీకలుగా గైకొని ఏదో సాహిత్యసూత్ర రహస్యాన్నిగానీ, తత్త్వాన్నిగానీ ధ్వనింపజేసే ప్రక్రియ ప్రబంధాలలో పెద్దనగారే ప్రారంభించారు. దాన్ని యథాశక్తి ప్రబంధకవులు సాధించారు. చేమకూర వేంకటకవి మూడువిధాలైన వ్యంజనావృత్తికి ప్రతీకలైన పాత్రలచిత్రవృత్తుల్ని పరమరణీయంగా చిత్రించటమే కాకుండా, ధ్వనిభేదాలకు ప్రతికాత్మక ప్రవృత్తితో రూపకల్పనం చేసి తన ప్రజ్ఞాప్రాభవాన్ని ప్రకటించి, తన ప్రత్యేకత నిలుపుకొన్నాడు.

'తా రసపుష్టిమైఁ బ్రతిపదమ్మున జాతియు వార్తయున్ జమ
త్కారము నర్థగౌరవముఁ గల్గ ననేక కృతుల్ ప్రసన్నగం
భీరగతిన్ రచించి మహి మించినచో నిఁక శక్తు లెవ్వర
య్యా! రఘునాథభూపరసికాగ్రణికిం జెవిసోఁకఁ జెప్పఁగన్.'
(1-31)[7]

---

7. వివేచన (ఉస్మానియా విశ్వవిద్యాలయం - తెలుగుశాఖ - పరిశోధన పత్రిక) - మొదటి సంచిక (డిసెంబరు 1976)లో ప్రచురితం.

# వేమన యోగి: పద్యం ప్రక్రియ: మకుటం ముద్ర

వేమన ఎటువంటి కవి? వేమన పద్యాలు ఏ ప్రక్రియకు సంబంధించినవి? ఈ రెండు ప్రశ్నలకూ సూటిగా సమాధానాలు దొరకటం కష్టం వేమనను గురించి పరిశోధన చేసి గ్రంథాలు రచించినవారి మాటల్లోనే సమాధానాలు సూటిగా లేవు ఇక మామూలు మనుషుల మాటెందుకు? మచ్చుకు ఇద్దరు ముగ్గురు పండితుల మాటలు గమనిద్దాం ముందుగా వేమనను గురించి—

1 వేమన కవులని పేరు సంపాదింపని కవులలోఁజేరిన వాఁడంటిని — రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు (వేమన 1945 పు 139)

2 విశ్వదాభిరామరామ వినుర వేమ అను మకుటముతో అందరికిని తెలిసిన కవి వేమన అంతేకాదు అందఱును తలకు ఒక విధముగ తలంచు కవి కూడ వేమనయే వేమన అద్వైతి అని ఒకరు వీరశైవుడు అని మఱొకడు మొదట జైనుడు తర్వాత చార్వాకుడు అని ఇంకొకరు కందుకూరి వీరేశలింగముగారి వంటి సంఘ సంస్కర్త అని వేఱొకరు కారల్ మార్క్స వంటి అర్థిక శాస్త్రవేత్త అని కొండొకడు రామకృష్ణ పరమహంస పూర్వకవి రూపమే అని ఒక్కరు బౌద్ధ నాగార్జునాచార్యుల బద్ధ ప్రతిబింబమే అని ఒకానొకరు వేమన మహాకవి అని కొందఱు మహా+అకవి అని మఱికొందఱు ప్రజాకవి అని ఒకరు విశ్వకవి అని మఱొకరు లోకకవి అని ఇంకొకరు వ్యాపారుల కవి అని వేరొకరు వ్యవసాయదారుల కవి అని కొండొకరు ఉల్లేఖాలంకారమునకు వేమన ఉజ్జ్వలమైన ఉదాహరణము! - ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి గారు (నాథయోగి మన వేమన (1987) పు 1)

3 వేమనగారిని నిన్నటిదాకా సాహిత్య పరిశోధకారులు మహాకవిగా పరిగణింపకపోవటం అటుంచి కవిగా కూడా జమకట్టుకోలేదు పండితుల దృష్టిలో లాగే పామరుల దృష్టిలో కూడా వేమనగారు కవులు కారు వాళ్ళ ఉద్దేశ్యంలో ఆయన దేవుడు అవతార పురుషుడు మహిమలు చూపిన మహాయోగి వేమన

గారిని కవిగా గుర్తించినవారు ఆధునికులే కొమర్రాజు లక్ష్మణరావుగారు ఇల్లలికారు కట్టమంచి రామలింగారెడ్డి గారు ముగ్గుపెట్టారు వంగూరివారు పీట వేశారు వేటూరివారు బండారువారు శేషాద్రి రమణ కవులు మొదలైనవారు ప్రస్తుతించారు రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు మహాకవిగా ప్రతిష్ఠించారు సుమారు ఏభయి సంవత్సరాల సాహిత్య చర్చల ఫలితాలను సమన్వయం చేసుకొని వేమనగారి జీవిత చరిత్రను సంగ్రహంగా చెప్పుకొనే వీలు నేటికి మనకు లభించింది —శ్రీ ఆరుద్ర (సమగ్రాంధ్ర సాహిత్యం 12 సం ప్ర 59 - 60)

వేమన పద్యాలను గురించి-

1 వేదములు వ్రాసినవి కావు వేమన కవితలు నంతే సన్యసించిన మీద మఱి మఱియునంతే గోచిలోపాటు గంటమును గూడ అతడు విసిరి వేసినవాడే సందర్భమునకు ఆశువుగా పద్యము లతనినోట వెడలినవి వెడలినవి వెడలినట్లే విన్నవారి నోటికి బట్టినవి విన్నతోడనే నోటికి బట్టగల శక్తి అతని పద్యముల కున్నది అతనికి అవి గుర్తు తప్పవు ఏ కొంచెము తప్పినను మరల నట్టి సందర్భమున కొంచెము మార్పుతో నదే పద్యము పాఠభేదముగా నతడు చెప్పును అవి ఆనోట నానోట ప్రచారము పొంది పిమ్మటొకప్పటికి తాటాకుల కెక్కినవి తప్పులతో నెక్కినవి నడక చెడినవి భావమున చెడినవి ఛందమున చెడినవి పదమున చెదరినవి ఇంకను సరిగాక సరిజేత కెదురు జూచుచునే యున్నవి సరిజేతకు గురియై మొదలి యర్థమునకు చేటువచ్చి సిగ్గిల్లు చున్నవి కూడ యున్నవి లేఖక పాఠక ప్రమాదములు వేమన కున్నంతగా నెవరికిని లేవు అయినను బ్రదికి మన కందినవి వేదములు వల్లెవేసిన వారి ఉదరపోషణ కుపకరించి బ్రతికినవన్న ననవచ్చునేమో గాని అట్టి ఉపజీవిక కూర్పకుండగనే వేమన కవితలు బ్రతికినవి. నిరక్షరసముల నోటను నింటను బడి బ్రతికినవి ప్రజాకవి కవితలుగానే బ్రతికినవి — శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావు (విశ్వదాభిరామ వినురవేమ (1981) పు 109)

2 ఏకమాత్ర విషయ పరిమితి గలిగి పూర్వాపర సంబంధ రహితమైన స్వతంత్రమైన చిన్న పద్యం ముక్తకం ముక్తకం సాధారణంగా వ్యంగ్య పూరితమైన రచన ముక్తకాన్ని వినడం ప్రారంభించగానే పరితలో ఉద్బుద్ధమయ్యే కుతూహలాన్ని పద్యం ముగిసేలోగా తృప్తి పరచగలగాలి ముక్తకానికి క్లుప్తత అందం ఈ సంక్షిప్తతే అనవసరమైన విషయ వివరణ అనే దోషం పట్టకుండా దీనిని కాపాడుతుంది పై ముక్తక లక్షణాలు చాలావరకు

వేమన పద్యాలకు వర్తిస్తాయి"—డాక్టర్ ఎస్. గోపి (ప్రజాకవి వేమన (1980) పు. 297, 298)

3. "తనకు తోచిన అంశమును వస్తువుగా గ్రహించి, శతక పద్యములు చెప్పినవారిలో వేమన ఆద్యు డనవచ్చును. అతని పద్యములలోని వస్తువు వివిధాంశములకు చెందినది. అవియు నొక క్రమమున లేవు." — డాక్టర్ కె. గోపాలకృష్ణరావుగారు (ఆంధ్ర శతక సాహిత్య వికాసము 1976, పు. 564)

'విశ్వదాభిరామ వినురవేమ' అనే మకుటంతో ఉండే ఆయన పద్యం కనీస మొకటైనారాని తెలుగువాడుండడు. భక్తిమాధుర్యానికి పోతన్న వాక్కు, సూక్తి సారళ్యానికి వేమన్న వాక్కు తెలుగువారి ముఖమందిరాల్లో గౌరవప్రతి పత్తులను సంపాదించుకున్నాయి.

వేమన్న వ్యక్తిత్వం విచిత్రమైనది. ఆయనకు పాండిత్యంకంటె పర మార్థం గొప్ప. అందువల్లనే పాండిత్యంకోసం పండితులపాదాల నంటలేదు. పరమార్థంకోసం జీవితాన్ని గురువుగా ఎంచుకొన్నాడు. జీవితం సత్యానికి మౌన వ్యాఖ్యానం చేస్తుంది. కాని, పాత్రప్రవచనాలను, తర్కవితర్కాలను చేయదు. జీవితానికి మొగమోటాలు లేవు; మెరమెచ్చులు లేవు. అది వరాన్ని ఎంత ఔదార్యంతో ఇస్తుందో శాపాన్నీ అంత నిర్దాక్షిణ్యంగా ఇస్తుంది. ఆటు పోటులతో కూడుకొన్న జీవితాన్ని ఆశ్రయించిన సాధకుడికి అటు రక్తికీ, ఇటు విరక్తికీ అవకాశమున్నది. రక్తిలో పడి సాధకుడు పరమార్థాన్ని మర్చిపోతే జీవితం శపిస్తుంది. శాపగ్రస్తుడైన జీవి విరక్తి మార్గం పడతాడు. పరమార్థాన్ని అన్వేషిస్తాడు. వేమన్న జీవితం ఇదే మార్గం పట్టింది. యౌవనంలో ఆయన తనకు అందిన ఐహికభోగాలను అనుభవిస్తూ పోయాడు. అందులో ఆయనకు అర్థార్థి సంబంధం తప్ప పరార్థంతో కూడిన పరమార్థం కనపడలేదు. కాంచనం, వంచనం రక్తి మార్గంలో ముళ్ళపొదల్లా కనిపించాయి. ఆ మార్గం వదలి పెట్టాడు వేమన. రక్తిని వీడినప్పుడు భక్తిని పట్టే అవకాశం ఉంటుంది సాధకుని జీవితంలో. భక్తికి బలం విశ్వాసం. వేమన వివేకాన్ని నమ్మినంతగా విశ్వాసాన్ని నమ్మిన వాడు కాడు. అందువలన భక్తుడు కాలేకపోయాడు. కాని, భగవంతుని వద్దకు చేర్చే మార్గాల నన్నిటినీ పరామర్శించాడు. భగవంతుడికీ, మనిషికీ మధ్య మతం పేరిట మనిషే కల్పించిన ప్రతిబంధకాలు అయన మనస్సును గాయం చేశాయి.

బహిర్ముఖమైన జీవితంమీద ఆయనకు కోపం వచ్చింది. అంతర్ముఖుడై ఆయన లోనే భగవంతుణ్ణి చూచుకొన్నాడు. జీవితం నేర్పిన గొప్ప గుణపాఠం అది.

వేమన జీవితంవెంట తిరిగినప్పుడెల్లా జీవితం లోకంలోని తప్పులను ఎత్తి చూపింది. చివరకు 'నీలోనే నిజం ఉంది తెలుసుకో'మని చెప్పి దూర మైనది. వేమన తనకు తానే గురువైనాడు; తనుకు తానే శిష్యుడైనాడు. శిష్యుడుగా తాను లోకవర్తనంలో ఉన్న పుచ్చుకాయతనాన్ని ప్రశ్నించుకొన్నాడు. గురువుగా తానే సత్యాన్ని నిరూపించుకొన్నాడు. ఆయన అంతర్వ్యక్తిలో జరిగే ఈ సంవాదసారమే ఛందోరూపం తాల్చి బయటపడుతుండేది. ఆయన కవిత అందుకే ఆత్మాశ్రయమైనది. అదే దాని అంతర్లీనమైన శక్తి.

వేమన్న స్వయంకృషితో సత్యాన్ని స్వాయత్తం చేసుకొన్న సాధకుడు. అందువలన ఆయన ప్రవృత్తిలో స్వాతంత్ర్యం సానయుదీరి రాణిస్తుంది. అది భావంలోనూ, భాషలోనూ ప్రతిఫలిస్తుంది. ఆయన తిట్టినట్లు చెప్పినా, కొట్టినట్లు చెప్పినా, వినేవాడికి ఆయన స్వాతంత్ర్యం మీద అభిమానం కలిగింపచేస్తుంది ఉన్నది ఉన్నట్లు చెప్పి విన్నవాడికి ఉడుకెక్కించినా, కన్నది కన్నట్లు చెప్పిన నిజాయితీ అతని మాటకు తలలూపింపచేస్తుంది. ఓంకానికి పోని అతని భాష బిగువుతో కూడిన సూటిదనాన్ని ప్రదర్శిస్తుంది. ఖూతులు పలికినా, నీతులు చెప్పినా నిర్లిప్తతతో నిండిన అతని నిర్మొగమాటం మాట కొక నిండుదనాన్ని కలిగిస్తుంది. అనుగ్రహంతో చెప్పినా, నిగ్రహంతో చెప్పినా అతని మాటల్లో అంతర్వాహినిగా సాగివచ్చే హాస్యధోరణి నొచ్చుకొన్నవాణ్ణికూడా నవ్వింప చేస్తుంది. కవ్విస్తూ నవ్వించే శక్తి వేమన్న కవితకే దక్కింది.

వేమన్న దృష్టిలో మనిషే దేవుడు. ఆయన తత్త్వం మానవతావాదం. మనిషి తనకు తాను ద్రోహం చేసుకొన్నా, మరో మనిషికి ద్రోహం చేసినా ఆత్మవంచన, దైవవంచన అని అంటాడు వేమన్న. మానవులమధ్య తాత్త్వికంగా తరతమభేదం లేదంటాడు; కుల వర్గ భేదాలు మానవకల్పితా లంటాడు. మనిషిలో మానవత్వాన్ని మసి చేసే మత మౌఢ్యాన్ని గర్హిస్తాడు. ఉన్నత మానవతా గుణాలను ప్రబోధిస్తాడు. వేమన దృష్టిలో ప్రబోధ మెంత ప్రధానమో, సంస్కరణ మంత అవసరం. మూఢవిశ్వాసాలనూ, అర్థరహితమైన ఆచారాలనూ, స్వార్థపోషకాలైన వర్గభేదాలనూ సంస్కరణ దృష్టితో ఆయన అవహేళనం

చేస్తాడు. ఆయన ఆత్మోద్ధరణతోపాటు సమాజ సముద్ధరణాన్ని కాంక్షించిన కర్మయోగి; మానవుడే మాధవుడని చెప్పిన జ్ఞానయోగి. అందుకే నేటికీ మనకు వేమన వాక్కు వేదంలా వినిపిస్తుంది; ఏనాటికైనా అది నిలుస్తుంది.

వేమన్న సమాజకవిగానూ, నాథ సంప్రదాయకవిగానూ విశ్లేషించటం జరిగింది. సమాజ కవుల్లో భక్త కవులనీ, తత్త్వ కవులనీ రెండు రకాల వారుంటారు. ఆ రెండు రకాల్లోనూ వేమన్న ఇమడటం కష్టమని విమర్శకుల అభిప్రాయం. "భక్త కవిగా, తత్త్వకవిగా కాక యోగిగా వేమన ప్రచారంలో ఉన్నాడు.... భక్త తత్త్వ కవులలోని సమాజపరమైన గుణాలను, బలహీనతలను విశ్లేషించగలగటానికి గల కనీసపు దిశానిర్దేశం వేమన పద్యాలలో కనిపించదు. ....సమాజ కవులుగా పేర్కొంటున్న ఇతర భక్త, తత్త్వ కవుల రచనలతో సమానంగా కాక, అందుకు భిన్నమైన భావాలు వేమన పేరిటి పద్యాలలో కని పిస్తాయి."- డాక్టర్ కె.కె. రంగనాథాచార్యులు (తెలుగులో తొలి సమాజ కవులు సంపాదకీయ వ్యాసం పు. 33 - 34). యోగిగా ప్రసిద్ధి చెందిన వేమన కవిత్వం లోని తాత్త్వికాంశాలు నాథ సంప్రదాయానికి దగ్గరగా ఉన్నాయని ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు ప్రతిపాదించారు.

విమర్శకుల దృష్టిలో వేమన్న ఒక సూత్రానికీ, ఒక విశ్లేషణకూ, ఒక తత్త్వానికీ ఒదిగే కవి కాడు. అయితే అతని వాక్కు ప్రజల గుండెల్లో సరాసరి ప్రవేశించి నిలిచే శక్తి కలది. వేమన్న గంటం పట్టి వ్రాసింది తక్కువ. ఆశు వుగా, చాటువుగా చెప్పినవి ఎక్కువ. ఆయన ఎన్నుకొన్న ఛందం ఆటవెలది; కొన్ని కందాలు కూడా ఉన్నాయి. యోగిగా ఆయన ఆశువులు చెపుతున్నప్పుడు కవిలాగా పద్యాన్ని పద్యంలా చదివేవాడా? లేక తత్త్వంలా హృద్యంగా ఒక బాణీలో పాడుతున్నట్లు పలికేవాడా? ప్రజల నాకట్టుకొనే పద్యరచనతో పాటు, పద్యగాన వైఖరికూడా వేమన కొకటి ఉండి ఉండాలి. కందపద్యాన్ని కందా ర్థంలా పాడే అలవాటు తత్త్వాలు ఆలపించే వారికున్నది. వేమన భక్త కవుల కంటె తత్త్వ కవులకే ఈ బాణీలో దగ్గరివాడుగా కనిపిస్తాడు. ఆటవెలదిని అపూర్వంగా ఆలపించటం వేమన వాక్కులో ప్రజాకర్షణ మార్గం అయివుండాలి. అప్పుడప్పుడు వేమనపద్యాల్లో గణభంగాలూ పదభంగాలూ దానివలననే ఏర్పడి ఉంటాయి. వేమన పద్యాలు ప్రజలలో ఒక పాటబాణీని కల్పించి ప్రజలచేత కూడా పద్యాలను పలికించి ఉంటాయి. వేమనతో కలిసి పాడటం, వేమనవలె

సొంతంగా పద్యం పాడటం అప్పటికీ, ఇప్పటికీ ఒక కళ. వేమన ప్రజలతో కలిశాడు; ప్రజలు వేమనను తమలో కరిగించుకొన్నారు. వేమన వ్రాసింది 'ఆటవెలది' కాని, లోకంలో 'వేమన పద్యా'లనే ప్రసిద్ధి. మకుటం ఉండటం వలన వేమన శతకం అనే పేరు వినపడుతుంది కాని, శతకప్రక్రియను శతధా భిన్నం చేశాయి వేమన పద్యాలు. అందువలన 'వేమన శతకం' అనేమాట ప్రక్రియా పరమార్థాన్ని సాధించలేనిది.

విమర్శకులలో కొందరు చెపుతున్నట్లు వేమనపద్యాలలో ప్రతి ఒక్కటీ ముక్తకమే. శతకాలలో, ఆశుకవితలలో, చాటుపద్యాలలోకూడా ప్రతి పద్యమూ ముక్తకమే. పదకవితా ప్రక్రియలైన సంకీర్తనలు, కీర్తనలు,పదాలు, కృతులు, తత్త్వాలు మొదలైన వాటిల్లో కూడా ముక్తకాలే ముఖ్యంగా ఉంటాయి. దేశి రచనల్లో ముక్తకానికి అధిక ప్రాచుర్యం ఉన్నది. 'వేమన పద్యాలు' అనే సమాసంలోని 'పద్యాలు' అనే వాటిని సామాన్యార్థంలో గ్రహించాలా? పారిభాషిక పదార్థంలో గ్రహించాలా? అని ఆలోచించవలసి ఉన్నది. నా అభిప్రాయంలో అన్నమాచార్యుల 'సంకీర్తనం', రామదాసు 'కీర్తన'. బ్రహ్మంగారి 'తత్త్వం', త్యాగయ్య 'కృతి' అని ప్రక్రియాపరంగా ఎలా పాడుతున్నామో, ఎలా గ్రహిస్తున్నామో, ఎలా విశ్లేషించుకొంటున్నామో అలాగే వేమనగారి 'పద్యం' అనేదాన్ని పారిభాషిక పదంగానే గ్రహించాలి. అది వేమన 'ఆటవెలది' కాదు; వేమన్న 'పద్యం.' ఆటవెలది ఛందస్సంబధమైన పరిమిత భావానికి సంబంధించింది. 'పద్యం' - 'పదం' లాంటిది. వాగ్గేయకారులూ, శతక కర్తలూ విరివిగా రచనలు చేస్తున్న కాలంలో పుట్టిన వారివలె వేమన్న భక్తుడు కాలేకపోయాడు. యోగిగా మారినా బ్రహ్మంగారి లాగా కాలజ్ఞానాలు చెప్పే పద్ధతిని గాని, తత్త్వాలను మార్మికంగా పాడే వైఖరినిగాని ఆశ్రయించలేదు. పదకవితలాగా పద్యాన్ని పాడాడు. అది ఆటవెలది కావటం యాదృచ్ఛికం కావచ్చు. పదకవులందరూ సంగీతాభినయాలకు సన్నిహితంగా ఉండే పాటల వివిధ ప్రయోగాలను ఆలపిస్తుంటే వేమన్న ఒక్కడేపద్యాన్ని ఒక బాణీగా పాడాడు.సంగీతం బరువులేని సరళ కవిత; మాతువుతోనే బ్రదుకు సాగించే మాత్రాగణాల ఛందం ఆటవెలది. వేమన 'పద్యాలు' చదువుకొనే, పాడుకొనే పామరజనానికి ఆయన పద్యఛందస్సు 'ఆటవెలది' అని తెలియకపోవచ్చు. కాని, అది 'పద్యం' అని స్పష్టంగా తెలుసు

పదసాహిత్య ప్రక్రియల అన్నింటిలో 'ముద్ర' ఒక ముఖ్య లక్షణం. త్యాగరాజ కృతుల్లో 'త్యాగరాజనుత' అనే ముద్ర తప్పకుండా ఉంటుంది. దానిని బట్టి అది త్యాగరాజ రచనగా గుర్తించటానికి వీలౌతుంది. శతకంలో 'మకుటం' ఇటువంటి ప్రయోజనాన్నే సాధిస్తుంది కూడా. వేమన పద్యాల్లోని చివరి పాదాల్లో "విశ్వదాభిరామ వినురవేమ" అనే మకుటం తప్పకుండా ఉంటుంది. దీన్ని వేమన శతక సంప్రదాయం నుంచే కాకుండా పదకవితా సంప్రదాయం నుంచి కూడా గ్రహించాడని చెప్పటం సత్యానికి సన్నిహితంగా ఉంటుందని భావిస్తున్నాను. వేమన్న రచించిన 'పద్యం' లో 'ముద్ర' తప్ప కుండా ఉంటుంది. ఇది వేమన శతకపద కవితాప్రక్రియల సమాన లక్షణంగా రూపొందించుకొన్న మకుట ముద్ర. బహుశః వేమన పద్యాలు ఏక్‌తారా మీద పాడుతూ ఉంటే శ్రుతిలో లయమయ్యే పద్య భాగం మకుట ముద్ర కావచ్చు. వేమన శతక పదప్రకియలను మకుట ముద్రలో యోగించి యోగి అయ్యాడు; అతని పద్యం ఒక ప్రక్రియ; అతని మకుటం ఒక ముద్ర.

18 వ శతాబ్ది తొలిపాదంలో వేమన పద్యాలు ప్రజల్లో బాగా వ్యాపించి ఉంటాయి. 1640-1725 మధ్య నివసించిన వేమన పదానికీ, పద్యానికీ ఒక విచిత్రమైన సంబంధం కలిపాడు. దానిని తత్త్వంలా పాడాడు. ప్రజలు ఆయనతో గొంతు కలిపి పాడుకొన్నారు. వేమనలాగా ముద్రలు నిలిపి కందాలూ, వృత్తాలూ కూడా చెప్పుకొన్నారు. వేమన తనువు చాలించినా అతని పద్యం జీవితం చాలించలేదు. పాటరాని పదకర్తలు వేమన పద్యాల అనుకర్తలు. పదం భక్తిలో మునిగింది; పద్యం బ్రతుకులో ఈదింది.*

(1989)

* ఈ వ్యాసం 4-6-1989 నాటి ఆదివారం ఆంధ్రప్రభలో 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు' అనే సీరియల్‌లో ప్రచురించబడింది.

# త్యాగరాజ కృతి : ఆత్యంతిక ప్రకృతి

"ఒక్క దక్షిణ భారత సంగీత చరిత్రలోనే కాకుండా, ప్రపంచ సంగీత చరిత్రలో కూడ 1750 నుండి 1850 వరకూ అత్యంత ప్రధానమైన యుగం. రెండు చరిత్రలలోను ఈ యుగాన్ని స్వతంత్ర ధాతుకల్పనాయుగమని పిలువ వచ్చును. యూరప్‌లో ఆనాడు బీతోవెన్, మోట్జార్ట్, మెండల్‌సోన్, షోపైన్, షూబెర్ట్, వీబర్, అను గొప్ప సంగీతకర్తలందరూ వెలిశారు. వారందరూ సోనాటా సింఫోని ఇత్యాదిగా (ఆర్కెస్ట్రా) వాద్యమేళములపైనీ, ప్రత్యేక వాద్యములపైనీ ప్రయోగింపదగిన సంగీత రచనలను అపూర్వమైన ధాతుకల్పనాచాతుర్యముతో వెలువరించి యశోధనులైనారు. ఇదే యుగంలో తమ స్వతంత్ర ధాతుకల్పనా త్మకములయిన కీర్తనలతో దక్షిణ భారత సంగీతానికి అఖండపరివ్యాప్తిని చేకూ ర్చిన అవతారమూర్తులయిన వాగ్గేయకారులు త్యాగరాజు, శ్యామశాస్త్రి, ముత్తు స్వామి దీక్షితులు. కర్ణాటక సంగీత చరిత్రకారులు వీరు మువ్వురినీ సంగీత త్రిమూర్తులనీ, రత్నత్రయమనీ పిలుస్తారు. శ్యామశాస్త్రులు (1762-1827), త్యాగయ్య (1767-1847), ముత్తుస్వామి దీక్షితులు (1776-1835) - ముగ్గురూ తంజావూరు జిల్లాలోని తిరువారూరుకు సంబంధించినవారే, సమకాలికులే. వారి రచనలలో రాగస్వరూపము పరిపూర్ణమై సర్వకళలతోను స్పష్టముగా స్ఫురిస్తూ ఉంటుంది. మృదువైన భాషాశిల్పానికిగానీ, నవ్యకల్పనలతో నిత్యసుందర మయిన సంగీత శిల్పానికిగానీ ముందు వీరిని స్మరించి, మిగిలినవారిని స్మరిం చాలి. అతి అపూర్వరాగాలలో కూడ అతి సునాయాసంగా చెప్పిన కీర్తనలూ, ఒకే రాగంలో వేర్వేరు ప్రత్యేక వ్యక్తిత్వాలు, వేర్వేరు కీర్తనలూ, ఆ కీర్తనల రసభావౌన్నత్యమూ, వాటి సంగీత రచనలో ఆత్మోత్తేజకమయిన ఉదాత్తతా ఈ ముగ్గురు మహనీయులకూ సంగీతరత్నత్రయ పదవిని పట్టముగట్టిన ప్రధాన లక్షణము లని శ్రీ సాంబమూర్తిగారు తమ వాగ్గేయకార చరిత్రలో వ్రాశారు." (శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారి ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము-పు.314.)

కర్ణాటక సంగీత సంప్రదాయంలో రత్నత్రయంగా గౌరవింపబడే పై ముగ్గురు కవులూ ఆంధ్ర సాహిత్య ప్రక్రియా వికాసచరిత్రలో నిర్వహించిన

పాత్రను సమీక్షిస్తే వారి ముగ్గురిలో త్యాగరాజు కృతిప్రక్రియాప్రవర్తకుడుగా, వాగ్గేయకార మూర్ధన్యుడుగా మాన్యుడౌతున్నాడు. ముత్తుస్వామి దీక్షితులు తెలుగువాడైనా ఆయన రచనలన్నీ సంస్కృతంలో సాగాయి. శ్యామశాస్త్రిగారి స్వరజతులూ, తాన వర్ణనలూ, కృతులూ ప్రసిద్ధి చెందినా త్యాగరాజ కృతులకు వచ్చిన ప్రశస్తిని పొందలేదు. అందువలన ఈ ముగ్గురిలో త్యాగరాజు ఘనుడు; ఆయన కృతి సంగీత ప్రధానమైన సాహిత్యపదకవితా ప్రక్రియలలో మిన్న.

సంగీత సంప్రదాయాన్ని సృజనాత్మక ప్రతిభతో సమగ్రంగా పోషిస్తూనే, దానికి సాహిత్య గౌరవాన్ని కూడా కల్పించిన మహనీయుడు త్యాగయ్య. అందువలన ఆయన కృతుల్లో సంగీత విద్వాంసులు గానరసమాధుర్యాన్ని ఆస్వాదించి, ఆస్వాదింపజేస్తారు. సాహిత్యమర్మజ్ఞులు భావసౌరభాలను ఆస్వాదించి సాహిత్య రస వివేచనం చేస్తారు. అయినా కృతిలో సంగీతసాహిత్యాలు నీరక్షీరన్యాయంగా కలిసి ఉండటంచేత ఉభయ సంప్రదాయాలు తెలిసిన ఉచితజ్ఞులుకాని దాని తత్త్వాన్ని ఉజ్జ్వలంగా వ్యాఖ్యానించలేరు.

సంగీత విద్వాంసులు త్యాగరాజు ప్రస్తరించిన రాగవైభవాన్ని జీవనగానంగా ఆలపిస్తారు. సమగ్రరాగ ప్రస్తారమే త్యాగరాజస్వామి ధ్యేయమనీ, వానికి ఆలంబనంగా కృతులలోని సాహిత్యాన్ని నిలిపాడనీ సంభావిస్తారు. కృతిలోని భావం కంటె స్వరప్రస్తారమే ముఖ్యమనీ, దానివలన కలిగేది గానరసమనీ భావించి కృతుల నాలపిస్తారు. వారి దృష్టిలో త్యాగయ్యకు సంగీతంమీద ఉన్న భక్తి అధికం; సాహిత్యంమీద ఉండే రక్తి గౌణం. అయితే, సాహిత్యోపాసకులు మాత్రం త్యాగరాజ కృతులలోని సాహిత్య రసికత్వాన్నీ, సంగీత సంయోజన సౌలభ్యాన్నీ సమీక్షించి భక్తిరససిద్ధిని సాధించుకొంటారు. ఒకరు గానరసోపాసకులు; మరొకరు సాహిత్యరసోపాసకులు.

గానరసం స్వరలయ సమ్మేళన కళావిన్యాసం వలన ప్రతీయమానమయ్యే ఆనందానుభవం. సాహిత్య రసం శబ్దార్థ శక్తుల ద్వారా ప్రతీయమానమయ్యే భావాల చర్వణంవలన సహృదయు డనుభవించే అలౌకికానందం. రసానందస్థితి రెండింటిలోనూ ఉన్నది. అయితే, గానరసంలో అవ్యక్తంగా, ఆపాతమధురంగా రసస్థితి ఉంటుంది. సాహిత్యరసంలో వ్యక్తమైన అర్థస్థితి యొక్క ఆలోచనం ద్వారా కలిగే అమృతత్వ లబ్ధిగా రసస్థితి నిలుస్తుంది. రసస్థితి ద్రవస్థితి. నాదం

గానీ, స్వరంగానీ సహజంగా ఆర్ద్రబిందువులు. సంగీతంలో స్వరాల వలన కలిగే అనుభవం సముద్రంమీద వాన కురిసినట్లుంటుంది. జలబిందువులు జలంలో వివక్షా విరహితంగా ఏకమైపోతున్నట్లుంటుంది. అందువలననే సంగీతాన్ని ఆపాత మధురమని వివేచించారు ప్రాచీనులు.

సాహిత్యంలోని శబ్దాలు వడగళ్ళ లాంటివి. వడగళ్ళవాన పడితే, అవి కరిగి నీరై జలరూపంగా మారి నీటిలో ఏకం కావటానికి కొంత కాలం పడుతుంది. శబ్దంలోని అర్థం - లేదా భావం - ఆర్ద్రమైన వడగళ్ళలోని జలం వంటిది. కవితలోని శబ్దమాధుర్యం అర్థవిచారణం వలన గాని రసస్థితి నందింపలేదు. కాని, కృతిలోని స్వరం సరాసరి రసస్థితిని కలిగిస్తుంది. గానరసంలో శబ్దార్థ విచారణం లేదు. శిశువులా, పశువులా, ఫణిలా నాదాన్ని అర్థవ్యక్తితో అవసరం లేకుండానే ఆస్వాదించటం అందులో ప్రధానం. ఆర్ద్రమైన నాదంతో ఆత్మను రసార్ద్రం చేసికోవటమే గానరస ఫలం. పాడితే త్యాగరాజ కృతులు అక్షయగాన రసాన్ని అందిస్తాయి.

కృతికి స్వచ్ఛమైన సంగీతానికి లాగానే గానరసమే ధ్యేయమని సంగీత మర్మజ్ఞుల మతం. అయితే, త్యాగరాజు సంగీతాన్నీ, గీతాన్నీ సంవదించి మన కందించి కృతిని సుకృతిని చేశాడు. త్యాగయ్య కృతులలో సాహిత్యం నీటిలో కరుగుతున్న చక్కెర పొడి లాంటిది. దానివలన కృతికి రుచి లభిస్తుంది. రుచి అంటే ఆస్వాదనీయత్వం అనీ, కాంతి అనీ రెండర్థాలున్నాయి. ఈ రెండర్థాలూ త్యాగరాజ కృతుల్లో అన్వర్థాలయ్యాయి. స్వరం భావాన్ని వ్యక్తీకరించలేదు; భావావస్థను మాత్రమే భాసింప చేస్తుంది. అందువలన స్వరం శబ్దాన్ని ఆశ్ర యిస్తుంది. దానివలన దీనికి ఆస్వాదనీయత్వం సిద్ధిస్తుంది. శబ్దం అర్థవంతం కాబట్టి అర్థదీప్తిని ప్రసాదిస్తుంది. కృతుల్లోని సాహిత్య గౌరవమే అర్థదీప్తి, ఆలోచనామృతం. దానిని ఉపాసిస్తే లభించేది సాహిత్య రసానందం.

కృతికి ఒక ప్రకృతిని, ఆకృతిని, ప్రవృత్తిని కల్పించినవాడు త్యాగయ్య. వాటిపై ఆయన శక్తియుక్తుల ప్రభావం తప్పకుండా ఉంటుంది. కృతికి మూడు పాళ్ళ సంగీత భావాన్నీ, ఒక పాలు సాహిత్య భావాన్నీ త్యాగయ్య కల్పించా డని సంగీత సాహిత్య మర్మజ్ఞులైన రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు వివేచిం చారు. "గేయ కల్పనలో అపూర్వశక్తి, అసాధారణ ప్రతిభలు గల ధీశాలి. అతడు పాటను నేర్చినంత శ్రద్ధతో మాటను నేర్వలేదు. సంగీత భావము

ముందర సాహిత్య భావము గౌణముగానే నడచును ఇట్లగుటకు కారణము - త్యాగయ్యకుఁగల అపారమైన గానవిద్యా పాండిత్యమే నాకు జూడఁగా పాటను నేర్చునంత శ్రద్ధతో అతడు మాటను నేర్వలేదు మాటయందతనిది ఇంచుమించు పోతన్న వంటి సహజ పాండిత్యము పాటలో నట్లుగాదు సుప్రసిద్ధులగు సొంటి వారి శిష్యుడు మీదు మిక్కిలి నారద మహర్షి యనుగ్రహమునకు పాత్రుడు రజత గిరీశుడు నగజకు దెల్పు స్వరార్ణవ మర్మములు విజయముగల త్యాగ రాజు కెరుకే అను గొప్ప ఆత్మప్రత్యయముగల క్రొవ్విన పండితుడు కనుకనే అతని సాహిత్యము మూడుపాళ్ళ సంగీతము నాశ్రయించి ఆకుమరుగుపిందెవలె నున్నది సంగీతభావము ముందర సాహిత్యభావము గౌణముగానే పడచును (త్యాగరాజయ్యసాహిత్యము (వ్యా) ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవసంచిక - 1965 పు 246 - 247 )

సాహితీ మర్మజ్ఞులు - సంగీతం వదలివేసినా సహజసుందరమైన భాషా రచనతో కృతి కమనీయమై ఒప్పతూండడం మనం గమనించగలం దీని కేకృతి అయినా ఉదాహరణమే అవుతుంది (డా గంగప్ప తెలుగులో పద కవిత పు 181) అని భావించటంకూడా ఉన్నది

ఈ విచికిత్స వలన తేలిందేమంటే - త్యాగరాజ కృతిని సాహిత్య ప్రక్రియగా పరిగణించటం సమంజసమేనని అయితే పదకవితా ప్రక్రియల్లో కృతి సంగీతస్వభావాన్ని విరివిగా సంతరించుకొన్న మిశ్రప్రక్రియ సంగీత సాహిత్యాంశాల సంగమస్థితి కృతిలో భాసించినా వాటిలో సంగీతాంశాలకే స్థాన మెక్కువ అలా ఏర్పడటానికి త్యాగయ్యగారి సంగీతపాండిత్యమే ముఖ్యకారణ మని రాళ్ళపల్లివారు పేర్కొన్నారు అది కాదనలేని కారణంగా కూడా కనపడు తున్నది అంతకుమించి ఆ కాలంలో అన్వేషింపదగిన మరొక హేతువు ఏదైనా ఉన్నదా? అనే ప్రశ్న గమనింపదగింది

18 19 శతాబ్దాలలో తెలుగు సాహిత్య ప్రక్రియలు ప్రవర్తిల్లిన తీరు గమనిస్తే - ఆ కాలం ఆత్యంతిక ప్రవృత్తులకు ఆలవాలమైనదిగా (Age of extreme att tudes) తోస్తుంది కావ్యసంబంధి ప్రక్రియలన్నీ ఆ కాలంలో రసాన్నీ ధ్వనినీ ఆదరించటం మాని చిత్ర ప్రవృత్తులను ప్రకటించటానికి ప్రయత్నించాయి లచ్చతెలుగు కావ్యాలు నిరోష్ఠ్యాది కావ్యాలూ ద్వ్యర్థి కావ్యాలూ గర్భకవితా కావ్యాలూ చిత్రకవితా ప్రయోగ కావ్యాలూ - ఇవే

ఎక్కువగా కనపడతాయి ఈ కాలంలో. రసం నుండి రచనవైపు సాగే ప్రస్థానంలో ఇది ఒక ఆత్యంతికమైన ప్రవృత్తి.

శృంగారమంటే 'రతి రతికోసమే' అనే ప్రవృత్తిని ప్రకటించటమే మధురాపుర శృంగార కవుల ప్రయోగ తాత్పర్యం. రసానికున్న ఔచిత్యపు విలువలను, పురుషార్థపు విలువలను కాదని, విశృంఖల రతి ప్రవృత్తిని వెలార్చే ఆత్యంతిక ప్రవృత్తి అది. రసానికి రసత్వస్థితి లేని అంచులను అందుకొనే యత్నం ఆ ప్రయోగం.

పద్యాల్లో, దేశిచ్ఛందాల్లో, చంపూరీతుల్లో రచించే పద్ధతిని మాని వచనైక కావ్యాలను వ్రాయాలనీ, అన్ని ప్రక్రియలనూ వచనంలో వినిర్మించాలనీ వెలువడిన మరొక ఆత్యంతిక ప్రవృత్తి ఈ కాలంలో గోచరిస్తుంది.

పదకవితా ప్రక్రియలలో సంగీతనాట్య సాహిత్యభావాల సమ ప్రాధాన్యం క్షేత్రయ్య రచనల్లో కానవస్తుంది. ఆ సమస్థితినుండి పదకవితను సంగీతం వైపు బాగా మొగ్గేటట్లుచేసి, కృతిని ప్రయోగించిన త్యాగయ్య కూడా ఆ యుగ ధర్మంలో సహజంగా ఇమిడియున్న ఆత్యంతిక ప్రవృత్తిని ప్రకటించాడని భావించటంలో విప్రతిపత్తి ఉండదేమో!

వాగ్గేయకారుల రచనలు సహజంగానే మిశ్ర స్వభావం గల ప్రక్రియలు. అందులో సంగీతం వైపు బాగా మొగ్గిన ప్రక్రియలను సాహిత్య విద్వాంసులు అంతగా పరిగణించరు. అందువలననే త్యాగరాజ కృతులను సాహిత్య శిల్పనిధులుగా గాని, కావ్య కళారస నిష్యందములుగా గాని విమర్శకులు లెక్కించరు. వాగ్గేయకారుల రచనలలో సహజంగా ఉండదగినంత మాధుర్యాన్ని మాత్రమే వారు అభిలషిస్తారు. ప్రబంధానికీ పదకవితా ప్రక్రియకూ ఉన్న భేదాన్ని గుర్తిస్తారు. ప్రక్రియాశక్తినిబట్టి పరిశీలిస్తారు. పదకవితా కర్తలను సాహిత్య చరిత్రకారులు, సాహితీ విమర్శకులు తగినంతగా గుర్తించి, వారి పేర్లమీద సాహిత్య చరిత్రలో యుగ విభాగాలను ఏర్పరచి, వారి సాహిత్యపు విలువలను ప్రత్యేకంగా అధ్యయనం చేయలేదని ఆధునికులలో ఎందరో బాధపడుతున్నారు. అన్నమాచార్యులకు ఒక యుగ నాయకత్వం ఇవ్వాలని ప్రతిపాదించారు కూడా. పదకవితాచరిత్రయే వ్రాస్తే క్షేత్రయ్య తరువాత త్యాగయ్యకు యుగకర్తృత్వం

నిస్సంశయంగా కట్టిబెబుతున్నారు ఎందువలన? పదకవితలో మాతువు కంటె ధాతువుకే అత్యంత ప్రాధాన్యమిచ్చే కృతివైపు దాన్ని పరిణమింపవేశా డాయన కర్ణాటక సంగీత విద్వాంసులందరూ కూడ త్యాగరాజ కృతులు పాడతారు కాని, వారికందరికీ ఆ కృతులలోని సాహిత్యపు విలువలు తెలియవు అయితే తెలియక పోయినా కృతులను పాడవచ్చు కదా అని సాహిత్యపు విలువలు లేకుండా ఉండటం కృతికి నియత లక్షణంగా నిర్దేశించలేము సాహిత్య ప్రక్రియకు ఇటు వంటి అవస్థ నిజంగా ఆత్యంతిక పరిస్థితి వలన ఏర్పడిందనే చెప్పాలి అది గుణమా? లోపమా? బలహీనతయా? బలమా? - ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పటం కష్టం

ఎందువల్లనంటే - కృతుల్ని ఆయా రాగాల్లో స్వరవిన్యాసంతో ఆలపించి నప్పుడే వాటిల్లో ఉండే సాహిత్యం సహృదయులకు రసానందాన్ని కలిగిస్తుంది కృతులను మనం పాడుకొనకుండా వట్టిగా చదువుకుంటే రసానందం పొందలేక పోవచ్చు ఇది అనుభవ సత్యం కూడా ప్రబంధంలోని పద్యంవంటిది కాదు పదకవిత్వ శాఖలోని కృతి కృతిసాహిత్యంలోని భావాంశ సంగీత శక్తిమీద ఆధారపడి ఉంటుంది పాడితేనే సంగీతపరంగానూ సాహిత్యపరంగానూ పరిపూర్ణ రసానుభవం కలిగించె సహజస్వభావం త్యాగరాజకృతి కలిగిఉండటం దాని ప్రత్యేకత ఇది పద కవితా ప్రక్రియ యొక్క ఆత్యంతిక ప్రవృత్తికి పరాకాష్ఠ సంగీతంలో జాలువారే త్యాగయ్య కృతులలోని సాహిత్యాంశ భక్తి భావ తీవ్రతకు ప్రాతినిధ్యం వహించటంచేత సాహితీపరులు కృతులను సాహిత్య ప్రక్రియగా సమ్మానించకుండా ఉండలేకపోతున్నారు అందువలన సాహిత్య వికాస చరిత్రలో కృతుల పేర ఒక యుగాన్ని 19 వ శతాబ్ది పూర్వార్ధంలో సంభావించటం సంభవించింది

త్యాగయ్య సాహిత్య ప్రక్రియను సంగీత ప్రక్రియగా మార్చేంత ఆత్యం తిక ప్రవృత్తిని ప్రకటించటంవలన సంగీతానికి ఎంతో మేలు జరిగింది సాహి త్యానికి ఒక నవ్యప్రక్రియ దక్కింది త్యాగయ్య కృతులు ఇంతకంటె మరి కొన్ని విలువలు కూడా ఆ యుగంలో సాధించాయి

1 పదకవితలలో మధురభక్తి ఆధ్యాత్మికశక్తిని క్రమంగా కోల్పోయి లౌకికప్రవృత్తిపై తౌల్యాన్ని ప్రదర్శించటం మొదలుపెట్టటంవలన త్యాగయ్య తన కృతుల్లో నవవిధభక్తులనే పాటించాడు కాని మధురభక్తికి ఎక్కువ

ప్రాధాన్యం ఇవ్వలేదు. దానివలన ఈ యుగంలో భక్తికి ఒక పవిత్రభావం ఏర్పడింది. అది శక్తి కలదని, ముక్తి నివ్వగలదని, ఆరాధనా విశేషంగా సాహిత్యాన్ని మార్చగలదనీ, అంతరాత్మను ఆధ్యాత్మికానుభూతితో నింపగలదనీ సహృదయ లోకంలో విశ్వాసం పెంపొందింది.

2. పద్యరచన శ్లేషక్రీడలతోనూ, చిత్రగర్భ కవితలతోనూ, అనేకార్థాలతోనూ సర్కస్ చేస్తూ వినోదాన్నీ, విసుగునూ కలిగిస్తున్న రోజుల్లో వచనం ఆ స్థానంలో నిలిచి సాహితీ ప్రక్రియలను పునరుజ్జీవింపచేయాలని ముందుకు వస్తూంటే- దానికి ప్రతిగా దేశిరచనా ప్రక్రియలు సంగీతాన్ని ఆశ్రయించి తమ ప్రాపకాన్ని పెంచుకొంటున్న తరుణంలో సంగీతాశ్రయత్వానికి ఆత్యంతికస్థితిని కలిగించే ప్రక్రియను నిర్మించి తన అస్తిత్వాన్ని నిలుపుకొన్నాడు త్యాగయ్య.

18, 19 శతాబ్దులలో ప్రసిద్ధులందరూ అంతో, ఇంతో, కాదా ఎంతెంతో ఆత్యంతికప్రవృత్తి ప్రదర్శించినవారే. వారిలో శృంగార కవులకు కాలం శృంగభంగం చేసింది; మధురభక్తి కవుల రచనలపై కాలం వెగటు పుట్టించింది. చిత్రకవితల మీద వేలంవెర్రి పెచ్చుపెరగటంతో చివరకు భారతి కంటనీరు పెట్టవలసివచ్చింది. అయితే, ఆత్యంతిక ప్రవృత్తిని ప్రకటించినా కాలాంతరంలోకూడా ప్రజాదరణం పొందినవారు ఇద్దరే ఉన్నారాకాలంలో. వారు వేమన, త్యాగయ్య. ఆత్యంతికప్రవృత్తి కూడా అన్నివేళలా అనర్థదాయకం కాదని వీరిరువురూ నిరూపించారు.*

(1989)

---

* ఈ వ్యాసం 28-5-1989 నాటి ఆదివారం ఆంధ్రప్రభలో - 'సాహిత చరిత్రలో చర్చనీయాంశాలు' అనే సీరియల్‌లో ప్రచురింపబడింది.

# వీర శాంత రసవాదాలు – ఒక వివేచన

కావ్యానుశీలనంలో నేటికీ పరమప్రమాణంగా పరిగణింపబడుతున్నది రసమే అయినా ఆ రసాన్ని గురించి ఉన్నత విద్యాసంస్థలలో అందరికీ అందుబాటులో ఉండే పద్ధతులలో విద్యార్థులకు బోధింపబడటం లేదు రసం విమర్శలో అనువర్తింపబడటం లేదు సాహిత్యానికి సహజంగా ఉండే సాహిత్యపు విలువలను గురించి వివేచన జరిగే ఈ రోజుల్లో కొందరు రసంవైపు, రససిద్ధాంతాల అవగాహనవైపు వాటి అనుశీలన పద్ధతులవైపు ప్రత్యేక శ్రద్ధ వహిస్తూండటం సంతోషదాయకం ఈ తరుణంలో వీర శాంత రసాల స్వరూప స్వభావాలను గురించి వాటి సామ్యభేదాలను గురించి ముచ్చటించటం ప్రస్తుత వ్యాసాంశం

## రసం అలౌకికం

ఈ మాట అనగానే కొందరు ఆధునికులు అలౌకికం అనే మాటకు నేడు వ్యవహారంలో ఉన్న అనేకార్థాలను దృష్టిలో పెట్టుకొని పై పరిభాషను పరిహాసం చేసేస్తారు తొందరపడి సాహిత్య శాస్త్రం కూడా ఒకశాస్త్రం కాబట్టి అన్ని శాస్త్రాలకు లాగానే దానికీ కొన్ని పారిభాషికపదా లున్నాయి వాటిని మనం మన్నించకపోతే శాస్త్రానికి శాస్త్రత్వం పోదు కాని మనకు శాస్త్ర విజ్ఞానానికి సంబంధించిన ఒక శిక్షణ విధానం లోపిస్తుంది అందువలన వ్యవహారానికీ శాస్త్ర పరిభాషకూ ఉన్న తేడాను మొదట గమనించి రసంవైపు సాగాలి

లోకంలో ఇంద్రియ గోచరాలయ్యేవన్ని వ్యావహారికసత్తా రూపాలు వీటికి సంబంధించిన అనుభవం లౌకికం మనోగోచరాలయ్యేవన్నీ ప్రాతిభాసిక సత్తా రూపాలు వీటి అనుభవం అలౌకికం ఆత్మసాక్షాత్కారాదులు ఆధ్యాత్మిక సత్తా రూపాలు వాటి అనుభవం ఆధ్యాత్మికం లోకంలో భార్యాభర్తలు నిత్య జీవితం శృంగారమయంగా సాగిస్తున్నారు వారు సుఖదుఃఖాత్మకమైన లౌకికానుభవాలు పొందుతారు వారే కావ్యగత పాత్రలైన సీతారామాదుల ప్రణయ గాథలను చదివిగాని రూపకాలలో చూచిగాని ఒక అలౌకికమైన ఆనందాన్ని పొందుతారు దాన్ని రసానంద మంటారు ఇందులో సుఖదుఃఖాత్మకమైన అనుభవాలు చివరకు ఒక ఆనంద స్పర్శతోకూడిన అవ్యక్త మధురానుభవంగా పర్యవసి

స్తాయి. లౌకికమైన సుఖాదుఃఖాలు సైతం ఆనందమయంగా అనుభవానికి అందటం అలౌకికమైన రసానుభవం. లౌకిక అలౌకికభావాలన్నీ ఆత్మానందంలో అంతర్భవించి సమాధిస్థితిని కలిగించే ప్రవృత్తి కలిగినవి; ఆధ్యాత్మికాలు. వీటిని నివృత్తిపరమైన అనుభవాలుగా పరిగణిస్తారు. ముచ్చటగా మూడు మాటల్లో చెప్పాలంటే - వీటిని ఆనందత్రయ మనవచ్చు.

1. లౌకికానందం - ఇంద్రియ గోచరమయ్యేది: లోకాశ్రయం.
2. అలౌకికానందం - మనస్సుచే అనుభవించేది - కల్పితం.
3. ఆధ్యాత్మికం - బుద్ధిచే అనుభవించేది - అంతర్ముఖం.

నిజానికి లౌకిక అనుభూతులు రసా లనబడవు. అలాగే ఆధ్యాత్మికా నుభూతులను గూడా కొందరు రసాలుగా అంగీకరించరు. అలౌకికాలే రసాను భవాలు. అయితే, భానుదత్తుని వంటి లాక్షణికులు లౌకికాలౌకిక భేదాన్ని స్పష్టం చేయటానికి లౌకిక, అలౌకిక రసాలను పేర్కొన్నారు[1]. లౌకిక విషయ సంబంధంనేత కలిగింది లౌకికం; అలౌకిక విషయ సంబంధం చేత కలిగింది అలౌకికం. లౌకికరసం ఆరు రకాలు; అలౌకిక రసం మూడు విధాలు. అవి 1. స్వాప్నికం; 2. మానోరథికం. 3. ఔపనాయకం.కలలు కనేటప్పుడు పొందే అనుభవం స్వాప్నికం; ఊహాజగత్తులో విహరించేటప్పుడు పొందే అనుభవం మానోరథికం; కావ్యపద పదార్థ చమత్కార నాట్య నిష్ఠమైనది ఔపనాయకం. ఈ మూడూ లౌకికాలు గావు- ప్రాతిభాసికాలు; అలౌకికాలు.

## రసాస్వాదం

రసాన్ని ఆస్వాదించటానికి సహృదయులే అర్హులు. "యేషాం కావ్యాను శీలన వశాత్ విశదీభూతే మనోముకురే వర్ణనీయ తన్మయీభవన యోగ్యతా తే హృదయ సంవాద భాజః సహృదయాః" అని ఆనందవర్ధను డన్నాడు. అటువంటి సహృదయుడు రసానందాన్ని క్రమంగా నాలుగు దశలను దాటి అయిదవ

1. సరసోద్వివిధో లౌకికోఽలౌకికశ్చేతి। లౌకిక సన్నికర్ష జన్మా లౌకికః, అలౌకిక సన్నికర్ష జన్మా త్వలౌకికః। లౌకిక సన్నికర్షః షోఢా విషయగతః।.... అలౌకికరస స్త్రిధా స్వాప్నికో, మానోరథిక, ఔపనాయశ్చేతి। ఔపనాయకశ్చ కావ్యపద పదార్థ చమత్కారే నాట్యేచ। పరంతు ద్వయోః రస్యానందరూపతా" - రసతరంగిణి - 6 వ తరంగం - పుట. 25

# వీర శాంత రసవాదాలు – ఒక వివేచన

కావ్యానుశీలనంలో నేటికీ పరమప్రమాణంగా పరిగణింపబడుతున్నది రసమే అయినా ఆ రసాన్ని గురించి ఉన్నత విద్యాసంస్థలలో అందరికీ అందుబాటులో ఉండే పద్ధతులలో విద్యార్థులకు బోధింపబడటం లేదు రసం విమర్శలో అనువర్తింపబడటం లేదు సాహిత్యానికి సహజంగా ఉండే సాహిత్యపు విలువలను గురించి వివేచన జరిగే ఈ రోజుల్లో కొందరు రసంవైపూ రససిద్ధాంతాల అవగాహనవైపూ వాటి అనుశీలన పద్ధతులవైపూ ప్రత్యేక శ్రద్ధ వహిస్తూండటం సంతోషదాయకం ఈ తరుణంలో వీర శాంత రసాల స్వరూప స్వభావాలను గురించి వాటి సామ్యభేదాలను గురించి ముచ్చటించటం ప్రస్తుత వ్యాసాంశం

## రసం అలౌకికం

ఈ మాట అనగానే కొందరు ఆధునికులు అలౌకికం అనే మాటకు నేడు వ్యవహారంలో ఉన్న అనేకార్థాలను దృష్టిలో పెట్టుకొని పై పరిభాషను పరిహాసం చేసేస్తారు తొందరపడి సాహిత్య శాస్త్రం కూడా ఒకశాస్త్రం కాబట్టి అన్ని శాస్త్రాలకు లాగానే దానికి కొన్ని పారిభాషికపదా లున్నాయి వాటిని మనం మన్నించకపోతే శాస్త్రానికి శాస్త్రత్వం పోదు కాని మనకు శాస్త్ర విజ్ఞానానికి సంబంధించిన ఒక శిక్షణ విధానం లోపిస్తుంది అందువలన వ్యవహారానికి శాస్త్ర పరిభాషకూ ఉన్న తేడాను మొదట గమనించి రసంవైపు సాగాలి

లోకంలో ఇంద్రియ గోచరాలయ్యేవన్నీ వ్యావహారికసత్తా రూపాలు వీటికి సంబంధించిన అనుభవం లౌకికం మనోగోచరాలయ్యేవన్నీ ప్రాతిభాసిక సత్తా రూపాలు వీటి అనుభవం అలౌకికం ఆత్మసాక్షాత్కారాదులు ఆధ్యాత్మిక సత్తా రూపాలు వాటి అనుభవం ఆధ్యాత్మికం లోకంలో భార్యాభర్తలు నిత్య జీవితం శృంగారమయంగా సాగిస్తున్నారు వారు సుఖదుఃఖాత్మకమైన లౌకికానుభవాలు పొందుతారు వారే కావ్యగత పాత్రలైన సీతారామాదుల ప్రణయ గాథలను చదివిగాని రూపకాలలో చూచిగాని ఒక అలౌకికమైన ఆనందాన్ని పొందుతారు దాన్ని రసానంద మంటారు ఇందులో సుఖదుఃఖాత్మకమైన అనుభవాలు చివరకు ఒక ఆనంద స్పర్శతోకూడిన అవ్యక్త మధురానుభవంగా పర్యవసి

స్థాయి. లౌకికమైన సుఖాదుఃఖాలు సైతం ఆనందమయంగా అనుభవానికి అందటం అలౌకికమైన రసానుభవం. లౌకిక అలౌకికభావాలన్నీ ఆత్మానందంలో అంతర్భవించి సమాధిస్థితిని కలిగించే ప్రవృత్తి కలిగినవి ఆధ్యాత్మికాలు. వీటిని నివృత్తిపరమైన అనుభవాలుగా పరిగణిస్తారు. ముచ్చటగా మూడు మాటల్లో చెప్పాలంటే - వీటిని ఆనందత్రయ మనవచ్చు.

1. లౌకికానందం - ఇంద్రియ గోచరమయ్యేది: లోకాశ్రయం.
2. అలౌకికానందం - మనస్సుచే అనుభవించేది - కల్పితం.
3. ఆధ్యాత్మికం - బుద్ధిచే అనుభవించేది - అంతర్ముఖం.

నిజానికి లౌకిక అనుభూతులు రసా లనబడవు. అలాగే ఆధ్యాత్మికా నుభూతులను గూడా కొందరు రసాలుగా అంగీకరించరు. అలౌకికాలే రసాను భవాలు. అయితే, భానుదత్తుని వంటి లాక్షణికులు లౌకికాలౌకిక భేదాన్ని స్పష్టం చేయటానికి లౌకిక, అలౌకిక రసాలను పేర్కొన్నారు[1]. లౌకిక విషయ సంబంధంచేత కలిగింది లౌకికం; అలౌకిక విషయ సంబంధం చేత కలిగింది అలౌకికం. లౌకికరసం ఆరు రకాలు; అలౌకిక రసం మూడు విధాలు. అవి 1. స్వాప్నికం; 2. మానోరథికం. 3. ఔపనాయకం.కలలు కనేటప్పుడు పొందే అనుభవం స్వాప్నికం; ఊహాజగత్తులో విహరించేటప్పుడు పొందే అనుభవం మానోరథికం; కావ్యపద పదార్థ చమత్కార నాట్య నిష్ఠమైనది ఔపనాయకం. ఈ మూడూ లౌకికాలు గావు- ప్రాతిభాసికాలు; అలౌకికాలు.

## రసాస్వాదం

రసాన్ని ఆస్వాదించటానికి సహృదయులే అర్హులు. "యేషాం కావ్యాను శీలన వశాత్ విశదీభూతే మనోముకురే వర్ణనీయ తన్మయీభవన యోగ్యతా తే హృదయ సంవాద భాజః సహృదయాః" అని ఆనందవర్ధను డన్నాడు. అటువంటి సహృదయుడు రసానందాన్ని క్రమంగా నాలుగు దశలను దాటి అయిదవ

1. సరసోద్వివిధో లౌకికోఽలౌకికశ్చేతి। లౌకిక సన్నికర్ష జన్మా లౌకికః। అలౌకిక సన్నికర్ష జన్మా త్వలౌకికః। లౌకిక సన్నికర్షః షోఢా విషయగతః।.... అలౌకికరస స్త్రిధా స్వాప్నికో, మానోరథిక, ఔపనాయశ్చేతి। ఔపనాయకశ్చ కావ్యపద పదార్థ చమత్కారే నాట్యేచ। పరంతు ద్వయో రస్యానందరూపతా" - రసతరంగిణి - 6 వ తరంగం - పుట. 25

దశలో పొందుతాడని అభినవ గుప్తపాదుడు చెప్పాడు. ఆ మాటలను డా॥ పోణంగి శ్రీరామ అప్పారావుగారి వివరణలో అందిస్తాను:

"1. హృదయ సంవాది అయిన విభావము (Aesthetic object) సామాజికుని కనులను, చెవులను విస్ఫారణేయును (Sense level).

2. ఈ దర్శన శ్రవణముల వలన సామాజికుడు భావనకు మొదలు పెట్టును. ఆ భావన వలన క్రమముగా నతడు ఆ విభావము యొక్క పరిమిత బాహ్య స్వరూపమునే కాక, అందు దాగియుండు బాహ్యేంద్రియములకు కన్పట్టని విశిష్ట ధర్మమును అనంతత్వమును దర్శింపగల్గును (Imaginative level). ఇందులకు రంగమున ప్రదర్శితమగు కావ్యమున వర్ణితమగు అనుభావాదికము దోహదము చేయును.

3. ఇట్లు విశిష్టదర్శన మైనంతనే వాని ప్రవృత్తియే మారిపోవును. ఇప్పుడు వానికి ఎదుట ప్రత్యక్షముగ కన్పించు విభావాదులతో పనిలేదు; వాని అంతర్యమును గూర్చి తాను భావన చేసిన విశిష్ట స్వరూపమే వాని మనఃఫలకము ఎదుట నిలిచి యుండును. (ఇట్టి అర్థమునందే "Art is the representation of the real in the mental aspect" అని Wors fold పేర్కొనెను). అనగా సామాజికుడు లౌకిక ప్రవృత్తి నుండి మరలి, స్వీయ సృష్టి అయిన ఒకానొక భావనాలోకమున సంచరించును. ఆ స్థితిలో అతడు పునఃపున రనుసంధానముచే తన భావనకు కారణమైన విభావముతో తాదాత్మ్యమును (Identity) పొందును. అనగా నాయకాద్యభేదమును పొంది, సాక్షాత్తుగా తదనుభావమునే తానును పొందుట కభిముఖు డగును. వెనువెంటనే నాయకాదుల ఆవేశాదు లెట్టివో అట్టివే వీనికిని కలుగ గలవు. అనగా వారి సుఖదుఃఖములనే ఈతడును పొందుచుండును. అదియే ఉద్వేగస్థితి (Emotional level). సామాజికునికి లేదా పాఠకునికి ఇట్టి స్థితిని పొందింపగల ప్రయోగము లేదా కావ్యము మాత్రమే ఉత్తమమని తెలియవలెను.

4. ఇట్లు సాక్షాన్నాయకాద్యనుభవమునే పొందుచు, ఆ భావ తీవ్రతకే లోనైన సామాజికుడు క్రమముగా తన్నుతాను మరచిపోవును. (Self forgetfulness) అనగా అతడు, స్వపరభేదములకు కారణమైన వ్యక్తిత్వమునే కోల్పోవును. అట్టి అలౌకికస్థితికే 'సాధారణీకరణ' మని పేరు (Univer-

salisation). సంభావన సరిగా లేకపోవుట మొదలగు ఏడు విఘ్నములను తరించినప్పుడే సామాజికు డిట్టి స్థితిని పొందగలడు.

5. ఈ సాధారణీకరణ స్థితిలో సామాజికుని బాహ్యేంద్రియములు పని చేయుట పూర్తిగా మానివేయును. స్థాయితో కూడిన హృదయము, ఆనందముతో కూడిన ఆత్మ - ఇవి రెండు మాత్రమే పనిచేయుచుండును. ఇదియే బ్రహ్మానంద సబ్రహ్మచారి అయిన రసస్థితి (Transcendency)." (నాట్యశాస్త్రము- పు. 228(

## రసానందం

రసానందం బ్రహ్మానంద సబ్రహ్మచారి అని లాక్షణికు లంటారు. కావ్యానందం ఇచ్ఛా క్రియాత్మక వృత్తు లణగిన మనస్సు యొక్క జ్ఞానవృత్తిచేత అనుభవింపబడుతుంది. బ్రహ్మానందం మనస్సంబంధం లేని బుద్ధితో అనుభవింపబడుతుంది. అటువంటి బుద్ధిని ప్రజ్ఞ అంటారు. ఆ ప్రజ్ఞను సాధించటాన్ని 'ఉన్మనీభావ' మనీ, 'అమనస్కయోగ'మనీ వేదాంతు లంటారు. అటువంటి అవస్థలో బుద్ధి అమనస్కమై ఆత్మవ్యాప్త మౌతుంది. అందులో స్వానందం ప్రతిబింబిస్తుంది. "ఆత్మాభిముఖ ధీవృత్తౌ స్వానందః ప్రతిబింబతి" అని వేదాంత పంచదశి. (11 ప్ర. 86 శ్లో.) ఆత్మానందం అతీంద్రియం, నిత్యం, నిర్విషయం, నిరతిశయమూ కావటంచేత బుద్ధిగ్రాహ్య మౌతుంది. "సుఖ మాత్యంతికం యత్తత్ బుద్ధి గ్రాహ్య మతీంద్రియమ్" అని భగవద్గీత. కాని, కావ్యానందం లేదా రసానందం ఇంద్రియ మనోగ్రాహ్యాలయిన కావ్యార్థాలవలన జనిస్తుంది; అందులోనూ అంతఃకరణవృత్తి ప్రధానంగా కలుగుతుంది.

అల్లమరాజు తన రసరత్న ప్రదీపికలో రసానందం - బ్రహ్మానందానికీ విషయానందానికీ మధ్యస్థమైనదని పేర్కొన్నాడు.[1] బ్రహ్మానందం ఏకరూపంగా అఖండంగా అప్రమేయమై ఉంటుంది. కాని, రసానందం మాత్రం రత్యాద్యనాది వివిధస్థాయి చిత్తవృత్తులచేత వివిధంగా గోచరిస్తుంది. బ్రహ్మానంద స్థితిలో ఆత్మకంటె ఇతరములైన వేవీ గోచరించవు. రసానుభూతిలో రత్యాదిచిత్త వృత్తులతో ఉపహితం కావటంచేత శృంగారాది రసాలు గోచరిస్తూ విభావాది చర్వణపర్యంతవ్యాప్తమైన ఆనందం తెలియబడుతూ ఉంటుంది. ఇదియే బ్రహ్మానందానికీ, రసానందానికీ గల భేదం.

---

1. రసరత్న ప్రదీపిక - ప్రథమ పరిచ్ఛేదము శ్లో. 10-15

అలంకారికులలో కొందరు రసాలన్నీ ఆనందదాయకా లని ప్రతిపా దించారు. అభినవగుప్తపాదుడే ఈ వర్గానికి నాయకుడు. మరికొందరు కావ్యరసాలు సుఖ దుఃఖాత్మకాలని భావించారు. భోజుడు, రుద్రభట్టు, శారదా తనయుడు మొదలైనవారు ఈ వర్గానికి చెందుతారు. ఈ రెండు వాదాలను సమన్వయించే వారు సహృదయులలో కూడా ఉత్తమమధ్యమాధమ భేదాన్ని ప్రతిపాదించిన భరతుని వివేచనను తీసికొని ఉత్తములకు రసాలు ఆనందానుభూతి నిస్తాయనీ, మధ్యములకు సుఖదుఃఖాత్మకాలుగా తోస్తాయనీ, అధములకు అనుభూతియే ఉండదనీ పేర్కొంటారు. ఏమయినా అలౌకికమైన రసానందం బ్రహ్మానంద సబ్రహ్మచారి యనే వాదం బహుళప్రచారంలో ఉంది; అనుభవానికి దగ్గరగా ఉంది.

## రససంఖ్య

"విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయమానః స్వాదుత్వం స్థాయీభావో రసస్మృతః"

అని ధనంజయుని ప్రవచనం. మానవునిలో స్థాయిభావాలే రసాలుగా పరిణ మిస్తాయి. "విభావానుభావ వ్యభిచారీ పరివృతః స్థాయిభావో రసనామ లభతే" అని భరతుడు చూపిన మార్గమే తరువాతి వారికి శరణ్యమైంది. భరతుడు రసస్థితిని పొందగలిగిన స్థాయిభావాలను ఎనిమిదింటిని పేర్కొన్నాడు. అందువలన రసము లెనిమిదనే ప్రసిద్ధి ఏర్పడింది- అవి: శృంగారము, హాస్యము, వీరము, అద్భుతము, రౌద్రము, కరుణము; బీభత్సము, భయానకము. శాంతముకూడ రసమని చాలమంది భావించారు. దానితో రసాలు తొమ్మిదనే వాదం ప్రచారం చెందింది. కాగా, కొందరు సంచారి భావాలుకూడా రసస్థితిని పొందుతాయన్నారు. మరికొందరు 'అనంతోవై రసాః' అని వాదించారు. అవన్నీ రంగంలో నిలవ లేదు. అష్టవిధరసవిచారానికి ఎటువంటి అభ్యంతరాలు లేవు. శాంతం రసమా? అయితే ఎటువంటి రసం? అనే అంశంమీద అలంకారికులలో అనేక వాదోపవాదా లున్నాయి. చివరకు శాంతం శృంగారాదులైన ఎనిమిది రసాలతోపాటు తొమ్మిదవ రసంగా కొందరిచేత పరిగణింపబడింది. కొందరిచేత అది రసా లన్నిటికీ మూలమైన ప్రకృతి రసంగా దర్శింపబడింది. ఈ వ్యాసంలో ప్రస్తా వించే వీర-శాంత రసాలకు ఒక సామ్యం ఉంది. ఒక భేదం ఉంది.

సామ్యం : వీర శాంతరసాలు అలౌకిక రసాలుగానే పరిగణింపబడే సంప్రదాయం లాక్షణికులలో ఉన్నది. వీరమే శాంతమనీ, శాంతమే వీరమనీ, వీరం ప్రవృత్తి రూపమైన ఉత్సాహ స్థాయి అనీ, శాంతం నివృత్తి రూపమైన ఉత్సాహ స్థాయి అనే ఒక వాదం ఉంది.

భేదం : ప్రాచీనాలంకారికులతో అభినవగుప్తపాదాదులు శాంత రసాన్ని ప్రకృతిరసమనీ, శృంగారాదుల వలెనే వీరం కూడా వికృతి రసమనీ భావించారు. వీరరసస్థాయి భావాన్ని గురించి భేదాభిప్రాయం లేదు. కాని, శాంతరసస్థాయిని గురించి అనేక వాదా లున్నాయి. వీరం అలౌకికం; శాంతం ఆధ్యాత్మిక రసం అనే వాదం ఉంది.

మరొక సామ్యం : నేను 'ధర్మవీర ఏవ రసానాం రసః' అనే వాదాన్ని ప్రతిపాదించాను. దానితో వీరరసం సహృదయులయందు ఉండే మూలరసంగా పరిగణింపబడుతున్నది. అంటే, శాంతంలాగా, వీరంకూడా ఏకైకరసమనీ, మూలరసమనీ చెప్పే రససమీకరణ వాదం నా వలన అలంకార శాస్త్రంలో కాలూనింది.

ఈ భూమికతో వీరరస శాంతవాదాల భేదసాదృశ్యాలను పేర్కొంటాను. ముందుగా శాంతరస స్థితిని ఆపై వీరరస స్థితిని తెలిపి, తులనాత్మకంగా సమీక్షిస్తాను.

## శాంతరసం : నవమరసం : ప్రకృతిరసం

రసాలలో శాంతానికి ఒక సమున్నత స్థానాన్ని లాక్షణికులు ఇచ్చారు. 'శాన్తః సర్వరసోత్కృష్టో న మైత్రీ న విరోధితా" అనీ అమృతానందయోగి చెప్పినమాటలు గమనింపదగినవి.[1]

శాంతానికి రసస్థితి నంగీకరించే లాక్షణికులలో ప్రధానంగా వినవచ్చే వాదాలు రెండు. ఒకటి - శాంతం నవమ రస మని వివేచించేది. "నిర్వేదస్థాయి భావాత్మకః శాంతోఽపి నవమో రసః" అని కావ్యప్రకాశిక. నవమ రసంగా శాంతాన్ని అంగీకరించేవారిలో కూడా దాని స్థాయిభావాన్ని గురించి ఏకాభిప్రాయం లేదు. కాగా, దాదాపు 15 వాదా లున్నాయి. రుద్రటాదులు 'సమ్యజ్ఞానం' అనీ, ఆనందవర్ధనాదులు 'తృష్ణాక్షయసుఖ' మనీ, అభినవగుప్తపాదుడు

1. అలంకార సంగ్రహము - 3 పరి. 44 శ్లో.

'అహంకార ప్రశమన' మనీ, హేమచంద్రాదులు 'శమ' మనీ, మరికొందరు 'సర్వచిత్తవృత్తి ప్రశమ' మనీ, కొందరు 'నిర్విశేష చిత్తవృత్తి' అనీ, భోజాదులు 'ధృతి'(ధృతి అన్నా, శమమన్నా ఒకటేనని భోజు డంగీకరించాడు) అనీ, మమ్మటాదులు 'నిర్వేద' మనీ, కొందరు 'ఉత్సాహ' మనీ, కొందరు 'జుగుప్స' అనీ, 'ఆత్మరతి' అనీ, మరికొందరు రత్యాదులైన ఎనిమిది స్థాయిభావాలలో ఏదైనా శాంతానికి స్థాయి కావచ్చుననీ - ఇలా వాద కోలాహలం సాహిత్య శాస్త్ర రంగంలో శతాబ్దాల తరబడి వినపడుతోంది. అయితే, వీటన్నిటికి ఒక సమన్వయ మార్గాన్ని కనుగొన్నవాడు అభినవగుప్తపాదుడు. ఆయన మతంలో శాంతానికి 'తత్త్వజ్ఞానమే' స్థాయి. "ఇహ తత్త్వజ్ఞాన మేవ తావ న్మోక్షసాధన మితి తస్యైవ మోక్షే స్థాయితా యుక్తా తత్త్వజ్ఞానంచ నామ ఆత్మజ్ఞాన మేవ; తేన ఆత్మైవ జ్ఞానానందాది విశుద్ధ ధర్మయోగీ పరికల్పిత విషయోపభోగ రహితోఽత్రస్థాయీ" అని అభినవగుప్తపాదుని వివరణం. జ్ఞానానందాది విశుద్ధ ధర్మాలు కలిగి, విషయోపభోగశూన్యమైన ఆత్మయే స్థాయి అని ఆయన భావం.

అభినవగుప్తపాదుడు శాంతరసానికి నవమరసస్థితి కాక ప్రకృతిరస స్థితిని కల్పించాడు. ఆ రసాన్ని సాధించటంలో కానవచ్చే కొన్ని అనుపపత్తులను తొలగించటానికీ, శాంతరస స్థాయిభావ కోలాహలాన్ని శాంతింపజేయటానికీ ఒక మహా మంత్రంగా ఆయన ఆ క్రొత్త బాటను నిర్మించాడు. అది ఒక రస సమీకరణ వాదంలా రూపొందింది. సంగ్రహంగా ఆయన వాద మిది-

అభినవగుప్తపాదుడు అభివ్యక్తి వాదాన్ని ప్రతిపాదించి, భరతుని రస నిష్పత్తి సూత్రానికి వ్యాఖ్యానం చేసి, రసం సామాజిక నిష్ఠ మని స్థాపించిన అంశాన్ని మొదట మనం గుర్తుంచుకోవాలి. సహృదయుని హృదయంలో వాసనారూపంగా ఉన్న రత్యాది స్థాయిభావాలను విభావాదులు వ్యక్తం చేస్తాయి. ఆ వ్యక్తమైన స్థాయిభావమే రసమౌతుంది.

రసాల నన్నింటినీ అనుభవించడానికి మూలమైన ఆత్మరసం ఒకటి సహృదయునిలో సంస్కారరూపంగా ఉంటుం దనేది - అభినవగుప్త పాదుని వాదానికి ప్రాతిపదిక. అతని వాదంలో శాంతం సర్వసంస్కార మూలప్రకృతి. తత్త్వజ్ఞానం - లేదా - శమం దానికి స్థాయి. అది సహృదయ హృదయంలో ఉండె నిసర్గస్థాయి భావం. అది సకల భావాంతర భిత్తిస్థానీయం. అది స్థాయి తమం. రత్యాదులలాగా అది సంచారి భావం కాజాలదు. తత్త్వజ్ఞానం - లేదా -

శమం అనే స్థాయి భావం వల్ల సిద్ధించే రసస్థితి విషయోపభోగరహితమైన నిర్వికారాత్మక చిత్తవృత్తి. అంటే - వికృతి రసాలు శమించిన చిత్తస్థితియే శాంతం. అది పరమానంద లాభంతో సంవిదేక రూపమై ప్రకాశించే స్థితి. అది ప్రకృతి రసస్థితి; రత్యాదులు వికృతులు.

"భావా వికారా రత్యాద్యా శ్శాంతస్తు ప్రకృతిర్మతః
వికారః ప్రకృతేర్జాతః పునస్తత్రైవ లీయతే॥
స్వ స్వం నిమిత్త మాస్వాద్య శాంతాద్భావం ప్రవర్తతే
పునర్నిమిత్తాపాయే శాంత ఏవ ప్రలీయతే"[1]

అని ప్రకృతి రస సమన్వయం. ఈ రసప్రస్థానంలో ప్రకృతి రసానికి వికార రూపములైనవి వికృతి రసాలు. అవి దానికి ఉపరాగ విశేషాల వంటివే. విషయ పరివృత్తి వలన వికృతి రసాలు ప్రకృతి నుండి పుట్టి, ఉపజీవించి, విషయ నివృత్తి వలన పర్యంతంలో శాంతంగానే ఆస్వాద్యమానా లౌతాయి.

శాంతరసస్థితి తరంగాలు లేని సముద్రం వంటిది. విషయ ప్రవృత్తి అనే వాయువుచేత నివృత్తి రసతరంగాలు అందులో తలయెత్తుతాయి. చివరకు విషయ ప్రవృత్తి నివృత్తం కావటం చేత నిశ్చల ప్రకృతి శాంత జలధి సిద్ధిస్తుంది. ఈ రస సమన్వయంలో గమనింపవలసిన కొన్ని మౌలికాంశాలు:

1. ప్రకృతి రసస్థితి వికృతి రసస్థితి కంటె విశిష్టమైనది. శాంతరసస్థితి బ్రహ్మానందసీయమై, రసానంద విశిష్టమైన జ్ఞానానంద స్థితి.

2. వికృతి రసాలను తనలో విలీనం చేసుకోవటమే శమస్థాయి భావపరిపోషణ విధానం. ప్రకృతి రసస్థితినుండి నిమిత్త భేదం చేత వికృతి రూపాలైన రత్యాదులు పుట్టి, అందులోనే విలీనమౌతూ ఉంటాయి.

3. రత్యాదులు వికృతిరస స్థాయిభావాలు. శమం రత్యాదులకంటె విశిష్టమైన స్థాయి. అంటే, అధికారభేదంతో రెండు రకాలైన (ప్రకృతి, వికృతి) స్థాయి భావాలను ఈ ప్రస్థానం గుర్తిస్తుంది.

4. ఈ ప్రస్థానంలో 'ఏకోరసః కరుణ ఏవ'లో అన్నట్లు శాంతరస మొక్కటియే రసమని ప్రతిపాదించటంలేదు. శాంతరసం ప్రకృతిరసం. అయితే,

1. నాట్య శాస్త్రమ్ - 1. 107, 108 (అభినవ భారతీ సహితం).

ప్రకృతిరస మొక్కటే రసమనే వ్యాఖ్యానం శాంతరస సమీకరణవాదంలో అతి వ్యాప్తిదోషానికి పాల్పడుతుంది కాబట్టి ఏకోరసః అనే ప్రతిపాదనకూ ప్రకృతి రసవివేచనకూ భేదం ఉంది శాంతరస సమీకరణంలో వికృతులకు భిత్తికా ప్రాయమైన ప్రకృతిని దర్శించి దానిని అలౌకికరసాతీతస్థితిలో ప్రతిష్ఠించటం జరిగింది

5 సహృదయుని రసానందంలో కలిగే అద్యంతస్థితులను సమీక్షించి నిర్వికారాత్మక చిత్తవృత్తి సర్వవాసనాప్రవృత్తికి మూలస్థితిగా వివేచించటం ఈ ప్రస్థాన తాత్పర్యం

అభినవగుప్తపాదుడు శాంతరసానికి తత్వజ్ఞానం స్థాయిభావ మని ప్రతిపాదించి స్థాపించిన తీరు వరమరమణీయం పరమప్రమాణం! ఆయన రచించిన శాంతరస ప్రకరణ ప్రవచనాన్ని మనం రెండంశాలుగా విభజించుకొని పరిశీలించవచ్చు 1 స్థాయిభావ స్వరూపస్వభావ విచారం 2 శాంతరసాస్వాద విధానవిచారం [1]

## 1. తత్త్వజ్ఞాన స్వరూపస్వభావాలు

(1) తత్త్వజ్ఞానమే మోక్షసాధనం కాబట్టి తత్త్వజ్ఞానమే స్థాయి తత్త్వజ్ఞానమంటే ఆత్మజ్ఞానమే జ్ఞానానందాది విశుద్ధ ధర్మయుక్తమైనదీ పరికల్పిత విషయోపభోగరహితమైనదీ అయిన ఆత్మయే శాంతానికి స్థాయి దీన్ని స్థాయి అని వేరుగా చెప్పవలసిన పనేలేదు

(2) తత్త్వజ్ఞానం సకల భావాంతర భిత్తిస్థానీయం సర్వస్థాయిభావాల కంటె అది స్థాయితమం రత్యాదిచిత్తవృత్తులన్నీ దానికి సంచారులు అందువలన అది నిసర్గమైన సిద్ధస్థాయిభావం

(3) రత్యాదులకూ తత్త్వజ్ఞానానికీ భేదం ఉంది రత్యాదులు చిత్తవృత్త్యంతర సంవృతాలై కలుషితాలౌతాయి వాటికి లౌకిక ప్రతీతి ఉంది తత్త్వజ్ఞానం చిత్తవృత్త్యాంతరానుసంధానం కలిగినా అవికల్పరూపంగా ఉంటుంది దానికి లౌకిక ప్రతీతి ఉండదు లోకంలో ఇది కొంత భాసించినా రత్యాది స్థాయి భావాల్లాగా దీన్ని పరిగణించటానికి వీల్లేదు సాధ్యరసాలైన శృంగారాదుల్లో

---

1 వివరాలకు చూడు అభినవభారతి పరిష్కృత శాంతరసప్రకరణమ్ Number of Rasas Prof V Raghavan పు 97-106

సిద్ధరసమైన శాంతానికి ఉపయోగం లేదు. తత్త్వజ్ఞానం ఎప్పుడూ సంచారి భావం లాగా లక్షణీయం కాదు.

## 2. శాంతరసాస్వాదనం

1. తత్త్వజ్ఞాన బీజ సంస్కార భావితులే శాంతరసంలో హృదయ సంవాదాన్ని పొందగలుగుతారు.

2. తత్త్వజ్ఞానం, శమం - సర్వం ఆత్మరూపమే. రత్యాదులు ఆత్మలోని కాలుష్యోపరాగ విశేషాలు. తత్త్వజ్ఞాన సిద్ధుడైన సహృదయుడు రత్యాదులను అనుగమించినా, సమాధినుండి వ్యుత్థితచిత్తుడైనా అవ్యవధానంగా సమాధిబలంచేత దాన్ని అధిగమించి, ప్రశాంతచిత్తుడౌతాడు.

3. శాంతం సర్వరస ప్రకృతి. ఇతర రసాలు సంస్కారాంతరాలతో ఉంటాయి. శాంతం సర్వ సంస్కార మూల ప్రకృతి. విషయ విపరివృత్తివలన సర్వ రసాలూ పర్యంతాన శాంతంగానే ఆస్వాదనీయా లౌతున్నాయి.

4. తత్త్వాస్వాద స్వరూపం - రత్యుత్సాహాదులన్నీ ఉపరాగాన్ని కలిగి స్తాయి. దానివలన ఆత్మస్వరూపం ఉపరంజితమై వాటియందు అనుభూతమౌ తుంది. సరళంగా కూర్చబడిన రత్నాలలో సితతరంగా నిర్భాసించే సూత్రంలాగా ఉపరంజకాలైన రత్యాదులలో ఆత్మస్వరూపం గోచరిస్తుంది. రత్యాదు లేవీ ఉప రంజకాలుగా లేకపోయినా ఆత్మవలె తత్త్వజ్ఞానం భాసిస్తుంది. అలా భాసమాన మైన తత్త్వజ్ఞానం విషయ పరాఙ్ముఖత్వంవల్ల సకలదుఃఖరహితమై, పరమా నంద లాభంతో సంవిదేకరూపమై ప్రకాశిస్తుంది. కావ్యప్రయోగబంధాలవలన సాధారణ రూపంలో నిర్భాసించి, అంతర్ముఖావస్థా భేదంతో లోకోత్తరానందా న్నిచ్చి, సంవిన్మయమైన హృదయ సంవాదాన్ని కలిగిస్తుంది.

పై అంశాలను క్రోడీకరించుకొని శాంతరస సమాలోచనం సాగించవలసి వచ్చినప్పుడు విమర్శకు ఈ క్రింది విధంగా వివేచించుకోవలసి వస్తుంది—

1. నిసర్గసిద్ధమూ, స్థాయితమమూ, ఆత్మజ్ఞానరూపమూ, సర్వరస ప్రకృతిభూతమూ అయిన స్థాయివలన కలిగే రససిద్ధి వికృతి రససిద్ధికంటె విశిష్టమైనదిగా విమర్శకులు అనుశీలించాలి.

2. రత్యాదులు వికృతులైతే, ప్రకృతి అయిన ఆత్మజ్ఞానం నిర్వికారంగా నిలిచేది అయి ఉండాలి. అయితే, అది ప్రాగభావం కాకుండా ప్రధ్వంసభావ మని తృష్ణాక్షయ సుఖవిచారంలో అభినవగుప్తపాదులు నిర్దేశించారు.[1]

3. రత్యాదులు సహృదయ రసానందాన్ని కలిగిస్తే, స్థాయితమమైన తత్త్వజ్ఞానం జ్ఞానానందాది విశుద్ధ ధర్మమైన ఆత్మస్వరూపంతో అభిన్నం కాబట్టి, దానివలన కలిగేది జ్ఞానానంద మని నిర్దేశించవచ్చు.

4. శాంతరసాస్వాదియైన సహృదయుడు సహజంగా తత్త్వజ్ఞాన బీజ సంస్కార భావితుడుగా ఉండాలి కాబట్టి, వీతరాగుడైన జిజ్ఞాసువే ఈ రససిద్ధికి తగిన అధికారి. జిజ్ఞాస మోక్షదాయకం కాబట్టి, మోక్షపురుషార్థనయమైనదే శాంతం.[2]

5. రసం సామాజిక నిష్ఠం కాబట్టి, సహృదయుని తత్త్వజ్ఞానమే శాంతానికి స్థాయి.

6. మోక్షపురుషార్థ సాధనైక ప్రవృత్తి గల సహృదయుడికి కావ్యరసాస్వాదన ప్రవృత్తియే ఒక వికృతి. ఆ వికృతి నాశ్రయించి అతడు ముందుకు సాగినా, అతని ఆత్మతత్త్వజ్ఞానం రత్నహారంలోని దారంలాగా ఉపరంజితమైనా, కాకపోయినా స్వస్వరూప ప్రకాశంతో నివృత్తి రూపంగా శోభిస్తూ ఉంటుంది.

7. రత్యాదులు శకుంతలాదుష్యంతాదులైన విభావాదుల నాశ్రయించి ప్రతీయమానమౌతూంటే, వాటిని సహృదయుడు తన్మయీభవన యోగ్యతతో హృదయ సంవాదాన్ని పొంది, ఆస్వాదిస్తాడు వికృతిరస వివేకంలో. కాని, ప్రకృతిరస వివేకంలో తత్త్వజ్ఞానం నాయకాశ్రితం కావచ్చు, కాకపోవచ్చు. అసలు కావ్యంలోని రత్యాది రసభావాలు కావు ప్రకృతి రసాస్వాదనపరుడైన సహృదయునికి ప్రధానం; మోక్షదాయకమైన తత్త్వజ్ఞానమే ముఖ్యం. అందువల్ల కావ్యంలోని తత్త్వజ్ఞానోపదేశమే అతనికి స్థాయి. ప్రకృతి రస మెప్పుడూ కావ్యగత శాస్త్రరూపమైన తత్త్వజ్ఞానాన్ని ఆశ్రయించే స్థాయిత్వాన్ని పొందగలుగుతుంది.

---

1. చూడు వివరాలకు : ధ్వన్యాలోకం, లోచన వ్యాఖ్యానసహితం, నిర్ణయ సాగర ప్రతి (1935) పు. 220.
2. తతః త్రివర్గఫలక రసానంతరం మోక్షఫలక శ్శాంతః - అభినవభారతి, నా. శా. 24 అధ్యా.

8. ప్రకృతి రస ప్రతీతి సహృదయుని ఆత్మస్థితమై ఉండటం చేత తత్త్వజ్ఞానం ప్రధానంగా ఆత్మరతి రూపంగానే భాసిస్తుంది. నిజాని కతడు తనతోనే తాను తాదాత్మ్యం పొందుతాడు. తన ఆత్మజ్ఞానంతోనే సంవదిస్తాడు. ఇదే శాంత రసం ఆధ్యాత్మిక రసమని చెప్పటానికి బలమైన ప్రాతిపదిక. కావ్యార్థాలు సహృదయునికి నిమిత్త మాత్రాలు. పర్యంతంలో నిలిచే స్వస్వరూప సంవిదాత్మకమైన సమాధిస్థితియే అతని రసస్థితి.

9. ఈ దృష్టితో వివేచిస్తే రత్యాదిస్థాయి భావాల వలన సహృదయుడు పొందేది రసానందం. స్థాయితమమైన తత్త్వజ్ఞానం వలన వీతరాగులు సవికల్పమై కూడా, నిర్వికల్పతను సాధించే చిత్తవృత్తితో అంతర్ముఖావస్థలో పొందేది జ్ఞానానందం. బహిర్విషయ విముక్తుడై నిర్వికల్ప సమాధిలో బ్రహ్మానంద సంధానం వలన యోగి పొందేది బ్రహ్మానందం. మొదటిది అలౌకిక రసానందం; రెండవది లోకోత్తర పరమానందం; మూడవది నిర్వికల్ప బ్రహ్మానందం.

10. శాంతం నవమ రసమని అంగీకరిస్తే దానివలన కలిగేది రసానందమే. ప్రకృతి రసమని వివేచిస్తే మోక్షసాధకమైన జ్ఞానానంద మౌతుంది. రసానందం బ్రహ్మానంద సబ్రహ్మచారి మాత్రమే. జ్ఞానానందం మోక్షోపస్కారకం కూడా. ఇక బ్రహ్మానందమే సాక్షాత్ మోక్షస్థితి.

## ఆనందవర్ధనుని శాంతరస ప్రస్తారం : అభినవగుప్తపాదుని పరిష్కారం

శాంతరస అభావవాదాన్ని ఖండిస్తూ ఆనందవర్ధనుడు తృష్ణాక్షయస్థాయి అయిన శాంతాన్ని ప్రతిపాదించాడు. కాని, దానిని ప్రకృతి రసమని కాని, దాని స్థాయిని స్థాయితమమని కాని నిర్దేశించలేదు. అయితే, అందరికీ తృష్ణాక్షయ సుఖ చిత్తవృత్తి అలవడటం సాధ్యం కాదనీ, ఏ కొద్దిమంది మహామహుల లోనో అది రససిద్ధి పొందినా దానిని శాంతరసమని అంగీకరించటంలో అభ్యంతర ముండకూడదని కూడా పేర్కొన్నాడు.[1] దీనినిబట్టి ఆనందవర్ధనుడు శాంతాన్ని నవమ రసంగా మాత్రమే అంగీకరించాడని స్పష్టమౌతుంది.

---

1. ధ్వన్యాలోకః : తృతీయోద్ద్యోతః. పు. 219 - 220 (లోచన వ్యాఖ్యా సహితం : నిర్ణయ సాగర ప్రెస్ ప్రతి. (1935) )

ఆనంద వర్ధనుని ప్రతిపాదనలపై వ్యాఖ్యానిస్తూ లోచనకారుడు (అభినవ గుప్త పాదుడు) శాంతానికి విభావాలుగా జనకాది రాజర్షులు సముచితంగా ఉంటారని సూచించాడు. "శృంగారాదేరపి ఫలభూమావవర్ణనీయ త్రైవ పూర్వ భూమౌతు ప్రశాంత వాహితా' 'సంస్కృతాన్తశ్చిద్రేమ ప్రత్యయాంతరాణి సంస్కారేభ్యః' ఇతి సూత్రద్వయ నీత్యా చిత్రాకారా యమనియమాది చేష్టావా రాజ్యధరోద్వహనాది లక్షణా వా శాన్తస్యాపి జనకాదేర్దుష్టైవే త్యనుభవ సద్భా వాద్యమనియమాది మధ్యా సంభావ్యమాన భూయో వ్యభిచారి సద్భావాచ్చ ప్రతీయత ఏవ"1 - ఇత్యాది వాక్యాలవలన నాయకాశ్రితమైన స్థాయి శాంతరస కావ్యంలో ఎలా పోషింపబడటానికి వీలుందో తెలుసుకోవడానికి అవకాశం కలుగుతోంది. అది 'నవమరసం శాంత' మనే వాదానికి అనుకూలమైన రస చర్చగా ఉపయోగపడుతుంది.

## వీరరస వివేకం

రసాలలో శృంగార వీరాలకు కావ్యాలలో అంగిరస స్థానాన్నిచ్చి, గౌర వించారు. శృంగారం సర్వజంతు సామాన్యం కాబట్టి అది సర్వజన ప్రహ్లాదన రసంగా పేర్కొంటారు. రసరాజమనీ ప్రశంసిస్తారు. ఉత్సాహస్థాయి సర్వజీవిత మనోవ్యాపారానికి ప్రాతిపదిక కాబట్టి వీరం జీవచైతన్య చోదకమని భావిస్తారు. శృంగారంకూడా వీరంచేతనే సాధింపబడుతుం దనీ, వీరంవలననే అది రసస్థితికి అందుకుంటుందనీ కొందరు భావిస్తారు. భరతుడు జన్యజనకరసవిభాగం చేస్తూ శృంగార వీర రౌద్ర బీభత్సాలను జనకరసాలనీ, హాస్యాద్భుత కరుణ భయాన కాదులు జన్యరసాలనీ పేర్కొన్నాడు. 'అథవీరోనా మోత్తమప్రకృతి రుత్సాహా త్మకః' అని భరతుడు, 'ఉత్సాహః సర్వకృత్యేషు సత్వరా మానసీక్రియా' అని శారదాతనయుడు.

చతుర్విధ పురుషార్థాలలో ధర్మం అగ్రగణ్యం. ధర్మంచేత అనుపాలిత మైన అర్థకామాలే రసనామవాచ్యా లౌతాయి. వీరం ధర్మమూలం. "తతో௨ర్థ కామయోర్ధర్మ మూలకత్వాత్ ధర్మ ప్రధానో వీరః" అని అభినవగుప్తపాదుడు అంటే ధర్మోత్సాహమే వీరరసస్థాయి భావం కాగలదన్నమాట.

బ్రహ్మచేత వీరరసం మూడువిధాలుగా వివేచింపబడిందని భరతుడు పేర్కొన్నాడు. అవి: దానధర్మయుద్ధవీరాలు. దశరూపకకర్త - ధర్మవీరాన్ని

1. లోచనవ్యాఖ్యా : ధ్వన్యాలోకః తృతీయోద్ద్యోతః - పుట. 220.

వదలి దయాయుద్ధదానవీరాలను చెప్పాడు. విద్యానాథాదులు ధర్మవీరాన్ని కలిపి దానధర్మ దయా యుద్ధాలని నాల్గు విధాలుగా వింగడించారు. రసగంగాధరకర్త వీరాన్ని ఎనిమిది విధాలుగా పేర్కొన్నాడు. అవి: యుద్ధ, దాన, దయా,ధర్మ, సత్య, పాండిత్య, క్షమ, బలవీరాలు. అచ్యుతదేవరాయలు ఇరవైయొక్క వీర భేదాలను పేర్కొన్నాడు. ఆ విభాగాన్ని సమర్థించుకొన్నాడు. నేను నా 'వీర రసము' గ్రంథం (1961)లో మరో మూడు వీరరసభేదాలను ప్రతిపాదించాను. అవి: స్వాతంత్ర్యవీరం, మానవీరం, యశోవీరం. అంతేకాక, వీరరసమంటే ధర్మవీరమే అనీ, వీరరసభేదాలన్నీ నిమిత్తభేదంచేత ఏర్పడేవనీ నిరూపించాను. నా మతం ప్రకారం ధర్మవీరమే వీరరసం.

కొందరు లాక్షణికులు ఉత్సాహాన్నే శాంతరసానికి స్థాయిభావంగా పేర్కొన్నారు. ధర్మవీరమే శాంతరస మన్నారు. ధర్మం ప్రవృత్తి, నివృత్తి భేదంచే రెండు విధాలు. ప్రవృత్తిధర్మం వీరం, నివృత్తిధర్మం శాంతం అని వారి భావం. మోక్షాన్ని సాధించటానికి కూడా తీవ్రమైన యత్నమవసరం. కాబట్టి శాంతరసానికి ఉత్సాహమే స్థాయి అని అన్నారు. ముముక్షువుల సాధన సంపత్తిలో శమాదిషట్కం చేర్చబడి వుంది. ఇది ఉపనిషత్సిద్ధం. ఈ దృష్టితో శమం సాధనరూప మౌతుంది. సాధకుడు ఉత్సాహవంతుడౌతా డనటం నిర్వివాదాంశం. అతనిలో వీరరసం నిబంధించబడటం అపేక్షితమే. కావుననే అభినవ గుప్తపాదుడు ''దానధర్మవీర శాంతప్రధానో ధీరశాంతః, మోక్షఫలకః శాంతః'' అని నిర్దేశించాడు.

శాంతరస స్థాయిభావాలను వేరువేరుగా పేర్కొన్న లాక్షణికుల అభిప్రాయాలను సమన్వయించేవారు ఆ స్థాయిభావాలన్నీ తత్త్వతః శమస్థాయికి విరుద్ధాలు కావని వాదిస్తారు. ఉత్సాహస్థాయివాదం కూడా అటువంటిదే. ప్రవృత్తి ధర్మోత్సాహం వీరరసానికి స్థాయి అయితే, నివృత్తి ధర్మోత్సాహాన్ని శమమని సంకేతిస్తే ఈ వాదంలోని వైరుధ్యం తొలగిపోతుంది. కాబట్టి, స్వభావంచేత శమం నివృత్తి ధర్మరూపం; నివృత్తి ధర్మోత్సాహానికి శమం అనే పిలుపు రూఢిచే నిలుపబడిందని వీరరసవాద తాత్పర్యం.

## ధర్మవీర ఏవ రసానాం రసః

'సాధ్యోహి రసః' - అని ప్రసిద్ధి. రసోన్ముఖమై సాగే మానవ మానస వ్యాపారమంతా సాధనాత్మకమైన ఉత్సాహ ప్రవృత్తి రూపం కావటంచేత సర్వ

రసాలకూ ఉత్సాహమే మూల ప్రకృతి అని నేను ప్రతిపాదించాను. ఈ అంశాన్ని ఇలా సమర్థించుకొన్నాను:

శారదా తనయుడు ఉత్సాహాన్ని నిర్వచిస్తూ-

"ఉత్తంద్రతా మభిభవ త్యత ఉత్సాహ నిర్వహః

ఉత్సాహ్యతే చోత్సహతే ఉత్సాహయతి వా భవేత్"1

అని పేర్కొన్నాడు. తంద్రతను (తూగుట, కునికిపాటు పడుటలను) అభిభవించేది (తిరస్కరించేది, తెగదేది) ఉత్సాహమనీ, ఆ పదానికి ఉత్సాహం పొందుట, ఉత్సాహ పెట్టుట, ఉత్సాహపడుట అనే అర్థాలు కల్గుతాయనీ తెలిపాడు. తంద్రతాభిభవం తమోగుణ నిరాకరణాన్ని సూచిస్తున్నది.ఉత్సాహాన్ని పొందుట అనే అర్థం విభావనాది వ్యాపారాలను ధ్వనింపజేస్తున్నది. ఉత్సాహ పెట్టుట అనే అర్థం శక్తిత్రయ ప్రచోదనశీలాన్ని సూచిస్తున్నది. ఉత్సాహ పడటం హృదయ సహజ వ్యాపార ధర్మాన్ని తెలుపుతున్నది. పైపెచ్చు తత్ప్రవృత్తి మెరపులాగా చకచ్చకితమై తరళ సుందరమై నిరంతర ప్రవాహ రూపమై తేజోమయమై ఒప్పారుతుందనే తాత్పర్య మేర్పడుతోంది. ఇటువంటి మానసిక వ్యాపారం సర్వ రస సాధన ప్రవృత్తికి ప్రాణభూత మనటంలో సంశయ ముండటానికి వీలులేదు.

ఇటువంటి ఉత్సాహ ప్రవృత్తి సామాజికుల హృదయాలలో రస సాధనావసరంలో నిలిచే స్థాయి. అంటే - సహృదయ రస సాధన వ్యాపారం అలౌకిక విభావజన్యం కావటంచేత రసనామయోగ్యమౌతోంది. మరొక మాటలో చెప్పాలంటే - సహృదయ రససాధన వ్యాపారం వీరరసనిష్ఠం.

వీరం సర్వ రసాలకును రసత్వాన్ని సిద్ధింపజేసే స్థాయిరసం. ఇటువంటి స్థాయి రసమైన వీరం లేనిదే రసభావాభివ్యక్తిలేదు; భావోన్మీలనం, ఉత్కర్షావస్థ, స్థాయిచర్వణ దశ, శృంగారాది రసానుభవస్థితి - ఇవి యేవీ ఉండవు. అందు వలన వీరమే 'రసానాం రసః' అని సిద్ధాంతీకరించబడింది.

వీరం 'రసానాం రసః' అంటే - వీరరసం రసశ్రేష్ఠ మనే తాత్పర్యంతో పాటు మూడు విధాలైన అన్వయా లేర్పడతాయి. అవి-

1. భావ [illegible] 35.

1. వీరరసం రసాల కన్నింటికీ (మూలమైన) రసం.

2. వీరరసం రసాలన్నింటిలో (వ్యాప్తమైన) రసం.

3 వీరరసం రసాలయొక్క (సారమైన) రసం.

ఈ మూడింటి వివరణ నిలా చెప్పుకోవచ్చు:

1. రస శబ్ద వాచ్యాలైన స్థాయిభావాలకు రసత్వ సిద్ధిని సాధించే సహృదయ హృదయస్థమైన ఉత్సాహమనే స్థాయి చిత్త ప్రవృత్తియే సర్వరస ప్రవృత్తులకు మూలమైన రసం.

2. నవవిధ రసాలు ధర్మోత్సాహానుప్రాణితాలైనప్పుడే దీప్తిమంతాలౌతాయి. కాబట్టి, ఉత్సాహస్థాయియైన వీరం సర్వరస పోషణాన్ని చేసే స్థాయిరసం. ప్రవృత్తి, నివృత్తి రూపాలైన చిత్తవృత్తులచే వీరం చతుర్వర్గ సాధన కుపయుక్తమయ్యేది కాబట్టి, రసాలన్నింటిలోనూ వ్యాప్తిచెందిన రసం వీరరసం.

3. నిమిత్త భేదాలనుబట్టి వీరం బహువిధాలుగా భాసించినప్పటికీ, వాటి కన్నింటికీ మూలమైనది ధర్మవీరం. వీరరస భేదాలన్నింటికి రసత్వసిద్ధిని కల్పించేది ధర్మవీరం. అదియే రసాల సారం. ఈ నిరూపణం వలన తేలిన పరమతాత్పర్యం: "ధర్మవీర ఏవ రసానాం రసః" - రసాలకు రసమైన ధర్మ వీరం మూలరసం.

## వీరరసం - మూలరసం

నవరసాల్లోని వీరరసమే మూలరసమైన వీరం అనటానికి వీల్లేదు. కాని, ప్రవృత్తిచేత ఆ రెండూ సజాతీయాలే. ఎలాగంటే - రామాదుల నాశ్రయించి ప్రవర్తిల్లే ఉత్సాహస్థాయిభావం సహృదయులచేత ధర్మయుద్ధాది వీరాలుగా ఆస్వాదింపబడుతోంది. అంటే కావ్య విభావాదుల్లో సహృదయుడు పొందే తన్మయీభవన యోగ్యతవల్ల అది నవరసాల్లో ఒకటైన అలౌకికానందం అవుతుంది. ఇక మూలరసమైన వీరరసం ఇంతకంటె విశిష్టమైంది. సహృదయుడు రసానందాన్ని సాధించే మనోవ్యాపారంలో వివిధస్థాయి భావాలను చర్వణం చేసే ఉత్సాహ ప్రవృత్తిని వెలారుస్తున్నాడు. దానివలన అతడు సర్వరసాలను ఆస్వాదింపగలుగుతున్నాడు. నాయకాశ్రితమైన ఉత్సాహ స్థాయి నిమిత్తంగా సహృదయుడు అనుభవించే రసం నవరసాలలోని వీరం. నాయకాదుల నాశ్ర

యించిన ఏట్టి స్థాయి భావాన్నైనా నిమిత్తంగా చేసికొని సహృదయుడు సాధించే రసం - మూలప్రకృతి అయిన వీరం.

సాహిత్య క్షేత్రంలో శాంత, శృంగార, కరుణ, అద్భుతరస సమీకరణ వాదాలు ప్రసిద్ధం. సహృదయ నిసర్గరసాలుగా చెప్పబడే ఈ రసాలలో శాంతం ప్రకృతి రస మనీ, అహంకార రసమైన శృంగారం సర్వరస భావోత్కర్షకారిణి అనీ,కరుణం ఏకైక రసమనీ, అద్భుతం మనస్సుకు చమత్కార జనితమైన విస్తర స్థితిని కలిగించే మానసిక క్రియ అనీ ప్రతిపాదింపబడినాయి. భక్తిరసవాదులు, ఆనందరస వాదులు సహృదయునియం దుండే నిసర్గరసం పరిపూర్ణానంద రస మనీ, అది భగవత్స్వరూపమనీ పేర్కొంటారు. ఇన్ని రససమీకరణ వాదాలు వెలసిన తరువాత ధర్మవీర రసం మూలరసం - లేదా - 'రసానాంరసః' అనే వాదానికి ప్రత్యేకత ఏమైనా ఉందా? అన్న ప్రశ్న కలుగవచ్చు. దాని ప్రత్యేకత దానికుంది; దాని ప్రతిపాదనకు అవసరం కూడా ఉంది. అందువల్లనే వీర రసం మూలరసం అనే ఈ బలమైన వాదం!

ఇది బలమైన వాద మని ఎందుకంటున్నా నంటే - సమీకరణవాదాల్లో సమన్వయింపబడని అంశాల కిది ఏకవాక్యతను సాధిస్తోంది. ఎలాగంటే - భరత మతాన్ని అనుసరించి నాట్యంలో, కావ్యాలలో అష్టవిధ రసాలు తత్తత్ స్థాయి నిమిత్తాలుగా ఆస్వాదింపబడుతున్నాయి. కావ్యరసా లనే పేరు వాటికే చెల్లుతుంది. శాంత రసాన్ని నవమ రసంగా అంగీకరిస్తే, అలా కావ్యాలలో అదీ పోషింప బడితే దానికీ అదే స్థితి ఉంటుంది. ఇక ప్రకృతి రసంగా శాంతాన్ని గ్రహిస్తే అది రసశబ్ద వాచ్యమైనప్పటికీ ఇతర రసాలకంటె విశిష్టమైనదిగా ప్రతిపాదింప బడింది. అది భిత్తిక. మూలప్రకృతి. దానిలో వికృతి రసాలు ఉపరాగాలుగా భాసించినా సహృదయ చిత్తవృత్తి శాంతమే. అది విరాగుల చిత్త ప్రవృత్తి అని ప్రకృతిరస వాదుల అభిప్రాయం. కావ్యరస చర్వణంలో విరక్తులు సహృదయుల కంటె అతీతులు. వారికి శృంగారాదులు వికృతిప్రాయాలు.

మరి వీరరసవాదంలో ప్రమాణభూతుడు సర్వరస సాధనపరాయణుడైన సహృదయుడు. అతడు నిర్వికారాత్మకచిత్తవృత్తిని భజించే విరాగి కాడు అతనికి రసములందు రాగ ముంటుంది. కావ్యరసాలవలన అతడు పొందే రసా నందం అతని ధ్యేయం. ప్రకృతిరసమైన శాంతంలో అతడు పొందే పరమా నందం శుద్ధకావ్యానందం కాదు. అట్లని అది బ్రహ్మానందమూ కాదు. కావా

నందం నిమిత్తంగా ముముక్షువు సాధింపదలచుకొన్న బ్రహ్మానందనయమైన జ్ఞానానందం. కాబట్టి శాంతం ప్రకృతిరస మనే వాదం కంటె 'ధర్మవీర ఏవ రసానాం రసః' అనే మూలరసవాదం భిన్నమైంది.

ఇక అహంకార రసమే శృంగార రసమనే భోజుని రససమీకరణ వాదంలో ఆత్మ సమ్యగ్గుణోద్భూతమైన సాత్త్వికాహంకారమే సహృదయుణ్ణి రసికునిగా చేసే గుణం. దానివలన సర్వరసాస్వాదన ప్రవృత్తి అతని కేర్పడుతుంది. ఆ ప్రవృత్తి రససాధనకు ముఖ్యం. అహంకారం రససాధనకు మూలభూతమైన జీవసంస్కారంగా భోజుడు భావించాడు. దానిని అంగీకరించుట వలన 'వీరం మూలరసం' అనే వాదానికి ఎటువంటి విప్రతిపత్తి లేదు. అహంకారం ప్రవృత్తి రూపాన్ని తాలిస్తే ఉత్సాహ మౌతుందని వీరరసవాదుల అభిప్రాయం. రససాధనలో ప్రవృత్తి రూపం పొందని అహంకారం నిష్ఫలమని మా మతం. అహంకారం లౌకిక జీవితంలో కాని, అలౌకిక కావ్యజగత్తులో కాని, ప్రవేశించాలంటే ఉత్సాహమనే వాహికయే దానికి శరణ్యం. కాబట్టి సహృదయ రససాధన ప్రవృత్తిని రసప్రకృతిగా సంభావించే వీరరసవాదం శృంగారరస సమీకరణవాదం కంటె గుణసమన్వితం.

ఇక్కడ మరొక అంశం. భోజుని అభిప్రాయంలో శాంతరసానికి ధృతి స్థాయిభావం. అదికూడా ఏకైకరసమైన అహంకారానికి అంగమే. అహంకార ప్రశమన రూపమైన శమం స్థాయిగా కలిగింది శాంతమని లాక్షణికు లందరూ దాదాపు అంగీకరించిన విషయమే. అయితే, అహంకార ప్రశమన ప్రవృత్తి శృంగారరససమీకరణ వాదంలో సాధించటం సాధ్యం కాదు. కాని, వీరరస వాదంలో అది సాధ్యం.

ప్రకృతి రసాన్ని ఆస్వాదించటంలో సహృదయుని కెటువంటి సాధన అవసరమో. నివృత్తిరసమైన శాంతాన్ని సాధించటానికి అటువంటి సాధనమే అవసరమౌతుంది. దీన్ని గమనిస్తే కొన్ని చిక్కులు తొలగిపోతాయి. సర్వరస మూలప్రకృతి అయిన వీరం ప్రకృతిరస సాధనలో ప్రవృత్తివీర మనీ, శాంత రససాధనలో నివృత్తివీర మనీ సంభావించటం సముంజసం. అప్పుడు భోజుని అహంకార రస ప్రయోగంలో ఏర్పడే విప్రతిపత్తి వీరరసవాదంలో నివారింప బడుతుంది.

శృంగారాదిరసాలను ఆస్వాదించగలిగిన సహృదయుడు శాంతరసాన్ని పొందగలడా? పొందజాల దని అభినవగుప్తపాదుల అభిమతం. శాంతరస సహృదయాధికారం సామాన్య సహృదయాధికారంకంటె విశిష్టమైనది,విలక్షణమైనది. వీరరసవాదం దీనిని అంగీకరించదు. సర్వరసాస్వాదనలో సహృదయస్థితిని ఒక విధంగానే సంభావిస్తాం వీరరసవాదంలో. నవమరసవాదులను వదలిపెడితే ప్రకృతిరసవాదులు శాంతానికీ, మోక్షానికీ ముడిపెట్టారు. అది కొన్ని సమస్యలు తెచ్చిపెట్టింది. మోక్షసాధనం అలౌకిక రసప్రపంచానికి సంబంధించింది కాదు. ఆధ్యాత్మిక అనుభూతికి సంబంధించింది. దానిని రసంతో కలిపి చర్చిస్తే రస విమర్శలో సాంకర్యం ఏర్పడుతుంది. వీరరసవాదం ఈ సాంకర్య సంకటస్థితులను తొలగించింది. సహృదయులందరికీ శృంగారాదు లెలా సాధ్యరసాలో-శాంతం కూడా అలాగే సాధ్యరసం.

కరుణాద్భుత రససమీకరణ వాదాలలో చిత్తద్రవవికాసస్థితులను రసాలని పేర్కొనటమైంది. వీరరసవాదంలో రససాధనలో హృదయం పొందే అవస్థలుగానే అవి గుర్తింపబడ్డాయి. అందువలన ఆయా స్థితులను సాధించే యత్న విశేషమైన చిత్తప్రవృత్తి రసనామంతో ఈ వాదంలో వ్యవహరింపబడుతోంది. ఇలా వీరరసవాదం మిగిలిన సమీకరణవాదాలకంటె ప్రత్యేక ప్రతిపత్తి కలిగిందనీ, నిర్దుష్టమైందనీ స్పష్టమౌతోంది.

వీరరసవాదంలో సర్వరస సాధన ప్రవృత్తి అయిన సహృదయునిలోని ఉత్సాహం రసానుభవ మూలకందం! దీనిని రసమని వ్యవహరిస్తున్నా ప్రవృత్తిగా పరిగణిస్తున్నాం. ఇది రసాలకు (మూలమైన) రసం. స్థాయిభావ చర్వణంలో సహృదయ సంస్కార రూప భావాభివ్యక్తిని, ఆత్మయొక్క ఆనంద చిత్కళా ప్రతిబింబన వ్యాపారానుకూల్యతను సాధించి కావ్యరసాలను ఆస్వాద యోగ్యాలుగా చేసి రసస్థితిని కలిగించే మనోవ్యాపార మీ రసం. సర్వకావ్యరసాలకూ సహృదయచిత్తక్షేత్రంలో రసత్వసిద్ధిని సాధించే సాధనం ఉత్సాహంస్థాయియైన ఈ వీరం. సహృదయ హృదయస్థాయియైన ఈ ఉత్సాహం సాధ్యాలైన రసాలయొక్క అస్తిత్వానికి ఆదిమూల మౌతున్నది. దీనిస్థితి రససాధన వ్యాపారానికి మాత్రమే పరిమితం కావటంచేత కావ్యరసవిమర్శలో దీని ప్రస్తావన ఎప్పుడూ అవసరమౌతుంది. ఇది లౌకికం కాదు; ఆధ్యాత్మికం కాదు; ఉభయ మధ్యస్థమూ కాదు. ఇది అచ్చంగా అలౌకికం!

'రసానాం రసః' అని చెప్పే వీరరసాన్ని కరుణరసవాదుల్లాగా ఏకైక రస మనటంలేదు. శృంగారాదులకు రసస్థితులను మన్నించటమౌతున్నది కాబట్టి శాంతరసవాదంలోలాగా వాటిని వికృతి రసాలుగా భావించటంలేదు. శాంతరస వాదంలోని ప్రకృతి రస స్థితిని వీరరసవాదం-అది అలౌకికం కాదు కాబట్టి- రస విమర్శలో అంగీకరించటంలేదు. శృంగారరసంలోని అహంకారం వీరరసవాదం లోని వీరమువలె ప్రవృత్తి రూపం కాదని దానిని మన్నించటంలేదు. కరుణరస సమీకరణవాదంలోని ద్రవస్థితి సంస్కారమే కాని సాధన ప్రవృత్తి కాదని వీర రసవాదమతం. అద్భుతం అవస్థయే కాని ప్రవృత్తికాదు. కరుణ సమీకరణ వాదులు మిగిలిన రసాలను వికార, వివర్త రూపాలుగా గణిస్తారే కాని వాటి కావ్యరస వ్యక్తిత్వాలను అంగీకరింపరు. అయితే, వీరరసవాదం ఏ మానసక్రియ తన సాధనచేత శృంగారాదులకు రసత్వస్థితిని సంతరింపజేస్తుందో దానిని రస మని సంకేతిస్తుంది. అది రసాల వెంట నడిచి వాటిని సాధిస్తుంది, కాని, తానే రసమై తనయందు మిగిలిన వాటి నన్నింటిని విలీన మొనర్చుకొనేది కాదు.

నవరసాలలో వీరం ధర్మమూలం! సహృదయ స్థాయియైన వీరం ఉత్సాహ ధర్మమూలం! అటువంటి ధర్మోత్సాహరూపమైన సహృదయ ప్రవృత్తి 'రసానాం రసః' అనబడు మూలరసమైన వీరమని పిండితార్థం!

"ధర్మవీర ఏవ రసానాం రసః" అనే ఈ నవ్య రస సమీకరణవాదం నాచేత దాదాపు 1960 లో ప్రతిపాదింపబడింది; 1985 దాకా ఆ వాదానికి సంబంధించిన అనేక అంశాలమీద ఆలోచనలు సాగించి ఆ వాదాన్ని అన్ని విధాలా బలపరిచాను. భారతీయాలంకారిక సిద్ధాంతాలలో నా వీరరసవాదం ఒక శక్తిమంతమైన సమన్వయవాదంలా నిలుస్తుందని భావిస్తున్నాను. సమీకరణ వాదాలను అధ్యయనం చేసే సహృదయులు ఈ వాదాన్ని కలిపి చదువుకోకపోతే అవగాహనకు ఒక సమగ్రత రాదని నా నమ్మకం! శాంతానికీ వీరానికీ ఉన్న విరోధాన్ని తొలగించిన వివేక సూత్రం ఈ వాదం!

ఆధునికాంధ్ర సాహిత్యరంగంలో మూడు సాహిత్య సిద్ధాంతాలు చరిత్ర కెక్కిన సత్యాలుగా నేడు నిలువబడి ఉన్నాయి. అవి: రాయప్రోలువారి మాధురీ దర్శనం; విశ్వనాథవారి 'కరుణరసవాదం', జీవియస్ 'ధర్మవీరవాదం'.వాటి వాటి చారిత్రిక వాస్తవికతల నేపథ్యంలో ఈ మూడూ తెలుగువారు భారతీయాలంకారిక ప్రస్థానాలకు అభినవంగా అందించిన సాహిత్య సిద్ధాంతాలు!* (1996)

* ఈ వ్యాసం ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులవారి షష్టిపూర్తి సంచికకోసం రూపొందించింది: 21-5-1996.

# సంప్రదాయ సాహిత్యం-నేటి సమస్యలు

"One of the functions of the scholar - critic is to demonstrate that the history of a literature is a gradual and continuous slope. And so the sense of fact serves to maintain a perpetuation of the literary tradition without which a civilized society cannot persist as such"1 అన్న బేట్సన్ మాటలు జ్ఞాపకం వస్తున్నాయి నే నీ అంశంమీద మాట్లాడాలని అనుకున్నప్పుడు. సాహిత్య చరిత్ర సతతం పల్లానికి ప్రవహించే జీవనది లాంటిది. బేట్సన్ అవిచ్ఛిన్నంగా సాగే సానువుగా, పల్లపు ప్రదేశంగా భావించాడు. మనం పల్లంలో పారే జీవనదిగా సంభావిస్తాం. ఆ ప్రవాహ జీవిత వాస్తవ స్థితిని పరిశీలించటం పరిశోధక విమర్శకుని కర్తవ్యం. అంతటితో ఆగకుండా ఆ గతిలో, ఆ ప్రగతిలో భాసించే అవిచ్ఛిన్న సాహితి సంప్రదాయాన్ని అవిష్కరించటం విమర్శకుని బాధ్యత. అటువంటి అవిచ్ఛిన్న సంప్రదాయ పరిజ్ఞానం లేకపోతే నాగరక సమాజం అస్తిత్వాన్ని రక్షించుకోవటం అసాధ్యం! సంప్రదాయ సాహిత్యాన్ని గురించి ప్రసంగించాలంటే సాహిత్య సంప్రదాయాన్ని గురించే పరోక్షంగా పరిశీలించాలన్నమాట! సాహిత్య సంప్రదాయాన్ని పాటించే సాహిత్యమే సంప్రదాయ సాహిత్య మన్నమాట!

ఇరవయ్యో శతాబ్దంలో సంప్రదాయాన్ని గురించి వ్యాఖ్యానించాలంటే, సంస్కృతం కంటే ఇంగ్లీషునే ఎక్కువగా ఆశ్రయించాలి. ఎందువల్లనంటే, 'సంప్రదాయ సాహిత్యం' అనికానీ, 'సంప్రదాయ కావ్యాలు' అనికానీ పిలవడం సంస్కృతాంధ్ర లక్షణ గ్రంథాలలోని కావ్య విశ్లేషణ పద్ధతులలో వినపడదు, కనపడదు.కాని,ఇంగ్లీషు సాహిత్యంలో, విమర్శలో ఇటువంటి పారిభాషిక పదాలు, పదబంధాలు ప్రచారంలో ఉండటంచేత మనంకూడా వారిలాగా పిలవటం మొదలుపెట్టాం. టి.యస్. ఎలియట్ వివరించిన Tradition అనే పారిభాషిక పదమే తెలుగు సాహిత్య విమర్శలో వాడే సంప్రదాయానికి మూలమనీ, దాని అర్థమే

1. The scholar - critic - F.W. Bateson. P. 182.

దీని పరమార్థమనీ మనం గ్రహిస్తున్నాం. సంప్రదాయమంటే 'Not only of the Pastness of the past, but of its presence' అనే దృష్టితో సమీక్షిస్తున్నాం. సంప్రదాయమంటే అంధానుకరణం కాదనీ, అభినవలోచనం అనీ సంభావిస్తున్నాం. సంప్రదాయాన్ని గురించి సవ్యంగా ఆలోచించేవారు కూడా ఆధునిక పాశ్చాత్య దృక్కోణంతో ఆ శబ్దార్థాన్నీ దాని వినియోగాన్నీ అలాగే వివేచిస్తున్నారు.

అయితే, ఏ సాహిత్య చరిత్రలోనైనా ఒక పరిణామం బలంగా సాగే టప్పుడు మూడు రకాల కవులు, రచయితలు ఉంటారని టి.యస్. ఎలియట్ వివేచించాడు. వారు- మొదటి రకం: గతాన్ని మాత్రమే గౌరవించేవారు; రెండవ రకం: భవిష్యత్తు మీది ఆశతో గతాన్ని కాలదన్నేవారు; మూడోరకం వారు: గతంలోని మంచినీ, వర్తమానంలోని వ్యక్తిత్వాన్నీ సంవదించుకొన్న సమన్వయ మూర్తిమత్వాన్ని సమతౌల్యంతో సాధించేవారు. వీరిలో మొదటివారు అనుకర్తలు మాత్రమే. వారికి గతం మీద వీరభక్తి ఉంటుంది. అనువాదాలకూ, అంధానుకరణలకూ, ప్రచార సాహిత్యానికీ కర్తలవుతూ ఉంటారు. వారి రచనల్లో క్రొత్తదనం గోచరించదు. రెండవ రకం వారు తిరుగుబాటుదారులు. వారి దృష్టిలో సంప్రదాయం గతవైభవం లాంటిది; మృతప్రాయమైనది; సృజనా త్మక శక్తిని కోల్పోయినట్టిది; వర్తమానానికి పనికిరానిది. ఆ మాటకు వస్తే- సమూలంగా ధ్వంసం చేయతగింది; లేదా పాతిపెట్ట తగింది. ఈ రకం వారి వలన గతానికీ వర్తమానానికీ మధ్య సాహిత్య సంప్రదాయంలో ఒక విచ్ఛిత్తి ఏర్పడుతుంది. దీనివలన ఒక జాతి కొన్ని మౌలికమైన, దేశీయాలైన విలువ లను కోల్పోవచ్చు. భవిష్యత్తుకోసం చేసే పోరాటంలో, పొందే ఆరాటంలో వాటిని సమగ్రంగా సాధించలేకపోతే రెంటికి చెడ్డ రేవళ్ళలాగా అశాంతికి గురి కావచ్చు. ఏమైనా, క్రొత్త ఒక వింతగా భావించి ముందుకు దూకే తరానికి ఈ రెండవ రకం అభ్యుదయశీలంగా అనిపిస్తుంది. వారిని అనుసరిస్తారు, ఆదరి స్తారు. ఇక మూడోరకంవారు నిజంగా సంప్రదాయవాదు లనిపించుకొనేవారు. సంప్రదాయ సాహిత్యమంటే కాలానికి అనుగుణంగా పరిణామం చెందుతున్నా సాహిత్యసంప్రదాయాన్ని అవిచ్ఛిన్నంగా రక్షించుకొనేదని విశ్వసించేవారు.

తెలుగులో జరిగిన చారిత్రిక వాస్తవ మేమంటే - వామపక్ష రాజకీయ చైతన్యానికి నిబద్ధులైన రచయితలు, విమర్శకులు సంప్రదాయం అనే పదాన్ని

దాదాపు టి. యస్. ఎలియట్ చెప్పిన మొదటిరకంవారి రచనలకే వర్తింపజేసి, ఆ అర్థంలోనే దానిని రూఢి కెక్కించారు. అంతటితో ఆగకుండా మరొక అడుగు ముందుకు వేశారు. ఎలియట్ చెప్పిన మూడవ రకం రచయితలను వారు గుర్తించక పోగా, వారిని మొదటిరకం వారితోనే కలిపి చెప్పటం ప్రారంభించారు. దానితో సంప్రదాయ శబ్దానికి ఉండవలసిన అర్థంపోయి, వారి వక్రీకరణం వలన, అంధానుకరణమనే అర్థంలో రూఢి కెక్కింది. ఈరోజు సంప్రదాయ శబ్దం కొందరికి వక్రీకరింపబడిన అర్థంలోనే స్ఫురిస్తున్నది. సాహిత్య సంప్రదాయానికి జరిగిన మహాపకారాల్లో ఇది మొదటిది.

ఈ సందర్భంలో సాహితీ మిత్రుడు డా॥ ముకురాల రామారెడ్డిగారన్న మాటలు తలపుకు వస్తున్నాయి: "సంప్రదాయం అంటే 'పాతది' అని బాహాటంగా అర్థం చెప్పే సాహిత్య రచయితలు అనేకులు బయలుదేరారు నేటి కాలంలో. అంతేకాదు, ఆ మాట వింటేనే ఈసడించుకుంటున్నారు. వీళ్ళ శిష్య వర్గ జనాభా బాగా పెరిగిపోతున్నది. వీళ్ళంతా కలిసి మాది 'ఆధునికం'-అంటే- 'కొత్తది' అంటున్నారు. వీళ్ళవాదాలు విని సంప్రదాయజ్ఞులు చప్పరించేస్తున్నారు. ఏమి చేసినా సంప్రదాయజ్ఞుల బలం సన్నగిల్లుతున్న రోజు లివి. ఎలా తోస్తే అలా చెప్పి, మేం చెప్పిందే 'ఆధునికం' అన్నవాళ్ళ బలగమే బాగా వర్ధిల్లుతున్నది. ఇదంతా ఎందుకు జరుగుతున్నది? అంటే - సంప్రదాయ లక్షణాలు, ఆధునిక లక్షణాలు స్థూలంగానైనా తెలియకపోవటం వల్ల కొంత గజిబిజి జరుగుతున్నదని చెప్పవచ్చు."[2]

తెలుగు విశ్వవిద్యాలయం వారు 'సంప్రదాయ సాహిత్యం' మీద కీలక ప్రసంగం చేయుమన్నప్పుడు నేను కొంత తత్తరపాటు చెందాను. సంప్రదాయమంటే వారే అర్థంలో భావించారో, నేనే అర్థంలో చెప్పాలో, వినేవారు ఏ అర్థంలో గ్రహిస్తారో అని. ఇప్పటికీ నాకు ఆ అనుమానం లేకపోలేదు. సంప్రదాయ మంటే ఎలియట్ చెప్పిన మూడవవర్గం వారు అనుసరించే సాహిత్య సంప్రదాయమని నేను అనుకుంటున్నాను. మరెవ్వరైనా, సాహిత్య సంప్రదాయం తెలిసినవారు అలాగే అనుకుంటారు. మరి తెలుగు విశ్వవిద్యాలయంవారు 'నవ్యసంప్రదాయ కవిత్వోద్యమం'ను అంగీకరిస్తున్నారు. అప్పుడు సంప్రదాయ శబ్దం వామ

2. ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న దృక్పథాలు : (వ్యా) సంప్రదాయవాదం: డా॥ ముకురాల రామారెడ్డి - పు. 204 - 205.

పక్షీయుల పారిభాషిక పదంగా భావించే అవకాశం ఉంది. అయితే, సంప్రదాయ సాహిత్య సదస్సులో 'ప్రాచీన సాహిత్యం' అని కూడా వాడారు. ఆధునిక కవితా సదస్సును ఆ తరువాత నిర్వహిస్తున్నారు. అంటే - సంప్రదాయ సాహిత్యమంటే ప్రాచీన సాహిత్యమనే తెలుగు విశ్వవిద్యాలయం వారి విశ్వాసమని స్పష్టమౌతోంది. నేనూ ఈ వ్యాసంలో అదే భావంతో ఆ పదాన్ని స్వీకరించి సమీక్షిస్తున్నాను.

సాహిత్య చరిత్రలో వికాసదశలను సాధించే శక్తి అవిచ్ఛిన్నత. దానిని సందర్శించి ఆవిష్కరించటం పరిశోధక విమర్శకుని ప్రథమ కర్తవ్యమని బేట్సన్ చెప్పిన మాటలు గమనించాం. ప్రాచీన సాహిత్యాన్ని గాని, ఆధునిక సాహిత్యాన్ని గాని వికాసదశలలో పరిశీలించేటప్పుడు తోడ్పడేది దానిలో అవిచ్ఛిన్నంగా సాగే ఆంతర్గతి సూత్రం. దానిని సాధించటం సంప్రదాయ సాహిత్యంలోని ముఖ్యాంశం.

## సాహిత్య వికాసంలో అంతర్గతి సూత్రం

వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యంలో ఎంతమంది కవులు, రచయితలు ఏయే కాలాలలో ఏయే రచనలు చేశారు? వారి జీవిత విశేషాలేమిటి? కావ్య రచనా విశేషాలెటువంటివి? - మొదలైన వివరాలను కాలక్రమ పద్ధతిలో చెపితే కవుల చరిత్ర అవుతుంది. ఇప్పుడది పాతపడ్డ పద్ధతి.

దానికంటె మేలైనది సాహిత్య చరిత్ర. ఏయే చారిత్రిక, సాంఘిక, మత, రాజకీయ, సాంస్కృతిక, సాహిత్య పరిస్థితులలో ఏయే కవులు ఏయే రచనలు ఏయే కాలంలో చేశారో వివేచిస్తూ, కాలక్రమ పద్ధతి ననుసరించి, యుగ విభజన సూత్రాన్ని ఆలంబనంగా చేసికొని సాహిత్య సమీక్ష చేసేది సాహిత్య చరిత్ర.

తెలుగులో ఇంతవరకు వెలువడిన సాహిత్య చరిత్రలలో రచయితలు పాటించిన యుగ విభజన పద్ధతులను పరిశీలిస్తే ఎక్కడా ఏకసూత్రత కనపడదు. కొందరు సాహిత్య చరిత్రకర్తలు యుగాలను యుగకర్తలైన కవుల పేర్ల మీదా, ప్రసిద్ధ ప్రక్రియల పేర్ల మీదా పిలిచారు. మరికొందరు సాహిత్య ధోరణులకూ, ప్రయోగాలకూ, ఉద్యమాలకూ ప్రాధాన్యమిచ్చి పేర్లు పెట్టారు. ఇంకొందరు రాజవంశాల ప్రాతిపదికల మీదా, చారిత్రిక ఘట్టాల ప్రాబల్యం

మీదా యుగాలను రూపొందించారు. అయితే, ఏ సాహిత్య చరిత్రలోనూ ఒకే పద్ధతి ఆమూలాగ్రం పాటించటం సాధ్యంకాలేదు. యథా సౌకర్యంగా యుగ విభాగం సాగింది.

సాహిత్య చరిత్రలలో యుగ విభజనం నియతంగా కాలక్రమ పద్ధతిలోనే సాగింది. ప్రతి యుగానికీ ఒక ప్రత్యేకత ఉండటం సహజం. ఆ ప్రత్యేకతను చాటే యుగ ధోరణులను విశేషంగా వ్యక్తీకరించటం యుగ సమీక్ష ముఖ్య ధర్మమైనా - ఆ కాలంలో వెలువడిన వాఙ్మయాన్నంతా గుదికూర్చి వివరించక తప్పదు. దానివలన సాధారణంగా సాహిత్య చరిత్రకు సమన్వయ స్వభావం కంటె సంకీర్ణ స్వభావం ఏర్పడే అవకాశం ఎక్కువగా ఉంటుంది. అందువలన ఈ పద్ధతి కూడా ఆదర్శవంతమైనదని చాలమంది భావించటం లేదు.

సాహిత్య చరిత్ర కంటె సార్థకమైనది సాహిత్య పరిణామ చరిత్ర. సాహిత్యంలో కలుగుతున్న పరిణామాలను గుర్తించటం, ఆ మార్పులకు కార్య కారణ సంబంధాలను తర్కబద్ధంగా నిరూపించటం - ఈ మార్గంలోని ముఖ్య లక్షణం. అయితే, పరిణామాలకు ప్రేరకశక్తులను గుర్తించి నిర్ణయించడంలో సాహిత్య చరిత్రకారులలో ప్రధానంగా రెండు దృక్పథా లున్నాయి. ఒకటి - గతి తార్కిక భౌతికవాదాన్ని అనుసరించి ఆయా కాలాలలో ఆయా క్రమాలలో జరిగే సామాజిక పరిణామాలకు అనుగుణంగా సాహిత్యంలో కూడా పరిణామాలు కలుగుతాయని విశ్లేషించే దృక్పథం; రెండు - సమాజ పరిణామాలకు సమాంత రంగా సాహిత్యంలో కూడా పరిణామాలను కలిగించే అంతర్గతి తర్కం ఒకటి ఉంటుందని, సాహిత్యంలో వెలువడే దార్శనికమైన, ప్రక్రియాపరమైన, శైలీ సంబంధమైన ప్రయోగాల కన్నింటికీ అదే ప్రేరక శక్తిగా పనిచేస్తుందనీ వివేచించే దృక్పథం. ఈ రెండింటినీ అందరికీ అందుబాటులో ఉండే పరిభాషలో చెప్పాలంటే మొదటిది-సామాజిక స్పృహ, రెండవది-సాహితీ స్పృహ.

సాహిత్యపరిణామ చరిత్రలు పరిణామాలను కార్యకారణబద్ధంగా వ్యాఖ్యా నిస్తున్నాయి కాని, అవి ఆయా కాలాలలో అదే క్రమంతో ఎందుకు వచ్చాయో అటు చారిత్రికంగా కాని, అటు సాహితీపరంగాగాని, ఇదమిత్థంగా, ఖచ్చితంగా, సమగ్రంగా, తర్కబద్ధంగా వ్యాఖ్యానించి చెప్పలేకపోతున్నాయి. ఈ లోపాన్ని తీర్చగలిగింది సాహిత్యవికాసచరిత్రగా పలువురు భావిస్తున్నారు.

ఒక కాలంలోని మత, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక, ఆర్థిక వ్యవస్థలను సమర్థించటానికో, నిలువబెట్టటానికో, విమర్శించడానికో, కూలగొట్ట డానికో మాత్రమే సాహిత్యం పుడుతుందని కొందరు చేసే వాదాన్ని సిద్ధాంత పరంగా అంగీకరించినా, ఉదాత్తసాహిత్యం ఒక కాలంలో పుట్టి సమకాలీన మత రాజకీయార్థిక పరిణామాల ప్రభావాన్ని కొంత కలిగివున్నా, సాహితీజగత్తులో ఆ ప్రభావానికి లోనుగాని ఒక నవ్యదర్శనాన్ని ప్రతిపాదించి, దాని కనుగుణ మైన ప్రక్రియలను, కవితాశైలులను నిర్మించటం ద్వారా ఒక నూత్న పరిణా మాన్ని తీసికొనివచ్చే అవకాశమున్నట్లు మన సాహిత్య చరిత్ర స్పష్టంగా చెపు తున్నది. దీనినిబట్టి సాహిత్య పరిణామానికి కారణం సాహిత్య దర్శనంలో కవులు తెచ్చే మార్పులేనని స్పష్టమౌతున్నది.

గతితార్కిక భౌతికసూత్రాన్ననుసరించి సాగే సామాజిక పరిణామ చరి త్రలో అంతర్భాగంగా సాహిత్య చరిత్రను సమన్వయించిన దానికంటె సాహి త్యంలోని సహజ గతితార్కిక పరిణామచైతన్యానికి ప్రేరణ కలిగించే సాహిత్య దార్శనిక సిద్ధాంతాల నాశ్రయించి రచనలు వెలువడతా యన్న వాస్తవాన్ని గుర్తించి, అయా సాహిత్య సిద్ధాంత దృక్పథాలతో వెలుపడిన రచనాప్రక్రియల వికాస విధానాన్ని వివేచించేటట్లు సాహిత్య పరిణామ చర్రితను రూపొందిస్తే-అది సాహిత్య వికాస చరిత్ర అవుతుంది. వికాసచరిత్రలో పరిణామాలను మార్పులు గానే కాకుండా వాటికి తాత్త్విక భూమికలుగా పనిచేసే శక్తుల వికాసగతి సూత్రాన్ని గూడా దర్శించి వివేచించాలన్నమాట![3]

తమ తమ కాలాలలో భారతీయ సాహిత్య దర్శనాలలో వస్తున్న అత్యా ధునిక ధోరణులకు లక్ష్యాలుగా కావ్య ప్రయోగాలు చేసే కవుల ప్రవృత్తి సాహితీ వికాసానికి దోహదం చేస్తుంది. క్రీ.శ. 11 వ శతాబ్ది నుండి 17 వ శతాబ్ది వరకు ధ్వని పరివర్తన యుగం సాగింది భారతదేశ సాహిత్య రంగంలో. ఆ కాలంలో దేశిసాహిత్యాలలో వెలువడిన సాహితీ ప్రయోగాలు భారతీయ సాహితీ దర్శనాలకు అనుగుణమైన దేశీయమైన నవ్యసృష్టులు, నవ్యతను సాధిం చిన సృష్టులు. భారతీయ సాహిత్య దర్శనాలు దేశీయంగా జాలువారిన అభినవ దర్శనాలుగా ఆవిష్కరింపబడిన కళాఖండాలు ప్రాచీనాంధ్ర సాహితీ ప్రయో

3. చూడు వివరాలకు : సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు - జి.వి. సుబ్రహ్మణ్యం. తెలుగు అకాడమీ ప్రచురణ (1991).

గాలు. ఆ కాలంలో సాహిత్య సిద్ధాంతాలలో ముఖ్యంగా నాలుగు శాఖలు భారత దేశమంతటా విస్తరించాయి. వాటి స్వరూప స్వభావాలను తెలుసుకుంటే తప్ప ఆంధ్ర సాహిత్యం పుట్టి ఆ క్రమంలో అలాగే ఎందుకు వికసించిందో తెలియదు. అదే తెలుగు ప్రాచీన సాహిత్య వికాసంలో అంతర్గతి సూత్రం.

తెలుగు సాహిత్యంలో కలిగిన పరిణామాలను గాని, వికాసాన్ని గాని వివేచించేటప్పుడు ఆయా సాహిత్య ప్రస్థానాల ఆవిర్భావ వికాసాలను విస్మరింప లేము. భారతీయ రంగంలో ధ్వని పరివర్తన యుగంలో పుట్టి పెరిగిన సాహిత్య సిద్ధాంత శాఖలే తెలుగు సాహిత్య వికాసాన్ని తీర్చిదిద్దాయి. వాటిలో మొదటి శాఖ ధ్వని మార్గాన్ని సమర్థించేది. తెలుగులో కవిత్రయం ఈ మార్గాన్ని ఘంటాపథం చేసింది. రెండవది - అలంకార ప్రస్థానశాఖ. తెలుగులో ఈ మార్గానికి మార్గదర్శి నన్నెచోడుడు. మూడవ శాఖవారు శుద్ధరసవాదులు. ఈ మార్గానికి తెలుగులో పోషకులుగా నిలిచేవారు - పాల్కురికి సోమనాథుడు, శ్రీనాథుడు, పోతన, అన్నమాచార్యులు, మరికొందరు శ్రీనాథయుగ కవులు. నాల్గవది కవిశిక్షామార్గం. కేతన, భాస్కర రామాయణ కవులు మొదలైనవారు ఈ త్రోవలో నడిచినవారు. ఈ శాఖవారు కావ్యలక్షణాలను పాటించినా - ఒక సాహిత్య దర్శనాన్ని అనుసరించిన శైలిని సృష్టించే వ్యక్తిత్వాలను ప్రదర్శించ లేరు. వీ రెన్నటికీ యుగకర్తలు కాలేరు.

సాహిత్య దర్శనం గల కవులే నవ్యతను సృజించగలరు, యుగాలను ప్రవర్తింపజేయగలరు. తెలుగుసాహిత్యంలో నాచనసోముడు చమత్కార ప్రస్థానాన్నీ, ప్రబంధకవులు వక్రోక్తి ప్రస్థానాన్నీ, శ్లేషకావ్య కవులు, ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యకవులు అలంకార ప్రస్థానాన్నీ, దక్షిణాంధ్రయుగ సాహిత్యంలోని పదకర్తలు, యక్షగానకర్తలు, శృంగారకావ్యకర్తలు శుద్ధరస వాదాలలోని వివిధశాఖలనూ సమర్థించి పోషించారు. సాహిత్య వికాసానికి సాహిత్య దార్శనిక సిద్ధాంతాల వికాసమే ప్రేరకశక్తిగా పనిచేస్తుందని స్పష్టమౌతున్నది.

ఆధునికాంధ్ర సాహిత్యాన్ని వివేచించినప్పుడు కూడా ఈ వికాస దృక్పథమే పనికి వస్తుంది. పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాలూ, భారతీయ సాహితీ సిద్ధాంతాలూ, సాహిత్యేతర సిద్ధాంతాలూ, ప్రయోగ వైచిత్రులూ అనే నాలుగు మార్గాల్లో ఆధునికాంధ్ర సాహిత్యం వికసించింది. ఆ అంశాన్ని వివరించటం

## [ప్ర[క్రియా వివేచనం

[ప్రాచీన సాహిత్యాన్ని గాని, ఆధునిక సాహిత్యాన్నిగాని వివేచించాలంటే ఆయా కవుల కున్న సాహిత్య దర్శనాలతోపాటు, వారు సృష్టిస్తున్న రచనలు ఏయే [ప్ర[క్రియలకు చెందుతాయో స్పష్టంగా తెలుసుకొని ఉండాలి. అలా తెలియకపోతే దాని కనుగుణమైన సాపేక్ష విమర్శ సూ[త్రాలను గు[ర్తించి అన్వయించటానికి వీలుండదు. ఉదాహరణకు ఆం[ధ్ర మహాభారతం పురాణమా, కావ్యమా, ఇతిహాసమా ముందు తేల్చాలి. ఇతిహాసమైతే అది శా[స్త్రేతిహాసమా, కావ్యేతిహాసమా - ఏదో నిశ్చయించాలి. ఆ నిశ్చయం ముందే లేకపోతే ఆ [గంథాన్ని ఆ [ప్ర[క్రియోచితమైన [ప్రమాణాలతో పరిశీలించలేము. "Every work of literature belongs to at least one 'genre'. Indeed, it is sure to have a significant generic element"[4] అన్న అల్‌స్టైర్ ఫౌలర్ మాటలు ఈ సందర్భంలో గుర్తుకు తెచ్చుకోవాలి.

[ప్రతి [ప్ర[క్రియలోనూ [ప్రతిభావంతులైన కవులు [ప్రయోగాలు చేసి, ఆ [ప్ర[క్రియను బహుధా విస్తరిస్తారు; అనేక పర్యాయాలు సంశ్లిష్టం చేస్తారు; కొన్నిసార్లు సంకీర్ణం చేస్తారు; వైవిధ్యాలనూ వైరుధ్యాలనూ కూడా కల్పిస్తారు.

[ప్ర[క్రియకు బహిరంతర రూపాలుంటాయని వివేచించినవారు రినె వెలక్, ఆస్టిన్ వారిన్. వారు తమ 'థియరీ ఆఫ్ లిటరేచర్' అనే [గంథంలో Attitude, Tone మొదలైనవి [ప్ర[క్రియ అంతరరూపానికి సంబంధించినవనీ, ఛందస్సు మొదలైనవి బాహిరరూపానికి చెందినవనీ వివేచించారు. [ప్ర[క్రియ [ప్రధానంగా అంతరరూపాన్నిబట్టే గౌరవింపబడుతుంది. రూపనిర్మాణాన్ని organisation అని గానీ, Structure అని గానీ అంటారు. [ప్ర[క్రియలలో ఏర్పడే పరిణామమే సాహిత్య చరి[త్రలో గోచరించే వికాశదశల విన్యాసమని వారు పేర్కొన్నారు, ఈ మాటలు గమనింపదగినవి - "Theory of genres is a principle of order, It classifies literature and literary history not by time or place (Period or national language) but by specifically literary types of organisation or structure."[5]

---

4. Kinds of Literatures: Alstair Fowler (1982) పు. 20.
5. Theory of Literature : Rene Wellek and Austin Warren (1978) - పు. 226.

తెలుగు సాహిత్య చరిత్రలో ప్రక్రియా వికాసాన్ని వివేచించేటప్పుడు రెనె వెలెక్, ఆస్టిన్ వారెన్ చూపిన పద్ధతి సమంజసంగా ఉంటుంది.

ప్రక్రియ యొక్క అంతరమైన రూపం కవి సాహిత్యదర్శనశక్తి నుండి ఉద్భవిస్తుంది. బాహిరమైన రూపం కవి సాధింపదలచుకొన్న ప్రయోజనం నుండి కాని, ఉద్దేశించిన శ్రోతల అభిరుచి నుండి గాని పుట్టుతుంది. కావ్యం వ్రాసిన ప్రతివాడూ కవి ప్రశస్తినీ పొందలేడు. ప్రక్రియా స్వరూపాన్ని రూపు కట్టించిన వాడూ, కవితాశైలిలో తనదైన ఒక విశిష్ట రుచిని రచనద్వారా కల్పించినవాడూ మాత్రమే ఉత్తమ కవిగా పరిగణింపబడతాడు. ప్రయోజనంకోసం వెలువడే బాహిరరూపంటె, ప్రాణశక్తితో వెలువడే అంతరరూపం ప్రక్రియకు ముఖ్యం. బాహిరరూపం ప్రయోగనైపుణ్యాన్ని వెలారిస్తే, అంతరరూపం ప్రతిభాశక్తిని ప్రకటిస్తుంది. ఇది నన్నయ కాలానికే కాదు నేటికి కూడా వర్తించే సాహిత్య ప్రక్రియాస్వభావం. దర్శనమూలం ప్రక్రియ.

ప్రాచీనాంధ్ర సాహిత్యంలో వెలువడిన రచనలను ప్రక్రియాపరంగా వివేచించి, వాటి స్వరూపస్వభావాలకు అనుగుణమైన పేర్లు పెట్టి, వాటికి అనుకూల మైన ప్రమాణాలనూ, సాపేక్ష విమర్శ సూత్రాలనూ ఏర్పరచుకోవలసిన అవ సరం నేడెంతైనా ఉంది. ప్రాచీన కవులకు పదకోశాలు నిర్మించే కాలం గడచి పోయింది; ఈనాడు ప్రతి మహాకవికి ఒక కావ్యలక్షణ గ్రంథం వెలువరించ వలసిన అవసరం ఏర్పడింది. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాదమి బాధ్యతలు నిర్వ హిస్తున్న తెలుగు విశ్వవిద్యాలయం ఈ సమకాలీన సాహిత్యావసరాన్ని గుర్తించి స్పందించగలదని ఆశిస్తున్నాను.

ప్రక్రియాపరంగా ఏకసూత్రంతో సాహిత్య వికాస చరిత్రను నిర్మించే ఒక ప్రణాళికను నేను 'సాహిత్యచరిత్రలో చర్చనీయాంశాలు'లో ప్రతిపా దించాను. (చూడు: వ్యా. సాహిత్య వికాస చరిత్ర: ఒక ప్రణాళిక: పు. 217 - 222.) ప్రాచీన సాహిత్యచరిత్రలోని యుగకర్తల రచనల ప్రక్రియలను వివేచించి, పేర్లు పెట్టి ఆ దిశలో నిర్మాణాత్మకమైన ప్రతిపాదనలను ఆ గ్రంథంలో అందించాను. వాటికి సంబంధించిన సమస్యలను చర్చించాను. వాటిని రేఖామాత్రంగా పేర్కొంటాను:

1. కవిత్రయ భారతం కావ్యేతిహాసం. (వ్యాస భారతం శాస్త్రేతిహాసం)

2. నన్నెచోడుని కుమార సంభవం వస్తు కావ్యం. (కన్నడ కావ్య ప్రక్రియను తెలుగులో నిలిపాడు.)

3. పాల్కురికి సోమనాథుని బసవపురాణం కన్నడంలోని జైనపురాణ లక్షణాలను ప్రచ్ఛన్నంగా పాటించిన దేశిపురాణం; పండితారాధ్యచరిత్ర కన్నడ సాహిత్యంలోని 'చరిత్రె కావ్యా'లకు ప్రతిబింబం.

4. తిక్కన మౌలికంగా కథా కావ్య ప్రియుడు. నాట్యశాస్త్ర మర్యాద లను పారిభాషిక పదాలను శ్రవ్యకావ్య మర్యాదలో చొప్పించినవాడు.

5. కేతన దశకుమారచరిత్ర కథా కావ్యం; మారన మార్కండేయ పురాణం కథా కావ్య స్పృహ కలిగిన ప్రథమాంధ్ర మహాపురాణం. వీరిరువురూ తిక్కన కావ్య దృక్పథాన్ని సమర్థించేవారే.

6. ప్రక్రియకు తగిన శైలి అనే సిద్ధాంతాన్ని ప్రదర్శించినందుకే ఎఱ్ఱా ప్రెగ్గడ ప్రబంధపరమేశ్వరుడయ్యాడు. ఎఱ్ఱన ప్రయోగాలు:

1) హరివంశము: పురాణ కవితా శైలి+ఇతిహాస వస్తువు + కథా కథన పద్ధతి.

2) అరణ్యపర్వ శేషము: కావ్య కవితా శైలి + ఇతిహాస వస్తువు + ఉభయ (కథన+వర్ణన) పద్ధతి.

3) నృసింహ పురాణము- ప్రబంధ కవితా శైలి+పురాణ వస్తువు+ వర్ణనాత్మక పద్ధతి (ప్రబంధపురాణం).

7. నాచన సోమునిది చమత్కార ప్రస్థానం: ఉత్తర హరివంశం వంశ కథా కావ్యం.

8. రంగనాథ భాస్కర రామాయణాలు - రసకావ్యాలు.

9. శ్రీనాథునిది శృంగారము సర్వరసమూలమనీ, అహంకార రసమే శృంగారమనీ భావించేది. భోజుని రసప్రస్థానంలో సాగినవాడు శ్రీనాథుడు.

1) శృంగార నైషధము - మార్గరస కావ్యం.

2) హరవిలాసం - విలాస కావ్యం.

3) కాశీఖండం, భీమఖండం, శివరాత్రి మాహాత్మ్యం-ప్రబంధ పురాణ ప్రక్రియలో మూడు ప్రయోగాలు.

10. ఆంధ్ర మహాభాగవతము - భక్తి పరిపూర్ణ రసమనే వాదాన్ని ప్రతిపాదించే మహాపురాణం - భక్తి కవితకు తెలుగులో పరమ ప్రమాణం.

11. తాళ్ళపాక అన్నమాచార్యుల సంకీర్తన సాహిత్యం - తమిళ వైష్ణవ సాహిత్యంలోని పంచవిధ భక్తిమార్గాలను ప్రమాణంగా తీసికొని మధురభక్తికి ప్రాధాన్యం కలిగిస్తూ రచించిన మధుర కవితలు - పదకవితా మార్గదర్శకాలు. సంకీర్తన పద సాహిత్యంలో విశిష్ట ప్రయోగం.

12. ప్రక్రియా వైవిధ్యానికి, ప్రయోగ బాహుళ్యానికి శతక ప్రక్రియ తెలుగులో కల్పవృక్షం.

13. నాసికేతోపాఖ్యానం (దగ్గుపల్లి దుగ్గన రచన) శాంతరస కావ్యం కాదు. అద్భుత రససమీకరణ వాద ప్రభావంలో వెలసిన కావ్య ప్రయోగం.

14. శ్రీనాథ యుగంలోని క్రీడాభిరామం వీధి, జక్కనాదులు రచించి నవి కథా కావ్యాలు. అయితే అవన్నీ జాతి వార్తా చమత్కారాలకు అంకితమైన ప్రయోగాలు.

15. తెలుగులో పిల్లలమర్రి పినవీరభద్రుని శృంగార శాకుంతలం నుండి పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నం వరకూ ప్రబంధ యుగమని పిలువదగి నది. అందులో వెలువడిన ప్రబంధాలు కుంతకుని వక్రోక్తి జీవితం ప్రమాణంగా వెలువడిన వివిధ ప్రయోగాలు.

16. రామరాజభూషణుని వసుచరిత్ర నుండి చేమకూర వేంకటకవి విజయ విలాసం దాకా తెలుగులో శ్లేష కావ్యయుగం అని పిలవాలి. అలంకార సిద్ధాంత దర్శనం ఆ ప్రయోగాలకు మూలం.

17. క్షేత్రయ్య పదాలు పదకవితలలో నాట్యానికీ, సంగీతానికీ, సాహిత్యానికీ సమప్రాధాన్యం కలిగించే ప్రయోగాలు.

18. యక్షగానం దేశినాటక ప్రయోగం : విస్తృతికీ, వైవిధ్యానికీ పేరొందింది

19. సాంత్వన కావ్యాలు 'రతి రతి కోసమే' అనే శృంగార రసవాద శాఖను పోషించిన కావ్య ప్రయోగాలు.

20. ద్వ్యర్థి కావ్యాలూ, త్ర్యర్థి కావ్యాలూ, చతురర్థి కావ్యాలూ, గర్భ కవితా కావ్యాలు వెలసిన కాలం చిత్రకవితా ప్రక్రియల విచిత్ర ప్రయోగాల కాలం.

21. పద్యాన్ని పదానికి ప్రతిగా నిలిపిన ప్రయోగవాది వేమన.

22. సంగీత ప్రధానమైనదే ఉత్తమ పదకవిత అని నిరూపించిన పద కవితా బ్రహ్మ త్యాగరాజస్వామి.

మచ్చునకు మాత్రమే కొన్నిటిని ఉదాహరించటం జరిగింది. వివరాలకు నా గ్రంథం చూడవచ్చు.

ఆధునిక ప్రపంచ భాషా సాహిత్యాలలో ప్రక్రియాపరమైన విమర్శకూ, ప్రక్రియావికాస చరిత్రలకూ ఎంతో ప్రాముఖ్యం ఏర్పడి ఉంది. సాహిత్యాన్ని సృష్టిస్తున్న రచయితకూ, దానిని ఆస్వాదించే సహృదయునికీ, దాని తత్త్వాన్ని వివేచించే విమర్శకునికీ ప్రక్రియాపరమైన శాస్త్రీయ పరిజ్ఞానం ఉండటం ప్రాథమిక లక్షణంగా ప్రపంచమంతటా భావింపబడుతున్నది. తెలుగులో ప్రక్రియాపరమైన విమర్శలేదని చెప్పలేము. కాని, పాశ్చాత్య సాహిత్యరంగాలతో పోల్చు కుంటే తగినంత పరిణతిని సాధించలేదని అనిపిస్తుంది. మనం ఈ రంగంలో వడివడిగా ముందుకు సాగాలి. సాహిత్య వికాస చరిత్ర భావనం మనకెన్నో క్రొత్త వెలుగులు ప్రసాదింపగలుగుతుంది.

వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యంలో ఎందరో మహాకవులు తమ తమ సాహిత్యదర్శనాలతో తమకు ముందున్న ప్రక్రియలకంటె వినూత్నమైనవిగాని, విశిష్టమైనవి కాని, సమన్వయాత్మకమైనవి కాని, సంకీర్ణరూపమైనవి కాని, ప్రక్రియలను సృజిస్తూ సాహిత్య వికాసానికి దోహదం చేశారు. అయితే, ప్రాచీన కవులలో చాలమంది భారతీయ మిశ్రప్రక్రియలను వెలయించారు. ఆధునిక కవులలో పలువురు పాశ్చాత్య ప్రక్రియలకు భారతీయ ప్రతిరూపాలను కల్పించారు. నవ్యసంప్రదాయవాదులు ప్రాచ్య పాశ్చాత్య మిశ్రప్రక్రియలను రూపొందించారు. ప్రతిభాపరంగా ఈ మూడు పద్ధతులూ మూడు శిఖరాల వంటివి. అయితే, ఈ మూడు మార్గాలనూ సమదృష్టితో సాహిత్యపు విలువలను వివేచనతో నేడు పరిశీలించి వికాసచరిత్రను వినిర్మించుకోవలసిన అవసరం ఉన్నది.

సాహిత్యవికాస చరిత్ర పఠితలకు ప్రక్రియాపరంగా ప్రయోగాలను పండొలిచి చేతిలో పెట్టినట్లుచేసి,సౌలభ్యాన్ని కలిగించి ఆస్వాదన స్వాదుత్వాన్ని పెంచుతుంది. పఠితలు తాము చదువుతున్న కావ్య ప్రక్రియను గుర్తించగలగడం సహృదయాధికారంలో ముఖ్యమైనది. కావ్యపఠనంలో ప్రక్రియా పరిజ్ఞానం ప్రాథమిక లక్షణమనీ, అటువంటిది పఠితలలో వ్యక్తం కాకపోతే అస్పష్టత ఏర్పడి, కళానుభూతిని పొందటం దుర్లభమౌతుందని ఆల్‌స్టైర్ ఫౌలర్ స్పష్టం చేశాడు. ఆ మాటలు గమనించండి—

"The process of generic recognition are in fact fundamental to the reading process. Often we may not aware of this. But whenever we approach a work of unfemiliar genre - new or old - our difficulties return us to fundamentals. No work, however avantgarde, Is intelligible without some context of familiar types. Innovative works tend to bc obsecur precisely because their generic context is not yet obvious."[6] తెలుగులో నవ్య ప్రక్రియలు, ప్రయోగాలూ అన్నప్పుడు ఆధునిక సాహిత్యంలో పాశ్చాత్య ప్రభావంతో ప్రభవించిన వాటినే ఎక్కువగా పరిగణనలోకి తీసికొంటుంటాం. అది పొరపాటు. నన్నయగారి ప్రయోగం నుండి కూడా ప్రక్రియాపరమైన పరిజ్ఞానాన్ని మనం ఇంకా సుసంపన్నం చేసుకోవలసిన అవసరం ఉన్నది.

సాహిత్య జగత్తు ఈ అవసరాన్ని గుర్తిస్తున్న ఈ తరుణంలో తెలుగు విశ్వవిద్యాలయం వారు తెలుగు సాహిత్య వసంతోత్సవాలలో ప్రాచీన సాహిత్యానికి ప్రథమ సమావేశాన్ని కేటాయించటం, అందులోనూ పురాణేతిహాసాలు, ప్రబంధాలు, కావ్యాలు మొదలైన ప్రక్రియలపై వివిధ ఉపన్యాసాలను అనుభవజ్ఞులచేత సమర్పింపజేయటం సంతోషింపదగిన విశేషం.

సంప్రదాయ సాహిత్యంలోని సాహిత్య సంప్రదాయాన్ని గురించి ఎప్పుడైనా ఎవరైనా ఉపన్యసించవచ్చు. ఎన్ని అంశాలనైనా ఏకరువు పెట్టవచ్చు. కాని, ఈనాటి సమస్యలకు ప్రాముఖ్యమిస్తూ, ఇప్పుడు మాట్లాడటం ప్రస్తుతం. సాహిత్యంలో అంతర్గతి సూత్రాన్వేషణం, ప్రక్రియావికాస సమాలోచనం ఆధునికంగా విమర్శకులు ఆలోచిస్తున్న సాహిత్య సంప్రదాయ సమస్యలు. వాటికి ప్రాముఖ్య మిచ్చి, నాలుగు మాటలు చెప్పటం ఈ ఉపన్యాస వ్యాసతాత్పర్యం. ఇది కీలక ప్రసంగం కాబట్టి, అందులోని కీలకం కూడా ఇదే. నాకీ అవకాశం కలిగించిన తెలుగు విశ్వవిద్యాలయంవారికి కృతజ్ఞతలు. (1996)

6. Kinds of Literature : Alstair Fowler (1982) Page 259, 260.

# మంచి మాటలు

## కవిసమ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ

బహుగ్రంధ పరిశీలనము బహువిషయ నిరూపణము శ్రీసుబ్రహ్మణ్యము గారి పాండిత్యమునకు నిదర్శనములు. రసవిషయము గహనమైనది దానిని నిరూపించుటకు చేసిన ప్రయత్నము ప్రశంసనీయము

వీరరసము - అభిప్రాయము (1961)

## ఆచార్య పింగళి లక్ష్మీకాంతము

మీరు నిర్దుష్టమైన పాండిత్యము కలవారుగా నిశితపరిశోధన దృష్టి కలవారుగా సరసవ్యాసకర్తలుగా లోకంలో ప్రతిష్ఠగడించారు. విశేషించి కళాపూర్ణోదయము నందలి సరస్వతీ చతుర్ముఖుల ప్రణయకలహాంశములకు మీరు చెప్పిన నూతన వ్యాఖ్యానము అపూర్వమును అద్భుతముగా నున్నది

— సారస్వతసౌరభము - ఆశీస్సులు - (27-12-1969)

## ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం

ఏకోరస కరుణ ఏవ అని భవభూతి యమృతవాణి - వీరమునుగూడ దిగ్రదావి శృంగారమే ముఖ్యమని భోజుడును శాంతమే ప్రకృతిరసము తదితరములు వికృతిరసములని అభినవగుప్తాచార్యులును ఆలంకారికులలోనే ఏకవాక్యత లేమి తోపింప చేయుచున్నారు. సుబ్రహ్మణ్యంగారు పిన్నవారయ్యు ధీరచింతకులు స్వతంత్రాలోచనాపరులు అని చెప్పదగియున్నారు. వీరి మతమున వీరమే సర్వమానసిక ప్రవృత్తులకును బీజభూతము. వీరమునకు స్థాయిభావము ఉత్సాహము. కామమే మానవుని యెల్ల ఇచ్ఛాక్రియాశక్తులకు పునాదియని యంగీకరించినవారు కూడ వీరము లేనిదే కామము శోభావిహీనమగునని యొప్పుకొందురు. కావున కామముకంటెను మూలప్రవృత్తి యుత్సాహరూపమైన వీరమని అంగీకరింపక తీరదు. ఇట్లు వీరమే రసానాం రసః యన నొప్పి యున్నది

— వీరరసము ముందుమాట స్థాపన లో (1961)

## ఆచార్య దివాకర్ల వేంకటావధాని

కొందఱు గురువు లుందురు వారి గురుత్వము శిష్యపరంపర కపార ప్రతిష్ఠాకరమై యుండును కొందఱు శిష్యు లుందురు వారి శిష్యత్వము గురువుల

# వ్యాసాల వన్నెచిన్నెలు

కొన్ని విమర్శలు మేధా విలాస ప్రధానముగా నుండును. అవి నిర్మాణాత్మకములగును. కొన్ని విమర్శలు హృదయ స్పంద ప్రధానములుగా నుండును. అవి సృజనాత్మకములై ఆనంద ప్రదములుగా నుండును.

1. 'పురాణము - ఇతిహాసము' - ఈ చర్చయందు వ్యాసకర్త ప్రదర్శించిన తటస్థ భావము, సంయమము ప్రశంసనీయము!

2. 'మేఘసందేశము - ప్రకృతి వర్ణనము' - అను వ్యాసము విషయ విశ్లేషణమునకును, విశ్లిష్టాంశముల సమన్వయ పూర్వక వ్యాఖ్యానమునకును చక్కని ఉదాహరణ.

3. "మహాభారతమున కర్ణుని స్థానమెట్టిదో అలంకార శాస్త్రానుసారముగా నిరూపింప నెవ్వరును ప్రయత్నించినట్లు కనపడదు. 'మహాభారతము - కర్ణుడు' అను వ్యాసమున వ్యాసకర్త అట్టి ప్రయత్నము చేసెను."

4. "బసవపురాణ నిర్మాణము - జైనపురాణ ప్రభావము" - ఈ వ్యాసమున ప్రతిపాదింపబడిన సిద్ధాంతము అపూర్వమైనది....రచయిత ఈ వ్యాసమును పరిశోధకులకు చక్కని ఒజ్జబంతిగా రూపొందించెను.

5. కళాపూర్ణోదయ పరిశీలనమున సరిక్రొత్తయైన మార్గమును త్రొక్కి అనితర సాధ్యమైన రహస్యమును సాధించి చి॥ సుబ్రహ్మణ్యము పింగళి సూరన ప్రతిష్ఠను మఱియొక మెట్టు పైకెక్కించెను.

—డాక్టర్ పాటిబండ మాధవశర్మ

"నన్నయ రచనలో నాటకీయత" "హంసడిభకోపాఖ్యానము"

1. తెలుగు పండితుల్లో ఒక అలవాటుంది. నన్నయ పేరు చెప్పగానే ప్రసన్నకథాకలితార్థయుక్తిని ఎన్నుకోవడం; తిక్కన్నను పేర్కొనగానే నాటకీయతను ఎత్తుకోవడం. ప్రాధాన్య వివక్షనుబట్టి అది నిజమే కావచ్చు. కానీ, ఎంతకాలం ఈ గతానుగతిక సంచారం? తిక్కన్నలో కథా కథన శక్తి లేదా? నన్నయలో నాటకీయత లేదా? ఉంది. ఆ చూచే చూపులో ఉంది. 'నన్నయ రచనలో నాటకీయత' అనే వ్యాసంలో ఆ ప్రయత్నమే జరిగింది.

2. నాచనసోముని ఉత్తర హరివంశంలోని హంసడిభకోపాఖ్యానం ప్రతీకాత్మకమైన కథ అని ప్రతిపాదింపబడింది.

S2047 ఆచార్య సి. నారాయణరెడ్డి

కఖండ కీర్తి కారణమై యలరారుచుండుచు. అట్టి శిష్యచూడామణులలో శ్రీ డా॥ జి. వి. సుబ్రహ్మణ్యముగా రగ్రగణ్యులు. వారు కవులు, వ్యాసకర్తలు, విమర్శకులు. వాగ్మి శేఖరులు. అధ్యాపకశిరోమణులు, సర్వలక్షణగ్రంథపారదర్శకులు."

—ప్రథమాంధ్ర మహాపురాణము - 'ప్రస్తావన'లో (24-12-1972)

## ఆచార్య సి. నారాయణరెడ్డి

"డా॥ సుబ్రహ్మణ్యం వివేచన ఉన్న భావుకుడు, రసజ్ఞత ఉన్న నిశిత విమర్శకుడు, విద్యావినయాలు సమ ప్రమాణంలో సంతరించుకున్న యువకుడు. ఉపరిశోధన కంటె పరిశోధనల పట్ల ఆసక్తి ఉన్న సాధకుడు."

—'సారస్వత సౌరభము' ముందుమాటలో - (26-1-1970)

"డా॥ సుబ్రహ్మణ్యం సమీక్షణ శక్తి ఉన్న భావుకుడు. చెప్పదలచుకున్న దానిని నిర్దిష్టంగానే కాక నిర్దుష్టంగానూ చెప్పగలిగే ఔచిత్యజ్ఞుడు. పాత విషయాలను పరిగ్రహించినా, కొత్త దృక్కోణంతో పరిశీలించి, తాను శోధించిన మేలి నిగ్గులను ఆకృతీ, ఆత్మా ఉన్న మూర్తులుగా నిలబెట్టగలిగిన సద్విమర్శకుడు."

—'నవ్యాలోకము' ముందుమాట 'అంతర్వీక్ష'లో - (1973)

"సాహిత్య విమర్శ రెండు రకాలు. ఒక గ్రంథాన్నో, ఒక ప్రత్యేక విషయాన్నో తీసుకొని, అంగాంగ పరిశీలనం చేసి, అంతరంగంలో మునకలు వేసి, చేతి కందిన ముత్యాలో, రత్నాలో సేకరించ వలసిన వారికి అందివ్వడం ఒక రకం; క్షుణ్ణమార్గ సంచారం కాకుండా, ఏదో ఒక సరికొత్త మెరుపు కోసం మథనపడి, నిదురచెడి, ఏ సుముహూర్తాననో ఒక నవ్యాంశం తటిత్తులా మెరిస్తే దానికి కరచరణాలు కల్పించి, సమగ్రరూపం శిల్పించి ప్రాజ్ఞుల యెదుట ప్రదర్శించడం మరో రకం. ....మిత్రుడు డాక్టర్ సుబ్రహ్మణ్యం మలి రకానికి చెందినవాడని బోధపడుతుంది. (1970)."

## ఆచార్య యస్వీ జోగారావు

"1961 లో 'వీరరసము' అనే డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం గారి గ్రంథం వచ్చింది. వీరరస స్వరూప స్వభావాలను పరమ భావుకతతోను, పటు శాస్త్రజ్ఞతతోను వివరించి మన వివిధ వాఙ్మయ శాఖలలో దానికి గల ప్రతిపత్తిని నిరూపించి, అకాడమీ బహుమతికి సమర్థులయ్యారు గ్రంథకర్త. ఇలా ఒక రస సిద్ధాంతాన్ని ఒక వాఙ్మయానికి సమన్వయించి, సరసానుశీలనము, సమ్యగవలోకనము చేయడానికి సమకట్టిన గ్రంథాలు మన కెన్నో లేవు. అందులో ఇది అక్షరాలా అగ్రగణ్యము."

—యువభారతి ప్రచురణ - మహతి - (1972)

## ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు

"అప్రమత్తత, భావతీక్ష్ణత, పాండిత్య స్ఫూర్తి, ఔచిత్య పరిపాలన,
శబ్దనైశిత్యం సుబ్రహ్మణ్యం సహజ ప్రవృత్తులు. ఈ రచయిత ఆలోచనలోగాని,
రచనలో గాని, విషయ వివరణలో గాని, విమర్శ విధానంలోగాని 'జంకు
గొంకులు' కనిపించవు. సుబ్రహ్మణ్యం ఆత్మవిశ్వాసం ఉన్న పండిత విమర్శ
కుడు గనకనే ఈ ధైర్యసాహసాలు; డా॥ సుబ్రహ్మణ్యం - ఒక్క పదబంధంలో
చెప్పాలంటే - సహృదయ పండిత విమర్శకుడు."

—'రసోల్లాసం' ముందుమాట 'ఆమోదం'లో - (1980)

## డాక్టర్ పాటిబండ మాధవశర్మ

"చిరంజీవి సుబ్రహ్మణ్యము ప్రతిభాశాలి, వ్యుత్పన్నుడు, వివేకి, సంప్ర
దాయానురక్తి, వృద్ధోపసేవాసక్తి, ఈతని చిత్తమునకు చక్కని పరిపాకమును
సంయమమును సమకూర్చినవి. విషయ విశ్లేషణమునకు కావలసిన సూక్ష్మ
దృష్టియు, విశ్లిష్టాంశముల సమన్వయమునకు కావలసిన క్రాంతదృష్టియు,
ఈతనికి చక్కగా అలవడి యున్నవి. విషయమున సమగ్రత, పరిశీలనమున
శాస్త్రీయత, సిద్ధాంతీకరణమున తార్కికత, ఈతని రచనల సామాన్య లక్షణ
ములు. ఇతనిని ఉత్తమ పరిశోధకుడుగా, విమర్శకుడుగా, రచయితగా రూపొం
దించినది ఈతని సర్వ ప్రవృత్తికి ప్రాణభూతమైన ఉత్సాహము.

—"సాహిత్య సౌరభము"నకు ముందు మాట "ఆమోదవీచి'లో (1970)

## శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావు

"శ్రీ సుబ్రహ్మణ్యము స్వతంత్ర పరిశీలనా దృష్టి పుష్కలముగాఁ గల
వారు. అలంకార శాస్త్ర సిద్ధాంతములను వివరించుటయే కాక నూతన సిద్ధాంతము
లను యుక్తి సహజముగా చేయగల దక్షులు. ప్రాచీనాలంకారికుల సిద్ధాంతము
లను ఆధారముగా గాని నూతన సిద్ధాంతములు ప్రతిపాదించుట మంచి బాట.
ఎప్పటికప్పుడు శాస్త్రకర్త సమన్వయ దృక్పథము నలవరచుకొనవలయును.
అట్టి సమన్వయశక్తి ప్రాచీనులలో నున్నంతగా నవీనులలో ఎంతోమంది యందు
కానవచ్చుట లేదు. అట్టి శక్తి గలవారిలో సుబ్రహ్మణ్యముగారు మొగదలయం
దున్నారు."

—భారతి - ఫిబ్రవరి - 1962

# వ్యాసాల వన్నెచిన్నెలు

కొన్ని విమర్శలు మేధా విలాస ప్రధానముగా నుండును అవి నిర్మాణాత్మకములగును కొన్ని విమర్శలు హృదయ స్పంద ప్రధానములుగా నుండును అవి సృజనాత్మకములై ఆనంద ప్రదములుగా నుండును

1 పురాణము ఇతిహాసము - ఈ చర్చయందు వ్యాసకర్త ప్రదర్శించిన తటస్థ భావము సంయమము ప్రశంసనీయము!

2 మేఘసందేశము - ప్రకృతి వర్ణనము - అను వ్యాసము విషయ విశ్లేషణమునకును విశ్లిష్టాంశముల సమన్వయ పూర్వక వ్యాఖ్యానమునకును చక్కని ఉదాహరణ

3 మహాభారతము - కర్ణుని స్థానమెట్టిదో అలంకార శాస్త్రానుసారముగా నిరూపింప నెవ్వడను ప్రయత్నించినట్లు కనపడదు మహాభారతము - కర్ణుడు అను వ్యాసమున వ్యాసకర్త అట్టి ప్రయత్నము చేసెను

4 బసవపురాణ విమర్శనము - జైనపురాణ ప్రభావము - ఈ వ్యాసమున ప్రతిపాదింపబడిన సిద్ధాంతము అపూర్వమైనది. రచయిత ఈ వ్యాసమును పరిశోధకులకు చక్కని ఒజ్జబంతిగా రూపొందించెను

5 కళాపూర్ణోదయ విలసనమున సరికొత్తమైన మార్గమును త్రొక్కి అనితర సాధ్యమైన రహస్యమును సాధించి వి సుబ్రహ్మణ్యము పింగళి సూరన ప్రతిష్ఠను మరియొక మెట్టు పైకెక్కించెను

—డాక్టర్ పాటిబండ మాధవశర్మ

నన్నయ రచనలో నాటకీయత హంసడిభకోపాఖ్యానము

1 తెలుగు పండితుల్లో ఒక అలవాటుంది నన్నయ పేరు చెప్పగానే ప్రసన్నకథాకలితార్థయుక్తిని ఎత్తుకోవడం తిక్కన్నను పేర్కొనగానే నాటకీయతను ఎత్తుకోవడం ప్రాధాన్య వివక్షనుబట్టి అది నిజమే కావచ్చు కానీ ఎంతకాలం ఈ గతానుగతిక సంచారం? తిక్కన్నలో కథా కథన శక్తి లేదా? నన్నయలో నాటకీయత లేదా? ఉంది ఆ చూచే చూపులో ఉంది నన్నయ రచనలో నాటకీయత అనే వ్యాసంలో ఆ ప్రయత్నమే జరిగింది

2 నాచనసోముని ఉత్తర హరివంశంలోని హంసడిభకోపాఖ్యానం ప్రతీకాత్మకమైన కథ అని ప్రతిపాదింపబడింది

520478 ఆచార్య సి నారాయణరెడ్డి

